# తెలుగు కన్నడ భారతముల తులనాత్మక పరిశీలనము

(తిక్కన-కుమారవ్యాసుల విరాటోద్యోగ పర్వములు)

డా॥ బి. వి. యస్. మూర్తి,
ఎం.ఏ. ఎం.ఫిల్., పిహెచ్.డి.,



శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి ఆర్థిక సహకారముతో ముద్రింపబడినది.

ప్రచురణకర్త

బులుసు హేమలత

7 29-7, బారువారి వీధి,

త్యాగరాజ నగర్

రాజమండ్రి

ప్రతులు 1000

అక్టోబరు : 1991

వెల రు. 65/-

# కృతజ్ఞతలు

కన్నడ భాష పరిచయాన్ని కలిగించి నాలో ఆసక్తిని రేకెత్తించిన "దక్షిణ ప్రాంతీయ అధ్యయన సంస్థ" (SRLC) వారికి, నా కన్నడ భాషా పరిజ్ఞానాన్ని గుర్తించి తమ విశ్వవిద్యాలయమున పరిశోధన కవకాశమిచ్చిన బెంగుళూరు విశ్వవిద్యాలయము వారికి నేను కృతజ్ఞుడను.

నా పరిశోధనలో నాకన్ని విధముల సహకరించి నాలో పట్టుదలను రేకెత్తించి సారథిగ నిలిచిన సహృదయులు, ఈ గ్రంథమునకు తమ చక్కని మాటలతో వారి హృదయావిష్కారము గావించిన అస్మద్గురువర్యులు, బెంగుళూరు విశ్వవిద్యానిలయ తెలుగు శాఖాధ్యక్షులు, ఆచార్య శ్రీ తంగిరాల వెంకట సుబ్బారావుగార్కి మనఃపూర్వక నమః సుమాంజలి

నాపై సంపూర్ణ వాత్సల్యముతో గ్రంథము నవలోకించి, విలువైన ఆశీస్సుల నిచ్చిన శ్రీ శ్రీ శృంగేరీ దక్షిణామ్నాయ ప్రణవ స్వరూప శ్రీ చరణులకు ప్రణామములు

అడిగినంతనే నా గ్రంథము నామూలాగ్రముగ చదివి నా పరిశోధన ప్రశంసింపదగినదని అభిప్రాయము నందించిన సహృదయులు, విమర్శక శ్రేష్ఠులు, ఆచార్య శ్రీ జి వి సుబ్రహ్మణ్యంగార్కి నా కృతజ్ఞతాభివందనములు

"వ్యాసభారతము – నన్నయ పరిష్కారము" అను తమ సిద్ధాంత గ్రంథమునకు ఆంధ్ర విశ్వవిద్యాలయ స్వర్ణపతక గ్రహీతలు, ప్రసిద్ధ పండిత విమర్శకులు, శిష్యవాత్సల్యముతో నా గ్రంథమునకు ముందుమాట వ్రాసి ఇచ్చిన శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు



బెంగుళూరు విశ్వవిద్యాలయము నుండి పిహెచ్ డి పట్టము పొందిన సిద్ధాంత గ్రంథము

# శ్రీశ్రీ జగద్గురు శంకరాచార్య మహా సంస్థానం
# దక్షిణామ్నాయ శ్రీ శారదాపీఠం
## శృంగేరి
## ఆశీస్సు

శ్రీ డాక్టర్ బులుసు వేంకట సత్యనారాయణమూర్తిగారికి నమస్కారములు.

తమరు రచించి శ్రీ చరణుల సన్నిధిని సమర్పించిన "తెలుగు-కన్నడ భారతముల తులనాత్మక పరిశీలనము" అను గ్రంథమును శ్రీ చరణులు అవలోకించినారు

భారతీయ వాఙ్మయమునందు మహాభారతమునకు విశిష్టమైన స్థానమున్నది అది కేవలము కౌరవ-పాండవుల చరిత్ర ప్రతిపాదకముగ మాత్రమేకాక అనేక ధర్మ, ఆధ్యాత్మ తత్త్వములకు ఆకరముగ సమస్త ఆస్తిక జనస్తోమమునకు అత్యంత ఆదరణీయముగ నున్నది అట్టి ఉత్కర్ష కలిగిన గ్రంథము కావుననే దానిని దేశభాషలందు అహమహమికతో కవులు అనువదించి తమవాణిని సార్థకము చేసికొనిరి. అట్టి మహాభారత అనువాదములలో కవిత్రయము వారొనర్చిన ఆంధ్రానువాదము, కుమారవ్యాసుని కన్నడానువాదము పేరెన్నికగన్నవి

కవిత్రయమునందు తిక్కనగారి రచనయే బృహత్తరముగ నున్నది ఆయన అనువాదము మహోన్నతముగ నున్నది కుమార వ్యాసుని అనువాదము కూడ ఉత్కృష్టముగ నున్నది. ఈ ఇద్దరు కవులయొక్క దృష్టికోణములను వారి గ్రంథములద్వారా గమనించి తమరు రచించిన గ్రంథము చక్కగ నున్నది. విషయ ప్రతిపాదనము సమీచీనముగ నున్నది తమ యీ ప్రయత్నము సార్థకమగుగాక యనియు, తమ యీ గ్రంథము భావుకులబృందములకు ఆనందము కలిగించుగాక యనియు శ్రీ చరణులు ఆశీర్వదించినారు.

ఇంతే నమస్కారములు.

శృంగేరి
5-10-1991

(సం) టి దక్షిణామూర్తి

**G. V. Subrahmanyam**, M A Ph D,
Professor of Telugu &
Dean, School of Humanities
Central University Hyderabad

హైదరాబాదు
10 10 91

# ప్రశంసింపదగిన పరిశోధన

ఒక రచనయొక్క అస్తిత్వాన్నీ, వ్యక్తిత్వాన్నీ, దేశీయతనూ విలువ కట్టడానికి విశేషంగా తోడ్పడే విమర్శవిధానం తులనాత్మక పరిశీలనం అయితే, దానిని శక్తిమంతంగా వినియోగించుకోవటం మీద దాని ఫలితాలు ఆధారపడి ఉంటాయి. తెలుగులో తులనాత్మక పరిశీలనం సాగవలసినంత విస్తృతంగా సాగలేదని అనిపిస్తుంది పరిమితంగా జరిగిన పరిశ్రమలో ప్రశంసింపదగిన పరిశోధన డా॥ వి వి యస్. మూర్తిగారి "తెలుగు కన్నడ భారతముల తులనాత్మక పరిశీలనము".

తెలుగు, కన్నడ భాషాసాహిత్యాలు అత్యంత సన్నిహితంగా వర్తించిన, వ్యవహరిస్తున్న ప్రజాచైతన్యశక్తులు రెండింటి మధ్యా సమస్పందనలున్నాయి, ప్రతికూల స్పందనలున్నాయి, సంవాద స్పందన లున్నాయి తెలుగు సాహిత్యచరిత్రలో దాదాపు 15వ శతాబ్దం వరకూ వెలువడిన సాహిత్యప్రక్రియల అస్తిత్వాలనూ, వ్యక్తిత్వాలనూ, ప్రత్యేకతలనూ వివేచించవలసివస్తే, మనం కన్నడ సాహిత్య చరిత్రనుకూడా తప్పకుండా అధ్యయనం చేయాలి తులనాత్మక పరిశీలనంద్వారా నాటి విలువలను నిర్ధారణం చేయాలి అంతటి అవినాభావసంబంధం ఉంది తెలుగు కన్నడ సాహిత్యాలకు.

నన్నయ మహాభారతాన్ని తెలుగులో పునర్నిర్మించటానికి ఎందుకు పూనుకొన్నాడు? తిక్కన ఎఱ్ఱాగాదులు ఎందుకు ఆ ఉద్యమాన్ని కొనసాగించారు? నన్నయ ఆంధ్రమహాభారతాన్ని కావ్యేతిహాసంగా ఎందుకు దిద్ది తీర్చాడు? తిక్కన ప్రబంధ మండలిగా

ఎందుకు సంభావించారు? ఎట్టిన ప్రబంధ పరమేశ్వరత్వం అంటే ఏమిటి? శివకవుల దేశి సంప్రదాయం, సాహిత్యపరిభాషా పరికల్పనం వెనుక ఉన్న ప్రేరకశక్తి ఎటువంటిది? మొదలైన ఎన్నో ప్రశ్నలకు కన్నడ సాహిత్య ప్రయోగ పరిజ్ఞానం లేకుండా తెలుగులో సమాధానం చెప్పటం చాల కష్టం అయితే, ఆయారంగాలలో కొంత కృషి జరిగింది.

ఉదాహరణకు ఒకటి రెండంశాలు మనవిచేస్తాను. కన్నడంలో పంపాదులు పురాణ, లౌకిక కావ్యప్రక్రియలను నిర్వహించి జైన మతపరంగా సాహిత్యాన్ని వినిర్మించారు. పురాణ స్వభావాన్ని మార్చారు. పంచలక్షణ విశిష్టమైన పురాణం పంచకల్యాణ విశిష్టమైనదిగా కన్నడంలో రూఢికెక్కింది. పురాణేతిహాసాలలో ప్రసిద్ధమైన కథలను జైనమతానుగుణంగా మార్చి, కావ్యభర్తకూ, కావ్యనాయకునికీ అభేదం పాటిస్తూ రచించిన కథాకావ్యాలు కన్నడ సాహిత్యంలో పంప యుగంలో కస్తూరిలా పరిమళించాయి ఈ పద్ధతికి వ్యతిరేకి నన్నయ. పురాణ, కథాకావ్యాలు కన్నడంలో ప్రశస్తిపొంది ఉన్నాయి వాటిని నన్నయ స్వీకరించలేదు వాటికంటె విలక్షణంగా కావ్యేతిహాసాన్ని ఎన్నిక చేసుకొన్నాడు. తీర్థంకర చరిత్ర కాదు మహాభారత వస్తువు. ధర్మసాధకుని పరిపూర్ణ జీవితం. అందువలన అది ఇతిహాసమైంది. పంప మహాకవి తనకు ముందున్న మార్గ, దేశీ సంప్రదాయాల కవితా ధోరణులను మిశ్రపరచి ఒక కవితాశైలిని సృష్టించి కన్నడకావ్యలక్ష్మికి ఒక వ్యక్తిత్వ స్ఫూర్తిని కల్పించి "ఆదికవి" అనే బిరుదానికి పాత్రుడయ్యాడు నన్నయకూడా తెలుగు కవితకు ఒక కావ్యేతిహాసశైలిని సృష్టించి ఇచ్చి "ఆదికవి"గా గౌరవింపబడ్డాడు. మతానుగుణంగా ప్రసిద్ధకావ్య, పురాణ కథలను మార్చే జైనకవుల పద్ధతికి ప్రతికూల స్పందనయే—

"జననుత కృష్ణద్వైపా
యనముని వృషభాభిహిత మహాభారతబ
ద్ధ నిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్"

అనే భారతరచనాదృష్టి శివకవులు కన్నడ సాహిత్య పరిభాషను తెలుగులోకి తెచ్చిపెట్టాలని నానావిధ ప్రయత్నాలు చేశారు వస్తుకావ్యమన్నారు దేశి, మార్గ పద్ధతులన్నారు జాను తెనుగు అన్నారు. ఈ పరిభాష తెలుగులో ప్రాచుర్యం పొందలేదు శివకవులు తెలుగుసాహిత్యానికి అలంకరించిన కన్నడ బొమ్మలుగానే మిగిలిపోయాయి. తిక్కన కాలంలో ఆ మహాకవి నన్నయ రూపొందించిన తెలుగుకావ్య అస్తిత్వానికీ, వ్యక్తిత్వానికీ ఒక ప్రత్యేక స్థానాన్ని కల్పించాడు తన ప్రభావాన్ని కన్నడ సాహిత్యంమీద ప్రసరింపచేసేటంత ఔన్నత్యాన్ని సాధించాడు. ఇలా వరసగా ఎన్నో విశేషాలు తెలుగు-కన్నడ సాహిత్యాల తులనాత్మక అధ్యయనం ద్వారా వెలువడే అవకాశం ఉన్నదని స్పష్టమౌతున్నది ఈ భూమికతో పరిశీలిస్తే ఈ సిద్ధాంతవ్యాసంలో ఎన్నో కొన్ని వస్తువుల యొక్క విలువ మనకు తెలియవస్తుంది

డాక్టర్ బి వి యస్ మూర్తిగారు తిక్కన, కుమారవ్యాసుల భారత రచనలను తులనాత్మకంగా పరిశీలించారు ఇది అభినందిపదగిన అంశం తెలుగులో పంప, నన్నయల కవితా విశేషాలను గురించి జరిగినంత చర్చ తిక్కన, కుమారవ్యాసుల కవితా విశేషాలను గురించి సాగలేదు నాకు తెలిసినంతవరకు. ఈ అంశంమీద తెలుగులో ఒక సమగ్రస్థాయిలో సాగిన తులనాత్మక పరిశీలన గ్రంథం మూర్తిగారి సిద్ధాంతవ్యాసం తెలుగు సాహిత్య వికాస చరిత్రకు తోడ్పడే ఎన్నో విలువైన అంశాలను ఈ గ్రంథం మనకు అందిస్తున్నది ఆంధ్రమహాభారత ప్రశస్తిని ఇనుమడింపజేసే సత్యాలనెన్నో ఈ తులనాత్మక పరిశీలనం వెలువరిస్తున్నది.

ఎనిమిది అధ్యాయాలలో నిర్వహించిన ఈ సిద్ధాంత వ్యాస రచనలో మొదటి, చివరి అధ్యాయాలను ఉపక్రమణిక, ఉపసంహారాలుగా గ్రహించినా మిగిలిన ఆరు అధ్యాయాలూ తులనాత్మక పరిశీలనకు సంబంధించినవే విశేషమేమంటే తిక్కన ప్రభావం కుమారవ్యాసునిమీద ఉండవచ్చునేమో అనే తార్కిక అనుమానం (హైపోథిసిస్) ఈ పరిశోధనకు ప్రాతిపదిక పరిశోధన ఫలితాంశంగా తేలిన తాత్పర్యమేమిటంటే- తిక్కన కుమారవ్యాసుల రచనలలో కొన్ని సమానాంశాలు ఉన్నా, తిక్కన ప్రభావం కుమారవ్యాసుని మీద లేదని, వారిరువురి రచనలూ ఆ కాలాలలో వెలసిన విశిష్ట ప్రయోగాలని ఈ ఫలితాంశ ప్రభావం సిద్ధాంతరచనా ప్రణాళిక మీద పడక తప్పదు. అందువల్లనే డాక్టర్ బి వి యస్ మూర్తిగారు ద్వితీయాధ్యాయం నుండి సప్తమాధ్యాయం వరకు ప్రతి అధ్యాయం లోనూ మూడు అంతర్విభాగాలను చేసుకోనవలసి వచ్చింది మొదటి విభాగంలో తిక్కన రచనకు సంబంధించిన అంశాలు, రెండవ విభాగంలో కుమారవ్యాసుని సంబంధించినవీ వివరించి, మూడవ విభాగంలో తులనాత్మకపరిశీలన ఫలితాంశాలను ఈ గ్రంథరచయిత వివరించారు ఫలితాంశాలకు అనుకూలమైన పరిశోధనప్రణాళిక ఈ పరిశోధనలోని ఒక ప్రత్యేకత

పరిశోధనలో విస్తృత సామగ్రిసేకరణం, విశ్లేషణం, సముచితమైన వినియోగం జరిగింది ఈ అంశం పరిశోధన కృషికి సాక్ష్యం. వక్తవ్యాంశాలను సోదాహరణంగా స్పష్టప్రతిపత్తితో వివరించిన రచనావిధానం ఇందులో గోచరిస్తుంది ఇది పరిశోధకుని అవగాహనను, ఆలోచనలోని స్పష్టతను పట్టియిస్తుంది

డాక్టర్ బి. వి. యస్ మూర్తిగారు సంస్కృతాంధ్ర భాషా సాహిత్యాలలో మంచి పాండిత్యం కలవారు. కన్నడభాషా సాహిత్యాలతో వారికున్న పరిచయం ఈ పరిశోధనకు బాగా తోడ్పడింది అధ్యాపకులుగా, పరిశోధకులుగా మూర్తిగారి శక్తిసామర్థ్యాలు

ప్రదర్శితం కావటానికి ఈ పరిశోధన ఒక మంచి అవకాశం కల్పించింది. వీటన్నిటికంటె మించి బెంగుళూరు విశ్వవిద్యాలయంలో ఈ పరిశోధన జరగటం హర్షింపదగిన విశేషం. మిత్రులు ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావుగారి సారథ్యంలో ఈ తులనాత్మక అధ్యయన ప్రవృత్తి బెంగుళూరు విశ్వవిద్యాలయం ఆంధ్రశాఖలో మూడుపూవు లారుకాయలుగా అభివృద్ధి చెందుతున్నది

ఆ శాఖ కాసిన రుచికరమైన ఫలాలలో ఇది ఒకటి. అందుకు పర్యవేక్షకులు ఆచార్య సుబ్బారావుగారినీ, పరిశోధకులు డాక్టర్ బి.వి.యస్. మూర్తిగారిని మనసారా అభివందిస్తున్నాను.

హైదరాబాదు<br>
10-10-1991.

జీ వి. సుబ్రహ్మణ్యం



ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు
తెలుగు అధ్యయన శాఖాధ్యక్షులు
బెంగుళూరు విశ్వవిద్యాలయం

బెంగుళూరు
6-10-91

# తులనాత్మక సాహిత్యం - తెలుగు కన్నడాలు

1974లో బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు ఎం.ఏ. తరగతులు ప్రారంభించాం. తరువాత ఎం.ఫిల్., పిహెచ్.డి. డిగ్రీలు కూడా ప్రారంభమయ్యాయి. కన్నడ దేశంలో మన తెలుగుశాఖ ఏర్పడడానికి ముఖ్యకారకులు ఈనాటి భారత ప్రధాని, ఆనాటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, సాహిత్యప్రియులు, బహుభాషాకోవిదులు అయిన శ్రీ పి.వి. నరసింహారావుగారు 1971 లోనే వారిచ్చిన మూడులక్షల నిధితో 'కవిసమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణగారి ప్రోత్సాహంతో ఇక్కడ తెలుగుశాఖ ఏర్పడింది.

ఈ తెలుగు అధ్యయనశాఖ కర్ణాటక రాజధానిలో ఉండడం వల్ల తెలుగు కన్నడ సాహిత్యాల తులనాత్మక పరిశోధన సమంజసంగా ఉంటుందని నాకు అనిపించింది. నా ప్రియమిత్రులు దూర్వాప్రగడ తిరుపతిరావుగారిచే 1970లోనే నేను ఇటువంటి తులనాత్మక పరిశోధనకు అంకురార్పణ చేయించి 1973 లో పూర్తి చేయించాను. 1979-80 సంలలో చి॥ బి.వి. యస్. మూర్తి ఈ తులనాత్మక పరిశోధన కొనసాగించి ఎం.ఫిల్. డిగ్రీ తీసుకొన్నారు. దీనితో తృప్తిచెందక సత్యనారాయణమూర్తిగారు తిక్కన రచనలో మేరుశిఖరాలైన విరాటోద్యోగపర్వాలు రెండూ తీసికొని, కుమారవ్యాసుని రచనతో పోల్చి నా పర్యవేక్షణలో సమగ్రంగా పరిశీలించారు. 1988లో ఈ కష్టతరమైన పరిశోధనను సమర్థవంతంగ నిర్వహించి పిహెచ్.డి పూర్తి చేశారు.

నేను బెంగుళూరు విశ్వవిద్యాలయంలో రెండు పరిశోధన ప్రణాళికలు సిద్ధంచేశాను. తిక్కన భారతాన్ని మూలంతో పోల్చడం ఒకటి, తిక్కన భారతాన్ని కుమారవ్యాసుని భారతంతో పోల్చడం రెండు. ఈ రెండూ రెండు శాఖలుగా కొనసాగుతున్నాయి సంస్కృతం బాగా చదువుకున్న పరిశోధకులు మొదటిశాఖనూ, కన్నడభాషా పరిచయంగలవారు రెండవశాఖనూ వరించి ముందుకు పోతున్నారు నన్నయ భారతాన్ని పంప భారతంతో పోల్చిచూడడం కూడా పూర్తి అయింది ఇకపోతే నన్నయ భారతాన్ని కుమారవ్యాసుని భారతంతో పోల్చడం, తిక్కన భారతాన్ని పంపభారతంతో పోల్చడం, తిమ్మణ్ణ భారతంతో పోల్చడం మిగిలి ఉన్నాయి ఇవి నా భవిష్యత్ప్రణాళికలు.

తెలుగులో సాహిత్యం క్రీ శ 11వ శతాబ్దంలో ప్రారంభమయితే, కన్నడంలో క్రీ శ 9వ శతాబ్దంలోనే ప్రారంభమయింది 1100 సం॥ల చరిత్రగల కన్నడ సాహిత్యాన్ని ఆరు యుగాలుగ విభజించవచ్చు 1 ప్రాచీన యుగం (క్రీ శ. 450-940) 2 పంప యుగం (940-1150) 3 బసవ యుగం (1150-1400) 4 కుమారవ్యాస యుగం (1400-1700) 5 చిక్కదేవరాయ యుగం (1700-1900) 6 ఆధునిక యుగం (1900-నేటివరకు). ప్రాచీన యుగంలో "కవిరాజమార్గ" అనే లక్షణగ్రంథం (నృపతుంగుడు, 814-877) "వడ్డారాధనె" అనే జైన కథల సంకలనం (శివకోట్యాచార్యుడు, 10వ శతాబ్దం) ప్రసిద్ధికెక్కాయి పంపయుగంలో పంప, పొన్న, రన్న (రత్నత్రయం), బసవయుగంలో హరిహరుడు, రాఘవాంకుడు, జన్నకవి, కుమారవ్యాస యుగంలో కుమారవ్యాసుడు, లక్ష్మీశుడు, చిక్కదేవరాయల యుగంలో తిరుమలార్యుడు, బసప్పశాస్త్రి, ఆధునిక యుగంలో కువెంపు, బేంద్రె, అడిగ గొప్ప కవులు

ప్రాచీనాంధ్ర కవిత్వంలోని తిక్కనలాంటి కవి, రాయలలాంటి కవి, ఆధునికాంధ్ర కవిత్వంలోని విశ్వనాథలాంటి కవి, శ్రీశ్రీలాంటి

కవి కన్నడంలో లేరు. తెలుగులో కూడా తిక్కనంటి కవి తిక్కన ఒక్కడే మనకు నన్నయను అనుకరించి సఫలీకృతులయిన కవు లున్నారు కాని తిక్కన ననుకరించి నెగ్గినవారు లేరు. అర్థాన్ని అనుసరించి మాత్రమే శబ్దం నడవడం, వాక్యాలన్నీ సూచ్యార్థ సూచ కాలుగ ఉండడం, నాటుకభాషలోని పదాలు ఎక్కువగ వాడడం తిక్కన శైలియొక్క ప్రత్యేకత

కుమారవ్యాసుడు ఆదిపర్వం నుండి గదాపర్వం వరకు గల పది పర్వాలు అత్యద్భుతంగా వ్రాశాడు దానికి "కర్ణాట భారత కథామంజరి" అని పేరు పెట్టాడు. కాని ఈ పేరు మరుగున పడిపోయి జన వ్యవహారంలో "కుమారవ్యాస భారతం" అని "కన్నడ భారతం" అని "గదుగిన భారతం" అని పేరు వచ్చింది దీంట్లో 150 సంధులు, 8,500 భామినీ షట్పది పద్యాలు ఉన్నాయి తరువాతి 8 పర్వాలను కృష్ణరాయల ఆస్థానంలోని తిమ్మణ్ణ రాయల కోరికమీద పూర్తి చేశాడు (ఇతడు పూర్తిగ తిక్కన ననుసరించాడు)

తెలుగులో పోతన భాగవతానికి ఎంత పేరు ప్రఖ్యాతు లున్నాయో, కన్నడంలో కుమారవ్యాసుని భారతానికి అంత పేరు ప్రఖ్యాతు లున్నాయి పోతన కవిత్వానికీ, కుమారవ్యాసుని కవి త్వానికీ చాలా పోలికలు కూడా ఉన్నాయి ఇద్దరూ మహాభక్తులు పోతన భక్తితో భాగవతాన్ని వ్రాస్తే కుమారవ్యాసుడు భారతాన్ని కూడా భాగవతంలాగే వ్రాశాడు. తన భారతాన్ని "కృష్ణకథ'' అని చెప్పుకున్నాడు పోతన కుమారవ్యాసు లిద్దరూ నన్నయలాగ అక్షర రమ్యతను ఆదరించారు. శ్రవణపేయమైన ప్రేయస్సును, సౌకుమా ర్యాన్ని పాటించారు. ఈ గుణాలు సరిగ్గా తిక్కన కవిత్వానికి వ్యతి రేకమైన గుణాలు! పోతనలోలాగే కుమారవ్యాసుడిలో కూడా గీతి గుణం (Lyrical element) ఎక్కువ. అతడు షట్పది పాటలగా భారతం వ్రాశాడు పోతన సీసపద్యాలన్నీ మధురమైన పాటలుగానే వ్రాశాడు తిక్కన ఈ గీతిగుణానికి బద్ధ విరోధి

తెలుగు సాహిత్యంలో తిక్కన, కన్నడ సాహిత్యంలో కుమారవ్యాసుడు ప్రథమశ్రేణికి చెందిన మహాకవులు ఇద్దరు తమ

తమ సాహిత్య చరిత్రలలో యుగకర్తలు కవిత్వంలోను పాండిత్యంలోను కూడా దిట్టలు భారతాన్ని తిక్కన ధర్మాద్వైత బుద్ధితో వ్రాశారు మత వైషమ్యాలతో కొట్టుకు చస్తున్న ఆంధ్రులకు హరిహరనాథ తత్త్వాన్ని ప్రతిపాదించాడు. కుమారవ్యాసుడు కేవలం భక్తిభావంతో భారతాన్ని వ్రాశాడు. భారతాన్ని "కృష్ణకథ" అని చెప్పాడు అంటే పోతన భాగవతం వ్రాసినట్టుగ, కుమారవ్యాసుడు భారతాన్ని వ్రాశాడన్నమాట. తిక్కన భారతానికి లౌకికమైన సామాజిక ప్రయోజనం ఉంది దీని ప్రయోజనం వైయక్తికమైన "ఆత్మవిముక్తి" అనికూడా చెప్పవచ్చు

తిక్కన కుమారవ్యాసులిద్దరూ భారతీయ సంస్కృతికి దర్పణం పట్టిన మహాకవులు ప్రతిభాశాలురు, బృహత్తర కావ్యాలు నిర్మించిన అపూర్వ శిల్పులు ఇద్దరికీ వ్యాసభారతమే మూలం. ఇద్దరూ వైదికధర్మంమీద భక్తి తాత్పర్యాలు కలవారే. అందువల్ల ఇద్దరూ సంస్కృత భారతాన్ని బాగా జీర్ణించుకొని వ్యాసహృదయాన్ని పూర్తిగా గ్రహించి "కృష్ణద్వైపాయనముని వృషభాభిహిత మహాభారత బద్ధ నిరూపితార్థ మేర్పడన్" తమ తమ మాతృభాషలలో వ్రాశారు కాబట్టి ఈ రెండు భారతాల తులనాత్మక పరిశీలనం చాల అవసరం.

విషయసేకరణ వర్గీకరణ, విశ్లేషణ—ఈ మూడు పరిశోధనలో ప్రధానాంగాలు. ఈ మూడింటిని డా॥ మూర్తిగారు చక్కగ నిర్వహించారు తులనాత్మక సాహిత్యం నేడు ప్రత్యేక శాఖగ అభివృద్ధి చెందుతోంది (దీంట్లో ఎం.ఎ కోర్సులుకూడా ప్రారంభమయ్యాయి) ఈ శాఖాభివృద్ధికి డా॥ బి.వి యస్ మూర్తిగారి కృషి దోహదం చేస్తోంది అనడంలో సందేహం లేదు.

జ్ఞానభారతి
6-10-91

తంగిరాల వెంకట సుబ్బారావు

# డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు,

ఎం ఏ పిహెచ్ డి

## సహృదయ భూమిక

"బహుభాషల బహు విధముల
బహుజనములవలన వినుచు భారత బద్ధ
స్పృహులగు వారికి నెప్పుడు
బహుభాగంబుల ఫలంబు పరమార్థముగన్.

అని రాజరాజనరేంద్రుడు నన్నయభట్టారకునితో ననిన మాటను బట్టి సంస్కృతభారత మప్పటికే వివిధ దేశభాషలలోని కనువదింపఁ బడుటయో, అనుసరింపబడుటయో జరిగియుండెనని తెలియుచున్నది. ఆ దేశభాషలు తమిళ కన్నడములు. ఆ భాషలలో భారత మప్పటికే రచింపఁబడియుండుటచేతనే రాజరాజు స్వభాషయగు తెలుఁగులోఁ గూడ భారతమును రచియింప నన్నయను ప్రేరేచెను.

ప్రకృతగ్రంథము 'తెలుఁగు కన్నడ భారతముల తులనాత్మక పరిశీలనము' దీని రచయిత డాక్టర్ బులుసు వేంకట సత్యనారాయణ మూర్తిగారు వారు పిహెచ్ డి పట్టముకయి బెంగుళూరు విశ్వ విద్యాలయమునకు సమర్పించిన సిద్ధాంతగ్రంథమిది ఈ పరిశీలనము విరాటోద్యోగ పర్వములకు మాత్రమే పరిమితమయినది గావునఁ దెలుఁగున నా పర్వములను రచించిన తిక్కనయు, కన్నడ భారత రచయితయగు శ్రీ కుమారవ్యాస బిరుదాంచిత నారణప్పతోఁ దుల నాత్మక పరిశీలనార్హుఁడగుచున్నాఁడు, మఱియు నొక్క తిక్కనతోఁ బరిశీలించినచో నీ గ్రంథము లక్ష్యము నెఱవేఱినట్లు కాదు తిక్కన నారణప్పల గ్రంథములకు మూలము వ్యాసమహర్షికృత సంస్కృత మహాభారతము గావున దానితోఁ గూడ నీ గ్రంథమును బరిశీలింప వలసిన యావశ్యకత యీ రచయిత కేర్పడినది. అందుచే వీరి కృతి త్రిధాభూత మయినది

కావున నా రెండు భాషల యందలి భారతములను బరస్పరము పోల్చుటయు, నా రెంటికిని మూలమగు వ్యాసభారతముతో వానిని సరిచూచుటయు ననుచితముగాక పోవుటయు కాక సముచిత మనియుం జెప్పనొప్పను.

ఇందలి విషయ విభజనము యథోచితముగా నున్నది. అది రచయిత విషయ వివేచనా శక్తికి దార్కాణ.

ఇందు రచయిత చేసిన నిర్ణయములసందిగ్ధములయి, సత్య సన్నిహితములయి వారి పరిశీలనశక్తిని జాటుచున్నవి.

ఈ గ్రంథమున రచయిత యుపయోగించిన భాష సరళమై పరిశోధన సద్యోఽవగాహన యోగ్యమై యలరారుచున్నది.

ఇట్టి గ్రంథమును వ్రాయుటయన మాటలుగాదు. రచయిత మూడు భాషలలో బండితుడు కావలయును. సంస్కృతాంధ్ర కర్ణాట భారతములను క్షుణ్ణముగాం బరిశీలించి విమర్శించు శక్తిగల వాడయి యుండవలయును. కవితాశిల్పచాతుర్యవేత్తయై యుండవలయును. ఈ రచయిత డాక్టర్ బులుసు వేంకట సత్యనారాయణ మూర్తిగారి కాయా విషయము లన్నిటియందును శక్తియున్న దనుటకీ గ్రంథమే నిదర్శనము.

రచయిత సంస్కృతాంధ్ర కర్ణాట భారతములనుండి ప్రకరణానుగుణముగా పలయు భాగముల నుద్ధరించి ప్రత్యక్షీకరించుటచే గ్రంథమునకు గౌరవ మేర్పడి పరిశీలకులకు విశ్వాస్యమగుచున్నది.

రచయిత డాక్టర్ మూర్తిగారింత సమర్థముగా నీ గ్రంథమును రచించినందుల కెంతయు నభినందనీయులు. వారిట్టి విమర్శ గ్రంథముల నింకను రచించి విద్వల్లోక నుతి పాత్రులగుదురని యాకాంక్షించుచున్నాను.

రాజమహేంద్రవరము,
8-10-1991

జొన్నలగడ్డ మృత్యుంజయరావు

# విషయసూచిక

శ్రీ

# ప్రథమాధ్యాయము - అవతారిక

## భారత ప్రాశస్త్యము :

జయ నామకమగు వ్యాసకృత భారతము తొలుత 8800ల శ్లోకములతో గాథా రూపముగ నుండినది. ఇది కాలక్రమమున ప్రక్షిప్తములతో చేరి సపాద లక్ష శ్లోక విస్తృతమైనది.

వేదములకు సకల స్మృతి వాదములకు బహుపురాణ వర్గంబులకున్
నాదైన చోటులను గామూలల ధర్మార్థ కామ మోక్ష స్థితికిన్[1]

వేదపారాయణద ఫల గం
గాది తీర్థ స్నాన ఫల కృ
చ్ఛ్రాది తపసిన ఫలవు జ్యోతిష్టోమ యాగ ఫల
మేదినియ నొలిదిత్త ఫల వ
స్త్రాది కన్యా దాన ఫల వహు
దా పరిసి భారత దొళొం దక్షరవ పేళ్దరిగె[2]

(భారతము ఒక అక్షరమునైనను ఆదరముతో వినిన వారికి వేద పారాయణము వలని ఫలము, గంగాది తీర్థముల స్నానము చేసిన ఫలము, కృచ్ఛ్ర చాంద్రాయణాది తపముల ఫలము, జ్యోతిష్టోమ యాగము చేసిన ఫలము, ప్రీతితో భూదానము చేసిన ఫలము, వస్త్ర దానము, కన్యాదానము మొదలగు దానములు చేసిన ఫలము కలుగుచున్నది)

అని నుతింపబడిన భారతమును దక్షిణ దేశ భాషలలో మొట్టమొదట క్రీ॥ శ॥ 9వ శతాబ్దమున 'పెరుం దేవనారు' అను కవి

---

1 తిక్కన భారతము వి. ప, ప్ర. ఆ, పద్యము 4

2 కుమార వ్యాస భారతము ఆ. ప, పీఠికా సంధి, పద్యము 20

తమిళమున రచించెను. తరువాత క్రీ॥ శ॥ 10వ శతాబ్దమున 'పంప' కన్నడమున 'విక్రమార్జున విజయము' అను పేర భారతమును రచించెను ఆంధ్రమున నన్నయకు పూర్వమే 'అధర్వణుడు' భారతమును రచించెనందురు. కాని అది నేడు లభ్యమగుటలేదు రాజ రాజ నరేంద్రుని కోరికపై ఆదికవి, వాగనుశాసనుడు నగు 'నన్నయభట్టు' భారతమును జగద్ధితముగ నాంధ్రీకరించుటకు మొదలిడి ఆది, సభా పర్వములను, అరణ్య పర్వమున కొంత భాగమును వ్రాసి మరణించెను

తిక్కన విరాట పర్వము మొదలుకొని 15 పర్వములను ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగ తెనుగు బాస వినిర్మింప బూనుటవలన ఆంధ్రుల సుకృతము కావ్యకర్తలు, శబ్ద నిపుణులు, కావ్య నిర్మాతలు, ధర్మోపదేష్టలు, తత్త్వజ్ఞాన సంపన్నులు వేరు వేరుగ నుండుట సహజము. పై మహత్త్వము లన్నియు నొకే పురుషునియందు రాశీభూతమై యుండుట అరుదు. అట్లున్నచో ఆ మహామహుడు తన జాతియొక్క పుణ్యవశమున జన్మించిన వాడని చెప్పదగును తిక్కన ఆంధ్ర జాతిలో నట్టివాడుగ జన్మించిన మహానుభావుడు.

నన్నయ, తిక్కనలు రచింపగ మిగిలిన అరణ్య పర్వ శేషమును 'ఎఱ్ఱాప్రగ్గడ' పూరించి భారతాంధ్రీకరణమును పూరించిన ఘనత నందుటయే గాక కవిత్రయములో నొకడై సమ్మాన్యుడైనాడు

కన్నడ మహాకవులైన పంప, రన్నలు తమ భారతములను జైనమత ప్రభావముతో రచించిరి వ్యాసభారతమును పంచమ వేదముగ పరిగణించి హరిలో సమస్త లోకములు అణగి యున్నటులు భారత సముద్రమున సమస్త పురాణములు, శాస్త్రములు అణగి యున్నవని భావించి భారత రచనము వలన జన్మ జన్మల పాపము

శ్లాఘనీయ మగునని విశ్వసించినవాడు కుమార వ్యాసుడు. కుమార వ్యాసుని నిజనామము నారణప్ప. ఈతడు కన్నడ కవులలో సుప్రసిద్ధుడగుటయే గాక కన్నడిగులకు అత్యంత ప్రీతి పాత్రుడు. ఈతని భారతము వినిపించని పల్లె కన్నడ దేశమున లేదనుట అతిశయోక్తి కానేరదు.

కుమార వ్యాసుడు భారతమున తొలి పది పర్వములను 'భారత కథామంజరి' అను పేర రచించెను. మిగిలిన యెనిమిది పర్వములను శ్రీకృష్ణ దేవరాయల ప్రేరణమున 'తిమ్మణ్ణ' అను కవి అనువదించెను.

వేలకొలది వర్షముల నుండి భారతీయుల హృదయ పీఠముల నాక్రమించుకొని స్త్రీ, బాల, వృద్ధులని గాని, అక్షరాస్యులు, నిరక్షరాస్యులని గాని లేక అందరిచేత నొకే రీతిని సన్మానింపబడుచున్న గ్రంథము మహాభారతము. విపులత్వమున గాని, మహత్త్వమున గాని దానికి సరితూగు గ్రంథము వేరొకటి లేదని చెప్పవచ్చును. వ్యాస మహర్షి దివ్య ప్రతిభచే రూపు దిద్దుకొన్న మహాద్భుత కృతి యిది.

వ్యాసమహర్షి కురువంశ మూలపురుషులలో నొకడు. కౌరవ, పాండవులకు పితామహుడు. తన వంశము నందలి మూడు తరముల వారి ఆటుపోటులను కనులార గాంచినవాడు. నాటి జన జీవనమును, సంస్కృతిని సమగ్రముగ గ్రహించినవాడు. ఆ కారణముననే తనకు అనుభవైక వేద్యమగు భరత వంశీయుల చరితమును 'మహాభారతము'న నిష్పాక్షిక దృష్టితో నిక్షేపించినాడు.

వ్యాసుడు మహాభారతమునే గాక పదునెనిమిది పురాణములను రచించెననియు, వేదములను నాలుగు భాగములుగ విభజించెననియు ప్రతీతి. ఒకే వ్యక్తి ఈ కార్యము నంతయు తానొక్కడే చేయుట సాధ్యమగునా? అను అవిశ్వాసముతో కొందరు విద్వాంసులు అవన్నియు భిన్న కర్తృకములని ఊహించి యున్నారు. మరి

తపోనిరతులు, మేధావులు నగు మహర్షుల శక్తిని మన పరిమితిలో కొలచి చూచుట తప్పు కావచ్చును. అయినప్పటికిని అవన్నియు ఏక కాల కర్తృకములు కావనియు, ఏక కర్తృకములును కావనియు పలు బాహ్యాంతర సాక్ష్యములచే నిరూపింప బడు చుండుట వలన ఆ యూహ సమంజసమేమో యనిపించుచున్నది

"వ్యాస" అనునది ఒక వ్యక్తి పేరుకాదు ఒక కుటుంబము యొక్క లేదా ఒక గురు పరంపరయొక్క పేరు కావచ్చునందురు అట్లంగీకరించిన వేదములను విభజించిన వాడును, పురాణములను రచించినవాడును వేరు వేరు వ్యాసులగుదురు. భారతమును రచించినది "కృష్ణ ద్వైపాయనుడ"ను వ్యాసుడు

"మహాభారతము" ప్రాచీన కాలము నుండియు మన దేశమున అత్యంత ప్రజానురాగము పొందిన కావ్యము. "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అని కావ్య పఠనమును నిషేధించిన జనులు గూడ మహాభారతమును ప్రతి దినము పారాయణము చేయుచు అందలి తత్త్వములను అనుష్ఠానమునకు తెచ్చుటకు ప్రయత్నించిరి. కొద్దిమందికి మాత్రమే పఠన యోగ్యమగు వేదమువలె గాక "భారతము" అందరును పఠింపదగిన గ్రంథమైనది ఎందరో దార్శనికులు, సాధు సజ్జనులు, రాజులు మహారాజులు దాని వలన ప్రేరితులగుటయేగాక అసంఖ్యాక కవులు, నాటక కారులు, శిల్పులు, చిత్రకారులు తమ కృతులకు మూల సామగ్రిగను, మహోన్నత భావములకు ప్రేరకముగను దానినే ఆశ్రయించిరి. ప్రాచీన కాలమున "మహాభారతము" ప్రాథమిక విద్యాభ్యాసమున అధ్యయనమునకు అత్యావశ్యకమై యుండెడిదట మహాభారతకథ నాటి విశాల భారత ఖండమందలి మూల మూలలలోనే గాక బర్మా, సయాామ్ వంటి విదేశము లందును, జావా, బలి వంటి దూర ద్వీపములందును వ్యాప్తిలో నున్నట్లు తెలియుచున్నది.

కేవలము కళాభివ్యక్తి కొరకు మన మహాకవులు తమ కావ్యములను రచించి యుండలేదు. ధర్మ బోధ గావించు ఉద్దేశము తోడనే వారు గ్రంథములను రచించిరి. "కళ కొరకే కళ" అనునది వారి తత్త్వము కాదు. 'ఆత్మోద్ధారణ కొరకే కళ' అనునది వారి లక్ష్యము. కావ్యము తన సౌందర్యముచే సహృదయుల నాకర్షించి తత్కాలమున మోహ పరవశులను చేసి రసానందమున ముంచి తేల్చుటతో బాటు కాంతాసమ్మితముగ ఉపదేశమును గూడ చేయ వలయునని వారి ధ్యేయము.

కావ్య సౌందర్యము నాస్వాదించుచు సహృదయులు ఆనందమున తన్మయులై యున్నప్పుడు వేరొక సమయమున శుష్కములుగ కనబడు ధార్మిక విషయములు వారికి హృద్యముగ కనబడును. వారికి తెలియకుండగనే వారి హృదయమున సూటిగ చొచ్చి వారి జీవనమున పెనవేసికొని పోవును. ఒక చిన్న కథ లేదా రూపకముచే వచ్చునట్టి పరిణామము ఏ నియమముల చేతను రాదు. అందుచేతనే మహావీరుడు, గౌతమ బుద్ధుడు, రామకృష్ణ పరమహంస వంటి మహనీయులు తమ అనుచరులకు ధర్మ స్వరూపమును మనోహరమగు కథల రూపమున ఉపదేశించి యుండిరి. సద్భావన, సచ్చరిత్రములు కథలలో వచ్చెడి నిదర్శనములచే స్పష్టముగ మనసునకు హత్తుకొనుటయే గాక అవి దేహము లేదా ఆలోచనలయొక్క అవిభక్తాంగములై పోవును. మహాభారతము వలన జరుగునట్టి క్రియయు నదియే. అది భారతీయుల స్వభావమును సంప్రదాయములను చాల వరకు తీర్చి దిద్దుకొని వారి జీవనమును ధర్మమను పునాదులపై నిలిపినది.

ఒక విధముగ 'మహాభారతము' పాండవ, కౌరవుల యుద్ధ కథ. ఇది వీరయుగమునకు చెందిన ఒక కృతి. దానియందలి యుద్ధపరంపరలు, యుద్ధోత్సాహములు, వీరుల సింహనాదములు, శస్త్రాస్త్రముల మహిమలు, రోమాంచము కలిగించు సన్నివేశములు, చావు బ్రతుకులు, గెలుపు ఓటములు సమ్మిళితమై

కురుక్షేత్ర రణరంగమున 18 అక్షౌహిణుల సైన్యమునకు 18 దినముల ఘోరయుద్ధముగ పరిణమించి చివరకు ఉభయ పక్షముల సర్వ వినాశనమునకు దారితీసినది. జటిలమగు సన్నివేశములతో కూడిన కౌరవ, పాండవుల ఈ వీరగాథయే మహాభారతమును విశ్వసాహిత్యమున అగ్రస్థానమున నిలబెట్టుచున్నది. ఇంతియేగాక అందంతర్లీనమైయున్న నైతిక ధార్మిక భావనలు కూడ దాని విశ్వజనీనతకు హేతువగుచున్నది. "ధర్మలాభాత్ పరం నాస్త్యత్ తస్మాత్ ధర్మం చరోత్తమం" "యతో ధర్మస్తతో జయః" ఇదియే అనుగుణముగున కథల వలన మనకు తెలియు విషయము. కుంతీదేవి తన కుమారుడగు యుధిష్ఠిరునకు చెప్పు బుద్ధివాదమిది - "ధర్మే తే ధీయతాం బుద్ధిః మనస్తు మహదస్తు చ" చిట్టచివర వ్యాసమహర్షి ఎలుగెత్తి ఇచ్చిన సందేశమిది -

> ఊర్ధ్వబాహుః విరౌమ్యేష న తు కశ్చిత్ శృణోతి మామ్
> ధర్మాదర్థశ్చ కామశ్చ స కిమర్థం న సేవ్యతే
> న జాతు కామాత్ న భయాత్ న లోభాత్
> ధర్మం త్యజేత్ జీవితస్యాపి హేతోః
> ధర్మో నిత్యః సుఖదుఃఖే త్వనిత్యే
> జీవో నిత్యః హేతురస్య త్వనిత్యః

ధర్మాధర్మములకు నిరంతరము పోరాటము జరుగుచునే యుండును. కొండొకచో అధర్మమే పైచేయిగ కనపడినను అది తన వినాశనమునకు మూలమగు అంశమును కూడబెట్టుకొని యుండుటవలన దాని జీవనము అల్పకాలికమని మహాభారతము మనకు బోధించుచున్నది. అసత్యము, అన్యాయము, అధర్మము తలయెత్తకయే యుండకూడదా? అను విషయమును మితబుద్ధికల మనము తెలిసికొనజాలకపోవచ్చును. కాని ధర్మమే చివరకు జయించునని మాత్రము 'మహాభారతము' మనకు విశ్వాసమును కలిగించుచున్నది

ధర్మమను పునాదులపై నిలచియుండు మహాభారతమున భారతీయులకు మిగిలిన విషయములకన్నను ప్రధానముగ కనబడునది అందు ప్రతిపాదితమగు ధర్మము సంహిత, స్మృతులవలెనే మహాభారతమును ఒక ధర్మగ్రంథము అందు నాయకునిగ పేర్కొనబడు యుధిష్ఠిరుడు ధర్మరాజు అతడు ధర్ముని కుమారుడు ధర్మావతారము (ఆత్మావై పుత్రనామాసి) భారత యుద్ధము ధర్మయుద్ధము. ఆ యుద్ధక్షేత్రము ధర్మక్షేత్రము (ధర్మక్షేత్రే కురుక్షేత్రే) కావ్యమున పలుమార్లు చెప్పబడిన విధముగ విజయము ఎల్లప్పుడు ధర్మము వైపే (యతో ధర్మస్తతో జయః) విష్ణువు శ్రీకృష్ణునిగ అవతారమెత్తినదియు ధర్మ సంస్థాపనముకొరకే (ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే) ఆ కారణముననే మహాభారతమును మిగిలిన విషయములన్నిటికంటెను అధికముగ ధర్మశాస్త్రమునియే పరిగణింతురు

మహాభారతమున కథాకల్పనము, అంతర్గతముగు నైతిక భావన ఎంత చక్కనిదో వ్యాసమహర్షి యొక్క పాత్రముల పరికల్పనమును అంత చక్కనిది భీష్మ, ద్రోణ, యుధిష్ఠిర, భీమార్జున, కృష్ణ, దుర్యోధన, కర్ణ, ద్రౌపదులు - ఈ ఒక్కొక్క పాత్రమునందును ప్రారంభమున కనబడు గుణవిశేషములు కథ సాగుకొలది వికాసమునంది క్రమక్రమముగ స్పష్టమగుచుపోయి కథయొక్క ఉపసంహారమునకు తగిన రీతిని రూపుదిద్దుకొన్నవి యుధిష్ఠిరునియందు శాంతి, సంయమము, ధర్మ దౌర్బల్యము, దుర్యోధనునియందు ద్వేషము, అసూయ, క్రౌర్యములతో కూడిన మూర్ఖత్వము దానికితోడు పాపమునకు వెరవనట్టి స్వభావము, భీమునియందు నిర్లక్ష్యస్వభావము మరియు హఠాత్తుగ ఉద్రేకముపొందు ప్రవృత్తి, అర్జునునియందు గాంభీర్యము, దీనరక్షణ, యుక్తాయుక్త పరిజ్ఞానముతో కూడిన సాహసము, కర్ణునియందు గర్వము, దురహంకారము, బద్ధవైరములు

వానితోపాటు విచిత్రమగు ఔదార్యము; ధృతరాష్ట్రునియందు
మితిలేని గాఢత్వము, విజ్ఞః విదుర ద్రోణులయందు న్యాయపరత,
రాజనీతిః భీష్మునియందు శౌర్యము, దయాపరత, వైరాగ్యము,
ద్రౌపదియందు స్త్రీ సహజమగు వినయశీలత, తీవ్రనిష్ఠ, పరిశుద్ధ
చరిత్రము వీనిని ప్రధానముగ చూడవచ్చును. అటులనే శ్రీకృష్ణుని
యందలి రాజనీతి, గాంభీర్యములను, దుష్టశిక్షణ, శిష్ట రక్షణ మూల
ముగ విశ్వశాంతి ప్రయత్నమును, నిష్కామకర్మ, నిస్స్వార్థ మనో
భావము, అసలు మానవత్వమును చూడగలము.

కవి చిత్రించిన ఇతిహాసము వేలకొలది వర్షములు గడచి
ప్రాచీనమైనను నేటికిని అది మనకు ప్రీతిపాత్ర మగుచున్నదన
అందలి ఉదాత్త పాత్రములతో పాటు కల్పింపబడిన రసమయ సన్నివేశ
ములే దానికి కారణము. మనము కావ్యమును పఠించుచు కవిచే
చిత్రింపబడిన సన్నివేశములలో లీనమై తన్మయుల మగుచుంటిమేని
అందలి పాత్రములును మనవలెనే అను అనుభవము మనకు కలుగు
చుండుటయే కారణము. ఆ పాత్రములు కూడ మనవలెనే సంతోష
పడుచున్నవి. మనవలెనే కన్నీరు కార్చుచున్నవి. మనవలెనే
కోపము, ఉద్రేకము పొందుచున్నవి. నిస్సహాయముగ నిట్టూర్పు
విడుచుచున్నవి. పరానుకంపముతో మనసు కరగుచున్నది. కష్టకాల
మున మనసు విలవిలలాడుచున్నది. మనకును కవి కల్పితపాత్రము
లకును వ్యత్యాస మేమన ఏ గుణము మనయందు పరిమితముగ
నుండునో లేదా అపేక్షణీయమగునో ఆ గుణము వారియందు పరిపూర్ణ
ముగ నుండును. ఏ కష్టకాలమున మనము బెదరిపోవుదుమో అప్పుడు
వారు సాహసముతో నెదిరింతురు. ఎప్పుడు మనము సుఖముగ
పొంగిపోవుదుమో అప్పుడు వారు కొంచెంత ధైర్యముతో కనబడు
దురు. ఎప్పుడు మనము స్వార్థమునకు లొంగిపోవుదుమో అప్పుడు
వారు స్వార్థత్యాగము చేయుట మనము చూతుము. అగ్రగామియంద

వ్రాసిన తావున సంయమనమును చూపుదుము. మన లోకమున మనము దేనిని చక్కనిదని, సొగసైనదని తెలిసికొని ఎచ్చటనో ఒక ఆ క్షణము అందందు ఖండ ఖండముగ చూచి పూర్తిగ, స్థిరముగ దొరుక లేదే యని బాధపడుచుందుమో దాని నంతను ఆ సౌజన్య సౌభాగ్యముల నన్నిటిని కవి తన కృతిక లోకమున మన మనో నేత్రమునకు కనబడునట్లు రూపుదిద్దును. దానివలన కలుగు ఆనందమే, ఆ పారవశ్యమే కావ్య సౌధోద్యాన మాహాత్మ్యము.

మనము కావ్యమును పఠించుచు పోవునపుడు మనకు తెలియకుండగనే ఏదియో అవ్యక్త శక్తి ప్రభావమున మన మనస్సు సత్పాత్రల సద్గుణములను అనుసరించుచు, దుర్జనుల దుర్గుణములను వ్యతిరేకించుచుండును మనస్తత్వవేత్తలు తెల్పునట్లు కవులు, ఋషులు యిట్టి అద్భుత సృష్టి వలన మనము మన జీవితము నందలి కొరతలను తీర్చుకొనుచున్నాము అశక్యములగు కోరికలకు అవకాశము కల్పించుకొనుచున్నాము. వాస్తవ జీవనమున మానవుని ఆత్మ ఎల్లప్పుడును అతృప్తితోనే కూడియుండును అతనికి జీవితమున విధి దత్తమగు అల్ప సౌఖ్యముచే దానిని అతడు తృప్తి పొందింపలేడు ఆ కారణమున అతడు తనయందు అభావములగు గుణములను యథేష్టముగ పొందునట్టి కాల్పనిక వ్యక్తులను సులభముగ నూహించుకొని ఆ వ్యక్తులతో అభేదభావము నూహించుకొని తన కొరతల నన్నిటిని తీర్చుకొనును. అంతియేగాక ఆనందమున మునిగి తేలు అతనికి తాను అట్లు చేయుచున్నానను విషయము కూడ తెలియదు.

'భారతమున సంయుక్త భారత హృదయము వ్యక్తికిని ప్రతి భారతీయుని హృదయము దర్శనీయమగు[1]'నని పాశ్చాత్యులు అభిప్రాయ పడుచున్నారు భారత, రామాయణములు నేటికిని భార

1 V S సుక్థాంకర్, On the meaning of Mahabharata Page 48

తీయుల రక్తగతమునై నారి నాడులలో ప్రవహించుచుండుటకు అందు స్పష్టముగ దర్శనీయమగు మహోన్నతములగు ఆదర్శములే హేతువు ఈ ఆదర్శములు చేతికి చిక్కినట్లుండి చిక్కక శాశ్వతమగు ఆసక్తిని, కుతూహలమును కలిగించుచుండును. ప్రతి జన జీవనము నందును ఆయా జనులయొక్క మహాదర్శములు అవ్యక్తముగను సర్వవ్యాపకముగను నుండును. మహాభారతము మహోన్నతి పదమును ముట్టిన భారతీయుల ఆదర్శములకు ఒక సువర్ణ సంపుటము వంటిది ఈ అంశమే వేలకొలది వర్షముల నుండి సజ్జనుల నుండి సామాన్య మానవుని వరకు ఎల్లరను తనవైపు ఆకర్షించుకొనుటకు కారణమగుచున్నది మనము నేటికిని మన జీవన విధానమున అమ్మహాకావ్యమును మీరలేము అంతియేగాక సర్వశ్రేష్ఠమగు ఆ కావ్యము నుండి మనము ఇంకను పాఠములను నేర్చుకొన వలసి యున్నది ప్రతి వ్యక్తికిని అతని కావశ్యకమగునట్టి, అతను జీర్ణము చేసికొన వలసి యున్నట్టి పాఠమును నేటికిని 'మహాభారతము' నేర్పుచునే యున్నది

ఇట్లు సర్వకాలము లందలి జనులకు ప్రియమైనదియు, మిక్కిలి వైవిధ్యము కలిగినట్టిదియు, అత్యంత విపులమైనదియు నగు "మహాభారతము"ను ఒక్కడే వ్యక్తి రచించియుండెనా? అను సందేహము విద్వాంసులలో జనించినది అది సకారణమే యనిపించును. గ్రంథారంభమున "నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్" అను శ్లోకము కలదు అందు వ్యాస భగవానుడు తనకు తానే నమస్కారము చెప్పికొనుట అసమంజసముగ కనబడుచున్నది ఆ ఆక్షేపణమును తప్పించుటకు 'వ్యాసం' అనుటకు బదులు 'చైవ' అను పాఠాంతరమును ఆ తరువాతి కాలమున ఎవరో దిద్దియుందురు కాని ఆ అధ్యాయముననే ముందు "మహర్షేః పూజితస్యేహ సర్వలోకై

ర్మహాత్మనః ప్రవక్ష్యామి మతం పుణ్యం వ్యాసస్యాద్భుత కర్మణః"
ఇత్యాదిగ వ్యాస పరమగు స్తుతి కనబడుచున్నది ఆ కారణమున
పై దిద్దుబాటు అంగీకార యోగ్యముగ కనబడదు. ఆ శ్లోకము గాని,
ఆ అధ్యాయము గాని, అన్య కర్తృక మనిపించు చున్నది.

అనుక్రమణికా పర్వమునందు శౌనక మహర్షి నైమిశా
రణ్యమున దీర్ఘ సత్రయాగము నారంభించిన విషయము, అప్పటికి
వచ్చిన ఉగ్రశ్రవసుడను సౌతి ఆ యాగమునకు వచ్చిన మునీశ్వరు
లకు వ్యాసకృత మహాభారతమును చెప్పదొడగెనను విషయము
వచ్చును అంతియేగాక-

"నమో భగవతే తస్మై వ్యాసా యామిత తేజసే।
యస్య ప్రసాదాత్ వక్ష్యామి నారాయణ కథా మిమామ్॥[1]"
అని వ్యాస భగవానునికి నమస్కరించి సౌతి కథను ప్రారంభించు
చున్నాడు అపుడా ఆ భాగము వ్యాస రచన మని ఎట్లనగలము?

అసలు వ్యాస రచిత మహాభారతమును మొదట వైశం
పాయన మహర్షి అర్జునుని ముని మనుమడగు జనమేజయునకు తెలిపె
ననియు, దానినే మరల తానిక్కడ చెప్పుచున్నాననియు సౌతి పేర్కొ
నెను ఆ కారణమున వైశంపాయనునియొక్కయు, సౌతియొక్కయు
మాటలు కృతిలో చేరిపోవుట అనివార్యమే కదా!

అనంతరము వచ్చిన 'పర్వ సంగ్రహ పర్వము' కూడ
శౌనకాదుల మధ్యన నడచిన సంభాషణమే. అదియును వ్యాస
కృతము కానేరదు. ముందు 'పౌష్య పర్వము'న జనమేజయుడు తన
సహోదరులతో కూడి కురుక్షేత్రమున జరిపిన సత్రయాగము విష
యము కలదు దానిని కూడ వ్యాసభగవానులే రచించి రనియు
వైశంపాయనుడు దానినే జనమేజయునకు తెలిపెననియు పేర్కొనిన

[1] వ్యాస భారతము, ఆదిపర్వము, అను, అధ్యాయము శ్లోకము ౨౬

అసహాస్యముగ నుండదా? అటు తర్వాతి 'పౌలోమ పర్వము'న ఉగ్రశ్రవ శౌనకుల సంభాషణము ముందుకు కొనసాగి శౌనకుని వంశమగు భృగువంశ మాహాత్మ్యము విస్తరింపబడినది. ముందు వచ్చు 'ఆస్తీక పర్వము' నందును జనమేజయుని విషయమే.

ఈ కారణమున పీఠికాభాగమందలి విషయముల నన్నిటిని వ్యాసుండే రచించెనని పేర్కొనుట ఉచితముగ కనబడదు. అటులనే అనుక్రమణికా పర్వముననే-

'మన్వాది భారతం కేచిత్ ఆస్తీకాది తథా పరే ।
తథోపరిచరాద్యన్యే విప్రాః సమ్యగధీయతే॥[1]'

అని యుండుటను చూచిన వ్యాసకృత భారతము ఎచ్చటి నుండి ప్రారంభమగుచున్నదను విషయమున ఆ కాలమునకే పండిత లోకమున భిన్నాభిప్రాయము లుండినట్లు కనబడుచున్నది. అదే అనుక్రమణికా పర్వమున-

'అష్టౌ శ్లోక సహస్రాణి అష్టౌ శ్లోక శతానిచ।[2]' అనియు
'ఇదం శత సహస్రంతు లోకానాం పుణ్యకర్మణాం
ఉపాఖ్యానైః సహజ్ఞేయం ఆద్యం భారత ముత్తమం[3]' అనియు
'ఏకం శత సహస్రంతు మయోక్తం వై నిబోధత[4]' అనియు
'చతుర్విం శతి సాహస్రీం చక్రే భారత సంహితాం
ఉపాఖ్యానై ర్వినా తావత్ భారతం ప్రోచ్యతే బుధైః[5]' అనియు

పేర్కొనుటను చూచిన దాని విపులత్వ విషయమునను ఏకాభిప్రాయము కనబడదు. వ్యాసకృత భారతమున బహుశః మొదట 24,000 శ్లోకములు మాత్రమే ఉండి యుండుననియు అనంతరము వైశంపాయనుడు, సూత పౌరాణికుల వంటి అనేకానేక కవుల కల్పన

---

1 వ్యా భా, ఆ ప, అను, అధ్యాయము 1 శ్లోకము 53
2,3,4 5 శ్లో 81 శ్లో 101, 102, శ్లో 109

లకు లోబడి అనేక ఉపాఖ్యానములు ఇతర విషయములు చేరి లక్ష శ్లోకములతో నేటి "మహాభారత" రూపము దాల్చియుండుననియు చెప్పవచ్చును.

మహాభారతమును అధ్యయనముచేసిన పలువురు పాశ్చాత్య ప్రాచ్య పండితులు మొత్తముమీద అది ఏక కర్తృకము కాదనియు, మూలము ముఖ్యఘట్టములుగ అది అనేక ప్రక్షిప్తములకు లోబడినదనియు, దాని వలన గ్రంథము పెరిగిపోయినదనియు తలంచిరి. మూలతః కావ్యము కౌరవుల సద్గుణములను ప్రశంసించుట కొరకై యుండి ధర్మ నీతి విషయములతో గూడి ధార్మిక కావ్యమయినదని వారి అభిప్రాయము *

---

* 'మహాభారత కర్తృత్వమును గూర్చియు వ్యాప్తిని గూర్చియు నూరు వర్షముల కాలమున పాశ్చాత్య ప్రాచ్య విద్వాంసుల ఆలోచనలీ ప్రకారముగా నున్నవి —
బోప్ (Bopp) అను విద్వాంసుడు "మహాభారతము నందలి భాగములన్నియు ఒకే కాలమున ఒకే కర్తచే రచియింపబడినట్లు లేదు ' అని అభిప్రాయపడెను
సి లాసెన్ (C Lassen) అను నతడు 'వైశంపాయనుడు జనమేజయునకు చెప్పినది "భారతము' సౌతి శౌనకునకు చెప్పినది "మహాభారతము" ఇప్పుడున్నది తృతీయ విస్తృతరూపముగ భావించుచున్నాను' అనెను ఇతని అభిప్రాయమున ఆ కావ్యము మూలత ధర్మాతీతము కౌరవ ప్రధానము నయియుండి అనంతర కాలమున కృష్ణ పాండవ ప్రధానము ధర్మబోధకము నయినది
వెబర్ (Weber) అనునతడు మొదట 8 800 శ్లోకములతో కూడిన మహాభారతము క్రమముగ ఒక లక్ష శ్లోకములకు పెరిగినది యుద్ధమునకు సంబంధించిన కథా భాగమే మూలభారతమయి యుండి ఋగ్వేదము నందున్న "నారాశంసీ" గాథల మాదిరితో అనేక శతమానముల కాలము ప్రజాముఖములలో నుండి ఎవరో ఒకరిచే వీరకావ్యముగ రచింపబడి యుండును, అనంతరము అనేకుల చేర్పులచే అది విస్తృతమైనదై యుండునని ఊహించెను
మ్యాక్స్‌ముల్లర్ (Max muller) 'మూలమున లౌకిక కావ్యమనిపించి కౌరవుల వీర గాథగా నుండి, అనంతరము వైదికులు దానిని పరిష్కరించి ధర్మనీతి ఆధారములను చేర్చి ధార్మిక కావ్యముగ చేసిరి' అనియున్నాడు

సోరెన్ సేన్ (Sorensen) అను స్కాండినేవియా పండితుడు "మహాభారతము ను మూలతః ఏక కర్తృకముగ నంగీకరించి ప్రక్షిప్తములను విభాగించి వేరుచేయుటకు ప్రయత్నించెను

ల్యూడ్ విగ్ (Lud wig) అనునాతడును సొరెన్ సేన్ వలెనే అభిప్రాయపడి మహాభారతము ఋతు పరివర్తనము యొక్క రూపకమనియు వేదములకును దానికిని సంబంధమును కల్పించెను

హాల్ట్ మన్ (Holtzman) మూలతః కౌరవులను ప్రశంసించు వీరగాథగా నుండె ననియు అనంతరము బౌద్ధుల చేర్పులకు లోబడినదనియు ఆటు తర్వాత హిందూ కావ్యమయినదనియు పాండవ ప్రశంస – కృష్ణ ప్రాధాన్యతలు క్రమేణ తలయెత్తిన వనియు నూహించెను

మ్యాక్ డొనెల్ (Macdonnel) కురు పాంచాలుర వీరగాధలను ఎవరో సంకలనము చేసి వీరకావ్యముగ రచించిరనియు కౌరవ ప్రధానముగ నున్న కధ అనంతర కాలమున పాండవ ప్రధానముగ మారినదని భావించెను

శ్రోడర్ (Schroeder) కొద్ది హెచ్చు తగ్గులుగ హాల్ట్ మన్ అభిప్రాయము నంగీకరించెను

హాప్కిన్స్ (Hopkins) అను అమెరికా విద్వాంసుకు మహాభారతమును "గ్రంథము కాని గ్రంథము" అని హాస్యముగా పలికి కౌరవపరముగా నున్న కావ్యము క్రమముగ కృష్ణ పారమ్యమునకు లోబడి పాండవ ప్రధానమై ధర్మము నీతి ఇత్యాదులను చేర్చుకొని ఇంకను పెరుగుచునే యున్నదనెను

వింటర్ నిట్స్ (Winter nitz) కౌరవ పాండవుల యుద్ధము ఐతిహాసిక ఘటనము అది మొదలు వీరగాథా రూపమున నుండి కాలక్రమమున దానిలో ధర్మ, నీతి సంప్రదాయముల ఉపదేశము దేవతల కథలు, మతపరమైన విషయములు చేరుకొన్నవి ఇంతటి విస్తృతమైన అనేక తావుల పరస్పర విరుద్ధాభిప్రాయములతో కూడిన ఈ గ్రంథము ఇపుడున్న రూపముననే ఏక కర్తృకమునచో ఆ కర్త ఏకకాలమునసే అద్భుతుడు, అతి బుద్ధిమంతుడు కావలసి యుండును ఆ కారణమున ఈ గ్రంథము వేలాది వర్షములుగ పెరుగుచు వచ్చిన అనేక కర్తృకము" అని యున్నాడు

రమేశచంద్రదత్త అను బెంగాల్ విద్వాంసుడు పాశ్చాత్యుల అభిప్రాయములనే ఏకరీతిగ ఆమోదించెను

అరవిందఘోష్, డా॥ సుక్థాంకర్ వంటి విద్వన్మణులు పాశ్చాత్య విద్వాంసుల వాద సరణిలో బయల్పడిన సందేహముల నన్నిటిని నివారించి మొత్తముమీద "మహాభారతము" భారతీయ సంప్రదాయముల కనుగుణముగ ఒకరిచేతనే రచింపబడిన మహాకావ్యముగ సమర్థించిరి కాని కావ్యము సంతతటను ప్రక్షేపములు క్రమ్ముకొనుట ద్వారా అది వృద్ధి పొందుచు వచ్చినదనుటయు నిజము. ఆ కారణమున "మహాభారతము" వర్ధనశీలమగు ఒక మహాకావ్యము. అది విపులత్వమున వర్ధిల్లుచు పోవుటకు విశేషముగ దాని జన ప్రియత్వమే కారణము ప్రాచీన కాలమందలి జనులు ఇట్టి కావ్యములను చదివి చదివి ఒక ప్రక్కనుండి కంఠస్థము చేయుచుండుటవలన అనుష్టుప్ శ్లోకముల నడక వారికి చక్కగ హృద్గతమగు చుండెను దానికి తోడు శ్రద్ధ సంపదయు వారికుండెను వారు కావ్యమును ఎత్తి వ్రాసికొనునప్పుడు ఇటనేదో కొరత కలదని తోచినచో తప్పక రెండు శ్లోకములతో ఆ లోపమును భర్తీ చేసి, వర్ణన చాలదనిపించిన చోట నాలుగు వర్ణన శ్లోకములను చేర్చి ముందుకు సాగజొచ్చిరి అంతియే గాక కథకులు కథను చెప్పునప్పుడు ఆ కథలో తమకు ప్రియమగు ఒక్కొక్క పాత్రను ప్రశంసించునప్పుడు గూడ కావ్యము పెరిగి యుండవచ్చును

కౌరవ పాండవుల ఇతిహాసమునకు తోడు భృగువంశ చరిత్రమును, కృష్ణ మాహాత్మ్యమును చేర్చి తెలుపుట మహాభారత

---

C V వైద్య 8 800, 24 000 1 00 000 అను సంఖ్యలను బట్టి మన్వాది, ఆస్తీకాది ఉపరిచరాది అను ఆధారములపై మహాభారతము మూడు ఆవృత్తులు కలదిగ ప్రతిపాదించెను.

డాల్మన్ (Dalhman) అను జర్మను విద్వాంసుడు మహాభారతము నందు ధార్మిక నైతిక భావములే ప్రధానము లనియు వాని వివరణ కొరకే కౌరవ పాండవుల కథ ఇతర ఘట్టములు ఉపకరణ చేరినవనియు అభిప్రాయపడెను

విపులత్వమునకు మరియొక ప్రబల కారణమనిపించుచున్నది. బౌద్ధ ధర్మము అవనతమగుచు భారతదేశమున వైష్ణవ ధర్మము దినదినాభి వృద్ధి నందగ కృష్ణ భక్తియు నందు చేరి కృష్ణపారమ్యమే ప్రముఖ ధార్మిక భావనమై మహాభారతము నేటి స్వరూపము నందియుండెను. సుమారు 800 వర్షముల కాలము ప్రక్షిప్తములు చేరుచు వచ్చి ఇప్పటికి సుమారు 1,500 వర్షముల క్రిందటనే "మహాభారతము" నేటి స్వరూపము నందియుండును [1] కాని నేడు దాని మూల స్వరూప మెట్టిది? ప్రక్షిప్త భాగము లేయవి? ఆ ప్రక్షిప్త భాగముల నుండి మూల భారతమును వేరు చేయుటెట్లు? అను ప్రశ్నములకు సమాధానము లంత సులభ సాధ్యములుగ కనబడుట లేదు.

వైదిక వాఙ్మయమున నిష్ణాతులగు "ల్యూడ్ విగ్" గారి అభిప్రాయము ప్రకారము "విమర్శకులు సూక్ష్మ పరిశీలన జరిపి ఎచ్చట అసంబద్ధములగు కథాంశములు గలవో, ఎచ్చట చెప్పిన విషయము పూర్తిగ అనవసరమనిపించునో, ఎచ్చట విషయము పునరావృత్తి యగునో, ఎచ్చట చెప్పబడుచున్న విషయమునకు చెప్పిన విషయమునకు సంబంధము కనబడదో అను విశేషములను కనిపెట్టగలిగిన అట్టి భాగములను సామాన్యముగ ప్రక్షిప్త భాగములుగ గుర్తింపవచ్చును" అంతియేగాక విమర్శకులు ఇంకను ముందుకువెళ్ళి ఛందస్సు, భాష, శైలి మున్నగు విషయములను కూలంకషముగ పరిశీలింపవలసి యున్నది అందున్నట్లుండి మార్పు కనబడినచో అట్టి భాగములు ప్రక్షిప్తములేమో అను సందేహమునకు స్థానము కలుగును అట్టి భాగముల ను విశేషమైన శ్రద్ధతో పర్యాలోచన చేయవలెను పలువురు విమర్శకులు శ్రమపడి మహాభారతము నందలి

---

1 At least 1500 years ago the Mahabharata was already just as we possess at to day in our manuscripts edition or at least very similar work which was of about the same extent as our epic of to day

Dr M W History of India Vol 1, Page 321,

ప్రక్షిప్త భాగములను వేరుచేయుటకు కృషి చేసిరి. కాని మహా
భారతము విషయమున ప్రక్షిప్త భాగముల సమస్య ఎంతటి జటిల
మైనదన సమ్మిశ్రముగాని మూలకావ్య మిదియని కనిపెట్టుటకు ఏ
విధముగను సాధ్యమగుట లేదు లోతుగ పరిశీలన జరిపి విశ్లేషణ
చేయుచు పోవునప్పుడు ఒకే మూలమనుటకు బదులు పలుమూలము
లను వాదమునకు అవకాశము కనబడుచున్నది. ఈ విషయమున
'పూనా' భండార్కర్ ప్రాచ్య పరిశోధన సంస్థవారు కాశ్మీరు నుండి
కన్యాకుమారి వరకు, బొంబాయి నుండి కలకత్తా వరకు మూలమూలల
యందు లభించిన సకల లిపులలోని "మహాభారత" ప్రతులను సంగ్ర
హించి సువీక్ష్య పరిశీలనానంతరము నూరారు ప్రతులను పరిశోధించి
సమర్థమైన మూల పాఠమేది కావచ్చునో పరిష్కరించి ఒక్కొక్క
భాగముగ ప్రకటించిరి ఆ పరిశోధన ఫలితముగ లభించిన
విశేషాంశము "మహాభారతము" పాయలుగ చీలి రెండు ముఖ్య
ప్రవాహములుగ నేటికి మనయొద్దకు ప్రవహించి వచ్చినది. అందు
ఒక ప్రవాహము 'ఔత్తరాహము' రెండవది 'దాక్షిణాత్యము' మరల
ఆ రెండు ప్రవాహములును తాము ప్రవహించు ప్రాంతములందు
ఆయా ప్రాంత భేదములను సమ్మిళితము చేసికొన్నవి. అంతియేగాక
ఒకే ప్రాంతము నందలి పలు ప్రతులందు పరస్పర వ్యత్యాసములు
కనబడుచున్నవి ఇట్లగుటకు కారణము "మహాభారతము" చాల
కాలము వరకు అమూర్త రూపమున నుండి పోవుటయే అనవలెను.

ఔత్తరాహ విభాగమున కాశ్మీరమున లభించిన పాఠమును,
దాక్షిణాత్య భాగమున మళయాళ దేశ పాఠమును విశ్వాసార్హమైనవిగ
గుర్తింప బడినవి దక్షిణ దేశ కవులగు కవిత్రయమువారికిని, పంప,
నారాణప్పలకును దాక్షిణాత్య పాఠమే ఆధారమై యుండుననుట
సహజము. అట్లని స్పష్టముగ వారు అనుసరించిన మూలగ్రంథ మిది
యని తెలుపుట కష్టము.

11వ శతాబ్దము నందలి దాక్షిణాత్య సారస్వత స్వరూపమును గూర్చి తెలిసికొనుటకు తూర్పు చాళుక్య రాజగు రాజరాజ నరేంద్రుని (1022-61) ఆస్థానము నందలి కవియగు నన్నయ భట్టుచే రచింపబడిన "ఆంధ్ర భారతము" చక్కని ఆధార మగుచున్నది "ఆంధ్రభారతము" మూలభారతమునకు సంక్షిప్త రూపమే యన వచ్చును అంతియేగాక నన్నయభట్టు తన కావ్యమునందు "పర్వ సంగ్రహ" భాగమును యథాతథముగ గ్రహించి మూల భారతము నందలి ప్రతి పర్వము నందలి శ్లోక సంఖ్యను తెలుపుట వలన పై విషయము మరింత స్పష్టమగు చున్నది అందువలన కవి స్వతంత్ర ప్రవృత్తికి విశేష ప్రాధాన్యము నీయక మూలమునే సమర్థముగ అనుసరించెను. కన్నడము నందలి ప్రసిద్ధ మహాభారత కవులలో ప్రథముడగు 'పంప' నన్నయభట్టు కన్న అతి ప్రాచీనుడేమియు కాడు అటులనే నారణప్ప అతి నవీనుడును కాడు

తులనాత్మక పరిశీలనము వలన నన్నయభట్టుచే అనుసరింప బడిన మూలగ్రంథమే పంప, తిక్కన,నారణప్పలకును ఆధారమై యుండునని ఊహింపబడుచున్నది ప్రకృతము ఈ పరిశోధనావసరమున తిక్కన, నారణప్ప లిరువురును కథావస్తువు నందు చేపట్టిన వ్యత్యాసములను సూక్ష్మముగ గుర్తించుటకు వీలుగ ఈ పరిశోధనాంశము కథాంశమున ప్రధాన ఘట్టములగు విరాటోద్యోగ పర్వములకు పరిమితము చేసికొనబడినది

### భారతమున విరాటోద్యోగ పర్వముల స్థానము :

భారతమున ప్రతి పర్వము తన ప్రాశస్త్యమును చాటు ఒక ప్రబంధ మగుచున్నది. కావుననే తిక్కన దీనిని "ప్రబంధ

మంజరి"[1] అనినాడు కుమార వ్యాసుడు "భారత కథా మంజరి"[2] అనినాడు

### విరాటపర్వము :

"హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథోపేతంబు నానారసాభ్యుదయోల్లాసి"[3] అని స్వయముగ తిక్కన విరాట పర్వము నందలి ఇతివృత్తము ఏవిధముగ ప్రబంధరచనమునకు అనుకూలముగనున్నదియు ప్రారంభముననే తేటతెల్లము చేసియున్నాడు ఇందలి ఇతి వృత్తము మానవ జీవితమున కత్యంత సన్నిహితము, వీర శృంగారాది రసములకు ఆశ్రయమును అగుటచే హృదయాహ్లాది అగుచున్నది ఆయా సందర్భములలో వ్యక్తుల ప్రవర్తనల వలన బయల్పడునట్టి వారివారి నైజశీల స్వభావములు మున్నగు వానికి ఈ కథా భాగమున అవకాశము అధికముగ నున్నది కావుననే లౌకిక జీవిత మిందు సంపూర్ణముగ ప్రతిబింబించిన దనవచ్చును.

మహాభారతమున విరాట పర్వమునకొక ప్రత్యేక ప్రాధాన్యము కలదు. ఈ వైశిష్ట్యము మిగిలిన పర్వములకు లేదనినను అతిశయోక్తి కానేరదు. నన్నయ పర్వ సంగ్రహ వివరణమున విరాట పర్వము 3,500 శ్లోకములు కలిగి యున్నదని తెలుపుచు 'పర్వో య వైరాటాదిక పర్వ చతుష్టయమునకు సభారంజకమై సర్వమనోజ్ఞము నాలగు పర్వము నాదగి విరాట పర్వము వెలయున్"[1] అని విరాట పర్వము సభారంజకము, సర్వ మనోజ్ఞము అయినదని దాని ప్రాధాన్యమును ప్రస్తుతించెను. పర్వ చతుష్టయమనగ నాలుగు ఉప పర్వ

---

1 తిక్కన భారతము, వి ప, ప్ర ఆ, ప 3

2 కు వ్యా భ ఆశ్వాసాంత గద్య

3 తి భా, వి ప, ప్ర ఆ, ప 7

1 తి భా, వి ప, ప్ర ఆ, ప 426

ములు— 1. పాండవ ప్రవేశ పర్వము, 2 కీచక వధ పర్వము, 3 గోహరణ పర్వము, 4 వైవాహిక పర్వము.

అరణ్యవాసము కన్నను పాండవులకు అజ్ఞాతవాసము మిక్కిలి కష్టతరమైనది. ఈ విషయము 'మహిత సముజ్జ్వలాకృతులు మానధనుల్ జనమాన్యులంగనా సహితముగాగ. సమ్యగుపాయ నిగూఢ వృత్తిమై నహితుల కప్రభేద్యమగు నాపదుమూడగు నేడు నేమి గతి చరించిర'ను జనమేజయుని పల్కులలోనే వెల్లడియైనది పరాశ్రితవృత్తి జీవనమున, అందునను రాజాశ్రయమున గల కష్టములు పాండవుల విరాటనగర జీవితము వలన వ్యక్తము లగుచున్నవి విరాటుని వినోదము కొరకు భీముడు జెట్టి మల్లురతో మాత్రమే గాక సింహాది క్రూర సత్త్వములతో గూడ బోరవలసి వచ్చుటయు, దాస్య భారము చేతనే స్వామిని యగు సుదేష్ణ ఆజ్ఞను మీరలేక ఆసవము తెచ్చుటకై ద్రౌపది కీచకు నింటికి బోవుటయు, తన అభిప్రాయమును గాదనిన ధర్మజుని విరటుడు పాచికలతో గొట్టుటయు నిత్యాదు లిందుకు నిదర్శనములు ద్రౌపదీ, ధర్మజాదుల దాస్యమే వారి నిస్సహాయ స్థితికి కారణమైనది. కీచకుని కాముక ప్రవృత్తి, వీరపత్ని సాధ్వీమణి అగు ద్రౌపదీదేవి పరాభవము, కీచక వధోద్యోగము దాని పరిణామ సన్నివేశములు మున్నగునవి సుదేష్ణా కీచకులయు, ద్రౌపదీ ధర్మజాదులయు అంతః ప్రకృతులను, శీల స్వభావాదులను వ్యక్తపరచు చున్నవి.

మన నిత్య జీవితమున మనకు ప్రత్యక్షములగు కాముక స్త్రీలోలుపత, యుక్తాయుక్త పరిజ్ఞాన శూన్యత, దాని ఫలితము కీచక వృత్తాంత ప్రధాన విషయములయి చివరకు దుష్ట నిర్మూలనముచే 'హృదయాహ్లాది' అగుచున్నది భీమ కీచకులు నాయక ప్రతి నాయకులుగను, వీరము ప్రధాన రసముగను, ధర్మార్థములు

ఫలముగను గలిగిన ఈ ఘట్టము నొక ప్రత్యేక ప్రబంధముగ వ్యాస, తిక్కన, కుమార వ్యాసులు తీర్చి దిద్దిరి

అహంకార మదోన్మత్తుడగు కీచకుడు ద్రౌపదిని సామాన్య వనితగ భావించి తన మన్మథ తాపము తీర్పగోరెను. కన్నడ భారతమున — చేతులు జోడించి దీనముగ ప్రార్థించుటకే దిగినాడు. ద్రౌపది పలు విధముల వారించినది. ప్రయోజన రహిత మగుటచే ఫలితముగ శత సోదర సహిత కీచక వధ జరిగినది ఊర్జిత కథ అనగ ఉత్సాహ గర్భితమైన కథ వీరమునకు ఉత్సాహము స్థాయి భావము ఈ కీచక వధ ఘట్టమున దుష్టోద్యోగమున కీచకుని ఉత్సాహము, దష్ట సంహారోద్యోగమున భీముని ఉత్సాహము ప్రదర్శితము చారుల వలన కీచక విషయము దుర్యోధనునకు చేరినది వెంటనే ఆ వనిత ద్రౌపది యని, ఆ గంధర్వుడు భీముడై యుండునని, పాండవుల ఉనికి విరాట నగరముననే యై యుండునని కూడ నిర్ణయింప బడినది వారి అజ్ఞాతవాసమును భంగ పరచుట మూలమున పాండవులను తిరిగి అరణ్యవాసమునకు పంపవలెనని ఉత్సహించిరి ఆ ఉత్సాహమే గోగ్రహణ రూపమున క్రియారూపము దాల్చినది. కాని ఈ ప్రయత్నమున పాండవుల విరాట రక్షణోత్సాహము కౌరవులను భగ్న మనోరథులను జేసినది. గోగ్రహణము నందలి పాండవుల ఉత్సాహమే తదుపరి భారత ఘోర యుద్ధమునకు ప్రోత్సాహకమైనది. పాండవుల విరాట రక్షణోత్సాహమే విరాటుని తన కుమార్తె అగు ఉత్తరను అభిమన్యున కిచ్చుటకు ఉత్సాహపరిచినది ఇట్లు విరాట పర్వము ఆద్యంతము ఊర్జిత కథోపేతమై చదువు వారికి, విను వారికి హృదయాహ్లాది అగుచున్నది

విరాట పర్వమొక ప్రత్యేక ప్రబంధమని, అందలి సన్నివేశములు వివిధ రసములకు ఆశ్రయములని తెలిసికొని యుంటిమి.

విరాట పర్వము నందలి ప్రధాన ఘట్టములు కీచక వధ, ఉ...
గోగ్రహణము, అభిమన్యుని వివాహము కీచక వధయందు భీ...
అంగి రసము, శృంగారాభాసము, రౌద్రము, బీభత్సము అంగము...
ఉత్తర గోగ్రహణము నందు అంగి రసము వీరము, దాని అంగము...
రౌద్రము, హాస్యము పాండవుల అజ్ఞాత వాసానంతరము బయల్ప...
సన్నివేశముగ అద్భుత రసము అభిమన్యుని వివాహ సందర్భము...
లలిత శృంగార రసమును ప్రధానములై మనోహరముగ సన్ని...
దీనికి తోడు కన్నడ భారతమున కృష్ణుని పాత్రమును ప్రవేశపెట్టి
మూలమున భక్తిరసమునకును స్థానము కలిగినది.

రసములు పలురకము లున్నను శృంగార, వీర రసము...
మాత్రమే ఉదాత్తము లైనవి ఆ కారణముననే లక్షణ కర్త...
నాటకములలో శృంగార, వీరములనే ప్రధాన రసములుగ పోషిం...
వలెనని శాసించిరి తిక్కన, కుమారవ్యాసులు విరాట పర్వము...
'నాటకీయము' గనే వర్ణించిరి. ఇందు శృంగార, వీరరసములు సమ...
గను, సమర్థముగను పరిపోషింప బడినవి. విరాటపర్వము రసరమణీయ...
ముగుట చేతనే 'నానా రసాభ్యుదయోల్లాసి'యై వెలుగొందు చున్న...

కథాకథనము విషయము పరిశీలించినను విరాట పర్వమ...
నకు ప్రత్యేక ప్రాధాన్యము కలదు భారతము నందలి పూర్వాప...
సన్నివేశములకు దానిని ఆయువు పట్టుగ పేర్కొనవచ్చును. అరణ్య...
పర్వాంతము వరకును జరిగిన సన్నివేశములను బట్టి దుర్యోధను...
సామ్రాజ్యము విజృంభించినది అధర్మముననే జయము లభించినట్...
చీకటిలో కాంతి కిరణమువలె అరణ్యపర్వము నందలి పపరాని గాథ
లోనే పాండవులు అత్యంత శక్తిమంతములైన పాశుపతాద్యస్త్రము
లను సాధించుకొని మరింత శక్తిమంతులైరి. ఉద్యోగ పర్వమునం
సత్యము, ధర్మము ప్రేరితములై బలమును పుంజుకొని భారత ఘో
రణమున పాండవులు ప్రతిజ్ఞలను నెరవేర్చుకొనుటకు వీలు కలిగినది.

'సమయ సముచిత కృత్యంబు చక్క జేసి
పాండవులు రాజ్యమున కాస సడక మున్న
యరసి మెఱిగి యరణ్యంబు నందు నొంటి
యట్లు యిడుమల గుడుపఁ బోనఁ గవలయు' ఇది దుర్యో
ధనుని దురాలోచన పాండవుల కిది ప్రాణ సంకటము రెండు పక్ష
ముల వారును కార్యసాధనమునకై తమ తమ శక్తి యుక్తులను
కేంద్రీకరించిరి విరాటపర్వమును భారత కథాక్రమమున పూర్వాపరాం
శములను కలిపెడి సంధిపర్వముగ గ్రహింప వచ్చును అజ్ఞాత వాస
మునకు మూలము ద్యూతము. అందులకు మూలము పాండవ కౌర
వుల శాత్రవాది వైరము అట్లే విరాటపర్వమునందలి కౌరవ పాండవ
యుద్ధములకు మూలము గోగ్రహణము దానికి మూలము కీచక వధ.
గోగ్రహణ యుద్ధఫలితము రాబోవు భారత మహా సంగ్రామమున
పాండవుల విజయమునకు సూచనప్రాయము ఇట్లు ఈ పర్వమున
రాబోవు కథాభాగము సూచితమైనది

ఆరణ్య పర్వాంతము వరకును దుర్యోధనుని విశృంఖ
లత్వము వర్ణితము. ఈ పర్వములోనే దుర్యోధనుని విజృంభణము
నకు భరతవాక్యము, పాండవుల క్రియాపరతకు నాందీ వాక్యము
పలుకబడినది ఈ రెంటింటి సూచకల్పనమే గోగ్రహణము ఇందలి
యుద్ధము పదునెనిమిది ఘడియ కాలమే యైనను పదునెనిమిది దిన
ముల భారత యుద్ధమునకు దీక్షయైనది. కురుక్షేత్ర సంగ్రామ విజయమున
కిదియే పునాదియైనది

పాండవులు విరాటుని కొలువున నిర్విఘ్నముగ ప్రవే
శించుటతో శుభారంభమైన ఈ ప్రబంధము దుష్ట శిక్షణముతో కొన
సాగి శుభ పరంపరలతో చివరకు అభిమన్యుని వివాహ రూపమున
మంగళాంతమైనది భారత యుద్ధ పరిసమాప్త్యనంతరము భరత
వంశాంకురము ఉత్తర సంతానము కావలసి యున్నది. మొత్తము

చంద్ర వంశమునే నిలుపవలసి యున్నది కావున ఉత్తరాభిమన్యుల వివాహము కథాభాగమునకు అత్యంత ప్రధానమైనది వ్యాసునికన్న తిక్కన కుమారవ్యాసు లిరువురును ఈ వివాహము నత్యంత వైభవముగ, మనోజ్ఞముగ, మంగళ యుతముగ, శృంగార రసప్లావితముగ వర్ణించిరి. దేశీయ సాంప్రదాయములతో అమూలకములైన విష యముల నెన్నిటినో చేర్చిరి

ఇంతియేగాక తిక్కన కుమార వ్యాసుల రచనా వైభవము మిక్కిలి మనోజ్ఞముగ ఈ పర్వమున ప్రకాశించినవి. ఈ పర్వము నందలి సూర్యోదయ, సూర్యాస్తమయ, అంధకారాది వర్ణనలు, విరహ వర్ణనము, ఆంగిక వర్ణనలు మొదలగునవి తరువాతి కవులకు మార్గదర్శకములైనవి. ఆంధ్రమున ప్రబంధ యుగమునకు తిక్కనయే మార్గదర్శకుడనవచ్చును విరాట పర్వము నందలి వర్ణనలు వర్ణనల కొరకు చేయబడినట్లు గాక కథాకథనమున చక్కని సమన్వయము నంది యుండుట ఒక ప్రత్యేకత. ఈ ప్రత్యేకత విరాటపర్వమునకు మాత్రమే పరిమితము కాదు విరాటపర్వము పారాయణ గ్రంథముగ జనులకు ప్రీతిపాత్రమైనది వర్షములు లేక కఱవు కాటకములు సంభవించి నపుడు విరాటపర్వము పురాణ పఠనము వలన వర్షములు కురియునని మనవారి నమ్మకము భారతమునకు ప్రజలలో గల ఆదరమునకు ఇది నిదర్శనము

## ఉద్యోగపర్వ ప్రాశస్త్యము

భారతము నందలి మిగిలిన పర్వముల కన్న ఉపాఖ్యాన ములచేతను, పాత్రల మానసిక చిత్రణ చేతను, వేదాంత సారము చేతను, రాజనీతి తంత్రజ్ఞత చేతను, నీతి బోధ చేతను ఈ ఉద్యోగ పర్వము ముత్యాల సరము నందలి నాయకమణి వలె ప్రకాశించును.

ఉద్యోగపర్వ ప్రాశస్త్యమును తెలుపుటకు సంస్కృతాంధ్రకర్ణాట భారతములు మూడును సమర్థములగుచునే ఉన్నవి

ఉద్యోగ పర్వమున వక్తృతియంతయు ప్రసంగాశ్రయమై యున్నది. ఇంత చక్కని ప్రసంగములకు మిగిలిన పర్వముల యందవకాశములు తక్కువ. ఈ ప్రసంగములను రెండు విధములుగ విభజించు కొనవచ్చును. 1. సంభాషణలు, 2. ఉపన్యాసములు. వ్యక్తులు ఒండొరులతో చేయు ప్రసంగములు సంభాషణములు, జనసందోహముల మనముల నాకర్షించుటకై సభా వేదికనుండి చేయు ప్రసంగములు ఉపన్యాసములు దు్రపదుని పురోహితుడును, శ్రీకృష్ణుడును కౌరవ సభయందును, సంజయుడు పాండవ సభయందును గావించిన ప్రసంగము లిందుల కుదాహరణములు అంతియేగాక నవీనులు పేర్కొను చర్చాగోష్ఠులు (Symposia) ను ఇందు గలవు అభిమన్యుని వివాహానంతరము విరాటుని కొలువుకూటమున, కృష్ణుని రహస్య మందిరమున, సంజయుడు పాండవులయొద్ద నుండి తిరిగి వచ్చిన తరువాత ధృతరాష్ట్రుని కొలువుకూటమున, భావిమహాకమునకై పాండవుల సమావేశమున ఈ గోష్ఠుల లక్షణము చక్కగ కనబడును

ఈ పర్వముయొక్క నామమే ఉద్యోగము ఉద్యోగ మనగ ప్రయత్నము ఈ ప్రయత్నము దేనికొరకు? సంధికొరకా? యుద్ధముకొరకా? యథార్థము పరిశీలింప సంధి జరుగునని విశ్వసించిన వారెవరును కనబడరు. ప్రయత్నమంతయు 'తమతప్పేమియు లేదు, తప్పంతయు నెదుటివారిదే' అని నిరూపించి బలసమీకరణము గావించు కొనుట కొరకే అని ఊహింప వచ్చును కావుననే సంధి ప్రయత్న ములకు విస్తృతి అధికముగ నున్నను ప్రాధాన్యమంతయు సమర ప్రయత్నమునకే ఒసగబడినది. సంధి ప్రయత్నములు కూడ సమర ప్రయత్నమునకు బలము చేకూర్చుటకు జరిగినవే అగుటచే ఈ పర్వ మును 'సమరోద్యోగపర్వ'మనుట ఎంతయును యుక్తము. సమర

సన్నాహమునకు కావలసిన సకల ప్రయత్నములును ఈ పర్వముననే గావింపబడినవి. సేనాధిపతుల నిర్ణయము కూడ జరిగి యుద్ధక్షేత్రమునకు తరలుట కూడ జరిగినది.

ఉద్యోగపర్వమున ప్రాసంగికేతివృత్తములు కొన్ని గలవు. అందు ప్రథమాశ్వాసము నందలి ఇంద్ర విజయోపాఖ్యానము, పలు ర్థాశ్వాసము నందలి అంబోపాఖ్యానమును ముఖ్యములైనవి. ప్రజాగర పర్వము నందలి వేదాంత బోధ ప్రాసంగికముగ నుండుటయే గాక మూలమున దీర్ఘముగ నుండుట పాఠకునకు కొంత విసుగు కలిగించుచున్నదని చెప్పక తప్పదు. తిక్కన కుమార వ్యాసులు దానిని సంగ్రహించుట మూలమున ప్రస్తుత కథకు ప్రత్యక్షముగ నుపకరించునట్లు చేసికొనుట వలనను వస్తుగమన వేగము నరికట్టకుండ గాచుకొనిరి. విదురుడు తన ప్రసంగమున మధ్య మధ్య 'పాండవులకు పాలుపంచి ఇమ్ము' అని ప్రస్తుతాంశమును బోధించుచు సందర్భశుద్ధిని గలుగ జేయుచుండెను. కుమార వ్యాసుని భారతమున ఇంద్ర విజయోపాఖ్యానము పరిహరింపబడి, అంబోపాఖ్యానము ఆదిపర్వముననే చేర్చబడినది.

తిక్కన కావ్యరస దృష్టితో సనత్సుజాతీయ పర్వమును దాదాపు పరిహరించి యుండ, కుమార వ్యాసుడు విపులముగ సనత్సుజాతునిచే ధృతరాష్ట్రునకు నీతిబోధ గావింపచేసెను. తిక్కన ప్రధానముగ కవియు, కుమార వ్యాసుడు భక్తుడును అగుటచే కావ్య తత్త్వజ్ఞుడైన తిక్కన ఔచిత్య దృష్టిచే పరిహరింపగ, కావ్య కళను గౌణముగ గ్రహించిన కుమార వ్యాసుడు దానినే విస్తరించెను.

ఉద్యోగ పర్వముయొక్క ప్రాశస్త్యమును పెంచునది వస్తు సంవిధాన చాతుర్యము. ఉద్యోగ పర్వము నందలి రాయబారములు గాని, ప్రసంగములు గాని పరిశీలించి సారాంశమును చెప్పవలెనన్న 'కౌరవులు అకారణముగ పాండవులపై పగబూని బాల్యము

నుండియు కష్టముల పాల్జేసిరి. అయినను శాంతాత్ములైన పాండ
వులు తమకు అయిదూళ్ళిచ్చినను చాలునని కోరుచున్నారు. వారి
తండ్రి పాలు వారికిచ్చుట న్యాయము' అని మూడు వాక్యములలో
చెప్పవచ్చును. కృష్ణుడుగాని, విదురుడుగాని, సంజయుడుగాని, గాం
ధారీ ధృతరాష్ట్రులుగాని, మరెవ్వరుగాని ఏమి చెప్పినను సారాంశము
సమానమే అగుచున్నది. కావున పర్వము నందలి వస్తువంతయు
పునరుక్తిప్రాయము. ఈ పునరుక్తికి ఏ మాత్రము విసుగు కలుగకుండ
చిత్రీకరించుటలోనే సంవిధాన ప్రాగల్భ్యమున్నది.

ఇందు మూడు రాయబారము లున్నవి. దేనికది ప్రత్యేకత
కలిగి యున్నవే. రాయబారులు-ద్రుపద పురోహితుడు, సంజయుడు,
శ్రీకృష్ణుడును. వీరిలో ప్రథముని పురోహితుడు రాజనీతి చతురుడు
కాడు. అతడు తన విప్ర స్వభావ సహజమైన పారుష్యముతో సత్య
మును ప్రదర్శించుచు మాట లాడినాడు. ఈ అభిప్రాయమునే
భీష్ముడును తెలిపి యున్నాడు. సంజయుడు చతుర భాషణుడు. ఎంతటి
కటు భావమునైనను అతడు మధురముగ ప్రదర్శింపగలడు. ధర్మజుని
కొలువు కూటమున నిలచి కౌరవులు రాజ్యభాగము నీయకపోయినను
వారి కర్మమునకు వారిని వదలి అహింసా ధర్మమును పాటించి అర
ణ్యములకు పోవుట మంచిదని పలుకుట దీనికి నిదర్శనము. కౌరవుల
అకృత్యముల నన్నిటిని సంజయు డంగీకరించెను. ఇదియే అతని గడుసు
తనము. ఎదుటివారితో ఏకీభవించినట్లు కనబడుచు వారిని మెల్లగ
తనపక్షమునకు త్రిప్పుకొనుట ఒక నేర్పు. ధృతరాష్ట్రుని సందేశము
చాల దుర్బలము. అయినను సంజయుని ఉక్తి నైపుణ్యము దాని
కమోఘమగు శక్తిని కలిగించినది. శ్రీకృష్ణుని రాయబారమున
మొదటి ఉపన్యాసము నందలి విషయము ద్రుపద పురోహితుడు
తెల్పిన అంశములే అయినను ఉక్తి చమత్కృతిలోని వైవిధ్యము
చాల స్పష్టముగ కనబడు చుండును. మొదటివాడైన పురోహితునకు

పౌరుష్యమును, రెండవ వాడైన సంజయునకు చాతుర్యమును ప్రధానములు కాగా కృష్ణుని ఉపన్యాసమున ఔజ్జ్వల్యము ప్రధాన లక్షణ మగుచున్నది. అతని ఉపన్యాసము సామాన్య మానవులనే గాక మహాత్ములగు మహర్షులను గూడ స్తబ్ధులను గావించినది. సభలలో నెట్లుపన్యసింప వలెనను విషయమునకు సమాధానము ఇచ్చట మనకు లభించుచున్నది. ద్రుపద పురోహితుని రాయబారమున పాండవ సందేశము నందించుటయే కర్తవ్యము గాని స్వకీయమైన బుద్ధికి ఇచ్చట స్థానములేదు. సంజయుని రాయబారమున తన ప్రభువు సందేశానుసారముగ చతురముగ మాటలాడ వచ్చునేగాని నిర్ణయాధికారము లేదు. శ్రీకృష్ణుని రాయబారమున ఫలితాంశమేమైనను అతడు సందర్భానుసారముగ మాటలాడుటకు, సందర్భోచిత నిర్ణయములు గైకొనుటకు సర్వాధికారములు కలిగి యున్నాడు. ఇట్లు మూడు రాయబారములును వేరు వేరు వ్యక్తిత్వములను ప్రదర్శించుచున్నవి.

ఉపన్యాసములు రెండు విధములుగ నుండును. చెప్పదలచుకొనిన సారాంశమును చివరి వరకు దాచిపెట్టుట ఒక పద్ధతి సారాంశమును ముందుగనే చెప్పివేయుట వేరొక పద్ధతి. సంజయు రాయబారము మొదటి పద్ధతికి చెందియుండ కృష్ణుని రాయబారము రెండవ పద్ధతికి చెంది యున్నది. దుర్యోధనునకు భీష్ముడు, ద్రోణుడు, మహర్షులును నీతి గరపుదురు. ఒకరు చెప్పినట్లు వేరొకరు చెప్పరు. వ్యక్తులను బట్టి వైవిధ్య మేర్పడుచునే యుండును. రాయబారి ఉపన్యాసము సభను ముగ్ధము చేయుటకు కాగా మిగిలినవారి ఉపదేశము వ్యక్తిని సంస్కరించుటకు చేయబడినవి. కావున ప్రయోజనమును బట్టి శైలిలోకూడ భేదము సిద్ధించినది. ఉద్యోగపర్వము నందలి ద్రౌపది పరుష నిష్ఠురములతో పలికిన పలుకులు చదువునప్పుడు కేశపాశము చేత ధరించి కృష్ణుని ముందు ఎలుగెత్తి ఏడ్చ

చున్న ద్రౌపది పాత్రనికి కనుల ముందు కనబడుచునే వుండును. ఉద్యోగపర్వములోని ప్రసంగము లన్నియు ఇంచుమించుగ వ్యంగ్య చమత్కార విలసితములు. సంజయుని రాయబార సమయమున ధృతరాష్ట్రుని పలుకుల అర్థము సభాసదులకొక విధమును అతని అంతరంగమున కొకవిధమును అగుట పరిశీలింపవచ్చును. కాని అది వాచ్యము గాదు. 'కావ్యస్యాత్మా ధ్వనిః' అను పూర్వాచార్యుల మతమునకు అద్వితీయమైన నిరూపణము భారతము నందలి ఉద్యోగపర్వమే. నదు లన్నియు సముద్రమున కలియునట్లు ఇతర గుణము లన్నియు ధ్వనిలో ఇమిడియున్నవి. ఇందలి సంభాషణ నైపుణ్యము నాన్యతో దర్శనీయము. ఎదుటివారి ముందుకాళ్ళకు బంధము వేసినట్లు మాటాడుటయు దానికి తగినట్లుగ కీలెరిగి వాత పెట్టినట్లు సమాధానములిచ్చుటయు పలుతావుల గనబడుచుండును

ప్రత్యక్షముగ సమర ప్రయత్నమునకు సంబంధించిన వస్తువును ఇందున్నది. దుర్యోధనార్జునులు కృష్ణ సాహాయ్యము నర్థించుట, దుర్యోధనుడు శల్యుని తన పక్షమునకు మరల్చుకొనుట. దండనాథ నిర్ణయము, సమరథాతిరథుల పరిగణనము, బలాబల విచారము నిందు చేరుచున్నవి.

ఇట్లు భారతము నందలి ఉద్యోగపర్వము పూర్వోత్తర భాగములకు సేతువువలె నుండి మిగిలిన పర్వముల కంటె ప్రత్యేకత కలిగినదై పాఠకులకు ఆనందము కలిగించునదై మరల మరల చదివించునదై ఒప్పారుచున్నది

## తులనాత్మక పరిశీలనము – ప్రయోజనము :

భారతము వ్యాసకృతము. తిక్కన కుమార వ్యాసుల రచనలు అనువాదములు. ఒక అనువాదమును మూలముతో పోల్చుట సముచితమే. అనువాదము యథామాతృకమయినను కాకపోయినను మూలానువాదముల తులనాత్మక పరిశీలనము సమంజసమే అగును.

యథాతథానువాద మగుచో అందు అనువాదకుడెంత వరకు కృతా ర్థుడయ్యెనో మూలము నతి క్రమించి స్వతంత్రతా విలసిత మగుచో అనువాదకుని స్వాతంత్ర్యము ఎంతవరకు సమంజసమో పరిశీలింప వచ్చును. అనువాదము యథామూలము కానప్పుడు తులనాత్మక పరిశీలనావశ్యకత మరింత అధికము అప్పుడుగాని అనువాదకుని స్థానము నిర్ణయింపబడదు అనువాదమున కనబడు సొగసులన్నియు అనువాదకునివే అని భ్రమపడరాదు మూలము నందున్నవేవియో లేనివేవియో ముందు నిర్ధారింపుకొనవలసి యున్నది. అట్లు చేయని విమర్శనము అసంపూర్ణమగును మూలకర్తకు అన్యాయము చేయు టయే గాక అనువాదకునకు లేని యశస్సు నంటకట్టుటయు అగును కావున అనువాదమును మూలగ్రంథముతో పోల్చుట అత్యా వశ్యకము. యథాతథానువాదముగాక స్వేచ్ఛానువాదము గావించు ఏ అనువాదకుడైనను ప్రధానముగ ఆరు పద్ధతులను అనుసరించును 1. విపులీకరణము 2. సంగ్రహీకరణము 3 పరిహరణము 4 అన్యథా కల్పనము 5 నూతన కల్పనము 6. యథాతథానువాదము తెలుగు కన్నడ భాషలలో ఆదాన ప్రదానములు, పరస్పర ప్రభావము అనా దిగ ఉన్నవి. దీనికి కారణములను పెక్కు పేర్కొన వచ్చును.

1 తెలుగు కన్నడములు మాటాడు ప్రదేశములు నైసర్గికముగ ఒకే భూభాగమును అంటిపెట్టుకొని యున్నవి
2. రాజకీయముగ ఈ ప్రాంతములను రెండింటిని ఒకే వంశపు రాజులు (చాళుక్య, విజయనగర మొ॥ వారు) పరిపాలించిరి
3 భాషా తత్త్వము ననుసరించి ఈ రెండు భాషలును ద్రావిడ భాషా కుటుంబమునకు చెందినవి
4. భాషకు స్థిరత్వము కలుగజేయు లిపి రెండింటికిని చాల కాలము వరకు ఏకరీతిగనే ఉన్నది
5 సాహిత్య స్వరూపమును నిర్దిష్టము చేయు వ్యాకరణ ఛందో రీతులు ఒకే విధముగ పెంపొందినవి.

6 సాంఘికముగను, మత విషయకముగను వీని సంబంధము మరింత దృఢమైనది

తెలుగు కన్నడములు ఒకే వాహినియందుద్భవించిన రెండు పాయలవలెను, ఒకే కొమ్మను పూచిన రెండు పువ్వులవలెను, ఒకే గర్భమున జనియించిన కవలవలెను సన్నిహిత సంబంధము గలిగినట్టివి కన్నడ ఆదికవి పంప తెలుగు వాడనియు, తెలుగు ఆదికవి నన్నయ కన్నడిగుడనియు విమర్శ ఆ భాషల సాన్నిహిత్యమును విశదపరచుచున్నది పంప ప్రభావము నన్నయ, తిక్కనలపై కలదనియు, కుమార వ్యాసునిపై తిక్కన ప్రభావము కలదనియు కొందరి విమర్శకుల అభిప్రాయము సోమనాథాది కవులు ఉభయ భాషలలోను కావ్యములు రచించి ప్రసిద్ధులైరి ఒకే గ్రంథమును భిన్న భాషలలో అనువదించినప్పుడు ఆ కవులు అనువదించిన, నిర్వహించిన విధానములను తులనాత్మక పరిశీలనము చేయుట వలన సాహిత్య వికాసమును, సమ్యగవగాహనమును కలుగును

భారతదేశము అనేక భాషల, జాతుల, సంస్కృతుల సమ్మేళనము భారతీయులలో జాతీయతను కలిగించుటకు సమకాలీన, ప్రాచీన సాహిత్యముల తులనాత్మక పరిశీలనము చాల ఆవశ్యకము, భాషా ద్వేషములను, ప్రాంతీయ తత్త్వములను రూపుమాపుటకు భావ వినిమయము, సంస్కృతి వినిమయమునకు అఖండ భారత సమగ్ర సంస్కృతి వీక్షణమునకు భిన్నత్వమున ఏకత్వ మనెడి భావమును ఈ ఉపఖండమున శాశ్వతముగ నిలబెట్టుటకు ఇట్టి తులనాత్మక పరిశీలనముల ఆవశ్యకత ఎంతయేని గలదు. తెలుగు కన్నడ భాషలలో నేటికే పలు తులనాత్మక పరిశీలన గ్రంథములు వెలువడినవి. వేమన - సర్వజ్ఞులపైన, పంప - నన్నయలపైన, పారిజాతాపహరణముపైన వెలువడిన పరిశోధనములు ఇందు కొన్ని మాత్రమే.

ఒక మహా కావ్యమును ఎన్నాళ్లైన ఒకే భాషలో ఒకే విధముగ అధ్యయనించుట కంటె భిన్న భాషలలో విభిన్న కవులు ఒకే వస్తువుపై చూపిన వారివారి కళాకౌశలములను దర్శించుటకు, వివిధ సంస్కృతులలో గల వైవిధ్యమును అంపలి ఏక సూత్రతను గ్రహించుటకు వీలు కలిగించును కర్ణాటకలోని సర్వజ్ఞ, ఆంధ్రలోని వేమన తులనాత్మకముగ పరిశీలింప బడినపుడు వారిలోని ధర్మ సంస్కారములు, సామాజిక నిశిత పరిశీలనములోని ఏక సూత్రత తెలియుటయే గాక ఆయా రాష్ట్రప్రజల భావైక్యమునకు చాల సాయపడును.

దేశవ్యాప్తముగ, ప్రపంచ వ్యాప్తముగ ఉన్న సాహిత్యములను ఈ దృష్టితో పరిశీలింప వలసి యున్నది దాని వలన 'ఒకే ప్రపంచము' అనిన జవహార్‌లాల్ నెహ్రూ, రాధాకృష్ణన్ వంటి మహానాయకుల కలలు నిజమగుటకు, ప్రపంచ శాంతికి, అంతర్జాతీయ సౌభ్రాత్రమునకు వీలు కలుగును. 'Indian literature is one though written in many Languages' అను డా॥ రాధాకృష్ణన్ గారి మాట అక్షర సత్యము. డా॥ జె. పార్థసారధి Comparative Literature ను పాఠ్య విషయముగ చేర్చుటను గూర్చి వ్రాయుచు 'It is opening the eyes of the youth to the totality of the Indian Heritage'[1] అని పేర్కొని యున్నారు.

ఈ పై కారణములను, ప్రయోజనములను దృష్టిలో నిడి కొని కళాప్రపూర్ణ నిడుదవోలు వెంకటరావుగారు, శ్రీ R V సుందరం గారు తిక్కన ప్రభావము కుమార వ్యాసునిపై గలదని తమ గ్రంథములలో పేర్కొనుటచే మూలభారతమును తిక్కన కుమారవ్యాసులు ఏ రీతిని అనుసరించిరో తులనాత్మక పరిశీలనము చేయుట సమంజసముగ భావించుచున్నాను

---

1 Studies in comparative literature, An article in the Hindu, Nov 25th 1982

# ద్వితీయాధ్యాయము

# కాలస్థలాదులు - రచనా సముద్దేశము

### తిక్కన కాలస్థలాదులు

తిక్కన సోమయాజి తన్నుగూర్చి తన గ్రంథములయందు తెలుపుకొన్నది చాల స్వల్పము ఇది తెలుగు కవులకు సామాన్య విషయము. ఆత్మస్తుతి అగునని కాబోలు వారు తమ చరిత్రలను పరిశోధనాంశములుగ మిగిల్చియున్నారు తిక్కన చరిత్రమును గూర్చి తెలిసికొనుటకు మనకు ఆధారముగ లభించునవి రెండు. 1 అతని రచనలు 2 కేతన రచించిన 'దశకుమార చరితము' వీని ఆధారముగ తిక్కన గౌతమస గోత్రుడు ఆపస్తంబ సూత్రుడు. శివపదార్చనా నిరతుడు తండ్రి కొమ్మనామాత్యుడు. తల్లి అన్నమాంబ. ఉభయ కావ్య ప్రౌఢి పాటించు శిల్పమున నేర్పుకలవాడు[1] తిక్కన వంశమునకు మూలపురుషుడు మారన ఇతడు శా॥శ॥ 1051 (క్రీ॥శ॥ 1129) ప్రాంతమున గుంటూరు జిల్లాలో పన్నను రాబట్టెడి అధికారిగ నుండెను[2] ఈతని మనుమడు క్రీ॥శ॥ 1150 ప్రాంతమున కమ్మనాటిని పాలించిన త్రిభువన మల్లదేవుని యొద్ద మంత్రిగ ఉండెను. ఆతని కుమారుడు భాస్కరుడు క్రీ॥శ॥ 1175 ప్రాంతమున గుంటూరి విభుడుగ నుండెను ఈతడే 'భాస్కర రామాయణము'ను వ్రాసియుండవచ్చును ఈతని కుమారుడు కేతన 'ఆంధ్ర పద్య కాదంబరి'ని రచించెను. కేతన ఆతని తమ్ముడు మల్లనయు కమ్మనాటి చోడులకు మంత్రులుగ నుండిరి. వారి తమ్ముడు సిద్దన నెల్లూరి చోడ తిక్కరాజునొద్ద మంత్రిగ నుండెను ఆతని కుమారుడు ఖడ్గతిక్కన చోడతిక్కరాజునకును, ఆతని కుమారుడైన మనుమసిద్ధికిని సేనాధిపతిగ నుండెను

---

1 తి భా, వి ప, ప్ర ఆ ప 18

2 ఆంధ్రకవి తరంగిణి, వాల్యూం 2 పుట 153




తిక్కన మనుమసిద్ధి ఆస్థానమున మంత్రిగ ఉండెను. మనుమసిద్ధి తిక్కనను 'మామా' అని పిల్చెడువాడు. మనుమసిద్ధి తండ్రి తిక్కరాజు క్రీ॥శ॥ 1190 ప్రాంతమున పుట్టి క్రీ॥శ॥ 1252 ప్రాంతమున రాజ్య మేలినట్లు తెలియుచున్నది మనుమసిద్ధి మరణ కాలము క్రీ॥శ॥ 1280 ప్రాంతమని కొందరు, క్రీ॥శ॥ 1263 ప్రాంతమని కొందరు చెప్పుదురు. తిక్కరాజునకు 25వ ఏట మనుమసిద్ధి జనించిన అతడు క్రీ॥శ॥ 1215 ప్రాంతమువాడగును దీనినిబట్టి తిక్కన జననము క్రీ॥శ॥ 1210 ప్రాంతమగును తిక్కన మరణము క్రీ॥శ॥ 1288 ప్రాంతమున జరిగినట్లు 'మెకంజీ వ్రాతప్రతి'[1] వలన తెలియుచున్నది. దీనిని బట్టి

1 చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తకాలయము

తిక్కన కాలము క్రీ॥శ॥ 1210-1288 అని చెప్పవచ్చును క్రీ॥శ॥ 1257 ప్రాంతమున నిర్వచనోత్తర రామాయణమును, క్రీ॥శ॥ 1265 ప్రాంతమున యజ్ఞము గావించి సోమయాజియై భారతమును రచించెననియు చెప్పవచ్చును

తిక్కన తనకు 'ఉభయ కవి మిత్రుడు' అను బిరుద మున్నటులు తెలిపికొని ఉన్నాడు. ఇతనికి 'కవిబ్రహ్మ' బిరుదమును తొలుత ఉపయోగించినవాడు 'ఎఱ్ఱాప్రెగ్గడ'. తెనుగున, సంస్కృత మున కవిత్వము చెప్పగల వాడగుటచే 'ఉభయ కవిమిత్ర' బిరుదము లభించెనని కేతన తెలిపియుండ 'మార్గ-దేశి'కవితల రెండింటియందును కవిత్వము చెప్పగల వాడగుటచే లభించెనని కొందరూహించిరి కేతన తన దశకుమార చరిత్రమున తిక్కనను 'వాక్పతినిభుడు' అనుటను బట్టి 'ఎఱ్ఱాప్రెగ్గడ' కవి బ్రహ్మయని పేర్కొని యుండవచ్చును.[2] తిక్కన నిర్వచనోత్తర రామాయణము, భారతము గాక విజయ సేనము, కవిసార్వభౌమ ఛందస్సు, కృష్ణ శతకము అను గ్రంథము లను గూడ రచించెనందురు కంపరాయల భార్య గంగాదేవి తన 'మధురా విజయ' సంస్కృత కావ్యమున సంస్కృత కవులతో గాటు తిక్కనను కూడ నుతించెను. తిక్కన నిర్వచనోత్తర రామాయణ మున "నేనుభయ కావ్య ప్రౌఢిఁ బాటించు శిల్పమునన్ బారగుడన్" అని చెప్పుకొనెను. కాని తిక్కన రచించిన సంస్కృత గ్రంథము లేవియు లభింపకపోవుట మన దురదృష్టము

---

2 కృతుల రచియింప సుకవుల
కృతులొప్పగొనంగ నౌరునికిం దీరునె వా
క్పతి నిభుడు వితరణ శ్రీ
యుతుఁ డన్నమ సుతుడు తిక్కడొకనికిఁ దక్కన్

దశకుమార చరిత్ర – ప్ర ఆ–ఎ 91

## కుమారవ్యాసుని కాలస్థలాదులు :

కుమారవ్యాసుడు కన్నడ సాహిత్యమున సర్వోత్తమ కవి. అతనివలె పండిత పామరులకు జనప్రియుడైన కవి వేరొకరు లేరనినను అతిశయోక్తి కానేరదు. 'హళెగన్నడ' యుగమునకు 'పంప' యుగకర్త అయిన "నడుగన్నడ" యుగమునకు "కుమారవ్యాసు"ని యుగకర్తగ చెప్పవచ్చును. పలువురు కన్నడ కవులవలెనే కుమారవ్యాసుడును తన గ్రంథమున తన్ను గూర్చి ఏమియు తెల్పుకొని యుండలేదు. తన పూర్వ కవుల నెవరిని స్మరించి యుండలేదు. తన కాలమందలి ప్రభువుల పేరులనైనను చెప్పి యుండలేదు. ఇందువలన కుమారవ్యాసుని కాలమును గూర్చిన నిర్ణయమునకై ఇతర ప్రమాణములపైనను ఊహలపైనను, ఆధారపడవలసి వచ్చుచున్నది.

కుమార వ్యాసుడు ప్రతిపర్వాంతమును "శ్రీమద చింత్య మహిమ గదుగు వీరనారాయణ చరణారవింద మకరంద మధుపాన పుష్పవచః షట్పదీ నికాయ శ్రీమత్కుమార వ్యాసయోగీంద్ర విరచిత మప్ప కర్ణాట భారత కథామంజరి యోళ్" అని ముగించెను. దీనిని బట్టి కుమార వ్యాసుడు గదగు ప్రాంత వాస్తవ్యుడనియు, అందున్న వీరనారాయణస్వామి భక్తుడనియు, యోగీంద్రుడనియు తెలియుచున్నది.

మాధవరసయ్య అనునతడు శా. శ. 1069 లో "కోళివాడ"[1] యందుండెను. అతడు రాజ నరసింగరాయని యొద్ద దండనాయకుడుగ ఉండెను. ఇతడు కోళివాడ గ్రామ మధ్యభాగమున వీరనారాయణుని ప్రతిష్ఠించెను. కొంతకాలమునకు మాధవరసయ్య తన కుమారుడగు తిమ్మరుయ్యను కోళివాడలో నుంచి తాను విజయనగరము పోయి

1 R S పంచముఖి కుమారవ్యాస కవియ చరిత్ర మత్తు కావ్య విచార - పుట 6

ప్రభువునకు అంగరక్షకుడయ్యెను. తిమ్మరుసయ్య కొడుకు లక్ష్మ రసయ్య. అతనికి అయిదుగురు కుమారులు. వారిలో పెద్దవాడు వీర నారాయణుడు. ఇతడే మన కుమార వ్యాసుడు. నారాయణప్ప, నారణప్ప, నారాయణ అనియు ప్రసిద్ధుడయ్యెను.

"కోళివాడ" గ్రామము నందలి శ్రీ మాధవ జనార్దన దేవాలయము నందలి స్తంభము మీది శా. శ. 1485 శాసనము ఆధారముగ నారణప్ప పూర్వులు "కోళివాడ" గ్రామాధిపత్యము కలిగి యుండినట్లు తెలియుచున్నది. వీరు ఋక్ శాఖవారు. ఆశ్వలాయన సూత్రులు. అగస్త్య గోత్రులు. విజయనగర రాజుల పరిపాలనము సాగినంత కాలము వీరి కుటుంబమువారు గజ సేనాధిపతులై యుండిరి అదే శాసనములోని "ఆనెయ దేవప్పయ్య" అను బిరుదము వలన ఈ విషయము స్పష్టమగుచున్నది. దేవప్పయ్య శా శ 1485 ప్రాంతమున గజసేనాధిపతి అయ్యెను. ఇతడు కుమారవ్యాసుని మనుమడు. దీనిని బట్టి కుమారవ్యాసుడు గజసేనాధిపతి అయి ఉండవచ్చును

కుమారవ్యాసుని కాలమును గూర్చి విద్వాంసులు భిన్నాభిప్రాయములు వెల్లడించి యున్నారు. దీనిని బట్టి కుమారవ్యాసుని కాలము 12వ శతాబ్దము నుండి 16వ శతాబ్దము వరకు విస్తరించినది.

శ్రీ T S సుబ్బరాయశాస్త్రిగారు 1650 లోని గురురాజ చరిత్ర, 1672 లోని ఖైరవేశ్వర కావ్యకథా సూత్ర రత్నాకరము, 1763 లోని చోర బసవ చరిత్ర మున్నగు కావ్యములందలి విషయములను ఆధారముగ చేసికొని కుమారవ్యాసుని కాలము 12వ శతాబ్దమని నిర్ధారణ చేసియున్నారు.

శ్రీ గోవిందపైగారు భారతము నందలి శబ్దరూపము లను భాషా ప్రయోగములను మరియు కొన్ని చారిత్రకాంశములను

ఆధారముగ చేసికొని ఈతని కాలము 13వ శతాబ్ది పూర్వార్థమని నిర్ణయించిరి.[1]

శ్రీ R నరసింహాచార్యగారు శ్రీకృష్ణదేవరాయలు తిమ్మణ్ణను కుమారవ్యాసుడు వ్రాయక వదిలిన ఎనిమిది పర్వములను పూర్తి చేయుమనిన 'తేసెనిసి వెరదిలా కుమారవ్యాస జత పర్వగళ హేళిద భారతద ఉళిద పర్వగళ నీనకల జన మెచ్చువంతె పేళు'అను పలుకులాధారముగ కుమారవ్యాసుని కాలము క్రీ॥శ॥ 1430 అని నిర్ణయించిరి[2]

శ్రీ శ శ. కోళివాడగారు కుమారవ్యాసుని తండ్రి లక్కరసయ్య మొదటి దేవరాయల యొద్ద క్రీ॥శ॥ 1406-1422 వరకు మంత్రిగ ఉండి అతని మరణానంతరము కోళివాడకు తిరిగి వచ్చెను అను విజయనగర చరిత్రను ఆధారముగ చేసికొని కుమారవ్యాసుని కాలము క్రీ॥శ॥ 1430-1455 వరకు అనియు భారతమును క్రీ॥శ॥ 1450-1455 మధ్య వ్రాసి యుండవచ్చుననియు నిర్ధారించిరి.[3]

శ్రీ సుజనాగారు కుమారవ్యాసుని భారత పద్యముల ప్రభావము, అనుకరణము భాస్కర కవిపై గలదని, భాస్కర కవి తన "జీవంధర చరితె"ను క్రీ॥శ॥ 1424లో రచించెననియు దానిని బట్టి కుమారవ్యాసుని కాలము క్రీ॥ శ॥ 1350 ప్రాంతమని పేర్కొని యున్నారు.[4]

కుమారి K సౌజన్యకుమారి పై అభిప్రాయమునే సమర్థించుచు భాస్కరకవి కుమారవ్యాసుని అనుకరించెననుట సందేహము లేదనియు కాని ఎంత పూర్వము వాడనుటకు సరియగు ఆధారములు లేకుండుటచే క్రీ॥శ॥ 1400 గ భావింపవలెనని పేర్కొనిరి.[5]

---

1 శ్రీ గోవిందపై - కుమారవ్యాస ప్రశస్తి పుట 1

2 R నరసింహాచార్య కర్ణాటక కవి చరితె, సం 2, పుట 64

3 శ శ కోళివాడ ధారవాడ దళారదె, సం 8, పుట 4

4 సుజనా, కుమారవ్యాస, పుట 78

5 K సౌజన్యకుమారి తిక్కన, కుమారవ్యాసుల పరిశీలనము పుట 6

పై అభిప్రాయములను పరిశీలింప కుమారవ్యాసుని తండ్రి లక్కరసయ్య కాలము క్రీ॥శ॥ 1406-1422 అనుటలో సందేహము కనబడదు. కుమారవ్యాసుని మనుమడు దేవప్పయ్య కాలము క్రీ॥శ॥ 1485 అనుటలోను సందేహము లేదు. కావున కుమారవ్యాసుని కాలము వీరిరువురి నడుమ 1425-1455 అనుటయే సమంజసము. భారత రచనాకాలము 1450-1455 మధ్య భాగమున జరిగియుండును.

భాస్కరకవి తన కావ్యరచనా కాలమును శా॥శ॥ 1345 గ తెలిపికొని యున్నాడు[1]. కాని అతడు తెల్పిన క్రోధి వర్ష ఫాల్గుణ శుద్ధ దశమి భానువారము కాదు. బుధవారము. క్రోధి సంవత్సర ఫాల్గుణ దశమి భానువారము శా॥శ॥ 1526 లో అగును. ఇట్లు భాస్కర కవి కాలము సందేహాస్పదమగుచుండ, భాస్కరకవిని బట్టి కుమార వ్యాసుని కాలము నిర్ణయించుటకు పూనుకొనుట నిష్ప్రయోజనము.

నారణప్పకు కుమారవ్యాసుడు అను పేరెట్లు వచ్చెను? అది నిజనామమా? లేక బిరుదమా? అని సందేహము. కవి కుమారవ్యాసుడను నామముతోడనే ప్రసిద్ధుడయ్యెను. ఇది నిజనామము కాదనిపించును. తల్లిదండ్రులు పిల్లవానికి కిట్టి నామమిడిరనుట సంశయాస్పదము. ఇది నామమనుట కన్న బిరుదమనుటయే సమంజసమనిపించును. అగుచో ఈ బిరుదమును తానే పేర్కొనెనా? లేక ఎవరైన ఇచ్చిరా?

"తరళనను తన్న వననుత పతి
కరిసి మగనెం దొలిదు కరుణది
వరవ నిత్తను దేవ వేదవ్యాస గురురాయ"[2] అను కవి

---

1 శరగగత్రితయ చంద్ర సంఖ్యెయ
వర శకాబ్ది క్రోధి సంవ
త్సరద ఫాల్గుణ శుద్ధ దశమి దినేశ వారదలి
H దేవ వీరప్ప కుమారవ్యాస - భాస్కరన కాలవన్ను కురితు,

2 కు వ్యా భా ఆ ప పీఠికా సంధి, పద్యము 11

మాటల వలన అతడు వ్యాసుని అనుగ్రహమునకు పాత్రుడయ్యె ననియు, శుకుడు ఔరస పుత్రుడగుచో తాను మానస పుత్రుడుగ భావించుకొనె ననియు తలంపవచ్చును కావ్యపీఠికలో-

బణగు కవి గళ లెక్కపనె వా
కెణిస డిరు శుక రూప పల్లవె
కుణిసి నగనె కవి కుమార వ్యాస నుళిదవర[1] అని చెప్పు

నుట చేతను గూడ కవి తన్ను శుకునితో పోల్చుకొని అతని వలెనే తానును యోగీంద్రుడయి యుండును దీనిని బట్టి నారాయణప్పయే తన్ను కుమారవ్యాసు డనియు, శుక రూపుడనియు పేర్కొని యున్నాను. కన్నడ రామాయణమును రచించిన "నరహరి" కుమార వ్యాసుని అనుకరించి తన్ను "కుమార వాల్మీకి" అని పేర్కొనినాడు.

కుమారవ్యాసుడు "ఐరావత"మను గ్రంథమును కూడ రచించెనని శ్రీ R S పంచముఖి తెల్పిరి. గ్రంథము వీరనారాయణు నకు అంకిత మీయబడుటయే ఇట్లనుటకు కారణము. వేరొక కవి వ్రాసి యుండునని రం శ్రీ ముగళిగారి అభిప్రాయము. ఇట్లు ఐరావత గ్రంథ రచనము ఇంకను వివాదాస్పదమై యున్నది.

తిక్కన పూర్వీకులు గుంటూరి విభులై యుండ కుమార వ్యాసుని పూర్వీకులు కోళివాడ గ్రామాధిపత్యము నంది యుండిరి. తిక్కన పూర్వులు కమ్మనాటి చోడుల సేవించి దండనాయకులుగ ఉండ కుమారవ్యాసుని వంశమువారు విజయనగర రాజుల సేవించి గజసేనాధ్యక్షులై ఉండిరి తిక్కన సోమయాజియై భారతమును రచింప కుమారవ్యాసుడు యోగీంద్రుడై భారతమును రచించెను అతడు ఉభయ కవిమిత్రుడై కవి బ్రహ్మ కాగా ఇతడు శుకరూపుడై కుమారవ్యాసుడయినాడు. తిక్కన నెల్లూరిలోని హరిహరనాథుని సన్నిధిలో భారతమును రచియింప కుమారవ్యాసుడు గదగు వీర

1 కు వ్యా భా, ఆ ప, పీఠికా సంధి, పద్యము 17

నారాయణుని ఆలయములో ఆసీనుడై రచించెను. తిక్కన శైవ, వైష్ణవములకు అతీతుడై హరిహరనాథోపాసన గావింపగ కుమార వ్యాసుడును శివకేశవ సమాన సిద్ధాంతమునే బోధించెను.

ఇట్లు తిక్కన కుమారవ్యాసు లిరువురును సమాన ధర్మములనంది భారతమును ధర్మబుద్ధితోడనే రచించి ఆంధ్ర కర్ణాట భాషలయం దగ్రగణ్యులగుటయే గాక ఆచంద్ర కీర్తిమంతులైరి.

## భారత రచనా సముద్దేశము

### తిక్కన భారత రచనా సముద్దేశము :

వ్యాసభారతమును పురాణమనియో, ఇతిహాసమనియో, కావ్యమనియో వర్ణింపరాదు. అది నన్నయభట్టు చెప్పినట్లు[1] ఒక విజ్ఞాన సర్వస్వము సారస్వతముయొక్క ప్రయోజనము ఆహ్లాదము కలిగించుటయు, విజ్ఞాన బోధనము గుటయునై ఉన్నది. "విశ్వశ్రేయః కావ్యం" అను కారికకు కూడ ఇదియే అర్థము.

వ్యాసభారతము కేవలము కురుపాండవ యుద్ధమునకు సంబంధించిన చరిత్ర మాత్రమే కాదు ఆనాడు విజ్ఞానమంతయు గ్రంథ రూపమున గాక వాగ్రూపమున ఉండెడిది ద్వాపరాంతమున జరిగిన సర్వనాశనమున శ్రుతిరూపమైన ఆ విజ్ఞాన మంతయు మృగ్యమై

1 ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని యాధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని కవి వృషభులు మహాకావ్య మనియు
లాక్షణికు సర్వలక్ష్య సంగ్రహమని యైతిహాసికు లితిహాస మనియు
బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చయంబని మహిఁ గొనియాడుచుండ
వివిధ వేద తత్త్వవేది వేదవ్యాసుఁ, డాదిముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై, పరగు చుండఁ జేసె భారతంబు

నన్నయ భారతము, ఆ ప, ప్ర అ, ప 32

అసద్ధర్మములు, అసత్య సిద్ధాంతములు తలయెత్తి సాగినవి. ఇంచు
మించుగ అస్తమించిపోయిన ఆ విజ్ఞానమును పునస్సంస్థాపనము
చేయుటయే తన జన్మ ప్రయోజనముగ వ్యాసుడు అవతరించెను.
ఆ యుగాంతమున యాదవకృష్ణుడును, కృష్ణద్వైపాయనుడును పుట్టి
యుండక పోయినచో భారతీయ నాగరకత కథావశేష మయ్యెడిది.

వ్యాసుడు తద్విజ్ఞాన సంరక్షణకు పూనుకొని మొదట జేసిన
కార్యము వేదములను విడదీయుట. ఆనాటి వేదములు చిక్కుబడ్డ
నూలు గుట్టవలె అనుక్రమణికారహిత స్థితిలో నున్నవి. అట్టి చిక్కు
లను తెగకుండ పదునుగ చూచినవాడు వ్యాసుడు. ఈ అర్థమునే ఎఱ్ఱా
ప్రెగ్గడ 'పొగులై యెందును పోనేర్పునకయున్న శ్రుతు లన్నియును
నోజ సూత్ర పఱిచె' అని చక్కగ ధ్వని ప్రధానముగ చెప్పెను. వేద
ములు విడదీసి సంతనే భారతీయ సంస్కృతి భవనమునకు గట్టి పునాది
ఏర్పడెను.

ఆపై ఆయన భారతమును రచించి ఆ పునాదిమీద విజ్ఞాన
సౌధము ను నిర్మించెను. కురుపాండవ చరిత్రను నిమిత్త మాత్రముగ
గ్రహించి ఆ మహాకవి భారతములో ధర్మశాస్త్ర వాక్యములను,
ఆగమ తాత్పర్యములను, ఐతిహాసిక గాథలను, పురాణ చరిత్రలను,
రాజవంశ వర్ణనలను అది ఇది అననేల? మన ప్రాచీన విజ్ఞాన సార
మునంతను రాశీభూతము చేసి ఏకత్ర నిబంధించెను. మీదు మిక్కిలి
సర్వోపనిషత్ సారమైన భగవద్గీతను అందు నిక్షేపించి ఉపనిషదర్థము
లకు స్థిరమైన వసతి కల్పించెను. ఉద్యోగపర్వము నందలి సనత్సు
జాతీయమును అట్టిదే. కావుననే-

'ధర్మే చార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్' అని

శంపాయనుడు అని యున్నాడు.

భారత స్వరూపమేమి? అను సందేహమునకు అది 'ధర్మాద్వైత మూర్తి' అని తిక్కన చరమ పరమ సిద్ధాంతము చేసెను. ఆ మహా ప్రబంధము పంచమ వేదమైనది. ఇట్టి పంచమ వేదమును ఆంధ్రులకు తమ భాషలో అర్పించుట 'ఆంధ్రావళి మోదముం బొరయ తెనుగు బాస వినిర్మింపు'ట సుకృతమని తిక్కన సోమయాజి తలంచెను.

'శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షో ముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహన్త్య విహతాం స్త్రీ పుంస యోగోద్భవాం
తే వేదత్రయ మూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వస్సురైః
భూయాసుః పురుషోత్తమాంబుజ భవ శ్రీకంధరా శ్శ్రేయసే' అని నన్నయ తొలి శ్లోకమున అవితథమగు లోకస్థితి విషయమున పేర్కొనిన పురుషత్రయ మెట్టిదో అతడు ప్రారంభించిన ఆంధ్రభారత రచనా విషయమున మనకు కవిత్రయము అట్టిదైనది. సామాన్యముగ ఆ పురుషత్రయమును సృష్టి స్థితి లయ కారకులుగ దలంచి బ్రహ్మ విష్ణు మహేశ్వరులను వరుసలో జెప్పుట పరిపాటి కాని నన్నయ తొలి శ్లోకములో వేదత్రయ మూర్తులగు ఆ పురుషత్రయమును పురుషోత్త మాంబుజ భవ శ్రీకంధరులను వరుసలో పేర్కొని యున్నాడు

ఈ వరుసనే మనము మన కవిత్రయమునకు అన్వయించిన పురుషోత్తమ స్థానమున ఆదికవి 'నన్నయ', అంబుజ భవ స్థానమున కాలమును బట్టి తరువాతి వాడేయగు కవిబ్రహ్మ 'తిక్కన', అటు పిమ్మట శ్రీకంధర స్థానమున అటు తరువాతి వాడగు శంభుదాసుడు 'ఎఱ్ఱాప్రెగ్గడ' నిలుతురు అయిన చమత్కారమేమన నన్నయ తొలి శ్లోకములో 'పురుషోత్త మాంబుజ భవ శ్రీకంధరా శ్శ్రేయసే' అని రచించి ఆ వెంటనే చెప్పిన గద్యలో 'అని సకల భువన రక్షణ ప్రభువులై యాద్యులైన హరిహర హిరణ్య గర్భ సగోత్రమా వాణీ పతులను స్తుతించి' అని పేర్కొని యున్నాడు ప్రార్థించినది త్రిమూర్తు

లనే అయినను తొలుత చెప్పిన వరుసను మార్చి వేసినాడు తరువాత కూడ 'హరి హర పద్మగర్భులను' అను పద్యమును కూడ ఈ వరుస లోనే స్తుతించి యున్నాడు

ఈ మార్పువలన గల విశేషమేమన పురుషత్రయమునకు మన కవిత్రయము ఛాయా మాత్రముగ గ్రహించినప్పుడు తొలి శ్లోకములో హరి-నన్నయ మొదటి స్థానము నాక్రమించి యుండ, రెండవ స్థానము నాక్రమించిన అంబుజభవుడగు-కవిబ్రహ్మ తిక్కన మూడవ వాడగుట, శ్రీకంధర-హర స్థానమున మూడవవాడగు శంభుదాసుడు ఎఱ్ఱన రెండవస్థానము నాక్రమించి హరి హిరణ్యగర్భులకు నడుమ జేరుట తటస్థించినది ఇట్లు వారి వారి కాలములను బట్టి గాక భారత గ్రంథ నిర్మాణమును బట్టి చూచినచో హరి హర స్థానముల నాక్రమించి మొదటి రెండున్నర పర్వములను రచించిన నన్నయ, అతడు వదలిన అరణ్యపర్వ శేషమును పూరించిన ఎఱ్ఱన తరువాతనేగదా విరాటపర్వాది పదునేను పర్వములను తెనుగు బాస రచించిన హిరణ్యగర్భ స్థానీయుడగు కవిబ్రహ్మ తిక్కన వచ్చెడిది కాబట్టి నన్నయ తరువాతి గద్యములో చెప్పిన హరి హర హిరణ్యగర్భుల క్రమము భారత గ్రంథ నిర్మాణ క్రమమునకు అన్వయించుకొన్నచో చక్కగ సమన్వయమగుచున్నది ఈ కారణమును బట్టియే భారత రచనాక్రమమున తిక్కన మూడవవాడగుచున్నాడు ఈ ఆంధ్ర భారత నిర్మాణము ఏయొక్క కవి చేతనో గాక కవిత్రయము వారి చేతనే జరిగియుండుట ఆంధ్రజనుల మహాభాగ్యమే అనక తప్పదు. అట్లు జరుగవలసి యుండుటచే మహర్షి తుల్యుడగు నన్నయ తొలి శ్లోకమున త్రిమూర్తుల స్తవము మూలమున సూచించినాడేమో

భారతము నందలి కథ, పాత్రలు, ధర్మము అనెడి మూడంగములు తిక్కన హృదయమును ఆకర్షించి యుండును. తిక్కన నాటకమునకు గల రూపసౌష్టవముగాని, శిల్ప సౌందర్యముగాని, మూల

మున లేవనుట నిర్వివాదాంశము. మూలమున పెక్కు తత్త్వములు విశీర్ణములై సమన్వయముకుదురని వైరుధ్యములుగలవిగా నుండ తిక్కన 'ఆ ధర్మ తత్త్వములందు అనేకత్వముగాని, వైరుధ్యముగాని లేదనియు నానాధర్మములయొక్క అద్వైతమూర్తియే భారతమని నిరూపించి నాడు. తనకు శ్రీమత్త్వము, ఆయుష్మత్త్వము, సుధీమత్త్వము భగవదనుగ్రహ లబ్ధము లని భక్తితో స్వీకరించి భోగియు, త్యాగియునై ఆ సంపదల వ్యామోహమున పడక నిర్లిప్తతతో మెలగిన బ్రహ్మజ్ఞాని తిక్కన[1] కావున తిక్కన లోకమునకిచ్చిన సందేశము ధర్మాద్వైత మార్గానుసారియైన పూర్ణయోగ సాధన.

తిక్కన 'కథా మాత్ర ప్రధానమును, యథోచితానుసరణమును అయిన అనువాదమునే ప్రారంభించెను. అది మూలమునకు విధేయమే కాని బానిస కాదు అతడు మూలము నందలి ప్రత్యెక్షరమును యథాతథముగ తెనిగింప బూనుకొనలేదు. అట్లని మిక్కిలి స్వతంత్రించి మూలమునకు దూరముగ తొలగిపోలేదు. తిక్కన మూలమునందలి ఉపపర్వ విభజనను పరిగణింపలేదు తన గ్రంథమును ఆశ్వాసములుగ విభజించియున్నాడు. మూలమున విరాటపర్వమున 3,500 శ్లోకములు[2]లుండ తిక్కన 1620 గద్య పద్యములుగ తెనిగించెను. మూలమున ఉద్యోగపర్వమున 6998[3] శ్లోకము లుండ 1562 గద్యపద్యములుగ తెనిగించెను విరాటపర్వమున మూలముతో సమానముగ గ్రంథము నడపిన తిక్కన ఉద్యోగపర్వమున సంక్షే

1 శ్రీమత్త్వాయుష్మత్త్వ సు, ధీమత్త్వ పద కటాక్ష దీపిత భక్త స్తోమారామ వసంతా, వ్యామోహ ప్రశమకరణ హరిహరనాథ

2 భండార్కరు, నీలకంఠ ప్రతుల ప్రకారము 2050, పి పి సేన్, నన్నయ 3 500 అనిరి తాళపత్ర ప్రతులలో కొన్నింట 3,500, కొన్నింట 2,800 అనియు కలదు

3 భండార్కరు, నీలకంఠ ప్రతుల ప్రకారము 6,698, పి పి సేన్ 7,998 నన్నయ ప్రకారము 6,998

షము చూపెను. ఈ లెక్కను బట్టి నాల్గవ వంతునకు గ్రంథమును సంక్షేపించెనని భ్రమపడరాదు. ఏమన మూల శ్లోకములను యథాక్రమముగ అనువదింపవలెననిగాని, అనుకరింప వలెననిగాని ఆయన సంకల్పింప లేదు. మూలార్థమును గైకొని కథను నడుపునపుడు రెండు మూడు శ్లోకముల అర్థము ఒక పద్యమున వ్రాయబడిన సందర్భములును, అనేక శ్లోకముల అర్థము ఒక వచనమున వ్రాయబడిన సందర్భములును పెక్కులు ఉన్నవి. సంస్కృత శ్లోకములు తెలుగు వృత్తముల కంటె చాల చిన్నవి. ఏదైన శ్లోకము తనకు నచ్చినదానినట్లే తెనిగించుటకును తిక్కన వెనుదీయలేదు. మరి కొన్ని యెడల రమణీయములైన శ్లోకములను తడవక వదలివేయుటయు కలదు. మరియు అనేక ఉపాఖ్యానములను ప్రధాన కథకు దూర బంధుత్వము కలవానిని సంప్రదాయ సంరక్షణార్థము వ్యాసుడు భారత కథలో చొప్పించి యుండెను. కాని తిక్కన సందర్భోచితములగు వానిని మాత్రమే స్వీకరించెను

విరాటపర్వము చక్కని ప్రబంధ వర్ణనలకును, కథా గమనమునకును ఆధారమై తిక్కన పేర్కొనినట్లు ఒక ప్రత్యేక ప్రబంధముగ రూపు దిద్దుకొన్నది. తిక్కన ఉద్యోగ పర్వము అతని మేధాశక్తికిని, రాజనీతిజ్ఞతకును, లౌకిక వ్యవహార నిర్వహణ కుశలతకును నిదర్శనము. ఈ పర్వము రాజకీయ సమస్యలతో జటిల విషయజాలముతో నిండి యున్నది. భారతేతివృత్తము నందలి ప్రధాన పాత్రల స్వరూప స్వభావములను మనస్తత్వమును పరిశీలించుటకు ఈ పర్వము ముఖ్యాధారము. ఇందు తిక్కన నిర్వహించిన 'రాయబారములు' తదనుకూలమగు రచనా వైవిధ్యమును, తిక్కన రాజనీతి పరిజ్ఞానమును వెల్లడిచేయుచున్నవి. ఇట్టి రాజనీతి చతురుని చేతిలో ఈ భాగము పడుట ఆంధ్రుల అదృష్టము

తిక్కన వ్యక్తపరచిన భావములను బట్టి నాటి సాహిత్య ప్రపంచ స్థితిని మనము ఊహింపవచ్చును. మత సంబంధమైనట్టియు,

భాషా సంబంధమైనట్టియు వివాదముతో నుండి దేశము బహు
నాయకమై జనశక్తి నానా ముఖముల నిష్కారణముగ విచ్ఛిన్నమై
పోవుచుండగ వివాదముల నన్నిటిని అణచివేసి ధర్మాద్వైతమును
బోధింప సమర్థమైన ఇతివృత్తము భారతము దక్క ఇంకొకటి లేదని
తిక్కనకు గోచరించి యుండును నిజము చెప్పవలయునన్న జాను తెను
గున రచనము గావించిన కీర్తి శివ కవులకుగాక నూటికి నూరుపాళ్ళు
తిక్కన సోమయాజికే దక్కవలయును ఏలయన శివ కవులు జాను
తెనుగనియు, తేటమాటలనియు పేర్కొనిరేగాని వారెవ్వరును సిస
లైన తెనుగు నుడికారముతో కావ్యము నొకటిని రచింపలేదు నిజ
ముగు తెనుగు తీయందనముతో ఒక ఉద్గ్రంథమును రచించి శివకవుల
కన్న తెనుగు నుడికారమునకెక్కువ సేవచేసిన ఘనకీర్తి తిక్కనకు
మాత్రమే దక్కవలసి యున్నది.

కేతన దశకుమార చరితమును తిక్కనసోమయాజికి అంకి
తము చేసెను. అతడు తన ఆశ్వాసాంత గద్య పద్యములందును,
అవతారిక యందును తిక్కన గుణగణములను, రూపమును, స్వభావ
మును, పాండితీ విశేషములను వర్ణించియున్నాడు. వానిని బట్టి
తిక్కన కీర్తిశాలి, విద్యాకళా పారగుడు, స్థైర్య గాంభీర్యాది గుణ
సంపన్నుడ, మహోదాత, సుందరాకారుడు, జితేంద్రియుడు,
తేజోమహితుడు, వేదవిద్యా ప్రవీణుడు, యజ్ఞాచరణ పరుడు, కృతి
కర్త, కృతిభర్త, ఉభయ కవిమిత్రుడు, నీతి విద్యా నిపుణుడు, శివ
భక్తి తత్పరుడు అని తెలియుచున్నది.

గ్రంథ రచన గావించుటకు స్వప్న వృత్తాంతమును తెను
గున మొదట ప్రవేశపెట్టినవాడు తిక్కన. తిక్కన భారత రచన
గావింప నుద్యుక్తుడుగాగ తండ్రియగు కొమ్మన స్వప్నమున కనిపించి
దీవించి అంతకు పూర్వము వ్రాసిన శ్లోకమునకు[1] భక్తవత్సలుపెగు

1 కిం మస్తి మాలాం కిము కౌస్తుభం వా పరిష్క్రియాయాం బహుమన్యసే త్వం
కిం కాలకూటః కిమువా యశోదా స్తన్యం తవస్వాదు వద ప్రభో మే

హరిహరనాథుడు దయాళుడై నాకలోకమున ఉన్న తన్ను గొనివచ్చి, నాడని తెల్పెను. అప్పుడు హరిహరనాథుడు వ్యాససంచితమును, పంచమ వేదముగ సకల జనారాధ్యమును అగు భారతమును తెనిగింపబూనుట భవ పురుషార్థ తతు పక్వ ఫలమును పొందుటయె, నీపూనికి కియ్యకొని నేను కృతిపతిత్వము వహింప వచ్చితి'ననెను. అంతట తిక్కన ఆనంద తరంగితాంతఃకరణుడై పునః పునః ప్రణామము లాచరించి తండ్రి అనుమతి గాంచి "దేవా! భవద్దివ్య కారుణ్య క్షీరాంబుధిని నా తుచ్ఛ చిత్తమున విస్తార మహితముగ నునిచితివి. ఇది యెంతయు నాశ్చర్యము. ఇంతకునీవు మదీయవాణి సత్యాంత విభూతిసంప నగు నిన్ను కొనియాడించు కొనుట యేమంత పెద్ద. నీ కరుణాతి శయమున నిట్లు పవిత్రుడనైతిని ఇంక జన్మాంతర దుఃఖములు తొల గించి నన్ను కృతార్థు గావింపుము"ని విన్నవించి సర్వాంగా లింగిత మహీతలముగ నమస్కారము గావించెను అపుడా దేవదేవుడు 'ఓయీ! జనన మరణాదులైన సంసార దురితముల కగ్గము కాకుండ తొలగు తెరువగను తెలుగు నీకిచ్చితిన'ని పలికెను తిక్కన బ్రహ్మానంద భరితుడై మేల్కాంచి కలలో గన్న దానిని మరల మరల దలంచుచు హరిహరనాథ దేవున కంకితముగ మహాభారతము రచింప బూనెను.

ఈ హరిహరనాథ తత్త్వము తిక్కన కల్పించినది గాదు. వ్యాసుని భారతమునగల అనేక తత్త్వములలో ఒకటిగ నున్నది మరియు విష్ణుని అష్టోత్తర శతనామావళిలో 'హరిహర రూపైక మూర్తయే నమః' అనుచోట పేర్కొనబడినది ఇట్లు అనేక తత్త్వము లలో ఒకటిగ అనేక నామములలో ఒకటిగ ఉన్న ఆ సర్వదేవతా ద్వైత మూర్తియైన తత్త్వమును తిక్కనసోమయాజి ధర్మాద్వైత మూర్తియైన భారతమున ఏకైక మహాతత్త్వముగ ప్రతిష్ఠించెను. తిక్కన భారత కృతిపతియైన హరిహరనాథుడు ఏదో ఒక గ్రామమున వెలసి గుడి కట్టించుకొన్న దేవుడు కాడు సృష్టి స్థితి లయములకు

కర్తయైన విశ్వేశ్వరుడు. కల్పితములైన నానారూప భేదములచే భగవంతుని పేరను, మతము పేరను దారుణకలహములలో నిరతమై అలజడి పొందుచుండిన ఆంధ్రులకు తిక్కన ప్రసాదించిన భగవత్తత్త్వము హరిహరనాథ తత్త్వము.

### కుమారవ్యాసుని భారతరచనా సముద్దేశము :

'కుమారవ్యాసను హాడిదనెందరె
కలియుగ ద్వాపర వాగువుదు
భారతకణ్ణలి కుణియువుదు మైదులి
మించిన మాలెగె తుటికాగువుదు' అని ప్రసిద్ధ కన్నడకవి 'కువెంపు' కుమారవ్యాసుని స్తుతించి యున్నారు. కుమారవ్యాసుడు కన్నడ భాషయందు జనప్రియుడైన కవి. అతని భారతమును నెరుగవని, వినని కన్నడిగుడు ఉండడనుట అతిశయోక్తి కాదు. పెక్కు నాటకములకును, యక్షగానములకును ఈ భారతము మూలగ్రంథమైనది. పలువురు నవకవుల రచనలను ప్రేరేపించినది. జనుల జీవన విధానమునకు మార్గదర్శకమైనది. కవి స్వయముగా చెప్పుకొనినట్లు ఇది రాజులకు వీరమును, బ్రాహ్మణులకు వేదార్థసారమును, విరహులకు విరహశృంగారమును, విద్వజ్జనులకు అలంకారమును అగుచున్నది. అంతియేగాక కవి తన భారతము కావ్యములకెల్ల [illegible] చెప్పుకొనెను.

కుమారవ్యాసుని ఆరాధ్యదైవము విష్ణువైనను అతడు శివుని మాహాత్మ్యమును తన గ్రంథమున వర్ణించియున్నాడు. కుమారవ్యాసుడు సమదృష్టిచేత అన్ని మతముల యందును సమభావమును, ఆదరమును కల సద్బ్రాహ్మణుడు. కావుననే తన గ్రంథమున 'విష్ణు భక్తిలోలుడై శంకరుని బద్ధద్వేషి అగువాడును, శంకరునియందు భక్తి

వైష్ణవులను ద్వేషించువారును అంబన కర్మదండాలురు ఏబది ఏడు కోట్ల నరకములను పొందుదుర'[1]ని పేర్కొని యున్నాడు

కుమారవ్యాసుడు తన భారతమునకు 'భారత కథామంజరి' అని పేరిడెను. 'తిళియ హేళువెను కృష్ణ కథెయను' అని తాను వ్రాయుచున్నది 'కృష్ణుని కథ' అని చెప్పుకొనెను 'కృష్ణమెచ్చలికె పంచమ శ్రుతియవారవెను' అని ఇది పంచమవేదమనియు తెలిపెను కవి దీనిని గదగునందలి వీరనారాయణునకు అంకితముగ రచించెను అందువలన దీనికి 'గదగుభారతము' అనియు పేరు. అంతియేగాక దీనిని 'దశపర్వ భారతము' అనికూడ పేర్కొందురు మహాభారతము నందలి పదునెనిమిది పర్వములయందును ఇతడు పదిపర్వములను మాత్రమే స్వీకరించుట ఈ పేరువచ్చుటకు కారణమైనది మిగిలిన ఎనిమిది పర్వములను శ్రీకృష్ణదేవరాయుల ఆస్థానమునందలి 'తిమ్మణ్ణ' అను కవి రచించెనను విషయము తెలిసినదే

భక్తివినయ సంపన్నుడైన కుమారవ్యాసుడు సహృదయులైన పాఠకులకు విజ్ఞాపన చేయుచు తన గ్రంథమున కొన్ని విశేషములను పేర్కొనియున్నాడు. 'పలక, బలపముపట్టి దిద్ది వ్రాయునది లేదు. ఇతరుల రీతిని అనుసరించునది లేదు. వ్రాయుట మొదలుపెట్టిన తరువాత ఆపునది లేదు భగవంతుని కృపవలన నాకు అట్టిశక్తి ఉన్నది[2]'

1 ಎಂಟು ವಿಲ್ಲದ ಕರ್ಮ ದಂಡಾ
ಲರುಗಳೈವತ್ತೇಳು ಕೋಟಿಯ
ನರಕ ದೊಳ ಗೋಲಾಡುತಿಹ ರವನೀಶ ಕೇಳೆಂದ

కు వ్యా భా, ఆ ప సం 3 ప 118

2 ಹಲಗೆ ಬಳಪವ ಹಿಡಿಯದೊಂದ
ಗ್ಗಳಿಕೆ ಪದವಿಟ್ಟಳುಪದೊಂದ
ಗ್ಗಳಿಕೆ ಪರರೊಡ್ಡ ವ ಹಿಡಿಯದ ಕೊಳ್ಳದಗ್ಗಳಿಕೆ
ಬಳಸಿ ಬರೆಯಲು ಕಂಠಪತ್ರದ
ಹುಳುಕು ಹಾಗೆಡದಗ್ಗಳಿಕೆ ಯೆಂಬ
ಬಲುಹು ಗದುಗಿನ ವೀರನಾರಾಯಣನ ಕಿಂಕರಿಗೆ

కు వ్యా భా, ఆ ప పీఠికాసంధి ప 15

తన గ్రంథమున కావ్యలక్షణములకొరకు వెదకవలదనియు పవిత్రమైన తు సితీర్థమువలె పద్మనాభుని మహిమను, శ్రేష్ఠమైన ధర్మముయొక్క విచారణమును చూడవచ్చునని తెలిపియున్నాడు 'జన్మజన్మలనుండి వెంటాడు పాపములను కడిగివేయు పవిత్రజలము తినభారతము ఈ గ్రంథమును రచించినది తానుకాదు వీరనారాయణుడే తానులిపికారుడు మాత్రమే' అని వినయముగ చెప్పుకొనగల్గినాడు. కేవలము మనోరంజనకొరకే చెప్పిన కవిత్వముగాక కుమారవ్యాసుని భారతము సన్మార్గదర్శనమును లక్ష్యముగ గలదని చెప్పవచ్చును

కుమారవ్యాసుడు పదిపర్వముల భారతమును 152 సంధులుగను, 8,500 పద్యములుగను రచించెను. పద్యములన్నియు భామినీ షట్పదియందు రచింపబడినవి కన్నడ భాషయందు షట్పది ఒక ప్రత్యేక ప్రతిపత్తికల మాత్రావృత్తము పలువురు కవులు షట్పది ఛ్ఛందమున తమ గ్రంథములను వ్రాయుటచే కన్నడయుగవిభజనమున 'షట్పదియుగము' అని ఒక యుగము ప్రత్యేకముగ ఏర్పడినది.

భామినీ షట్పది - 1, 2, 4, 5 పాదములయందు మూడు మాత్రలగణమును, నాలుగు మాత్రల గణమును జంటగ రెండు, రెండును, 3,6 పాదములయందు అదేగణములు మూడుజంటలును మీద గురువును వచ్చిన భామినీషట్పది అగును । ∪ (వ) ।∪। (జ) గణములు నిషేధింపబడినవి

కుమారవ్యాసుని షట్పది రచనము సరసమై, సరళమై, హృదయంగమమై ఉండును. ప్రాస, అనుప్రాసలతో సొగసైన లయ విన్యాసము కలిగియుండును. గొంతెత్తి పాడుకొనుటకు వీలుగ నుండును భావగాంభీర్యమును, అర్థచమత్కృతియు సొంపారుచుండును చదివినను, వినినను అమృతాస్వాదన మనిపించును. కలియుగము

నందున్న పాఠకునకు ద్వాపరయుగము కనులముందు నిలుచును. ఆ ధీరులు, వీరులు పాఠకుని ఎదుట నిలుతురు. కౌరవుల కపటము, అసూయ అధర్మప్రవర్తనము పాఠకుని హృదయమును కలచివేయును భీముని పరాక్రమము, అర్జునుని శౌర్యము మనసునుపొంగ చేయును ధర్మజుని నీతి, అహింసలు, ద్రౌపది పతిభక్తి, దైవభక్తులు పాఠకునికి ఆదర్శప్రాయములగును శ్రీకృష్ణుని ధర్మసంస్థాపన తంత్రకౌశలము ఆశ్చర్యపరచును. కావుననే వెనుక చెప్పిన విధముగ కలియుగము ద్వాపరముయినట్లు అనుభవము పాఠకునకు కలుగును ఈ అనుభవమునకు నాందిగనే కుమారవ్యాసుడు కావ్యారంభమున మంగళ పద్యమున - 'లక్ష్మీదేవికి ప్రియమైనవాడా! నిర్మలమైన పద్మమున నివసించు బ్రహ్మదేవుని తండ్రియైనవాడా! లోకములన్నిటి యందును పరమపావనుడైనవాడా సనకాది సజ్జనుల బ్రోచువాడా! రావణ సంహారకా! చెవులకు అమృతంపుజల్లువంటి మంగళకరములగు కథలకు కారణమైనవాడా! గదుగునందలి శ్రీవీరనారాయణస్వామీ! నీ భక్తునిదయతో కాపాడు[1]'అని తన గ్రంథనాయకుని కీర్తించియున్నాడు. తరువాత వరుసగ శివుని, వినాయకుని, సరస్వతిని, శ్రీరామస్వరూపుడగు వీరనారాయణుని, వేదవ్యాసుని ప్రార్థించి గ్రంథరచన కారంభించెను. భారతమును వ్రాయుటకు కారణములను వివరించుచు కుమారవ్యాసుడు ఇట్లు పేర్కొనెను 'రామాయణమును రచించిన కవుల భారముతో కూడిన ఈ భూమండలమును మోయజాలక ఆదిశేషుడు వణకుచుండెను రాముని చరితముతో అడుగుమోపుటకు ఎడములేని విధమున గ్రంథములు నిండిపోయినవి ఆకారణమున కుమారవ్యాసుడు

---

1 శ్్రీవనిత యరసనె విమలరా, జీవపీఠన పితనె జగకతి
పావననె సనకాది సజ్జననికరదాతార రావణాసురమథన శ్రవణసు
ధారసూచన కథన కారణ, కావుదానత జనవ గదుగిన వీరనారాయణ

కు. వ్యా. భా, ఆ. ప, పీఠికాసంధి, ప 1

రామాయణ రచనోద్దేశమును విరమించుకొనెను. భారతకథ కూడ కొందరు కవులచే గ్రథితమైనది కానికన్నడభాషయందు ఏమహాకవియు వ్యాసహృదయావిష్కారమునకు అప్పటివరకును పూనుకొనలేదు. అందుచే కుమారవ్యాసుడు భారతరచనకు నడుముకట్టెను.

కుమారవ్యాసుడు తనగ్రంథమునకు ఫలశ్రుతి నిట్లు తెల్పెను. 'దొంగతనము చేయువాడు చంద్రుని దూషించిన ఆ చంద్రునకు నష్టమా ? కాళ్ళులేనివాడు కాశిని దూషించిన ఆ కాశికి నష్టమా ? అటులనే క్రూరకర్ములగు వారి దూషణమున భారత మహిమకు నష్టములేదు ఈ కథను వినిన సజ్జనులకు ఘోరనరకము తప్పిపోవును, శ్రేయస్సు సిద్ధించును.'

సంస్కృత భారతమున 8,500 శ్లోకములతోనున్న విరాట పర్వము కన్నడభారతమున 646 షట్పదులలో చెప్పబడినది మూలమున 6,998 శ్లోకములతోనున్న ఉద్యోగపర్వము కుమారవ్యాసునిచే 671 షట్పదులలో చెప్పబడినది వ్యాసుని భారతమును యథాతథముగ కుమారవ్యాసుడు అనువదించియుండలేదు కథను మాత్రము గ్రహించి తనదైన స్వతంత్రరచనముగనే కొనసాగించెను. కావున కథాసందర్భమున తనకు అనుచితమని తోచినదానిని, కథాకథనమునకు అడ్డువచ్చు ఉపాఖ్యానములను నిస్సంకోచముగ వదలివేసెను తనకు ఇష్టమగునెడల మూలమునలేని సన్నివేశములనుకూడ కల్పించి తన "భారతకథామంజరి"కి సొగసులు దిద్దెను విరాటపర్వమున యుద్ధరంగమున అర్జునునకు, ఉత్తరునకు మధ్య కల్పింపబడిన సంభాషణము కుమారవ్యాసుని హాస్యప్రియతకు, జానపద రచనా విధానమునకు నిదర్శనము. అటులనే ఉత్తరాభిమన్యుల వివాహనిశ్చయానంతరము కృష్ణునకు దూతచే కబురుపంపుట, కృష్ణప్రవేశము కుమారవ్యాసుని కృష్ణభక్తికి దర్పణము

వ్యాసభారతమునందువలెనే కుమారవ్యాసుగూను ఉద్యోగ పర్వమును ఉత్తరాభిమన్యుల వివాహానంతరము రాజలందరును విరాటుని సభాభవనమున సమావేశ మగుటతోడనే ప్రారంభించెను సంస్కృత భారతమునందలి 10 ఉపపర్వములను 10 సంధులుగ రచించెను. ఉద్యోగ పర్వమునందలి ఉపాఖ్యానము లన్నియు కుమార వ్యాసునిచే విడిచిపెట్టబడినవి. నిజమునకు ఈ ఉపాఖ్యానములకును, ప్రధానకథకును సంబంధములేక పోవుటయే ఆతని ఈచర్యకు ప్రధాన కారణము. ఇక రాయబారముల విషయము పరిశీలించిన ద్రుపద పురోహితుని రాయబారము నామమాత్రముగ అర్థపద్యభాగముతోనే పూర్తియైనది. సంజయు రాయబారము అవసరార్థముగ జరిగినది. అతడు రాయబారిగనే పలుకునుగాని హితముగోరు ఆత్మసచివునివలె గాని, ధర్మతత్త్వజ్ఞునివలెగాని సంభాషింపడు కృష్ణుని రాయబారము మాత్రము విపులముగ వర్ణింపబడినది ఉలూకునిరాయబారము భీష్మ పర్వములోనికి మార్చబడినది కుమారవ్యాసుని ఉద్యోగపర్వమునకు పదునొకండవసంధి ఆయువుపట్టు. ఈ సందియందు కర్ణుని కీర్తి గగన చుంబితమైనది ఇచ్చట కుమారవ్యాసుడు వ్యాసభారతమునకే మెరుగులు దిద్దెను.

వ్యాసుడు క్రీ పూ కొన్ని వేల సంవత్సరముల నాటివాడు. బహుశః క్రీ.పూ 3101 సంవత్సర ప్రాంతమువాడు కావచ్చునందురు. తిక్కన క్రీ శ 13వ శతాబ్దమువాడు కుమారవ్యాసుడు క్రీ శ 15 వ శతాబ్దమువాడనుచున్నాము.

వేదములను విభజించి వానిసారమును భారతమహేతిహాసమున నిక్షిప్తము చేసినవాడు వ్యాసభగవానుడు. అందువలననే ఈగ్రంథము మహాభారతముగనేగాక పంచమవేదముగను గణుతికెక్కినది ఆర్ష సంస్కృతికిమూలభూతమైన భగవద్గీతకూడ ఇందే నిక్షిప్తమైయున్నది

తిక్కనసోమయాజి కాలమున వీరశైవ - వీరవైష్ణవ మతముల నిత్య సంఘర్షణములచే సమాజము ఛిన్నాభిన్నమైయున్నది. ఆ సమాజమునకు ధర్మాద్వైతమును బోధింపవలెనను దృష్టితో తిక్కన మహాభారతరచనకు చేపట్టినాడు. పదునైదుపర్వముల నొక్కచేతి మీదుగ రచించి వ్యాసహృదయమును చక్కగ ఆవిష్కరించినాడు. కుమారవ్యాసునకు పూర్వము భారతము జైనులచేతఁబడుటచే వ్యాసహృదయము వక్రీభవించి ప్రసరించినది. ఈలోపమును గుర్తించిన నారణప్ప తానే వ్యాసునిగ మారి వ్యాసనామమునే ధరించి, కృష్ణభక్త్యావేశమును తోడుగ చేసికొని ఆదినుండి పదిపర్వముల వరకు రచించినాడు. కృష్ణునిపై భక్తికలనాతన్నంత మాత్రమున ఈతడు శ్రీకృష్ణదేవరాయలవలె వీరవైష్ణవుడు మాత్రముకాదు మన పోతనవలెనే అద్వైతియైన కృష్ణభక్తుడు. ఇట్టి అద్వైత భక్తితోడనే 'భారతకథామంజరి'ని కన్నడ కస్తురిని కవితాపరిమళ భరితముగ గుబాళింపజేసినాడు.



# తృతీయాధ్యాయము - అనువాదసరణి

ద్వితీయాధ్యాయమున తిక్కన, కుమారవ్యాసుల కాల స్థలాదులును, వారి భారతరచనా సముద్దేశమును వివరింపబడినది ఈ అధ్యాయమున వారి అనువాద సరణి పరిశీలింతము.

## తిక్కన అనువాదసరణి

భారతము ఔత్తరాహప్రతికి, దాక్షిణాత్యప్రతికి ఎన్నో పాఠభేదములు కనబడుచున్నవి శ్లోకసంఖ్యలో, శ్లోకములలో, అధ్యాయములలో, ఇతివృత్తములో, పేరులలో అసంఖ్యాక పాఠములు గోచరించుచున్నవి. ఉత్తరదేశ పాఠమునకు, దక్షిణదేశ పాఠమునకు భేదసాదృశ్యములు పరికించినచో సామ్యములకంటె భేదములే అధిక మని విమర్శకాభిప్రాయము. భండార్కరు సంస్థవారుగాని, శ్రీవావిళ్ళ వారుగాని ప్రచురించిన సంస్కృత భారతములు తెనుగు భారతమునకు ఆధారమైన ప్రతిని నిర్ణయించుటకు పూర్తిగ సరిపడకున్నవి. అగుచో కవిత్రయమువారు ఏప్రతిననుసరించిరి? తిక్కన ఏప్రతిననుసరించెను? ఇది చిక్కువీడని సమస్య. ఈసమస్య విడువరకును తిక్కన అనువాద విధానమునుగూర్చి సరియగు విమర్శలు వెలువడుట కష్టము కవిత్రయమువారు మువ్వురును ఒకేపాఠముననుసరించి ఉండరనుటలో విప్రతిపత్తి లేదు. ముగ్గురుకవులును భిన్నకాలముల, భిన్నప్రాంతముల వారగుటచే వారికి లభించిన ప్రతులు వేఱైయుండును

వ్యాసభారతమును కవిత్రయమువారు యథామాతృకముగ అనువదింపలేదనుట స్పష్టము వ్యాసభారతము ఒకమేలిమి బంగారు ముద్ద దానిని వారు చక్కని ఆభరణములుగ మలచిరి అందు తిక్కన సోమయాజి సృష్టినిగూర్చి ఎఱ్ఱాప్రెగ్గడ పేర్కొనిన పద్యము ఎంతయు సుందరము-

తనకావించినసృష్టి తక్కరుల చేతంగాదునా నేముఖం
బునఁదాఁబల్కిన పల్కులాగమములై పొల్పొందునా వాణిన
ర్తినసీతండాకరుండనా జను మహాత్మ్యాప్తిన్ గవిబ్రహ్మనా
వినుతింతుం గవితిక్కయజ్వ నఖిలోర్వీదేవతాభ్యర్చితున్[1]

వ్యాసభారతమున 3,500 శ్లోకములుగఉన్న విరాటపర్వము అనువాదమున 1,628 గద్యపద్యములుకాగా, 6,998 శ్లోకములుగనున్న ఉద్యోగపర్వభాగము అనువాదమున 1,562 గద్యపద్యములుగ సంగ్రహింపబడెను దీనినిబట్టి తిక్కన విరాటపర్వములోకంటె ఉద్యోగపర్వములో అధిక సంయమనము పాటించినట్లు తెల్లము.

ఏ అనువాదము నందైనను ఆరు విధములైన అనువాద విధానములను గుర్తింపవచ్చును

1 మూలమునందు సంగ్రహముగఉన్న వర్ణనాదులను విపులముగ రచించుట - విపులీకరణము

2 విస్తృతములైన వీరప్రసంగములను సందర్భాను సారముగ విసువు జనించకుండునట్లు సంక్షిప్తపరుచుట - సంగ్రహీకరణము

3 రసహీనములు, కథాసంవిధాన ప్రతిబంధకములు, ననుచితములు నగు భాగములను పరిహరించుట - పరిహరణము

4 దేశకాలానుగుణములగు అభిరుచులకు అనుగుణముగ కథాంశములను మార్చుట - పరివర్తనము (అన్యథాకల్పనము)

5 సరసములైన, సందర్భానుగుణములైన నూతన స్వతంత్ర కల్పనలుచేయుట - నూతనకల్పనము.

6 పైసంస్కారములుకుతోడు బింబ, ప్రతిబింబ తుల్యములైన యథామాత్రానువాదములు కూడ కొన్నిపట్టుల చేయబడుట - యథాతథానువాదము.

1 హరివంశము, ప్ర ఆ, పద్యము 9

8

ఈ అనువాద విధానములను ఆధారముగ చేసికొని తిక్కన అనువాదసరణిని పరిశీలింప నారంభింతము మొత్తము సంస్కృతభారతమున తెలుగుభారతము మూడవ వంతుగనుండ విరాటపర్వభాగము మాత్రము మూలముతో సమాన విస్తృతి కలదయ్యెను.

ద్రౌపది సైరంధ్రీవేషమున సుదేష్ణను కొలువవచ్చుట మూలమున 37 శ్లోకములు[1]గ చెప్పబడినది దీనిని తిక్కన చక్కని వర్ణనలతోను, పాత్రల స్వభావ కల్పనలతోను పెంచి 44 పద్యగద్యము[2]లలో విస్తరించెను స్త్రీలపాత్రలను చిత్రించుటలో తిక్కనకుగల మక్కువయే దీనికికారణము. విరాటసభలో పాండవుల ప్రవేశమున కూడ వారి రూపలక్షణములు, ప్రత్యేక స్వభావరీతులు, కార్యశక్తులు మొదలగు వానిని తిక్కన తెలియపరిచి మూలమున కంటె ఆయాపాత్రలకు సజీవత్వమును కల్పించి విస్తరించెను

కీచకవధఘట్టము విరాటపర్వమునకు తలమానికము వంటిది ఈఘట్టమును తిక్కన శృంగార, వీరరస వర్ణనలతోను, సంవిధాన కల్పనలతోను, ప్రకృతి వర్ణన తోను 345 పద్యగద్యములుగ విస్తరించెను ఇది మూలమున 265 శ్లోకములలో ఇమిడియున్నది. తిక్కనకు నాటకీయానుసరణముపైగల ప్రేముడి ఈవిస్తృతికి కొంత కారణముగ పేర్కొనవచ్చును

ఉత్తరాభిమన్యుల వివాహము మూలమున రెండు అనుష్టుప్పులలో చెప్పబడినది దీనిని తిక్కన విస్తరించి 20 పద్యములలో చెప్పినాడు ఇందు వధూవరుల అన్యోన్యావలోకనము, తలంబ్రాలు, పాణిగ్రహణము, హోమము, వారనారీమణుల నృత్యగీతాదులు, కుమారుల చతురపరిహాస విలాసములు మొదలగు దేశీయ పద్ధతులు చోటుచేసికొనినవి

---

1 వ్యాసభారతము, వి ప అధ్యా 9 శ్లో 1–37

2 తిక్కన భారతము, వి ప, ప్ర ఆ, పద్యములు 289-332

ఉద్యోగపర్వమున మూలమునందు ఒక అధ్యాయమునకు మించియున్న ద్రుపదుని యుద్ధసన్నాహమునంతను 'ద్రుపదవిభుండు నాయతమయ్యె' అని ప్రారంభించి మూడుపద్యములతోడను, 'పురోధ వృత్తసంపన్నః కౌరవాన్ ప్రతిజగ్మివాన్' అని ఇంచుమించు ఒక అధ్యాయమున చెప్పబడిన పురోహితవృత్తాంతము ఏడు,ఎనిమిది పద్యములలోను చెప్పి ముగింపబడినది. శల్యుడు ధర్మరాజుతో ముచ్చటించు సందర్భమును ఎనిమిదియవ అధ్యాయమునుండి పదు నేడవ అధ్యాయమువరకు పది అధ్యాయములలో 350 శ్లోకములకు విస్తృతమైన అంశము 90 పద్యములలో ముగింపబడినది ఈపద్యము లలో 'అపుడు' 'అయ్యవసరమున' ఇత్యాదిగ పది సంది వచనములు నక్షత్రములవలె వెలుగొందుట గమనింపదగియున్నది.

సంజయుని రాయబారము మూలమున తొమ్మిది అధ్యాయ ములు, 250 శ్లోకములు అనువాదమున 114 పద్యములు. మూల, అనువాదములు రెండును సమముగ నడచినట్లున్నవి. విదురోపదేశము 600 శ్లోకములు దీనిని తిక్కన 90 పద్యములలో ముగించి సనత్సు జాతీయమును అసలు తాకకనే ఒక చిన్నవచనముతో ముగించుటలో తిక్కన రచనాదృష్టి పరిశీలనార్హము

కృష్ణుడు కౌరవసభకు ఏగునపుడు ధర్మజాదులు చెప్పిన మాటలు మూలమున కొంచెము తక్కువగ 300 శ్లోకములు అనువాద మున తొమ్మిది పద్యములు మాత్రము. ద్రౌపది శ్రీకృష్ణునితో చెప్పుటయు అతడు ఆమెను ఊరడించుటయు మూలమున 50 శ్లోక ములు, అనువాదమున 25 పద్యములు అన్నియును అమూల్యములు, అనన్యకల్పనా విలసితములు. కుంతీదేవిని కృష్ణుడు పరామర్శించు ఘట్టము మూలమునందు 107 శ్లోకములు, అనువాదమున 27 పద్య ములు. భోజనానంతరము విదురుడు చెప్పిన మాటలు మూలమున

30 శ్లోకములు అనువాదమున 2పద్యములు+1 వచనము. కృష్ణుడు కౌరవసభయందు పల్కినపల్కులు మూలమునందును, అనువాదము నందును సమానముగనే ఉన్నవని చెప్పవలసియున్నది దంభోద్భవ చరిత్ర మూలమున 50 శ్లోకములు, అనువాదమున ఒకసీసము జామదగ్న్య, కణ్వ, నారద, గాలవాదుల ఉపదేశములు మూలమున 700 శ్లోకములు, అనువాదమున 47 పద్యములు భీష్మద్రోణుల మాటలు మూలమున దాదాపు 20 శ్లోకములు, గాంధారి హితోక్తులు 45 శ్లోకములు, అనువాదమున ఇది అంతయు ఒకచిన్న వచనము మాత్రము

కృష్ణుడు కుంతియొద్ద సెలవుగైకొను సమయమున ఆమె చెప్పిన గ్రంథము విస్తారముగ నున్నను అనువాదమున దానికంతటికిని 'విక్రమోపజీవులయిన ముచికుందుండును, కంబయుండును నారికథలు పేర్కొని చేతుల లావునం గలిగిన జీవనంబునం బ్రదుకుండను'ని చెప్పిముగించెరు. మూలమున పైకథలు వివరింపబడినవి భీష్మద్రోణులు చెప్పినమాటలు 40 శ్లోకములు, అనువాదమున ముచ్చటగ మూడు పద్యములు మాత్రమే చెప్పబడినవి కృష్ణార్జునుల సమావేశము మూలమున 160 శ్లోకములలోనున్నవి. అనువాదమున 26 పద్యములు శ్రీకృష్ణుడు కౌరవసభలోని విశేషములను ధర్మరాజులకు చెప్పుట మూలమున 138 శ్లోకములు అనువాదమున 26 పద్యములు

ఉలూకోపాఖ్యానము మూలమున దాదాపు 300 శ్లోకములు, అనువాదమున 25 పద్యములు అంబోపాఖ్యానము మూలమున దాదాపు 700 శ్లోకములు, అనువాదమున 130 పద్యములు. ఇట్లు తిక్కన విరాటపర్వమును అనువదించుటలోకన్న ఉద్యోగపర్వమును అనువదించుటలో సంయమము చూపినను విస్తృతములగు ఉపాఖ్యానములను అనువదించుటలో మరికొంత బిగపట్టినచో ఇంకను తగ్గింపగలిగి యుండును

## విపులీకరణము

మూలమున పాండవులు శస్త్రాస్త్రములనుంచిన శమీవృక్ష వర్ణనము 'భీమశాఖాదురారోహా[1]' అని సామాన్యముగ నున్నది. కాని తిక్కన సన్నివేశ ప్రాధాన్యమును గుర్తించి చక్కని సీసపద్యమును కల్పించెను

సీ. నెగసిన కొనలేచి నింగి యంతంతకు
నవుల ప్రోవగ దనరారు దాని
జాగిన శాఖ లాశావక్రముల కొలం
దులు బారపెట్టంగ బొలుచుదాని
గవట లొండొంటితో గడియుచు నెఱములు
ప్రింగి ప్రబ్బగ బొంపు మిగులు దాని
లోని జొంపము పవలును వెనుచీకటి
నొదవించి పొదలంగ నొప్పుదాని
గనియె పవమాన వివిధ వర్తన కళాను
వర్తి గాక ఘూకారవ స్ఫూర్తి జాత
భీతి పరిసరవర్తి నాభీల భుజగ
చండమూర్తి శమీతరు చక్రవర్తి[2]
పక్షివ్యాకులముం బ్రేత నిలయోపాంతోత్థమున్ డాకినీ
రక్షోదంత పిశాచ గోచరము దుర్గంధంబునై చూడ జి
త్తక్షోభం బొనరించు[3] అనుపద్యము గూడ సందర్భోచితమైన బంధసౌందర్యము కలది

అర్ధరాత్రమున కీచకుని ప్రాణవాయువు అనంతవాయువులలో లీనమగు పుణ్యకార్యమునకు రంగస్థలమగు నర్తనశాలను గూర్చి మూలమున-

1 వ్యాస భా, వి ప, అధ్యాయ5 శ్లోకము 18
2 తి భా, వి ప, ప్ర ఆ, ప 162
3 ,, ,, 164

సంకేత మగమత్తూర్ణం శూన్యాగారమపావృతమ్
తదేవ నర్తనాగారం పాంచాలీయద భాషత॥ [1]

అని ఏదో క్లుప్తముగ తెల్పబడిన నర్తనాగార ప్రవేశమును ఆరు పద్యములలో తిక్కన దానినొక వర్ణనగ రూపుదిద్దెను

'వివేకరహితు హృదయంబునుంబోలెఁ దమోదూషితంబును విదగ్ధ వనితా ప్రేమంబునుంబోలె దుర్నిరూపంబును[2]'

ఎత్తుగడలోనే వర్ణనారూపముగు జవనాశ్వమును కళ్ళెము వదలి కదను త్రొక్కించుట కారంభించెను ఇందు వివేక రహితు డెవ్వడు ? విదగ్ధవనిత ఎవ్వరు ? వారు కీచకుడును ద్రౌపదియును కారందుమా ?

ఇంకను ఆనర్తనశాల -

శా 'ధ్వాంతాకారిత మధ్య కుట్టిమ ఘనస్తంభావళీరూపముం
భ్రాంతాది ప్రవిభాగ బోధరహిత ప్రాగ్ద్వారముం గాతర
స్వాంత త్రాసకరంబునై దురధివేశంబై'[3] ఉన్నదట ఆ గోడలు ఇటుక, సున్నము ఇత్యాదులతో గాక చీకటితో చేసి నట్లున్న వట అట్టి ఆ నర్తనశాల లోనికి భీముడు-

' తన యఖండిత బాహాబలగర్వము యచ్చుట ముంగలిగా'[4] నతికేలు పట్టుకొని ప్రవేశించినాడు.

'స్వాంతము బాహుగర్వఘన సంతమసాంధముగాగ శంక కొంకింతయులేక అహంకృతి ముంగలిగాగ[5]' కీచకుడు ప్రవే

1 వ్యా భా, అధ్యా 20, శ్లో 56
2 తి భా, వి ప ద్వి ఆ, ప 325
3 ,, , ప 327
4 ,, ,, ప 326
5 ,, ,, ప 331

శించి రాదు. ఈ వైవిధ్యము భీమకీచకుల స్వభావస్థితికే కాక ఆ నర్తన శాలయొక్క అంధకార బంధురస్థితికిని నిరూపకము.

ఉపకీచక సంహారానంతరము బంధవిముక్తయై పరేత భూమి నుండి తిరిగివచ్చు ద్రౌపది మూలమున -

త్రాసితేవ మృగీ బాలా శార్దూలేన మనస్వినీ
సాతు గాత్రాణి వాసశ్చ ప్రక్షాల్య ప్రవివేశ హా॥
తాం దృష్ట్వా పురుషా రాజన్ ప్రాద్రవన్త దిశో దశ
గంధర్వాణాం భయత్రస్తాః కేచిద్దృష్టిం న్యమీలయన్[1]॥

దీనికి తిక్కన సోమయాజి విపులీకరణము ఇట్లు ఆరంభమైనది. తిరిగి వచ్చు పాంచాలి "రాగాది వికార నిరాసంబునం బ్రసన్నమయిన బుద్ధియుంబోలె[2]" ఉన్నదట. మధ్యమధ్య తాత్త్విక విషయములను సందర్భానుసారముగ చొప్పించుట తిక్కనకు అలవాటు. అతని తాత్త్వికదృష్టికి తార్కాణములగు ఇట్టి సన్నివేశముల నన్నిటిని సమగ్రముగ సమీక్షించిన, అటులనే ఆశ్వాసాంత పద్యముల అంతరార్థమును పరిశోధించిన అది ఒక ప్రత్యేక పరిశోధనాగ్రంథముగుటయే గాక భారతరచనతో బ్రహ్మానంద స్థితిని గోరిన తిక్కన ఆంతర్యము స్పష్టము కాగలదు. అనువాదమున ద్రౌపదిని చూచి పౌరులు పరిపరి విధముల భావించుట తిక్కన విపులీకరణవిధానమునకు మచ్చుమక్క-

సీ. 'మనకీచకుల కెల్ల మారియై పుట్టిన
  సుదతి వో యెదునని చూచువారు
నద్దిరా! నీకు గ్రొవ్వణగదే జూతుగా
  కని తలసూపక యడగువారు
సలవోక గనుగొని యంతరంగము బిట్టు
  బెదర మాఱుమొగంబు పెట్టువారు

---

1 వ్యా భా, అధ్యా 24 శ్లో 12, 18

2 తి భా విప తృ ఆ, ప 86

నెదురుగావచ్చిన నెంతయేనియు దప్పి
కలుగ వేఁకత్రోవఁ దొలగువారు

తే. ముట్టబడి మేన గంపంబు పుట్ట నొదిగి
యుండువారు గరంబున నుదర మప్ప
ళించి యమ్మరొ రక్కెస యంచు నుల్ల
ములుకు వారునై పురజనంబులు దలంకి [1]

తొలగిపోయిరట పౌరులననేల 'విరాట రాజునకే ఒడలు కంపరమెత్తి నది [2] ఆ భయముయొక్క పలురంగులను పలుభంగుల తిక్కన చక్కగ విపులీకరించెను. 'పులిగనుగొన్న లేడులునుబోలె విభీతిగలంగ బాలన న్నెలతుక యంతరంగమున నిండిన హాస్యరసంబు మోముపై వెలి విరియంగనీక [3] వెడలినదట ఇట ద్రౌపది పాత్రమే పాఠకులకు ప్రతి నిధియై వారిలో కల్గిన భావములను ప్రదర్శించినది.

రాయబార సమయమున శ్రీకృష్ణుడు పాండవుల అభిప్రాయములను తెలిసికొన గోరినపుడు సహదేవుని అభిప్రాయము మూలమున "కథం ను దృష్ట్వా పాంచాలీం తథా క్లిష్టాం సభాగతాం
అవధేన ప్రశామ్యేత మనుమన్యు స్సుయోధనే"[4]
అని యున్నది దీనికి అనువాదమున

ఉ రక్కెస మాటలాడెదరు రాజును దమ్ములు వానిలో న నీ
వొక్కటియైన గాదనక యూఁకొనుచుండుట యంతకంటె మే
లక్కట యిట్లు వేడికొన నైనను బోయెదుపో సుయోధనుం
డెక్కడ భూమిలోన సగమిచ్చుట యెక్కడ దానవాంతకా [5]

1 తి భా, వి ప, తృ అ ప 36
2 ,, ప 29 to 32
3 ,, ప 37
4 వ్యా భా, ఉ ప, అధ్యా 79, శ్లో 8
5 తి భా, ఉ ప, తృ అ, ప 64

మ. తలపం గూడునె యింత సేసి ధరణీదైన్యంబు చుట్టంబులుం
జెలులుం దిట్టరె లాతి రాజులకు మెచ్చే యివ్విధం బిట్టిదిం
గలదే వేఁడఁగ ధర్మజుం డడుగఁ బోఁగాఁ గృష్ణ డాధార్తరా
ష్ట్రులు పాలిక చలంబునం బెనఁగ నిట్లుం గూడు దీవయ్యెనే[1]

ఉ. వీరలు ధర్మమార్గము సవిస్తరతం దగ నాడి రేనియు
న్వారలు దాని కియ్యకొనిరేని విను మచ్యుత యట్టి సంధి పెం
పారఁగ నేర్చునే యుచితమైనది కయ్యము వంకమాట లే
నేర గురుప్రవీరసభ నిశ్చయమిట్టిదికాఁగ జెప్పుమీ.[2]

మ. తుదిరాజ్యమ్ము సగమ్ము గొమ్ము తవియందుం బెరువంచించియుం
బదుమూఁడేఁడులు నీవనుం దిరిగిరా పాలిక పోవచ్చునే
యదిగాదే వెగి బంటవై యలుము మాయల్ వన్నునేర్పింక జె
ల్లదు సూ నీకని యాసుయోధనుని యుల్లంబుచ్చి పోనాడుమీ'[3]

అను నాల్గుపద్యములు చెప్పెను. ఇవి తిక్కన ప్రతిభాస్థాపితములు.
ఇట్లే ద్రౌపది మూలమున-

'పునరుక్తంచ వక్ష్యామి విస్రమ్భేణ జనార్దన
కాను సీమంతినీ మాదృక్ పృథివ్యామస్తి కేశవ'[4]

అను మాటలను అనువాదమున-

ఉ. 'ఆఱడి బోశయున్ ఫలము నందుటయుం గని పల్కనేరమిన్
మాఱట నోరిదానవయి మాటలు చిత్తమునందు నిల్పకే
గాఱులు ప్రేలెదన్ వినుడు కర్జము నెగ్గను గాన నల్కమై
వీతశిఖయైన మానిసికి వెండి వివేకము గల్గ నేర్చునే' [5]

అనియు-

---

1 2 తి భా, ఉ ప తృ ఆ, ప 95, 96
3 తి భా, వి ప, తృ ఆ, ప 97
4 వ్యా భా, అధ్యా 80, శ్లో 20
5 తి భా, ఉ ప, తృ ఆ, ప 107

"సాహం కేశగ్రహం ప్రాప్తా పరిక్లిష్టా సభాం గతా
పశ్యతాం పాండుపుత్రాణాం త్వయి జీవతి కేశవ"[1]

అను శ్లోకమును-

ఉ. 'నీవు సుభద్రకంటె గడు నెయ్యము గౌరవముం దలిర్ప సం
భావన సేయు దిట్టి నను బంకజనాభ! యొకండు రాజసూ
యావభృథంబునందు శుచియై పెనుపొందిన వేణిపట్టి యీ
యేవురు జూడగా సభకునీడ్చె కులాంగన నిట్లొనర్తురే'[2]

అని చక్కగ రసవంతముగ వివరించుట తిక్కనకే చెల్లును. అటులనే-

'సతామవస్థాం సంప్రాప్య కృష్ణాం ప్రేక్ష్య సభాంగతాం
క్షత్రధర్మాదపేయాత్మా నాకంపత యుధిష్ఠిరః'[3]

అనుదానిని తీసికొని-

గీ. జూదమునోర్చి సం
పదగొని యంతబోవక సభన్ ద్రుపదాత్మజ భంగపెట్టరే[4]

ఉ. దానికి నీ వోపెంబకితి ధర్మజ శాంతియు జూచి సత్యముం
బూని వృకోదరార్జునులు పొంగులుగా బెడచేత గన్న నీ
కానగ నొత్తుకొంచు జని యుగ్రవనంబున దుఃఖమగ్నులై
దీనతనుండి పూన్కి దగదీర్చియు గాండి మనంగ గోరెడిన్[5]

క. తను దాన పోలుగా కేమనవచ్చు నజాతశత్రు నతిశాంతితయున్
వినయము గౌరవము నే జనపతులకు గలవు సెపుమ సౌజన్యనిధీ[6]

అని ధర్మజు శాంతి శీలములను ప్రశంసించుచు పెంచెను

---

1 వ్యా భా ఉ ప అధ్యా 80 శ్లో 24
2 తి భా ఉ ప తృ ఆ ప 110
3 వా భా, ఉ ప అధ్యా 93, శ్లో 58
4 5 తి భా, ఉ ప, తృ ఆ ప 280, 231
6 ,, ,, ప 283

సంగ్రహీకరణము

అజ్ఞాతవాసారంభమున ధర్మజుడు అర్జునుని గూర్చి చేసిన ప్రశంస మూలమున ఇరువది[1] శ్లోకములలోనున్నది కాని అనువాదమున తిక్కన-

ఉ. 'ఖాండవ మేర్చి దేవతలుగానని యీశ్వరుగాంచె దోర్బలో
ద్దండత మహాసుర ప్రతతి దర్పమడంచి ప్రియంబొనర్చి యా
ఖండలుడున్న గద్దియ సగంబుననుండె మహానుభావుడీ
తండొక మర్త్యుడే? యనుచు ధాత్రి తలంచుగదా యిత డాహవంబులోన్'[2]

అని ఒకే ఒక్క పద్యములో పూర్తిగావించెను ఆఖండల సూనుని అమర్త్యోచిత కార్యములను ఒక్కపద్యములో చెప్పినను మూలభావ మంతయు నిమిడినది

ఊర్వశీ శాప వృత్తాంతము మూలమున ఏక[3]శ్లోకములలో చెప్పబడినది. అదియే అనువాదమున సంగ్రహింపబడి 'పూర్వశాప విహితంబగు రూపముదాల్చి'[4] అని ఆ కథను తిక్కన తెమల్చి వైచెను అవతల కొంపలంటుకొనిన సమయము ఈ కావ్యకళాదృష్టి తోడనే భారత రణప్రాంగణమున భగవద్గీత రంగవల్లికలు దిద్దుచు కూర్చుండుటకే తిక్కన అంచులు సవరించి విడిచివైచెను. సంస్కృతమున వ్యాసుడు చెప్పుట తప్పనిసరి. కారణము అది శాస్త్రేతిహాసము. ఆంధ్రమున తిక్కన విడుచుట తప్పుకాదు. కారణము ఇది కావ్యేతిహాసము.

అర్జునుని యుద్ధసంరంభమును చూడగోరి ఆకాశమార్గము నలంకరించిన ఇంద్రాదిదేవతల సంబరము మూలమున ఒక అధ్యా

1 వ్యాభా, వి ప, అధ్యా 8, శ్లో 30-40
2 తి భా, వి ప, ప్ర ఆ, ప 85
3 వ్యా భా, వి ప, అధ్యా 88, శ్లో 20-28
4 తి భా, వి ప, చ ఆ, ప 160

యము పూర్తిగ నున్నది. తిక్కన దానిని సంగ్రహీకరించి మూడు పద్యములలో ముగించెను. తిక్కన దృక్పథము ప్రతిబింబించిన అర్జు నుని సరంభము-

సీ. 'దేవదత్తాభీల రావంబు పెస గర్జ
ములు దీటుకొన తేటమొగము వడుచు
రథనేమి దళిత ధరాధూళి యంగంబు
లెల్ల గప్పగ వెలువెల్లనగుచు
బహుళ కపిధ్వజ ప్రభలు లోచనములు
మిఱుమిట్లుగొన బర్వ మెండు గొనుచు
నుద్భటాకార సముద్ధతి మనములు
త్తలపడ దోపంగ దల్లడిలుచు

తే. నడచు కౌరవరాజ సైన్యంబు గదిసె
దీగ దిగిచినగతి దన తేరు మెఱయ
రయముమై జని ప్రళయ భైరవ సహస్ర
గర్జనోదగ్ర తర్జను డర్జునుండు'[1]

ప్రత్యేక మాదృశ్యమును చూచుటకు ఆర్వురు చక్రవర్తులు, పదు నారుగురు రాజులు, ముక్కోటి దేవతలు విచ్చేసిరని ఇరువదిరెండు శ్లోకములలో విస్తరింపబడిన ఆ సన్నివేశము ఒక తేటగీతిలో క్లుప్త ముగ చెప్పబడినది

'దదృశుస్తే ధ్వజాగ్రంవై శుశ్రువుశ్చ మహాస్వనమ్
దోధూయమానస్య భృశం గాండీవస్య చ నిస్స్వనమ్'[2]

తిక్కన ఆ దృశ్య ప్రాధాన్యమును గుర్తించి ఒకసీస మాలికను కూర్చెను ఇట దృశ్యమునకే ప్రాధాన్యము గాండీవజ్యారవమునకు

1 తి భా, వి ప, ద ఆ, ప 248

2 వా స భా, వి ప అధ్యా 47 శ్లోకము 8

ప్రాతిపదికగ దేవదత్తాభీల రావముతో పద్యము నెత్తుకొని అర్జున రథ సమాగమమును క్రమముగ నావిష్కరించి, అందులకు కౌరవసైన్య ప్రతిస్పందనము చెప్పి, చివర గీతమున నారి సారించినట్లు అర్జునునకొక్క విశేషణము వేసినాడు.

ఈ సందర్భము మూలమున సంగ్రహింపబడినది. ఎక్కడ మూలమును కుంచింపవలయునో, ఎక్కడ ప్రపంచింపవలయునో, ఎక్కడ కథపట్టు రక్తికట్టునో, ఎక్కడ రసగ్రంథి విస్ఫారితమగునో తిక్కన మహాకవికి కరతలామలకము.

అభిమన్యుని వివాహానంతరమున సభాసీనులైన రాజులను మూలమున-

"సభాతు సా మత్స్యపతే స్సమృద్ధా మణిప్రవేకోత్తమ రత్నచిత్రా
స్వస్తాసనా మాల్యవతీ సుగంధా తామభ్యయుస్తే నరరాజవృద్ధాః।
అథాసనా న్యావిశతాం పురస్తా దుభౌ విరాట ద్రుపదౌ నరేంద్రౌ
వృద్ధాశ్చ మాన్యాః పృథివీపతీనాం పితామహం రామ జనార్దనౌచ।
పాంచాల రాజస్య సమీపతస్తు శినిప్రవీరస్సహ రౌహిణేయః
మత్స్యస్య రాజ్ఞస్తు సుసన్నికృష్టౌ జనార్దనశ్చైవ యుధిష్ఠిరశ్చ।
సుతాశ్చ సర్వే ద్రుపదస్య రాజ్ఞో భీమార్జునౌ మాద్రవతీసుతౌ చ
ప్రద్యుమ్న సాంబౌచ యుధిప్రవీరౌ విరాటపుత్రాశ్చ సహాభిమన్యుః।
సర్వేచ శూరాః పితృభి స్సమానా వీర్యేణ రూపేణ తథాబలేన
ఉపావిశన్ ద్రౌపదేయాః కుమారాః సువర్ణ చిత్రేషు వరాసనేషు
తత్రోపవిష్టేషు మహారథేషు విభ్రాజమానాభరణాంబరేషు
రరాజసా రాజవతీ సమృద్ధా గ్రహైరివ ద్యౌ ర్విమలై రుపేతా।"[1]

అనిఆరుశ్లోకములలో ఉన్న దానిని 'ధర్మతనయుండు, తమ్ములుం గొడుకులుం బరివేష్టించియుండ విశాలరమణీయంబగు విరాటు కొలువు కూటంబున కరిగి'[2] అని ఒక వచనమున సంగ్రహించెను

1 వా భా ఉ ప, అధ్యా 1, శ్లో 2 7
2 తి భా, ఉ ప, ప్ర ఆ, ప 4

అట్లే బలరాముని మాటలను సాత్యకి తిరస్కరించు ఘట్టమున-

యథాచ దృఢ ధన్వానౌ యమౌ కాలోపమ ద్యుతీ
కో జిజీవిషు రాసీదే ద్ధృష్టద్యుమ్నంచ పార్షతః।
పంచమాన్పాండవేయాంస్తు ద్రౌపద్యాః కీర్తివర్ధనాన్
సమప్రమాణాన్పాండూనాం సమవీర్యాన్ మదోత్కటాన్।
సౌభద్రంచ మహేష్వాస మమరై రపి దుస్సహం
గద ప్రద్యుమ్న సాంబాంశ్చ కాల వజ్రాన లోపమాన్।[1]

అనిమూఁడు శ్లోకములలోనుండ 'కవలవారు గొడుకు గమియు బాంచాల వర్గంబు వృష్ణివరులు గడగిరేని'[2]అని నామనిర్దేశమును సాంకేతికముగ చేసి విడిచెను.

విదురోపదేశమున మూలమున

'విద్యామదో ధనమద స్తృతీయోఽభిజనో మదః
మద ఏతేఽవలిప్తానాం ఏత ఏవ సతాం దమాః।'[3]

అని ఉన్న దానిని 'ధనమును విద్యయు వంశం
బును దుర్మదులకు మదంబు నొనరించు'[4]

ఇత్యాదిగ తెనిగించి 'మదఏతేఽవలిప్తానామేతఏవ సతాం దమాః' అను దానిలోని 'మదాః, దమాః' అనువ్యావృత్తి నందుకొనక ఉత్తరార్థమును తేల్చిపలికెను.

విశ్వరూప ప్రదర్శనమునకు ముందు కృష్ణుని మాటలు మూలమున ఆఱు శ్లోకములలో చెప్పబడగ అనువాదమున

1 వ్యా భా, ఉ ప, అధ్యా, శ్లో, 31 32,33
2 తి భా, ఉ ప, ప్ర ఆ ప 29
3 వ్యా భా, ఉ ప, అధ్యా34, శ్లో 42
4 తి భా, ఉ ప, తృ ఆ, ప 35

'ఏనొక్కరుండనయుని తలంచియె దుర్మదంబునం బొదివిపట్టు నుత్సాహంబు సేసితని'[1] ఒకవాక్యములో సంగ్రహించెను

**పరిహరణము**

సంస్కృత భారతమున ఉత్తరదేశపు ప్రతులలో ఆరవ అధ్యాయమంతయు ధర్మజకృత దుర్గాస్తవము కలదు. అది దాక్షిణాత్య ప్రతులలో లేదు. కావున ఇది వ్యాసకృతము కాదనియు, తరువాతి కాలమున చేరి ప్రక్షిప్తమై యుండునని కొందరు తలంచుచున్నారు తిక్కన ఈ అధ్యాయమును అనువదింప లేదు తిక్కన దాక్షిణాత్య ప్రతినే అనుసరించెననుట కిదియొక నిదర్శనము

మూలమున కీచకుడు తన అధికారమును, బలమును, దర్పమును, సంపత్సౌభాగ్యములను ప్రదర్శించి ప్రలోభ పెట్టుటకు ప్రయత్నించెను తిక్కన దీని ననువదింపలేదు. మూలమున కీచకుడు ద్రౌపదికొరకు తన భార్యను విడచిపుత్తు ననెను. దాసోఽహమనెను ఆమె కొరకు కులము, ధనము, యశము అన్నిటిని వదలుకొందు ననెను తెలుగున ఈ గొడవేమియును లేదు. 'విరాటరాజును తన అదుపాజ్ఞలలో నుంచుకొనగల సేనాధిపతి అగు ఆతడు ఒకానొక సైరంధ్రి కొరకు అంత దిగజారిపోవలసిన అవసరములేదు' అని తిక్కన భావన కావొచ్చును. ఆమె మనకు ద్రౌపదిగాని నాని చూపున వట్టి సైరంధ్రియే కదా!

కీచకుడు మూలమున ద్రౌపది తనకు లభింపనిచో 'అథవాఽపి జీవితం త్యజామి'[2] అనినాడు. చివరకు అనినంతపని చేసినాడు మూర్ఖుడు ఈ మాటనైన తిక్కన అనువదించి యుండవలసినది అటులనే మూలమున కీచకుడు ద్రౌపది సంగమమును కోరి శివుని శరణు వేడుకొనినాడు పాపము కీచకుని బేలతనమున కిదియొక నిదర్శనము-

---

1 తి భా ఉ ప, తృ ఆ, ప 405

2 వ్యాభా, విప, అధ్యా 14, శ్లో 14

"దేవం ప్రపద్యే శరణం వృషధ్వజం
త్రిలోచనం దక్షమఖ ప్రణాశనమ్
హరం భవం స్థాణు ముమాపతిం విభుం
త్వయాఽద్యమే సుభ్రు దదాతు సంగమమ్"[1]

ఈ చమత్కారమునైనను తిక్కన వినియోగించుకొనలేదు. కందర్ప దర్పమే కాక కంఠదర్పము గుండెదర్పము కూడ కలవాడు కీచకుడు. కావున వానివి మిక్కిలి అమాయకుని చేయకుండ దర్పోద్ధతుని సహజ లక్షణము నిక్షేపించి చివరి వరకు ఆనీచుని పాత్రను తిక్కన తన చెప్పు చేతలలో నాడించెను. తిక్కన కీచకుడు చివరకు-

'పరసతీ సంగమున వచ్చు పాపమునకు
నోరుతును గాని సైరింపనోప బచ్చ
విలుతు తూపుల తాకున కలరుబోడి'[2]

అని తన పాపపుకోరిక పరాకాష్ఠను ప్రదర్శించినాడు. వాని నెత్తిన మన్మథుడు ఎంతబలముగ తిష్ఠవేసెనో ఈ పద్యము తెలుపుచున్నది తిక్కన చిన్న పాత్రమును గూడ సూక్ష్మ దృష్టితో పరిశీలించి ఔచిత్య మును గుర్తించి మెరుగుపెట్టు చుండును. దానివలన ఆ సన్నివేశము మరింత ప్రకాశమానమగు చుండును. ప్రకృతము విరాట పాత్రమును తిక్కన ఎట్లు ప్రక్షాళితముచేసి ప్రకాశవంతము చేసెనో పరిశీలింతము. మూలమున సైరంధ్రిని చూచిన విరాట మహారాజునకు మన్మథ జ్వరము వచ్చినది

"రాజాచైవ సమీక్ష్యైనాం సమోహం గతవానిహ
మయాచ సత్యవచనై రనునీతో మహీపతిః"[3]

1 వ్యా. భా. వి ప అధ్యా 14 శ్లో 16
2 తి భా వి ప, ద్వి అ, ప 53
3 వా భా వి ప, అధ్యా 16 శ్లో 11

అని సుదేష్ణ కీచకునకు చెప్పినది గంధర్వులు మెపతులని తెల్పినంతనే భయమున ఆతని కామజ్వరము తిరోగమించినది ఈ విషయమును తిక్కన అనువదింపలేదు. కాని ఆముందు మూలానుసారముగ సుదేష్ణ ద్రౌపదితో అనినట్లుగ "విను నీరూపము సూచి మానృపతి యువ్విళ్ళూరు నే నెమ్మెయిం బనిగొందున్"[1] అని అనువదించి ఈవిషయమును విడిచిపెట్టుటలో విరాటమహారాజు దౌర్బల్యము ప్రత్యక్షముగ ప్రస్తరించుట ఉచితముగాదని సంకేత సూచకముగ ముందు తెల్పి తిక్కన సంతృప్తి చెందెను ద్రుపదపురోహితుని రాయబార సమయమున కౌరవసభలో భీష్ముడు కర్ణునుద్దేశించి-

"నచే దేనం కరిష్యామో యదయం బ్రాహ్మణోఽబ్రవీత్
ధ్రువం యుధి హతా స్తేన బక్షయిష్యామ పాంసుకాన్"[2]

అనిన మాటలకు తిక్కన అనువాదము ఆంధ్రభారతమున కనబడదు. ఉపప్లావ్యమునుండి వచ్చిన సంజయుడు కౌరవ సభలో తన మాటలు వివరించునపుడు మూలమున మొదట అర్జునుడును, తరువాత తక్కిన వారును పలికినట్లుగ-

"యద బ్రూతాం మహాత్మానౌ వాసుదేవ ధనంజయౌ"[3] అని ధృతరాష్ట్రుడు అడుగగ సంజయుడు-

"ధనుర్గుణ కిణాంకేన పాణినా శుభలక్షణం
పాదమానయయన్ పార్థ కేశవం సమచోదయత్।[4]
ఇంద్ర కేతు రివోత్థాయ సర్వాభరణ భూషితః
ఇంద్రవిరోర్యపమః కృష్ణః సంవిష్టో మామభాషత।"[5]

అని చెప్పినట్లున్నది. అనువాదమున ఇట్లులేదు. సంజయుడు కౌరవ సభలో తానుపోయివచ్చిన కథనంతను సంగ్రహముగ ఒకభిన్న వచన

---

1 తి భా, వి ప ద్వి ఆ, ప 121

2 వ్యా భా, ఉ ప, అధ్యా 21, శ్లోక 18

3, 4, 5 ,, అధ్యా 47, శ్లో 30, 31, 32

మున 'ఏ నుపప్లావ్యమునకేగి తొలుత వాఋదేవార్జునులం గంటి[1]' అని చెప్పెను.

అట్లే ద్రౌపది మాటలుగ మూలమున గల -

"అదాసాః పాండవాస్సంతు సరథా స్సాయుధా ఇతి
మయోక్తే యత్ర నిర్ముక్తా వనవాసాయ కేశవ"[2]

అను శ్లోకమును తిక్కన అనువాదమున స్వీకరింపలేదు. పాండవులు యుద్ధమునకు అంగీకరింపనిచో తన వారితో యుద్ధము గావింపజేయుదు నని ద్రౌపది సరోషముగ పలికిన మూలమునందలి-

'యది భీమార్జునౌ కృష్ణ కృపణౌ సంధి కాముకౌ
పితా మే యోత్స్యతే వృద్ధః సహపుత్రైర్మహారథైః
పంచచైవ మహావీర్యాః పుత్రా మే మధుసూదన
అభిమన్యుం పురస్కృత్య యోత్స్యంతే కురుభిస్సహ'[3]

అను శ్లోకములను ద్రౌపది సతీత్వమునకు భంగము కలుగునని కాబోలు అనువదింపక విడిచెను.

కృష్ణకర్ణుల సమావేశమున కర్ణుని మాటలుగ-

'ప్రాప్యచాపి మహద్రాజ్యం తదహం మధుసూదన
స్ఫీతం దుర్యోధనాయైవ సంప్రదద్యా మరిందమ'[4]
'న తదా భవితా త్రేతా న కృతం ద్వాపరం న చ'[5]
'పరాజయం ధార్తరాష్ట్రే విజయంచ యుధిష్ఠిరే'[6]

ఇత్యాదిగనున్న పెక్కు శ్లోకములను తిక్కన అనువదింపలేదు. కావు నే మూలము అంతగ పెరుగుటయు, అనువాదము ఇంత కుదుపుట్ట ముగ నుండుటయు సంభవించినది

1 తి భా ఉ ప, ద్వి ఆ, ప 118
2 వ్యా భా, ఉ ప, అధ్యా 80 శ్లో 28
3 ,, శ్లో 37–38
4,5,6 ,, అధ్యా 141 142 143 శ్లో, 33,13,7

శ్రీకృష్ణుడు కౌరవసభలో పల్కిన మాటలన్నియు ధర్మజాదులకు వివరించెను. కాని భీష్మ, ద్రోణ, విదుర, గాంధారీ, ధృతరాష్ట్రుల మాటలుగ ఉన్నవానిని అనువదింపక పోవుట ప్రత్యేకించి గమనార్హము.

భీష్ముడు - 'మా తాత! కలహం కార్షీ రాజ్యస్యార్థం ప్రదీయతాం
మయి జీవతి రాజ్యం కస్సంప్రశాసేత్పు మానిహ'[1]

ద్రోణుడు -

'భీష్మేణ దత్తమిచ్ఛామి సత్యయా రాజసత్తమ
నాహం తత్ప్రోఽభి కాంక్షిష్యే వృత్త్యుపాయం జనాధిప
యతో భీష్మ స్తతో ద్రోణో యద్భీష్మస్త్వాహ తత్కురు
దీయతాం పాండు పుత్రేభ్యో రాజ్యార్థ మరికర్షణ'[2]

అనియు, విదురుడు-

'బధ్యాకాని కృతిప్రజ్ఞం ధార్తరాష్ట్రం సుదుర్మతిం
కాథేదం రాజ్య ముద్యాసు పాండవై రభిరక్షితం'[3]

గాంధారి -

'న్యాయగతం రాజ్యమిదం కురూణాం
యుధిష్ఠిరశ్చాస్య వై ధర్మపుత్రః
ప్రచోదితో ధృతరాష్ట్రేణ రాజ్ఞా
పురస్కృతి శ్శాంతనవేన చైవ'[4] అనియు

ధృతరాష్ట్రుడు -

'ప్రయచ్ఛ రాజ్యార్థ మపేత మోహస్సవాహనం త్వం సపరిచ్ఛదంచ
తతోఽవశేషం తదజీవితస్య సహానుజస్యేవ భవన్న కేంద్రం'

1 వ్యాఖా. ఉ ప. అధ్యా. 147 శ్లో 40
2,3,4, ,, 148 శ్లో 13,14,35,36
5 ,, 149 శ్లో 36

అనియు చెప్పినట్లున్నది. రాజ్యభాగనిర్ణయ చర్చలో ఈమాటలకు చాల ప్రాముఖ్యమున్నది. ఒక్కొక్కరి మాటలు పెరుకను ఏదిదోమా ర్గమునిచ్చు చరిత్రము గోచరించుచునేయుండగను ఇంతటి ప్రాధా న్యముకల ఘట్టమును తిక్కన వదలివేయుటకు కారణమెరుగము.

## అన్యథాకల్పనము

కీచకోప కీచకుల సంహారణ కార్యక్రమానంతరము ద్రౌపది సుదేష్ణమందిరము ప్రవేశించినది. ఇది మూలమునను గలదు కాని అనువాదమున తిక్కన అన్యథాకరణ మిట్లున్నది. ఆ సమయ మున ద్రౌపది మనఃస్థితి ఎట్లున్నదో మూలమున చెప్పబడలేదు. ఆ మెకపుడు మనసున ఉల్లాసము పెల్లుబుకుచున్నది. అది సుదేష్ణకు కనబడకుండ అణచుకొనలేక పోవుచున్నది. ఆ విషయమునే తిక్కన-

సీ. "మునమున నెలమి సొంపొదవ నెమ్మొగమున
దోపంగ వచ్చిన ద్రోచి ద్రోచి
లలి నుల్లసిల్లుచు లలిత లోచనదీప్తు
లడర నుంకించిన నాగి యాగి
సంతసంబున బాలిశములగు చెయ్వులు
దొడర జూచిన జేయకుడిగియుడిగి
మనమున నుబ్బు మై మాట నాలుకకురా
గడగిన నాడక కడపి కడపి

తే. ధీరయై యిట్లు సమ్మద పూరమునకు
గలువ తనమును బలితంపు గట్టువెట్టి
వెలది యెఱుగని యది వోలె వికృతిలేక
యల్ల నెప్పటియట్టుల యరుగుటయును"[1]

1 వి భా, వి ప, తృ ఆ, ప 65

అని కథాంశమును అన్యథాకరించి వర్ణించెను. కవిబ్రహ్మ బుద్ధికందని ఊహ లేదుకదా ! నిన్నగాక మొన్న విరటుని కొలువున తన గరువ చందమును గుర్చి ధర్మజుడాక్షేపింపగ 'జూదరి యాలికి గఱువతనం బెక్కడిదియది' అని ప్రత్యాఖ్యానము చేసిన ఆమె ఇప్పుడు అణచు కొనలేని సమ్మదపూరమునకు "గఱువతనమును బలితంపు గట్టువెట్టి" నని అందుకనే ఆచార్య శ్రీ యస్. వి. జోగారావుగారు 'తిక్కన ద్రౌపది కడు గడుసుది' అని అనియున్నారు

అట్లువచ్చిన ద్రౌపదిని చూచిన సుదేష్ణ హావభావములను గూడ తిక్కన అన్యథాకరించెను. మూలమున సుదేష్ణ ప్రసంగా రోపముచేయగ అనువాదమున "భయశోకంబులు దనదు హృదయం బున బిరిగొన వినయపూర్వకముగ" ఆమెచే ద్రౌపదికి మన్నన సేయించెను. ఈగడుసుదనములు తిక్కన నాటకీయనైపుణి మెరయిం చుటకు చేసిన అన్యథాకల్పనము.

భారత ప్రతినాయకుడగు దుర్యోధనుని తిక్కన తనచేతి మీదుగ పరిచయము చేసిన సన్నివేశము అన్యథాకల్పనమున కొక చక్కని ఉదాహరణము ఈ పద్యము దుర్యోధనుని వైభవమువలె అట్టహాసముగ, సుదీర్ఘముగ సాగినది.

స్రగ్ధర -

> "మౌళిస్రక్సంగరంగ న్మధుకరపటలీ మానసాకృష్టి విద్యా
> శాలిస్ఫారార్ఘ్య రేఖాంజలిపుట ఘటనా చారుఫాలస్థలశ్యా
> మాలశ్రేణీ విశాలాంబర కుముదవనీ బాంధవాయత్త చంద్ర
> శ్రీలీలాగాఢ కాంతిస్మితవదన రుచిస్ఫీతు నాగేంద్రకేతున్"[1]

దానికి మూలమున -

1 తి భా, వి ప, ప్ర ఆ ప 77

"ఆసీనం సూర్యసంకాశే కాంచనే పరమాసనే"[1] అని దుర్యోధనుడు సూర్యసంకాశుడని యున్నది. ఆమాట ధర్మజునని తగునుగాని వీనినంతమాట అనుట ఎందులకని తిక్కన అన్యథాకల్పనము గావించుచు 'చంద్రశ్రీలీలా గాఢ కాంతిస్మితవదన రుచిస్ఫీతు' నగ మాత్రమే చెప్పి విడిచెను. ధర్మజుని ప్రశంసించు నపుడు తిక్కనవ్రాసిన గుణ ప్రశంసావచనములు ఈ సందర్భమున మచ్చునకైన కానరావు.

బృహన్నల సారథ్యమును తిరస్కరించుచు ఉత్తరుడు మూలమున తనవ్రతము నిట్లు తెల్పుకొనెను.

"సైరంధ్రి జానాసి మమ వ్రతం యథా
క్లీబం నభాషే పురుష స్స్వయం హి
సోఽహం నశక్ష్యామి బృహన్నలాం శుభాం
వక్తుం స్వయం యచ్ఛ హయాన్ మమేతి"[2]

పేడివానితో మాటాడకుండుట తనకు వ్రతమని తెలుపగ అనువాదమున తిక్కన అన్యథాకల్పనము—

చం. 'కురుబలమేగు దెంచెనకట గోవులబట్టిరి బట్టి దానిపై
బరిగొని శౌర్యసంపదయు బాహుబలంబును జూప బూని యే
నరిగెద నట్టి వేరికి బృహన్నల సారథియైన దీని న
వ్వరె పురిలోన నింతకరవా రథచోదకు లింత యేటికిన్'[3]

వినోదార్థము ఉత్తరుని ప్రజ్ఞలను విశదీకరించుట తిక్కన ఔచిత్య ప్రదర్శనమునకు నిదర్శనము దీనికి సైరంధ్రి చెప్పిన సమాధానము కూడ తిక్కన అన్యథాకల్పనమే.

1 శ్రీ వ్యా భా, వి ప, అధ్యా 21,32 శ్లో 9,26
3 తి భా వి ప,3 ఆ, ప 22

ఉ. "కౌరవసేనగాదు త్రిజగంబులు నొక్కట నెత్తివచ్చినం
దేరు బృహన్నలా వశగతిం జరియించిన గెల్వవచ్చు న
ద్వీర గుణంబు సొంపు పృథివీవర నందన మున్న రుంగుదుం
గారణ జన్మమై తను వికారము వచ్చిన బెంపు దప్పునే"[1]

ఇట మూలమున వ్యాసుడు 'భయకాలమున నియమముల ననుసరింప బనిలేద'[2]ని ద్రౌపదిచే ఒక చిన్న ధర్మోపన్యాసము నిప్పించెను. అంతకంటె ప్రకృతావసరమునకు తగిన రీతిని బృహన్నల శక్తి సామర్థ్యములను పేర్కొనుట మేల్తరమని తిక్కన భావన

బృహన్నలను చేరవచ్చు ఉత్తరను వర్ణించుచు మూలమున ఒక విశేషణముల పట్టిక కలదు-

"సుభ్రూః, శుభాననా, హాటక రత్న భూషితా, వజ్రముక్తా, మణి హేమకుండలా, మృదుక్రమా, ప్రదక్షిణావర్తతనుః, శిఖండినీ, పద్మాననా, పద్మదళాయతాక్షీ, తన్వీ, సమాంగీ"[3]

ఆమె నర్తనశాల కరుగుచున్నప్పుడు విశేషణముల దండకము గాక అవస్థాచిత్రణము కావలెను. ఉత్తరతో పరిచయమయి ఒక సంవత్సరము గడచినది వయసు పెరుగుట మాత్రమేగాక నాట్య విద్యనుకూడ నేర్చినది. సంవత్సరము క్రితము వర్ణనమున ఆమె నవయౌవన[4] నేటి వర్ణనమున ఆమె నాట్యయౌవన ఆ వర్ణన సొగసు ఈపద్యము చదివిననే తెలియును.

సీ. అడుగుల నునుగాంతి నయ్యెడ పద్మరా
గంబుల నెలకట్టు కరణి నొప్ప
బాలింట్లు దనువెంట ప్రాలింప జెన్నొందు
నసదు గావీగె యల్లాడుచుండ

1 తి భా, వి ప, చ ఆ, ప 22
2 వ్యాస భా, వి ప, ఆధ్యా,83 శ్లోకము 26 28
3 ,, శ్లో 30–32
4 తి భా, వి ప, ప్ర ఆ, ప 245

దట్టివేచి వెనువెంట దగులు కామాంధకా
రము లీల గ్రొవ్విద గొమరు మిగుల
గర్ణభూషణ మౌక్తిక ప్రభా జాలక
మీక్షణ దీప్తుల నినుమడింప

తే. సందియముల మెఱుపంబున శరగు సెంచి
ప్రోది రాయంచ రయమున బోవు నవ్వి
ధంబు దగ నభ్యసించు చందమున దోన
దనగ నుత్తర నర్తనశాల కరిగె[1]

ఉద్యోగపర్వ ప్రారంభమున 'విశ్రమ్య రాత్రౌ వృషసి ప్రతీతాః స్వభాం విరాటస్య తతోఽభిజగ్ముః'[2] అనుదానికి

తే "మనుజపతి యన్వయంబు పావనము జేసి
దిన చతుష్ట యానంతరమున ప్రియమున"[3]

అని తెలుగు చేసెను. తెలుగువారి ఇంట పెండ్లి నాలుగుదినములు జరుగుట అను ఆచారమును తిక్కన ఇచట పేర్కొనెను.
విదురోపదేశమున అచ్చటచ్చట కల-

'యో నోద్ధతం కురుతే జాతు వేషం
న పౌరుషేణాపి వికత్థతేఽన్యాన్'[4]
'న మూర్ఛితః కటుకాన్యాహ కించిత్
న దుర్గతోఽస్మీతి కరోతి మన్యుం'[5]
"దత్త్వా న పశ్చాత్ కురుతేఽనుతాపం'[6]

వానినన్నిటిని కూర్చి-

---

1 తి భా వి ప ద ఆ ప 26
2 వ్యా భా వి ప అధ్యా 1 శ్లో 1
3 తి భా వి ప, ప్ర ఆ ప 3
4,5,6 వ్యా భా, వి ప అధ్యా 33 శ్లో 92 93,94

తే. "తగిన వేషంబు దనుఁదాన పొగడు కొనమి
నొచ్చియును గీడు వలుకమి యిచ్చి వగవ
కునికి దన కెంత నెపవకయున్నఁ బథము
దప్పకుండుట నడవడికొప్పు నీయు"[1]

అని ఒక మూలికగా కూర్చెను. అట్టే మూలమున గల—

"సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః
అప్రియస్యచ పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః।"[2]

ఇత్యాదిగ నున్న మరికొన్ని శ్లోకముల గుంపును తీసికొని యథేష్ట ముగ-

'ప్రియవాదు లెందును గలరు. అప్రియంబగుగాకేమి యని పథ్యంబు పలుకువారులేరు. జూదంబునప్పుడే నష్టంపడి యప్రియంబులకు శంకింపక పథ్యంబుపలికితి నది నీకు రుచియింపక రోగికి పథ్యాహారంబు తలకంటగించు నట్లయ్యె నైన నిప్పుడు జెప్పెది వినుము కాకంబులం గైకొని పయూరంబులన్ పరిహరించు విధమున

సుయోధనాదులన్ బట్టి యుధిష్ఠిర ప్రముఖుల విడిచితివి. నేడు కార్యంబు ముట్టవచ్చినం దోపక మిడుంగురు సోకినట్లు తల్లడించెదవు'[3]

అని యథేష్టవ్యాపారమున అనువదించెను

అట్లే మూలమున ధర్మసార మాత్రముగ ఉన్న-

'త్యజేత్కులార్థే పురుషం గ్రామస్యార్థే కులం త్యజేత్
గ్రామం జనపదస్యార్థే హ్యాత్మార్థం పృథివీం త్యజేత్'[4]

ఈ మాటలను తీసికొని-

'కులంబునకై నట్టి యొకని దొలంగుటయు నీతియని పెద్దలు సెప్పుదురు. దుర్ణయపరుండై సద్బుద్ధిం వినండేని మనము దుర్యోధనను

1 తి.భా, వి ప,ద్వి ఆ, ప 45

2 వ్యా భా, వి ప, అధ్యా 37 శ్లో 14

3 తి భా, ఉ ప, ద్వి ఆ, ప 39

4 వ్యాభా, ఉ ప, అధ్యా 37, శ్లో 16

- ... ంగిన నేనుగు?'[1] అని పరిశ్రాన్తార్థకముగ వినచి 'ఇది ఎంత గొప్ప ... అట్లు విచారించుము'ని ధృతరాష్ట్రుని మోమువైపు ఎగాదిగ ... చుచున్నట్లుగ చెప్పెను ఈ విన్యాసము మిక్కిలి అపురూప ...నది

రాయబారపు టనంతరము సంజయుడు కౌరవ సభలో అర్జును సంగతులను వివరించు సందర్భమున ధృతరాష్ట్రుడు-

'సంజయా దత్వ్య కేనాస్మా న్పాండవాఽభ్యయుంజత
ధృష్టద్యుమ్నేన సేనాన్యా సోమకాః కిం బలా ఇవ'[2]

అని సంజయునడిగెను అపుడు సంజయుడు -

"తత్రాసీ మిత్త్రతో దైన్యాత్స్వాతం కశ్మల మావిశత్
తదాచచక్షే పురుషః సభాయాం రాజ సంసది
సంజయోఽయం మహారాజ మూర్ఛితః పతితో భువి
వాచం నసృజతే కాంచిద్ధీన ప్రజ్ఞోల్ప చేతసః"[3] అని మాటలు ... క్రిందపడిపోయెనని విదురుడు చెప్పెను. అది అనువాదమున-

'సంజయుడు వెచ్చనూర్చి తెచ్చపడి మూర్ఛపోయిన ... సింబున దెందంబు మగుడన్ జేష్టలు దక్కియుండి, కొండొక సీవునకు ... బొక్కంతి చేసికొని అక్కటా ! యీ భూపాలకుండింత వేల ...'[4] ఇత్యాదిగ తలపోసినట్లు చెప్పబడినది. ఒకవేళ నిజముగ ... మూర్ఛపోయినను ఆస్థితిని మార్చి సంజయుని పాత్రకున్నీ మత ...ముగ ధృతరాష్ట్రుని చేలతనము సూచించు ఈ సన్నివేశము తిక్కన ... చ్చి దిద్దిన అన్యదాకల్పనము

## నూతనకల్పనము :

అజ్ఞాతవాస సమయమున ద్రౌపది ప్రవర్తనమును గూర్చి ... ఆమెను హెచ్చరించెను. దానికి ద్రౌపది 'అనాదర మంద

1 తి. భా. వి ప, ద్వి ఆ, వ 89
2,3 వ్యా. భా. ఉ ప అధ్యా 49 శ్లో 9,11,12
4 తి భా, ఉ ప, ద్వి ఆ, వ 180

స్మిత సుందర వదనార విందయయి' "పాతివ్రత్యా చారముసై వర్తింతురు సైరంధ్రీజాతివారు[1]" అని చెప్పిన సమాధానము అమూలకము. ఇది ద్రౌపది ఆత్మ విశ్వాసమునకు, అట్టి మాటల యందు అనాదరణమునకు గుర్తు. శౌవి విశేషమున కిది సూచకమైనది

విరాటపర్వము ద్వితీయాశ్వాసము మొదటనున్న మల్ల యుద్ధ వర్ణనము కొంతమూలమున నున్నను తిక్కన ప్రయోగించిన 'ఉపతాయి' 'తోరహత్తము' 'ఒత్తోరుపు' 'జళికి' 'పట్టిసము' 'సీసము' మొదలగు దేశీయ మల్లబంధ విశేషములు స్వతంత్రములు ఇవితిక్కన విషయజ్ఞతకు గుర్తు.

కీచక ప్రబంధమున అమూలకము, అమూల్యము నైన విషయము లనేకములున్నవి. శృంగార రసాభాసమును రక్తికట్టించు టలో తిక్కన తన ప్రజ్ఞను ప్రదర్శించి కృతార్థుడయ్యెను ఇంత మూలాతిరేకము అనుచితమనువారును కలరు. కాని భీముడు కీచకుని సంహరించుటకు తగిన నిమిత్తము కావలెను. అందులకు వాని దౌర్జ న్యము మితిమీరవలెను. ద్రౌపదికొరకు వాడుపడిన తాపత్రయము ఆమెపై వానికి గల వల్లమాలిన మోహమును తెల్పుచున్నది ఆమె మనకు ద్రౌపదిగాని వాని దృష్టిలో నొకసామాన్య సైరంధ్రి అని ముందుగనే అనుకొంటిమి. అతడు కందర్పదర్ప గోచరుడు. మూల మున కీచకుడు సైరంధ్రిని చూడగనే ఆమెయెడల అనురాగయుక్తుడై ఆమెతో సరసమనుకొని విరసమునకు దొడగెను. కాని శిల్పమర్మజ్ఞు డగు తిక్కన కీచకుని అంతఃస్థితిని వరుసగ 13 పద్యములలో[2] అత్యద్భుతముగ నూతనమైన వర్ణనముగ కల్పించెను.

"ద్రౌపదీరూపమను నురిఁ దగిలి తనదు
హృదయమను మృగ మత్తఱి నుదిలకొనుచు

1 తి భా, వి ప, ప్ర ఆ, ప 112 113
2 తి భా, వి ప, ద్వి ఆ, ప 23-36

గాముఁడను బల్లిదపు వేఁటకాని బారిఁ
బడుట కెంతయు నాసింహబలుఁడు దలరి"[1]

ఇందు సింహబలుఁడను మాట సార్థకము. మృగరాజ సమబలుడగు కీచకుడు కాముని బారిపడినంతనే మృగప్రాయుడై పోయెను. ద్రౌపది రూపమున ఊరి తగులొక్కనిది. అంతియేగాక-

"కుసుమశరుని బాణముల్ గూఁడ నైదు
గరఁగ నేరిచి వాటించి కరువు గట్టి
పోసి చేసి చైతన్యసంపుటము దగఁ ఘ
టించిరో కాక యిట్టి చేఁగీయలు గలరె"[2]

అని కీచకుడు మన్మథావస్థకు లోనగుటతో కవిత్వము చెప్పు సామర్థ్యము కలవాడయ్యెను

"అనియని యుగ్గడించు, ధృతియల్లల నాడినఁ దల్లగించుఁ బై
కొను తలఁపోరగించు, మదిఁగోర్కులు పేర్చిన నప్పళించు, నె
ట్టన తెగ నగ్గలించు, నటం జనులం బరికించు, బుద్ధిమా
లిన వెసనెంతయుం గళవళించు మనోజవికారమగ్నుఁడై"[3]

ఇంచు గంతములగు సమాపక క్రియలతో ఇంత గంధసిగ సాగిన ఈ పద్యమున మన్మథ తాపముచే కీచకుని మనస్సు పడుచున్న ఆందోళన స్పష్టమగుచున్నది. రచనా విన్యాసమున తిక్కన కీచకుని మానసికాందోళనావస్థను నిరూపించ గలిగెను.

కీచకాధముని నీచమగు కోరికను పసిగట్టిన ద్రౌపది నిస్సహాయురాలై ప్రస్వేద, ప్రకంప, వైవర్ణ్యము[4] పొందినది. ఆ దురాత్ముడు దానిని మదన వికారముగ భావించినాడు. అనంగుపట్టి ఆడెడు జంత్రంబుపగిది[5] ఉన్న వానిని తిక్కన వైపుణితో నాటకీయతతో చిత్రించెను. ఇచ్చట సంభాషణ మేమియును లేదుకదా

1,3 తి భా, వి ప ద్వి ఆ, ప 24- 7
3,4 5 ,, ,, ప 31, 38, 37

నాటకీయత యేమి ? అనుకొనరాదు నాటకీయత అనగ పట్టి సం వాదము మాత్రమే గాదు ఆ పాత్రల మనోభావముల మాన ప్రదర్శ నము నాటకీయమైన విన్యాసము.

పరస్త్రీ వ్యామోహము వలన సుఖము శూన్యమని తమ్ముని మందలించుచు సుదేష్ణ చెప్పిన ఈ పద్యము నూతన కల్ప నము. దీని వలన సుదేష్ణ వాస్తవిక దృష్టి తేటతెల్లము. ముందు ద్రౌపదీ సూచిత ఏకాంత సమయ నిర్దేశమున కిది ప్రోదిసేయును.

సీ పతి యెఱింగినఁ దన ప్రాణంబుపై వచ్చు
నను భయంబున నుల్లమదరు చుండ
జనులు గాంచిన మానుషము దూలుఁ దనకను
పుయిలోటమున మోము పుల్లగిలఁగ
బోటికిఁ దోఁచినఁ బొలియుఁ దేకువ యను
వెగటునఁ జెయ్వులు వీడు పడఁగ
బంధుల కగపడ్డఁ గాచు నన్వయ మను
కలకమైఁ జెమటలు గ్రమ్ము దేరఁ

తే గ్రీడ వెసఁ గౌతుకం బురియాడ రతుల
చవులు గొనియాడ నేరని జార పొందు
హృదయమున కింపు సేయమి నెఱుక గలుగు
వారు దీని సుఖంబుగాఁ గోరరెందు"[1]

ఎంత చెప్పినను కీచకుని బుర్ర కెక్కినది కాదు. తెల్లవారినదో లేదో సిగ్గులేని మొగముతో దిక్కుతోఁచని మనసుతో మరల వచ్చినాడు. సైరంధ్రి కొరకు వెదకి చూచినాడు గతానుభవము జ్ఞాపకా పాంము గాగ తొందరపడి ద్రౌపదిని తాకుటకు సాహసింపలేదు సరిగదా పలుక రింపనుగూడ లేదు తనకు విలాసములును ద్రౌపదికి విశ్రాంతిములు నైన

1 తి భా, వి ప, ద్వి ఆ, ప 70

[illegible] గుగముల నోలక చూపినాడు ఆ సందర్భమున గల పద్యము [illegible] ములు[1] నూతన కల్పనములు.

> క. "ఎవ్వరితోనైన నెలుఁగెత్తి యొక్కింత
> పనిలేని వెంగలి పలుకు పలుకు
> పట్టియు కొండొంటి బిట్టు దాఁకఁగ నేల
> నందంద మునిగాళ్ళ నప్పళించుఁ
> గను విశాలంబుగా నొసలెల్ల విఱుచుచు
> మలఁగి రిత్తకు రిత్త నెలగి నవ్వుఁ
> దాళంబుగాఁ గరతలమునఁ బెలుచఁ గం
> బంబు వ్రేయుచు నెడపాట పాడు
>
> తే. మఱియు నంతంతఁ జేరువఁ బోలయు నింతి
> దన్నుఁ జూచెనొ కేంతయుఁ దల్లడిల్లు
> నిక్కుచక్కుచుఁ బడుఁ దిగు లినుమడింపఁ
> గాచు నత్తన్విఁ బోరిఁ బోరిఁ గిచకుండు"[2]

విట లక్షణముల నింత విస్పష్టముగ వర్ణించు నేర్పు అల [illegible] సాధ్యము కానట్టి పని. కవిబ్రహ్మ కావున కానని రహస్యము [illegible] కాబోలు కీచకుని నెత్తవేషముల నెంతయో స్వాభావికముగ [illegible] సహజ వర్ణన కవిత్వ వైశిష్ట్యమును ప్రకటింపదని [illegible] ందుదు అట్టివారి కీడుగో చూడుమని తిక్కన ఇచ్చిన సమా [illegible] రాజాస్థానమున తలపండిన తిక్కన, పలు సమస్యలతో [illegible] మునకు లిఖిన తిక్కన ఎన్నియో రకముల మానిసులను పరిశో [illegible] యుంచినవు ఎన్నియో మనసులను పరిశీలించి యుండును. పరి [illegible] ణామును పట్టి నపలని రచనలో తెలుగు పలుకుబడితో ప్రవ [illegible] నైపుణ్యము అనితర సాధ్యము.

---

1 తె లా, వి ప ద్వి ఆ, ప ౨౪౭ నుండి ౨౫౬
2 ,, ప ౨౫౦

ఆ కీచకు డంతటితో విడిచెనా? ఇంకను ద్రౌపదితో-

చం. "విరటుఁడు సూచుచుండ నిను వేవురముందట నట్లు ద్రోవ నో
క్కరుడును గాదుగూడ దనఁ గల్గెనె? పోటరులైన భర్త లే
వురు గలరంటి వారి యలవుం జలముం గనగంటి నింక నె
వ్వరుగల రెట్లుదప్పె దనివారణ బట్టెద నెందు జొచ్చినన్"[1]

అని ప్రలాపించినాడు. ఇందు కీచకుడు పూర్వదినమున జరిగిన సన్ని వేశమును పేర్కొనుచు ఆమె నిస్సహాయతను బయల్పరచుట ద్వారా తన అహంకృతిని విప్పి చెప్పికొనుచున్నాడు. అదియే ఒక విజయ మనుకొని గర్వముతో విర్రవీగుచు కామముతో బిర్రబిగిసినాడు పై పద్యము నందలి ప్రత్యక్షరము ఇందులకు సాక్ష్యముగ నున్నది సంభాషణ రూప సందర్భములందు పాత్రల స్వభావము స్పష్టీకరించు నప్పుడు విషయము నంతటిని వాచ్యము చేయ నవసరము లేదు ఆ సంభాషణల కుచితములగు అభినయ విన్యాసములను కవి తన భావనా బలమున ఊహించి పేర్కొనుట ఒక శిల్పము కాని వాని ఒడుపులను వాక్యనిర్మాణ వైఖరి లోనే ఇమిడ్చి చెప్పుట మరియొక శిల్ప మార్గము అదియే నిపుణత అందు తిక్కన నిష్ణాతుడనుటకు నిదర్శ నము లనేకములు అందు ఇది యొకటి కీచకుని నర్తనాగారమునకు ఏకాంతముగ రమ్మని ఒడంబరిచి-

"నా కోఁటిత దీర్చి వచ్చితి
నీ కోఁటితయు యింక సూతునిం దెగఁ జూచన్"[2]

అని ద్రౌపది అమూలకమగు మాటలతో భీముని కోర్కెను మరొక సారి ప్రజ్వరిల్ల జేసినది అంతట భీముడు ఉత్సాహతో తేజరిల్లె వెంటనే సందేహము కలవాడై వాడేకాంత సంకేతమునకు వచ్చునో

1 తి భా, వి ప, ద్వి అ, ప 257
2 ప 271

రా చేయుని తటపటాయించి మరల నిశ్చయము చేసికొన్నవాడై యిట్లు పలుకును. సందర్భోచితములగు ఈ పద్యములు అమూలకములే.

ఉ "వచ్చె మదాంధ వృత్తి ననివారణ నొక్కఁడు నాట్యశాల కుం
జెచ్చె నవశ్యమున్ వెదకి చూచి ననుంగని యప్డు సంగరం
బిచ్చె మదీయ బాహుబల హీనబలుండయి నీకుఁ బ్రీతిగాఁ
జచ్చె ననుంశయంబిది విచారము లిన్నియు నింక నేటికిన్"[1]

మ "అవనీ చక్రము సంచలింపఁగ దివం బల్లాడ నాశావయం
బవసూతింబుగ గోత్రశైల నికరం బాకంపముం బొంద న
ర్ణవముల్ ఘూర్ణ నమొందఁ గ్రోధము గృతార్థత్వంబునొందించి చి
త్రపథ ప్రౌఢి వహించి సూతునకు రౌద్రం బేర్పడం జూపెడన్"[2]

శబ్దమునకు వలెనే భావమునకును ఒక గతియు రీతియు నుండును. భావరీతికి శ్రుతి గూర్చి శబ్దమును కనిపెట్టి ప్రయోగించు దక్షుడే కవివామ్యుడగును. పై పద్యము లందలి పద విన్యాసములు క్రోధాతిరేకమున నున్న వృకోదరుని భావ తీవ్రతకు శతధా ప్రమాణ భూతములై యున్నవి రెండవ పద్యమున "రౌద్రం బేర్పడం జూపెడన్" అనుచోట తిక్కన రసమును శబ్దవాచ్యము చేసి చెప్పినాడు అది అనుచితమని కొందరు శంకింతురుగాని కామ పరవశుడగు కీచకుని క్రోధ పరవశుడగు భీముని పరస్పర ఘర్షణలో కామము నశించి క్రోధము జయించినది. పర్యవసానము క్రోధము కృతార్థత్వము నొంది రౌద్రమేర్పడినది. అనగ స్థాయిభావము రసముగ పరిణమించినదని పాఠకులకు తెల్పుటకు తిక్కన ఇట్లు ప్రయోగించి యుండును

1 తి భా, వి ప ద్వి ఆ. ప 279
2 " " ప 284

ఉత్తరాభిమన్యుల వివాహము మూలమున సుమారు '30' శ్లోకములతో[1] వర్ణింపబడినది. తిక్కన ఈ ఘట్టమున చాల నూతన కల్పనలు గావించెను. తెర పట్టుట, తలఁబ్రాలు పోయించుట మొదలగు తెలుగువారి పెండ్లి ఆచారములు కొన్ని ప్రసక్తములైనవి. తెర తొలగించు సరికి వధూవరుల మనసులలో వలపు జల్లు పడినది. వారి వారి అందచందములు ఒకరొకరికి కొంత కొంత శ్రుతపూర్వము లగుట చేత వేడుకల నువ్విళులూరినవి. ఒకింతుక చేపును ఎదురు చూచుట కోర్వకున్నవి వారి మనములు ఇక వారి చూపులు—

సీ. "వరు చూడ్కి ముద్దియ వదనంబుపైఁ బాఱి
తివుటమై నునుఁ గాంతి తీపుగ్రోలు
సుందరీ రత్నంబు చూపు మనోరమ
వడుగుల రొమ్ముపై నల్ల నడరుఁ
బతి విలోకనములు పడఁతుక మైఁదీవఁ
గలయంగఁ బలుమఱు మెలఁగు చుండు
చెలది కటాక్షముల్ విభునిపైఁ గ్రమమున
నెగసి మోమునఁ జోఁకి మగిడి వచ్చు
తే. నొండొరువుల లేఁజెమటల నూని ప్రేగు
పడిన చాడ్పున నవయావ భంగులందుఁ
దగిలి మఱపునఁ దమయు నిద్దఱు విశాల
నయన దీప్తులు నెఱుకువ భయులు పడఁగ [2]

అతనిది దిగజారు చూపు, ఆమెది ఎగబ్రాకు చూపు. అతనిది సింహావలోకనము. ఆమెది క్రమావలోకనము. అతని చూపు పరువులు వారుచున్నది. ఆమె చూపు అల్లన నెగసి విభుని మొగము సోఁకగనే తిరిగి పోవుచున్నది. అతని చూపు ఔత్సుక్య విస్మయము ఆమెది

2 వా భా వి ప, అధ్యా 7 శ్లో 29 నుండి 58
1 తి భా వి ప, పం ఆ ప 305

గాని తెనుగున ఉన్నట్లు "సంజయునితో నిట్లనియె, అని చెప్పి చుట్టు
నున్న వారితో నిట్టులనియె, అని పలికి వెండియు, అని పలికి సంజయు
దిక్కు మొగంబై" ఇత్యాదిగ సంజయునే గాక చుట్టునున్న వారిని
గూడ చూచి పలుకరించు శిల్పము తిక్కనకే చెల్లినది. మూలమున
ఇది కనబడదు. అన్ని పర్వములయందును ఆయా పట్టుల తిక్కన
ప్రదర్శించు ప్రత్యేకతను గమనించినచో నాటకీయతకు ప్రత్యేక
లక్షణమగు ఆంగికాభినయము మూలమునకు సౌందర్యపోషకముగ
తిక్కన ఎట్లు పోషించెనో మనము గుర్తింపగలము నిశ్చల రూపము
లను తిక్కన వరింపలేదనియే చెప్పవచ్చును.

రాయబారపు టనంతరము ధృతరాష్ట్రుడు సంజయునితో-

"పరప్రయుక్తః పురుషో విచేష్టతే
సూత్రప్రోతా దారుమయీవ యోషా
ఇయం దృష్ట్వా నియమం పాండవస్య
మన్యే పరం కర్మ దైవం మనుష్యాత్"[1]

అని చెప్పబడియున్న మూలమును చేకొని, తిక్కన ఒక నూతన
కల్పన గావించెను-

చం. "వలమున దుస్ససేనునకు, సౌబలునకున్ మిముఁ బట్టి యార్పఁ బో
మ్మల క్రియ నాడుచుండుదురు మానక నీవు సుయోధనుండు దా
రలసి యొకప్పు పాండుసుతు లాగ్రహ వృత్తిఁ జొచ్చిరేని నీ
వలము బలంబునుం గులముఁ జక్కగఁ జేయరె యొక్క వ్రేల్మిడిన్"[2]

అట్టి మూలమున వివరింపబడని నూతన కల్పనమును ధృతరాష్ట్రునకు
నేత్రదానము చేసినపుడు-

"త్వాం దృష్ట్వా ఘోరమాత్మానం కేశవస్య మహాత్మనః
న్యమీలయన్త నేత్రాణి రాజాన స్త్రస్త చేతసః

1 వ్యా భా, ఉ ప, అధ్యా 132, శ్లో 12

2 తి భా, ఉ ప, ద్వి ఆ, ప 11

గుణతే ద్రోణంచ భీష్మంచ విదురంచ మహామతీన్
సంజయం ధృతరాష్ట్రంచ ఋషీం శ్చైవ తపోధనాన్"[1]

ధృతరాష్ట్రుడు కోరకుండగనే నేత్రదానము చేయబడి నట్లుండ, అనువాదమున తిక్కన-

"అప్పుండరీకాక్షుండు నారదాది మహామునుల వలనను భీష్మ, విదుర, ద్రోణ, సంజయులయందును గరుణాంత రంగితం బగు కటాక్ష వీక్షణం గొలయ వారలకు దివ్య దృష్టి నొసంగిన"[2]

కం "కరుణింపుము సంశ్రిత భయ
హరణ ధురీణా సహింపు మజ్ఞానంబున్
శరణంబు వేడెద భవ
చ్చరణంబులు గనఁగొనం బ్రసాదింపఁగదే [3] అని

ధృతరాష్ట్రుని ప్రార్థనపైననే నేత్రదానము చేయబడినట్లు కల్పించెను. అట్లె ద్రౌపది మాటలుగ మూలమున-

"దుశ్శాసన భుజం శ్యామం సంఛిన్నం పాంసు కుంఠితమ్
యద్యహంతు న పశ్యామి కా శాంతి ర్హృదయస్య మే"[4]

దీనిని విస్తరించి తిక్కన ఎట్లు నూతనకల్పన గావించెనో చూడుడు-

సీ. "ఈ వెండ్రుకలు పట్టియీడ్చిన యా చేయి
నొలుతగాఁ బోరిలో దునిమి నీను
తను వింతలింతలు తునియలై చెదరి రూ
పఱి యున్నఁగని యుడుకాఱుఁగాక
యలుపాలఁ బొనుపడు నట్టి చిచ్చేయిది
పెనుగద పట్టిన భీమసేను
బాహుబలంబును గాటించి గాండీవ,
మును నొక విక్రమంబును వహించు

---

1 వ్యా భా ఉ ప అధ్యా 131 శ్లో 17 18
2 తి భా, ఉ ప, ద్వి ఆ, ప 405
3 " ప 408
4 వ్యా భా, ఉ ప, అధ్యా 8, శ్లో 39

ఆ. కట్టె విక్రమంబుఁగాల్పనే యిట్లు ప
న్నములు వడిన ధర్మనందనుండు
నేను రాజరాజ పీనుంగుఁ గన్నారఁ
గానఁబడయనైతి నే కృష్ణ![1]"

ఇందు మొదటిమూడు పాదములను తిక్కన విస్తరించి మిగిలినపద్యమును చక్కని పదములతో ద్రౌపది మనమును మనకు ప్రత్యక్షము గావించెను

మరియొక ఉదాహరణ-

"అజాత శత్రుస్తు విహాయ పాపం
జీర్ణాం త్వచం సర్ప ఇవా సమర్థాం
విరోచతే హ్యార్య వృత్తేన ధీరో
యుధిష్ఠిర స్త్వయి పాపం విసృజ్య"[2]

పై శ్లోకమున 'జీర్ణాంత్వచం సర్ప ఇవ' అనుదానిని పరిహరించి తిక్కన నూతనకల్పనము-

ఈ మానుషశక్తి యొల్లదు సమంచిత దైవమయాదియుండు నీ
పైన యతండు పుణ్యమును బాపము బెట్టినవాఁడు నీవు నీ
సూనువశంబుకాని యొకచొప్పు దలంపవు కర్ణ శౌబలా
ధీనము గార్యనిశ్చయము దెల్లము నీమతమొప్పదేమియున్[3]

ధర్మరాజును గూర్చి సంజయుడు పలికిన మాటలన్నియు కవిబ్రహ్మ కవితా విలసనమే.

" . ... .. వశీకృత చిత్తుడు ధర్మసూతి మి
త్రుని పులి యెల్లవారలు నధర్మము నీపయి బెట్టునంతకు
న్ననదును గానధుంబిడక నీకును నాకు మనల్పవచ్చునే"[4]

విదురోపదేశమున కలత చేరిన ధృతరాష్ట్రుని మాటలుగ మూలమున.

1 తి భా, ఉ ప, ఆ ప 117

2 వ్యా భా, ఉ.ప, అధ్యా 32 శ్లో 14

3,4 తి భా, ఉ ప, ద్వి ఆ, ప 6, 18

"ఏవమేతద్యథా త్వం మామనుశాససి నిత్యదా
మమాపి చ మతిస్సౌమ్య భవత్యేవం యథాత్థమాం
సాతు బుద్ధిః కృతాప్యేవం పాండవాన్ ప్రతిమేసదా
దుర్యోధనం సమాసాద్య పునర్విపరి వర్తతే
న దిష్టమప్యతి క్రాంతుం శక్యం భూతేన కేనచిత్
దిష్టమేవ కృతం మన్యే పౌరుషంతు నిరర్థకం"[1]

అని యున్న దానికి తిక్కన కల్పనము-

"అనిన నాంబికేయుఁడను నీదుపలుకులఁ
గలఁక దేరి బుద్ధి తెలివినొందె
నిట్లు చేయువాఁడ నిదియ కర్జము ధర్మ
మును యశంబు లాభమును దలంప"[2]

అని ధృతరాష్ట్రుఁడు చెప్పగనే విదురుడు-

చం. "అనుడు ముదంబు నమ్రమియు నాత్మఁ బెనంగొన నన్నతోఁడ ని
ట్లను విదురుండు పెద్దవడి కక్కట నీమది కార్యవృత్తి నా
ళ్కనియె సుయోధనుంగని యకుంఠిత నిశ్చయమై యతండు ప్రా
లినదెస ప్రాలకుండిన బలే మము బోఁటులకుం బ్రియంబగున్.

వ. అని పలికి నిట్టూర్పు నిగిడించి

క. దైవంబ నేర్పుఁగాకిటు
వోవఁగ నేసేర్తు నేరఁ బొమ్మని పలుకం
గా వశమె నరున కెక్కుడు
దైవము పౌరుషముకంటె ధరణీనాథా"[3]

అను విదురుని మాటలన్నియు వ్యాసుని మాటలుగాక నూతనకల్పన
ములే. అట్లే మరొక నూతన కల్పనము.

---

1 వ్యా. భా., ఉ. ప. అధ్యా 40 శ్లో 28-30
2,3 తి. భా., ఉ. ప. ద్వి. ఆ., ప 96 8 -99

బ్రూహామద్వచనం కృష్ణ సుయోధన మపండితమ్
శృచ్ఛ్రే వనే వావస్త్రోర్వ్యం పురేవా నాగసాహ్వయే [1]

అను సహదేవుని మాటలకు తిక్కన కల్పనమిది

మ. తుదిరాజ్యమ్మొసగమ్ము గ్రామ్ములైదింటం బేరువంచించియుం
బడు మాఁకేఁగులు నీవునుం దిరిగిరా శ్రీలిక పోవచ్చు నో
యదిగాదేఁ దెగి బంటనై యటుము మాయల్ వన్ను నేర్పింకఁజె
ల్లదు సూ నీకని యాసుయోధనున్ని యుల్లంబుచ్చి పోనాడుమీ" [2]

కుంతీదేవిని కృష్ణుఁ డూచు ఘట్టమున తిక్కన తెల్పిన

క. "ఇదియెల్లను నొకతల యాపదు మాఁడేఁడులును
నాకు బావ కొడుకుచే
నదయమగు కూడుగుడుచుట యదియొక తలయయ్యె
నేమియునఁ గఁ ననఘా [3]

క. తన్నుఁ దనతమ్ము నున్నా కన్న కొడుకులట్ల తలఁతుఁ గాని విభేదం
బెన్నఁడు నామది లేమికి న్నుఁ దైవం బసాక్షి వినుము పలికెదన్ [4]"

అను పద్యముల సారము కనబడదు

జామదగ్న్య్య, కణ్వ, నారద, గాలవాదుల యుపదేశములు వ్యాసుడు విస్తృతముగ వర్ణించినను మూలమున మునుల మాటలకు దుర్యోధనుని ప్రతివచనము లేదు. ధృతరాష్ట్రుడే

"భగవన్నేవ మేవైతత్ యథా వదసి నారద
ఇచ్ఛామి చాహమప్యేవం నత్వీశో భగవన్నహమ్" [5]

అని బదులిచ్చెను. అనువాదమున నట్లుగాక

దుర్యోధనుండు రాధేయుం గనుంగొని చేయుప్పళించి నవ్వి
వీరలింత వెఱ్ఱులగుదురే యని పలికి మునుల నవహేళించి

1 వ్యా భా ఉ ప అ 80 శ్లో ౬

2 3 4 తి భా ఉ ప తృ అ ప 97 102, 103

5 వ్యా భా ఉ ప అ 124 శ్లో 1

క. మునులార! నన్ను విధియే, మనిమనుపుట్టించె నట్టులయ్యెడఁగా క్రీ
వినఁజవిగాని పలుకులకుఁ, బనిగలదే యుడుగుఁడింక బహుభాషణముల్[1]

అని పరిహాసవాక్యములు పలికెను. ఇది తిక్కన కల్పననే
యుద్ధ సన్నాహమంతయు శ్రీకృష్ణుడే చేసినట్లు మూలమున-

> 'అకృతేనైవ కార్యేణ గతః పార్థానధోక్షజః
> స ఏవాస్మన్న్యూ నాభిష్టో ధ్రువం దక్ష్యత్యసంశయం'[2]

అనియున్నది. అనువాదమున నట్లుగాక-

క. 'తనవచ్చిన కార్యము మన
మనుకూలతఁ జేయకున్న హరి యలుకమెయిన్
జని యప్పాండు తనూజులు
మనమునఁ గినుకూనునట్టి మాటలు సెప్పున్'[3]

అని సూచనప్రాయముగ చెప్పనేగాని యతడే కారణమని చెప్పబడ లేదు.

### యథాతథానువాదము :

విరాటరాజు కొలువులో నిలిచిన ద్రౌపదిని శాంతపఱుప ధర్మజుడు ప్రయత్నించును. ఆమె క్రోధము శాంతి నొందక సభా ప్రాంగణము వీడకున్న ధర్మజుడామె నాక్షేపించుచు 'శైలూషి' (నాట్యకత్తె)తో పోల్చి పలికినాడు. అంతులకు ద్రౌపది మానసిక ముగ పరితాపము చెంది యిట్లు పలికినది.

మూలము - "సత్యముక్తం త్వయా విద్వన్
శైలూషిం విద్ధిమాం పునః

---

1 తి భా, ఉ ప, తృ ఆ, ప ౩౨౪ ౩౨౫
2 వ్యా భా, ఉ.ప అధ్యా, 153 శ్లో ౯
3 తి భా, ఉ ప, ౨ ఆ, ప 184

శైలూషకస్య తస్యాహం
మేషా జ్యేష్ఠోఽత్ర కోవిదః"[1]

అనువాదము- 'నాదువల్లభుండు నటుఁడింత నిక్కంబు
పెద్దవారియట్ల పిన్నవారు
గాన పతుల విధము కాక యే శైలూషిఁ
గావనంగ రాదు కంకభట్ట

అట్లగుటం జేసి నాకు నాట్యంబును బరిచితంబ మత్పతి శైలూషుండ కాఁడు కితవుండునుం గావున జూదరి యాలికి గఱువతనం బెక్కడి యది'[2]

ఇందుమూల శ్లోకము కత్తి వేటువలె నున్నదనిన దాని అనువాదము సూదిపోటువలె నున్నదనవలెను. మూలశ్లోకమున 'అసలు నేను అర్జునునకే భార్యను· నాదురదృష్టవశమున నాకు బావగారిగ నుండ వలసినవాఁడవు భర్తవైతివి' అనినంత భావము కలదు. మూలమందలి ద్రౌపది తీరే యట్టిది. భర్తయయిన వానిని నీవు భర్తగ నుండదగని వాఁడవని పలుకుట సతీధర్మము కాదని కాబోలు తిక్కన సందర్భోచితముగ 'కంకభట్ట' అని పేరెత్తి పల్కించి 'నాభర్త శైలూషుండు కాడు కితవుండును' అని చెప్పి పొడుపుగ నైనను పల్కించి ద్రౌపది కోప ప్రకటనమునకు సావకాశము కల్పించెను.

కీచకుడు తనకు గావించిన అవమానమునకు ప్రతీకారముగ నాతనిని భీమునిచే జంపింపదలచిన ద్రౌపది తన కష్టసుఖములను భీమునికి వెల్లడించుకొనుచు తనకు కుంతీదేవితో గల యనుబంధమును ప్రసక్తానుసారముగ తెల్పుకొను సందర్భమున మూలము-

"బిభామి కుంత్యా యా నాఽహం యుష్మాకం వా కదాచన
సాద్యాగ్రతో విరాటస్య భీతా తిష్ఠామి కింకరీ"[3]

అనువాదము-

1 వ్యా భా, ఉ ప, అ 16 శ్లో 117
2 తి భా ఉ ప, ద్వి ఆ, ప 152-158
3 వ్యా భా, ఉ ప, అ 18 శ్లో 24

క కావున వంచన బాహిర, పోవక యుండఁగ మనరిపుంబరిమార్పం
గావచ్చునేని నట్టిద, నావలపటుగాక తక్కినవు వలదుసుమీ[1]

ఆనాడు రాజసభలో కీచకుడు రచ్చకీడ్చి నపుడును-

ఉ. 'ఇందఱుఁజూడఁగా నిచట నిమ్మెయి నన్నుఁబతివ్రతాగుణా
స్పందిత వర్తనం బరమసాధ్వి ననిందిత శీలఁగీచకుం
డెందును నెట్టి యంగనల నెవ్వరుఁజేయనియట్లు సేయఁగా'[2]

అని ఆపుకొనలేని ఆవేశము త్రోచుకొని వచ్చినను అంతలోనే నిల ద్రొక్కుకొని పతులందరును కలుగజేసి కొన్నచో గుట్టుచెడ నని పేర్త్తిపెట్టక 'కొండఅకైన నిప్పు కృపకుండతీగాదలు యేమి చెప్పు దున్' అనియేమియు చెప్పదు ఆపుకొనలేని వ్యథను అతికరుణాత్మకముగ వెల్లడించుచు చాపోయినది. మూలమున ద్రౌపది కొంచెము గయ్యాళితనమును మిళాయించుకొనియుంట అనువాదమున తిక్కన సోమయాజి చేతిలో నాగయ్యాళితనము తగ్గి గడుసుదనము న వరుచు కొన్నది.

ఆత్మస్తుతితో తన అతిశయమును ప్రదర్శించుకొనుచున్న కీచకునకు ద్రౌపదీ వేషధారియగు భీముడు చమత్కారముగ నిట్లు సమాధానము పలుకుచున్నాడు-

మూలమున- దిష్ట్యాత్వం దర్శనీయోఽసి దిష్ట్యాఽఽత్మానం ప్రశంససి
త్వయాఽపీదృగ్గుణా నారీ శీలరూప సమన్వితా
అదృష్ట పూర్వా పశ్యేమాం యతో జానాసి సూతజ
ప్రదక్ష్యసిత్వం ముహూర్తేన యథేమాం స్త్రీగుణాన్వితాం
ఉపరంస్యసి కామాంశ్చ శీఘ్రం త్వం ద్రష్టుమర్హసి
వనమంగస్య సంస్పర్శో న తే దృష్టః కదాచన[3]

---

1,2 తి భా వి ప, ద్వి ఆ, ప 286,287,'42

3 వ్యా భా వి ప, అధ్యా 20 శ్లో 64 66

అనువాదమున—

తే. 'ఇట్టి వాఁడవు గావున నీవు నన్నుఁ
భోఁగడి కొనఁదగు సకల నాపోల్కి యాఁడు
దాని వెదకియు నెయ్యెడనైన నీకుఁ
బడయ వచ్చునె ? యెఱుఁగక పలికితిట్లు

క. గామొనలు చేర్చినప్పుడుఁ
నీకెమ్ము పలెట్లగునో దాని నీ వెఱిఁగెదు న
న్నేయు బలల తోడిదిగాఁ
జేయఁ దలంచితివి తప్పు నీనితి గంటె

క. నను మట్టి నీవు నెండియు
వనితల సంగతికి బోవువాఁడవె! యైనం
దనుఁ దేఁ బడసిన ఫలమే
కనియెద వికృ చిత్తభవ వికారము లెల్లన్[1]'

మొదటి రెండు పద్యములలో మూలభావము గతార్థము, కాఁగా మూడవ పద్యమున కవిబ్రహ్మ గంటమున అన్యత్ర అగుపించని చమత్కారము అలరారుచున్నది 'నాదు రూపంబు మనంబున నెక్కిన తరుణి తక్కొరుదు నేల సరకుసేయు' అనిన కీచకుని అహంకారమునకు దెబ్బకు దెబ్బ సమాధానము ఈ మూఁడవ పద్యము నందలి అర్థాంతరన్యాసము

భీమ కీచకుల మల్లయుద్ధము నర్తనాగారమున భీకరముగ జరుగుచుండ, వారి పోరాటమును వర్ణించుచు మూలము-

"స్పర్ధయా చ బలోన్మత్తౌ తౌ వృషౌ భీమకీచకౌ
నిశ్శబ్దం పర్యకర్షేతాం అన్యోన్యస్య వినిర్జయే"[2]

దీనికి తిక్కన అనువాదము రమణీయమేగాక అర్థవంతమును-

1 తి భా, వి ప ద్వి అ, ప 387-389

2 వ్యా భా, వి ప, అధ్యా 20 శ్లో 78

క. "తన యగపాటొరు లెఱుఁగు దు
రని సూతుఁగు సమయ భంగమగుటకు భీముం
డును గొంకుచుఁ జప్పుడు సే
యని గూఢ విమర్దన ప్రహారములఁ దగన్"[1]

భీమ కీచకులు భీకర రణము సల్పుచుండు శబ్దము కాదా యను సందే హము తానే ప్రశ్నించుకొని తిక్కన పరిష్కారము చూపెను. ప్రతి చిన్న విషయమున తిక్కనకు సూక్ష్మ పరిశీలనము సునిశితమగు చూపు కలదు. మూలాభిప్రాయమునకు సరిపోకమున తిక్కన అను వాదము చేసిన తావులెన్నియో గలవు.

ఉత్తర గోగ్రహణ యుద్ధమున అర్జునుని రాకకు ఆశ్చర్య చకితులైన తన పక్షము వారిని దుర్యోధనుడు హెచ్చరించు సంద ర్భమున మూలము—

"సంభ్రాంత మనసస్సర్వే ప్రాప్తే హ్యస్మిన్ ధనంజయే"[2]

దీనికి అనువాదము—

" .. ... ... . .. ... శత్రులం గనుగొని యుట్టు లొండొరు మొగంబులు సూచుచు నున్న వారునే[3]

సదా యుద్ధాభినివిష్టుడవని కృపుడు కర్ణు నాక్షేపించు సందర్భమున మూలము—

"సదైవ తవ రాధేయ యుద్ధే క్రూరతరామతిః"[4]

దీనికి అనువాదము —

---

1 తి భా, వి ప, ద్వి ఆ. ప 345
2 వ్యా భా, వి ప, అ 40, శ్లో 19
3 తి భా, వి ప, చ ఆ, ప 187
4 వ్యా భా, వి ప, వి అ 42, శ్లో, 2

'కయ్యమునకు నెపుడు కాలు ద్రవ్వుదు'[1]

అర్జునుడుత్తరునకు ద్రోణాచార్యుని నిరూపించు నపుడు

మూలము—

'యది మే ప్రహరేత్ ద్రోణశ్శరీరే ప్రహరిష్యతః
తతోఽస్మిన్ ప్రహరిష్యామి నాన్యథా యుద్ధ మస్తి మే'[2]

అనువాదము—

ఈతని తోడి కయ్యమున కియ్యకొనం దగ దేను దుష్ప్రథ
ద్యూత జయోద్ధతుండగు సుయోధనునిం బరిమార్పఁ బోవుచో
శాత శరోత్కరం బితఁడు చక్కఁగ నేయునొ నన్ను నేయఁడో
చూతము తాన మున్న నికిఁ జొచ్చి నజోత్తము గాక పిమ్మటన్[3]

ఈ పద్యము చివరి రెండుపాదముల విన్యాసము అర్జునుని వినయమును, తిక్కన తెలుగు దనమును ప్రకటించుచున్నది.

పూజనీయులైన ఆచార్యవర్గ మెదురుపడినప్పుడు తన సారథియైన ఉత్తరునితో మూలమున—

'మందం వాహాయ సారథే'[4] అనియుండ

దీనికి సరియగు అనువాదము—

'మన రథం బల్ల నల్లన చనఁగ నిమ్ము'[5]

మెల్లగ చనగ నిమ్మన్న అర్జునుడే కర్ణునెదురు పడినప్పుడు మూలమున.

'తేన మే యుద్ధ మానస్య శీఘ్రం వాహాయ సారథే'[6]

దీనికి అనువాదము—

ఇతఁ డుగ్రమైన చిచ్చు అతిం గ్రైషోయి పడుఁబడుదు
నీ వర వాయించుక లేక పరప వలయు రథంబున్[7]

---

1 తి భా, వి ప, చ ఆ, ప 207  2 వ్యా భా, వి ప, అ 19 శ్లో 7
3 ,, పం ఆ, ప 7  4 ,, శ్లో 14
5 ,, ప 10  6 ,, శ్లో 20
7 ,, ప 14

దుర్యోధనుని విషయమై అర్జునుఁ డుత్తరునితో మూలమున—

'లబ్ధ లక్ష్యో దృఢం వేధీ లఘు హస్తః ప్రతాపవాన్
తేన మే యుద్ధ మానస్య శీఘ్రం వాహయ సారథే[1]

తిక్కన అనువాదము—

ఉగ్రుఁడ నూన మాన మహిమోన్నత చిత్తుఁ డజయ్య విక్రమో
దగ్రుఁడు హస్తలాఘవ సమన్వితుఁ డేయు నెడన్ సమగ్ర కో
పాగ్రహ బుద్ధి మాడెస నవార్యుఁడు కార్యమునందు ధార్త రా
ష్ట్రాగ్రజుఁ డీతనిం గడిసి నప్పుడ పండువు నాకు నుత్తరా[2]

అర్జునుని నిరూపించుచు అశ్వత్థామ కర్ణునితో మూలమున—

'పునరేవ సభాం గత్వా ధార్తరాష్ట్రేణ ధీమతా
మాతులం పరిగృహ్యాశు మంత్రయస్వ యథా సుఖమ్[3]

అనువాదమున—

'తలకు గలదేని శకునిం బిలిచి విచారింపఁ బొమ్ము పృథివీ పతి నీ
తలన తన కార్య ఖడ్గంబుల మోపెక్కించె రత్త వోపునె నీవన్[4]

కర్ణుడు అశ్వత్థామకు చెప్పిన సమాధానము మూలమున—

'నాహం బిభేమి భత్స్నేర్న కృష్ణా ద్దేవకీ సుతాత్
పాండవేభ్యోపి సర్వేభ్యః క్షత్ర ధర్మ మనువ్రతః
సత్వాధికానాం పుంసాం హి ధనుర్వేదో సజీవినామ్
మహాతాం జాయతే దర్పః స్వరశ్చ న విషీదతి
పశ్యత్వాచార్య పుత్రో మా మర్జునే వాతి రంహసా
యుధ్యమానం సు సంయుక్తం జయో వై మయ్యవస్థితః[5]

దీనికి అనువాదమున—

---

1 వ్యాఖ్యా, వి ప, అధ్యా 49 శ్లో 22    2 తి భా, వి ప, పం ఆ, ప 15
3 " అధ్యా 60 శ్లో 5    4 " 23
5 " శ్లో 37 టు 39

'తలఁకెడు వానికిన్ మగఁడ తానఁట నన్నడిఁకించు వాఁడిసీ
పలుకకు భీతునట్లొదుఁగఁ బాఱునె శూరుఁడు నిన్ను వచ్చియే
కలనికి వచ్చితిన్ నరుఁడు కాఁడట వాసవుఁడైన నేమి నా
బలముఁ జలంబు నేరిమియు బంటుతనంబును నీవచూడుమీ'[1]

కర్ణార్జునుల యుద్ధమును వర్ణించుచు మూలమున—

స విస్ఫులింగోజ్జ్వల భీమ ఘోషః
కోపే స్థనః కేతు శిఖ శ్శరార్చిః
కర్ణాగ్ని రస్త్రానిల భీమ వేగో
బభౌ దిదృక్షన్నివ పార్థ కక్షమ్
స్వనేమి శంఖ స్వన భీమ ఘోషః
చల త్పతాకోజ్జ్వల భీమ విద్యుత్
పార్థాంబుద శ్శస్త్ర శరాంబుధారః'[2]

దీనికి అనువాదమున—

'రోషంబు భీషణ రూపమై చెలువొంద, నతుల కేతువు శిఖయై వెలుంగ
శరజాలములు పటుజ్వాలలై నిగుడ న, ర్కతనూభవోగ్రాగ్ని ప్రజ్వరిల్లు
నుద్ధతి నైపక యుజ్జ్వల దివ్య ప, తాక మెరుంగుగా దళిత ధరణి
రథనేమి రవము గర్జనముగ శరపరం, పరలు ధారలుఁగాఁగఁ బరఁగియుండె
నర్జునాంబుదం బనన్య సామాన్యస,
ముద్యమమున ముఖపయోరుహముల
కాంతి దఱఁగి యపుడు కౌరవసేనాస, రోవరంబు దీన భావమొంద'[3]

'అర్జునుడను మేఘము నుండి కురియుచున్న శరధారలకు కౌరవ వీరుల ముఖ పద్మములు కాంతి దరగినవి, అప్పుడు కౌరవ సేనాసరోవరము దీనభావ మొందినద'ను చక్కని విశేషము నిచట తిక్కన జోడించెను.
ఆచార్య ద్రోణు నెదుర్కొనునప్పుడు అర్జునుడుత్తరునితో మూలమున-

1 తి భా, విప పంఆ, ప 26    2 వ్యా భా, వి ప, అధ్యా 61, శ్లో 72 73
3 ,, ప 105

'యస్యాహం విష్ట స్సతతం మమ చేష్ట స్సదాచయః
క్షత్రధర్మం పురస్కృత్య తేన యోత్స్యామి సంయుగే'[1]

దీనికి అనువాదము—

కం. 'తన తనయు కంటె నెమ్మన
మున నాకుం గూర్చు భావమున గురులకు మా
ర్కొనియెదము రాజ ధర్మం
బున కీడునఁ జేసి యింత పుట్టగ వలసెన్'[2]

తాను విధిలేక యుద్ధమునకు సిద్ధపడినట్లు అనువాదమున స్పష్టీకృతము. ద్రోణార్జునుల సమరకేళి తిలకించుచు కురుసైనికు లాడిన మాటలుగ మూలమున—

'ద్రోణం హి సమరే కోఽన్యో యోద్ధు మర్హతి ఫల్గునాత్
రౌద్రః క్షత్రియ ధర్మోఽయం గురుంవై యద యోధయత్'[3]

అనువాదము—

కం. 'నరుఁడొక్కరుండు దక్కఁగ
గురుఁడు గడగి నప్పుడు మారుకొనఁ జాప ధరుం
డొరుఁడు గలఁడె? మతి వెదకిన
హరుఁడు గలం డింకఁ గలుగు ననరాఁ డెందున్'[4]

విదురోపదేశమున మూలమున—

'ఏకయా ద్వే వినిశ్చిత్య త్రీం శ్చతుర్భి ర్వశే కురు
పంచ జిత్వా విదిత్వా షట్ సప్త త్యక్త్వా సుఖీ భవ'[5]

అనువాదము—

తే. 'ఒకటిగాని రెంటి నిశ్చల యుక్తిఁ జేర్చి
మూఁటి నాల్గింటఁ గడు వశ్యములుగఁ జేసి
యేనిటిని గెల్చి యాఱింటి నెఱిఁగి యేడు
విడిచి వర్తించు వాఁడు వివేక ధనుఁడు'[6]

---

1 వ్యా భా, వి ప, అ ౭, శ్లో 28  2 తి భా, వి ప, పం ఆ, ప 120
3 ,, శ్లో 41  4 ,, ప 128
5 ,, అ 33 శ్లో 51  6 ,, ద్వి ఆ, ప 87

పై సందర్భముననే మూలమున—

'స్త్రియోఽక్షా మృగయా పానం వాక్పారుష్యంచ పంచమమ్
మహచ్చ దండ పారుష్య మర్థ దూషణ మేవచ'[1]

అనువాదము-

"వెలఁది, జూదంబు, పానంబు, వేఁట, పలుకు
ప్రల్లదంబును, దండంబుఁ, బరుసఁదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేత
యనెడు సప్త వ్యసనములఁ జనదు తగుల"[2]

కృష్ణుడు రాయబారమున కేగు సమయమున ద్రౌపది దీనతను వర్ణించుచు మూలమున-

'రాజ్ఞస్తు వచనం శ్రుత్వా ధర్మార్థ సహితం హితం
కృష్ణా దాశార్హమాసీన మబ్రవీచ్ఛోక కర్శితా'[3]

దీనికి అనువాదమున-

'ధర్మ నందను పలుకులు దనకు హృదయ
తాప మొనరింప మోమున దైన్య మొంద
నున్న పాంచాలి యిట్లని యొయ్యఁ బలికెఁ
గనలి శౌరితో గద్గద కంఠి యగుచు'[4]

అదే భాగమున ద్రౌపది మాటలుగ మూలమున-

"అయంతే పుండరీకాక్ష దుశ్శాసన కరోద్ధృతః
స్మర్తవ్య స్సర్వ కార్యేషు పరేషాం సంధి మిచ్ఛతామ్"[5]

దీనికి అనువాదమున-

క "ఇవి దుస్ససేను వ్రేళ్ళఁ
దవిలి సగము ద్రెవ్వి పోయి దక్కిన యవి కౌ
రవుల కడఁ దీఱు మాటల
యవసరమునఁ దలఁప వలయు నచ్యుత వీఁకన్'[6]

1 వ్యా॥ భా, ఉ ప, అధ్యా 33 శ్లో 99 2 తి భా, ఉ ప, ద్వి ఆ, ప 44
3 ,, అధ్యా 81 శ్లో 1 4 ,, తృ ఆ, ప 100
5 ,, శ్లో 36 6 ,, ప 116

ఇటులనే మూలమునగల—

> 'ఏకః స్వాదు నభుంజీత ఏకః కార్యాన్న చింతయేత్
> ఏకో న గచ్ఛే దధ్వానం నైకః సుప్తేషు జాగృయాత్'[1]

అనుదానికి అనువాదము—

> 'విను మధురాహారంబులు
> గొనుటయుఁ బెక్కండ్రు నిద్రగూరిన యెడ మే
> ల్కని యునికియుఁ గార్యాలో
> చనముఁ దెరువు నడచుటయును జన దొక్కనికిన్'[2]

మూలమున మరియొకటి—

> 'వనస్పతే రపక్వాని ఫలాని ప్రచినోతి యః
> సనాప్నోతి రసం తేభ్యో బీజం చాస్య వినశ్యతి
> యస్తు పక్వ ముపాదత్తే కాలే పరిణతం ఫలం
> ఫలాద్రసం స లభతే బీజాచ్చైవ ఫలం పునః'[3]

దానికి అనువాదము—

> "తనియఁ బండకుండ మును గోసికొనఁ జవి
> దేట కాదు విత్తు చేటుఁ గలుగుఁ
> బక్వమైనఁ గొనిన ఫలమిందుఁ జెడదు బీ
> జంబుఁ గార్యసిద్ధి చందమిట్లు'[4]

చివరిగా మూలమున—

> "యథామధు సమాదత్తే రక్షన్పుష్పాణి షట్పదః
> తద్వదర్థా మనుష్యేభ్య ఆదద్యా దవిహింసయా
> పుష్పం పుష్పం విచిన్వీత మూలచ్ఛేదం న కారయేత్
> మాలాకార ఇవారామే న యథాంగార కారకః"[5]

దీనికి అనువాదము—

---

1 వ్యా భా ఉ ప, అధ్యా 33 శ్లో 53
2 తి భా ఉ ప, ద్వి ఆ, ప 38
3 ,, అధ్యా 34 శ్లో 15, 16
4 ,, ప 56
5 ,, శ్లో 17, 18

"మాలకరి పుష్పములు గోయు మాడ్కిఁ దేఁటి
పువ్వుఁ దేనియ గ్రోలెడు పోల్కి నెదురు
కందకుండఁగఁ గొనునది కార్యఫలము
ద్రొగ్గులకుఁబోలె మొదలంటఁబోడువఁ జనదు "[1]

## కుమారవ్యాసుని అనువాద సరణి :

కుమారవ్యాసుని విషయమున గూడ అతడనుసరించిన మూలగ్రంథ మేది? యను విషయమున నిశ్చితాభిప్రాయము లేదు. కావున అనువాద విషయమున మనకు లభించు ప్రతులన్నిటిని పరిశీలించి మనమొక అభిప్రాయమునకు రావలసియున్నది. కుమారవ్యాసుడు భక్తిప్రధానముగ తన భారతమును భావించిన వాడగుట చేతను సామాన్యజనులు గూడ తన భారతమును పాడుకొనవలెనని తలంచిన వాడగుటచేతను విస్తారముగు వర్ణనా భాగములను కథకు అడ్డమువచ్చు ఉపాఖ్యానములను చాల వరకు పరిహరించి పాఠకునకు విసుగు జనింపకుండునట్లు తన గ్రంథమును తీర్చిదిద్ది సంగ్రహీకరణమున తనకు తానే సాటి యనిపించుకొన్నాడు. కుమారవ్యాసుడు సంస్కృత భారతమును అనుసరించినను అది కేవలము కథా సంవిధానమునకు పరిమితమై యున్నది. ఈ కథానుసరణము గూడ భావానువాదమాత్రముగ నున్నది. సంస్కృత భారతమున 3,500 శ్లోకములు కలిగినట్టి విరాటపర్వము కన్నడ భారతమున కేవలము 650 షట్పదులలో చెప్పబడినది. వ్యాస భారతమున 6,928 శ్లోకములలో నున్న ఉద్యోగపర్వము కుమారవ్యాసుని చేతిలో 714 షట్పదులుగ మలచుబడినది. దీనిని బట్టి అతడు ఎంత సంగ్రహముగ కథను నడిపించెనో మనకు తెలియుచున్నది. విరాట పర్వమున కథాగమనమును యథాతథముగ నడిపించినను ఉద్యోగ పర్వము రాజనీతి

[1] ఆ భా, ఉ ప, ద్వి అ, ప 67

ప్రధాన మగుటచేతను కవి రాజకీయవాది గాక భక్తిప్రధాను డగుట చేతను కుమారవ్యాసుని భారతమున రాయబారము లన్నియు తేలి పోయి కథాగమనమును మాత్రమే సూచింప గలిగినవి గాని కవితా ప్రతిభను చాటలేక పోయినవి వ్యాస భారతమును పలుమారులు అధ్యయనము చేసి దానిని తన మనసునందుంచుకొని తనదగు సొంత పద్ధతిలో నే కుమారవ్యాసుడు భారతమును రచించి యుండునని చెప్పవచ్చును

కుమారవ్యాసుడు తన భారతమును చాలవరకు సంగ్ర హించెనని చెప్పికొని యుంటిమి. ఎట్లు సంగ్రహించెనో కొన్ని ముఖ్య ఘట్టముల పరిశీలనమున చూడదగును

సంస్కృత భారతమున పాండవ ప్రవేశ పర్వము 327 శ్లోకములలో నున్నది. దీనిని కుమారవ్యాసుడు 30 షట్పదులలో ఒక సంధిగ మిక్కిలి సంగ్రహించి తెల్పెను. ఇచట మూలము ఆరవ వంతునకు సంగ్రహింపబడినది.

మూలమున కీచక వధ ఘట్టము 845 శ్లోకములలో చెప్ప బడినది దీనిని కుమారవ్యాసుడు సంగ్రహించి 152 షట్పదులలో చెప్పెను దక్షిణ గోగ్రహణము మూలమున 279 శ్లోకములలో చెప్పబడినది దీనిని కుమారవ్యాసుడు కేవలము 62 షట్పదులలో సంగ్రహించెను

మూలమున ఉత్తర గోగ్రహణ ఘట్టము ఇంచుమించు 1125 శ్లోకములలో చెప్పబడినది. దీనిని కుమారవ్యాసుడు కేవ లము 320 షట్పదులలో సంగ్రహించి చెప్పెను.

వివాహానంతరము తదుపరి రాజకార్య నిర్వహణమునకై విరాట సభలో సమావేశము మూలమున 89 శ్లోకములలో నున్నది. అది అనువాదమున 12 షట్పదులలో ముగింపబడినది.

మూలమున విస్తృతముగ గల ధర్మజ శల్యుల సంభాషణము 350 శ్లోకములుగ నున్నదానిని అనువాదమున ప్రధాన విషయము మాత్రము స్వీకరింపబడి 12 షట్పదులలోనే చెప్పబడినది

రాజనీతి విషయములందు తన కవితా ప్రతిభను చూపుట కంటె కథను ముందుకు నడిపించుకొని పోవుటయే కుమారవ్యాసుని లక్షణమని ముందుగనే తెలిసికొంటిమి కావుననే మూలమున 48 శ్లోకములలో నున్న ద్రుపద పురోహితుని రాయబారము-

"ద్రుపదరాజ పురోహితను కురు
నృపన నిత్తిలు బందు కండను
విపుళ మతి మాతాడిదను నిజరాజ కార్యియవ"[1]

అని ఒక్క అర్థ షట్పదిలోనే చెప్పబడినది.

మూలమున 250 శ్లోకములలో విస్తృతముగ నున్న సంజయుని రాయబారము 27 షట్పదులలో ముగింపబడినది

శ్రీకృష్ణుని రాయబారమునకు సంపుటకు పాండవుల సమాలోచనము మూలమున 300 శ్లోకములలో నున్నది. అనువాదమున 30 షట్పదులుగ సంగ్రహింప బడినది

కౌరవ సభలో కృష్ణుని ప్రసంగము మూలమున 63 శ్లోకము లుండగ, కుమారవ్యాసునిచే 7 షట్పదులు మాత్రమే చెప్పబడినవి.

నీతి ప్రధానములగు విదురోపదేశము, సనత్సుజాతీయము కుమారవ్యాసునిచే విపులముగ వర్ణింపబడినవి మూలమున 500 శ్లోకములలో నున్న విదురోపదేశము 132 షట్పదులయందును, మూలమున 200 శ్లోకములలో నున్న సనత్సుజాతీయము 114 షట్పదులయందును చెప్పబడినది ఈ ఘట్టములందు కుమారవ్యాసుడు వ్యాసుని భావితమును అనుసరింపక తాను పఠించిన పలు నీతి శ్లోకములను తన గ్రంథమునందు అనువదించెను.

---

1 కు వ్యా భా, ఉ ప, సం 2, ష 21

ఉదాహరణమునకు .

తైత్తిరీయోపనిషత్తు-

"ఆత్మన ఆకాశ స్సంభూతః ఆకాశా ద్వాయుః
వాయో రగ్నిః అగ్నే రాపః అద్భ్యః పృథివీ పృథివ్యా
ఓషధయః
ఓషధేభ్యో అన్నం అన్నా త్పురుషః"[1]

అనువాదము—

"అవని పతికేశాత్మనిం సం
భవిసి తంబరి వంబర నాళా
పవన పవన నాళగ్ని యగ్నియోళాదుదా భువన
భువనదిం ధరె ధరణి యిందు
ద్భవిసి తోషధి యోషధి గళిం
దవతరణ మన్నాది పురుష ప్రకృతి వికృతి గళ"[2]

విష్ణు పురాణము—

"ఉత్పత్తిం ప్రలయం చైవ భూతానా మాగతిం గతిం
వేత్తి విద్యా మ విద్యాం చ సవాచ్యో భగవానితి [3]

అనువాదము—

"సృష్టి సంహార దొళు భూత ద
కట్టళెగళ గతాగతి గళొళు
ముట్టిసిద విద్యెయొళ ప్రతిమనెనిసి
నష్టియొళు తుష్టియొళు మనవను
బిట్టు హిడియదె కాల కర్మవ
మెట్టినిత భగవంత నెనిసువ నరస కేళెంద'[4]

---

1 అధ్యాయం 1; వచనం 2

2 కు వ్యా భా, సర 4, ష 6

3 వి పు, అధ్యా 5, శ్లో 78

4 కు వ్యా భా, సంధి 4, ష 8

గరుడ పురాణము—

'త్యజ దుర్జన సంసర్గం భజ సాధు సమాగమం
కురు పుణ్య మహోరాత్రం స్మర నిత్యం జయాద్వయం[1]

అనువాదము—

'త్యజిసువుదు దుస్సంగవను మిగె
భజిసువుదు సత్సంగవను గజ
భజిసది రహోరాత్రియొళు ధర్మవన సంగ్రహిసు
భజిసు నిత్యానిత్య వస్తువ
విజయసహో యుహాపరకె తత్వద
నిజ విదెబె ధృతరాష్ట్ర చిత్తైసెందనా మునిప[2]

బ్రహ్మ బిందూపనిషత్—

'గవామనేక వర్ణానాం క్షీరస్యాప్యేక వర్ణతా
క్షీరవ త్పశ్యతే జ్ఞానం లింగినస్తు గవాం యథా[3]

అనువాదము—

'హాలవు వర్ణదొళెసెవ గో సం
కుల దొళొందే వర్ణదొళు కం
గొళిసు వీక్షిరామృతవు మైగొంగు తోర్పంతె
హోలబురెట్ట చరాచరం గళ
సుళివినొళు సుళి దపగ కడెయొళు
నిలువ నిజ నొందల్లదెర డిల్లెందనా మునిప'[4]

గరుడ పురాణము—

'ఏక వృక్షే సదా రాత్రౌ నానా పక్షి సమాగమః
ప్రభాతేన్యదిశో యాన్తి కా తత్ర పరివేదనా'[5]

---

1 గ పు, అ 108, శ్లో 26    2. వి వ్యా భా, స-ధి 4, ప 10
3 బ్ర ఉ, మంత్రం 19    4 ,, ష 18
5 గ పూ అ 112. శ్లో 46

అనువాదము—

నళిన మిత్రను పశ్చిమాంబుధి
గిళియె నానా పక్షి జాతిగ
ళలివృత్తె తందొందు వృక్షవనేరి రాత్రియను
కళెదు బెళబెళ గళిగె హారిద దొ
లిళెయ భోగాదృష్ట తిజెద
బళిక లోకాన్తరవ నైదువ నరసకేళెంద[1]

భర్తృహరి సుభాషితము—

'అజ్ఞస్సుఖ మారాధ్య స్సుఖతర మారాధ్యతే విశేషజ్ఞః
జ్ఞానలవ దుర్విదగ్ధం బహ్మాపి నరం న రంజయతి[2]

అనువాదము—

'జ్ఞానిగళ నొడు బడిస బహుద
జ్ఞానిగళ నహుదెనిస బహుదై
జ్ఞానలవవను కూడి కొంకిహ దుర్విదగ్ధరను
ఏన తిళుహలు బహుదు విష్వ
క్సేనగళ వల్లరస మిక్కిన
మానవర పాడావుదై హేళెంద నా మునిప'[3]

కుంతీ కృష్ణ సమాగమము మూలమున 107 శ్లోకములలో విస్తృతముగ నున్న దానిని కుమారవ్యాసుడు 9 షట్పదులలో సంగ్రహించెను. ప్రయోజన రహితమును అతి విస్తారమునునగు సప్తర్షుల హితము మూలమున 700 శ్లోకములలో నున్నది. అనువాదమున నామమాత్రముగ 5 షట్పదులలో చెప్పబడినది. భీష్మ ద్రోణ ధృతరాష్ట్ర గాంధారీ హితోక్తులు మూలమున 65 శ్లోకములలో నున్నది అది 7 షట్పదులలో ముగింపబడినది.

విశ్వరూప సందర్శనము మాత్రము మూలమున 16 శ్లోకములలో నున్నది సమముగ 8 షట్పదులలో చెప్పబడినది

1 కు వ్యా భా, సంధి 4; ష 18    2 భ సు, శ్లో 3
3 ,, ష 24

రాయబారపు టనంతరము కృష్ణుని కుంతియొద్ద సెలవు గై కొనుట మూలమున ఉపాఖ్యాన సహితముగ 206 శ్లోకములలో నున్నది కుమారవ్యాసుడు ప్రధాన విషయమును మాత్రము ఒకే ఒక షట్పదిలో చెప్పి ముగించెను.

కృష్ణ కర్ణ సమావేశము రసవత్తరఘట్టమైనను సంగ్రహీకరణ విషయమున తన దృష్టి కుమారవ్యాసుకు మీఱలేదు మూలమున 160 శ్లోకములలో గల ఈ సన్నివేశము 24 షట్పదులలో చిత్రింపబడినది

కృష్ణుని కౌరవ సభలోని విశేషములను పాండవులకు వివరించుట మూలమున వివరముగ 138 శ్లోకములలో నుండ అనువాదమున 11 షట్పదులలో మాత్రమే చెప్పబడినది

అంబోపాఖ్యానము, ఉలూకోపాఖ్యానము మూలమున విస్తరించి 700, 300 శ్లోకములలో చెప్పబడి యుండ, ఈ రెండు ఘట్టములును కుమారవ్యాసునిచే ఈ పర్వమున పూర్తిగ విడిచిపెట్టబడినవి

అనువాదము ఆరు విధములుగ పరిశీలింప దగునని చెప్పికొని యుంటిమి కుమారవ్యాసుని అనువాదము పై ఆరువిధముల నే రీతిని గ్రహింపబడినదో సంగ్రహముగ చూతము

## విపులీకరణము

కుమారవ్యాసుడు హాస్యప్రియుడు కావుననే ఉత్తర గో గ్రహణ ఘట్టమున గల హాస్యమును బహు విస్తారముగ చెప్పెను సంస్కృతమున ఈ హాస్యము కేవలము ఉత్తరుని ప్రగల్భములు, అర్జునుని తలక్రిందుల కవచ ధారణము, యుద్ధభూమిలో ఉత్తరుని పలాయనము వరకే పరిమితమైనది. కుమారవ్యాసుని భారతమున పైన పేర్కొనబడినవే గాక యుద్ధభూమిని ఉత్తరార్జునుల సంభాషణ రూపమున మరికొంత హాస్యము జోడింపబడినది ఇది 10 షట్పదులలో విపులముగ నున్నది

యుద్ధభూమికి వచ్చిన ఉత్తరుడు కౌరవసేనను చూచి మిక్కిలి భయపడి ఇంటికి వెనుతిరుగగ బృహన్నల ఉత్తరుని యుద్ధము

నకు ప్రోత్సహించు సందర్భములో "వీరులు యుద్ధభూమికి వెన్ను చూపుదురా? నేను నపుంసకుడ నైనను రణమునకు భయపడు చుంటి నేమో చూడుము"ని పలుకగ ఉత్తరుడు "నీవే వీరుడవు, నేనే నపుంస కుడను" అని నిష్ఠురముగ బదులు పల్కెను. అపుడు బృహన్నల యుద్ధభూమికి వెన్నుచూపించి పలాయనము చిత్తగించు వారికి అగు గరుగున మహాపాతకము చుట్టుకొనును సాహసముతో ముందడుగు వేసిన అశ్వమేధ ఫలము దక్కును మరణించిన వీరస్వర్గము, అప్స రసల సౌఖ్యము లభించును" అని పలుకగ ఉత్తరుడు "యుద్ధభూమికి వెన్నుచూపించువారి పాతకమును భూసురులు రూపుమాపుదురు అశ్వమేధమును ప్రత్యక్షముగ చేసి ఫలితము పొందవచ్చును నాకు అప్సరసల సౌఖ్యమక్కరలేదు. అంతఃపుర కాంతలే చాలును మా దొరతనమే మాకు ఇంద్రపదవి. నన్ను విడిచిపెట్టిన అదియే చాలునని పలికెను ఈ విధముగ సాగిన వారి సంభాషణము సందర్భో చితముగను, హాస్యయుక్తముగను ఉన్నది

ఉత్తరాభిమన్యుల వివాహ నిశ్చయానంతరము కుమార వ్యాసుడు శ్రీకృష్ణ పరమాత్మకు ప్రవేశము కల్పించి కథను విస్త రించెను మూలమున విరాటపర్వమున కృష్ణునకు ప్రాధాన్యము లేదు. అనువాదమున కృష్ణునకు తగిన ప్రాధాన్యము కల్పింపబడినది

వివాహ నిశ్చయానంతరము పాండవులు దూతచే నొక లేఖను శ్రీకృష్ణునకు పంపించినట్లు కుమారవ్యాసుడు మార్పు చేసి తన కృష్ణభక్తిని ప్రదర్శించుటయేగాక సమకాలీన రాజమర్యా దను తన గ్రంథమున ప్రకటించెను

పై లేఖయందు పాండవులు తాము అజ్ఞాతవాసము ముగిం చితి మనియు, కృష్ణ సందర్శనమునకై నిరీక్షించు చుంటిమనియు, తమను గుర్తించుటకు కౌరవులు జరిపిన గోగ్రహణములందు తమకే గెలుపు లభించినదనియు, విరాటరాజు తనకుమార్తె ఉత్తరను అభి మన్యున కిచ్చుట కేర్పరచెననియు వివరముగ వ్రాసిరి. అంతియే గాక

పాండవుల యాదవుల సంబంధము 4, 5 షట్పదులలో వివరింపబడినది ఇందు పాండవులకు కృష్ణునకు అభేదము చక్కగ చేర్కొనబడినది. ఇదంతయు కుమారవ్యాసుని కృష్ణభక్తికి, విపులీకరణమునకు ఉదాహరణము

విరాట సభలో సమావేశమున రాజుల నుద్దేశించి కృష్ణుడు మాటాడు సందర్భమున వైశంపాయను డిట్లుపక్రమించెను

మూలము—

కథాన్త మాసాద్య చ మాధవేన
సంఘట్టితాః పాండవ కార్యహేతోః
తే రాజసింహాః సహితాహ్య శృణ్వన్
వాక్యం మహార్థం సుమహోదయంచ"[1]

కృష్ణుడు పాండవులవిషయమున శ్రద్ధతీసికొనుటకు వారితో గల సంబంధమును కుమారవ్యాసుడు అనువాదమున చక్కగ వివరింప జేసెను

అనువాదము—

"కేళు జనమే జయ ధరిత్రీ
పాల కుంతీతనయ రున్నత
కేళిగెయ నెసెవన్తె కారుణ్య సింధువలా
శ్రీ లతాంగియ రమణ నినిబరొ
ళాళొడెయ తానెంబ భేదవ
బీళుకొట్టే నడె పతిర్దను తన్న మైదునర॥
హోలికెగె కొయ్యోడువ వేదద
తాళిగె గొణగిడువ ఘనతెయ
మేలె తన్నదు ఘనతె యెంబుద నత్తు బేఱిరిసి
కాలిగెఱగువనా యుధిష్ఠిర
నేన లోవ నేళువను కృష్ణన
లలె యనుపమ వెందు వైశంపాయ మునినుడిద"[2]

1 వ్యా భా ఉ ప, అధ్యా 1 శ్లో 9    2 కు వ్యా భా ఉ ప, సంధి 1 ప 12

[కుంతీ తనయుల ఔన్నత్యము వర్ణింప శక్యముకానిది. కృష్ణుడు వారితో ప్రభు, సేవక భావము లేకుండగనే మసలుచుండెను తన ఘనతను తెలుపుటకు వేదములకైనను శక్యముకాని శ్రీకృష్ణుడు ధర్మజుని పాదములకు నమస్కరించును కృష్ణునిలీల అనుపమము.]

కృష్ణుడు తన సాహాయ్యము కోరివచ్చిన దుర్యోధనునకును, అర్జునునకును సాయము చేయదలచి ముందుగ అర్జునుని కోరుకొనుమని తెలుపగ అర్జునుడు కృష్ణుని కోరుకొనును

ఈ సందర్భమున మూలము—

'ఏవ ముక్తస్తు కృష్ణేన కుంతీపుత్రో ధనంజయః
అయుధ్యమానం సంగ్రామే వరయామాస కేశవమ్[1]

కుమారవ్యాసుడు అర్జునుడు కృష్ణుని కోరుకొనుటయేగాక అందులకు కారణమునుకూడ చమత్కారముగ వివరింపజేసెను.

"మురమథన బిన్నహవు కౌరవ
నరస నతిసిరివంత నిద సిం
ధురిసలాపను బహళ యాదవసైన్య సాగరవ
ధరెయ సంపద విల్లదడవియ
తిరుకరాదె మగె నిబరను సం
తరిసలప్పుదె కృష్ణ! నీనే సాకు నమగెందు॥
నావు బడవరు బడవరిగె దిట
నీనె బెంబలవెంబ బిరుదను
దేవ కేళిదు బల్లె వెందను పార్థ కై ముగిదు"[2]

[మురమథనా! దుర్యోధనుడు శ్రీమంతుడు. యాదవసైన్య సాగరమును పోషింపగల సమర్థుడు. మేముసంపదలేక అడవిని తిరుగువారము ఈసైన్యమును సమర్థింపలేము కావున మాకు నీవే చాలును మేము దీనులము నీవు దీన రక్షకుడవని బిరుదు నందినవాడవు' అని అర్జునుడు చేతులు జోడించి పలికెను ]

1 వ్యా భా ఉ ప అ 7 శ్లో 9
2 [illegible]

## సంగ్రహీకరణము

కుమారవ్యాసుని భారతము సంగ్రహీకరణమునకు సాక్ష్యమని ముందుగనే తెలిసికొని యుంటిమి. ఇచట అతని సంగ్రహీకరణమున కొండు రెండు ఉదాహరణములను పరిశీలింతము

వివాహానంతరము రాజులెల్ల విరాటరాజు కొలువులో సమావేశమగుటయు వారిని గూర్చి కృష్ణుడు ప్రసంగించుటయు మూలమున—

'కృత్వా వివాహంతు కురుప్రవీరా
స్తదాఽభిమన్యోర్ముదితాః సపక్షాః

తస్థుర్ముహూర్తం పరిచింతయంతః
కృష్ణం నృపాస్తే సముదీక్షమాణాః'[1]

ఇత్యాదిగ ఎనిమిది శ్లోకములలో వివరముగ తెలిపిన దానిని కుమారవ్యాసుడు చాల సంగ్రహముగ అర్థషట్పదిలోనే చెప్పెను. అనువాదము-

'బందుదిన ఒడ్డోలగక్కె
తంద నఖిళావనియ రాయర
బృంద దొళు మురవైరి నుడిదను రాజకారియవ'.[2]

ద్రుపద పురోహితుని మాటలు వ్యాసుని భారతమున

'సర్వైరవశ్యం విదితో రాజధర్మః సనాతనః

ప్రయచ్ఛంతు ప్రదాతవ్యం మా వః కాలోఽత్యగాదయమ్'[3]

---

1 వ్యా భా ఉ ప, అధ్యా 1 శ్లో 1 8   2 కు వ్యా భా ఉ ప సంధి 1, ప 3
3 ,, అధ్యా 20 శ్లో 3-21

అనిఇట్లు 10శ్లోకములలో నుండగా కుమారవ్యాసుడు అర్థషట్పదిలోనే సంగ్రహించిన విధము మిక్కిలి రమ్యము

అనువాదము- 'ద్రుపద రాజపురోహితను కురు
నృపన నిత్తెలు బందు కంఠను
విపులమతి మాతాడిదను నిజరాజ కారియవ'[1]

### పరిహరణము :

కుమారవ్యాసుడు కథాగతికి అడ్డమువచ్చు విస్తృతములగు భాగములను పరిహరించుచు మూలమును తన భారతమున సంగ్రహించెను నహుషోపాఖ్యానము, విదులోపాఖ్యానము ఇత్యాదిగ విపులముగ నున్న ఉపాఖ్యానములన్నియు కుమారవ్యాసునిచే పరిహరింపబడినవి అట్టియెడ స్వల్పసంఘటనలను కుమారవ్యాసుడు పరిహరించెనని పేర్కొననవసరము లేకున్నను ఒకటిరెండు ఉదాహరణములను చూతము

అజ్ఞాతవాసమున కేగుచున్న పాండవులకు ధౌమ్యుడు కొన్ని హితవచనముల బోధించెను అవి మూలమున 40 శ్లోకములలో నున్నవి వానిని కుమారవ్యాసుడు పూర్తిగ పరిహరించెను.

జమ్మిచెట్టుపై పాండవులు తమ ఆయుధములను రహస్యముగనుంచు సందర్భమున వారుజయించిన రాజ్యములను, ప్రభువులను గూర్చి మూలమున చెప్పబడినది దానిని కుమార వ్యాసుడు పరిహరించెను.

సభయందు ప్రవేశించిన పాండవుల నొక్కొక్కరిని విరాటుడు వారిని గూర్చి ప్రశ్నించుటయు, దానికి వారు సమాధానమిచ్చుటయు మూలమున విస్తారముగ కలదు. కుమారవ్యాసుడు దీనిని పూర్తిగ పరిహరించెను,

---

1 కు వ్యా భా, ఉ ప, సంధి 2 ష 21

కీచకునిచే పరాభూతయైన ద్రౌపది విరాటుని నిందించు చుండగ ధర్మరాజు ఆమెను 'రాజసభలో ఆటకత్తెవలె ఏగలు పోవుచు రాజకార్యములకు విఘ్నము కలిగించు చున్నావ'నగ ద్రౌపది 'జూదరిభార్యకు ధర్మాధర్మము లేమి తెలియున'ని నిష్ఠురముగ పలికినట్లు మూలమున కలదు. అనువాదమున నిదిపరిహరింపబడినది.

ఉపకీచకుల మరణానంతరము ద్రౌపది మార్గమధ్యమున అర్జునునితో సల్లాపములాడుట మూలమున 7 శ్లోకములలో చెప్పబడెగ కుమారవ్యాసునిచే పరిహరింపబడినది.

రాయబారమున కేగుచున్న కృష్ణునితో ద్రౌపది మాటలుగ మూలమునగల

'అదాసాః పాండవాస్సంతు సాధ్యాస్సాయుధా ఇతి
మయోక్తే యత్రనిర్ముక్తా వనవాసాయ కేశవ'[1] అనుశ్లోకము

ద్రౌపది ప్రవృత్తికి సరిపడునది కానని తాబోలు పరిహరింపబడెను

అట్లే కౌరవసభలో కర్ణునుద్దేశించి భీష్ముడు పలికినట్లున్న మూలము ——

'నచేదేవం కరిష్యామో యదయం బ్రాహ్మణోఽబ్రవీత్
ధ్రువంయుధి హతాస్తేన భక్షయిష్యామ పాంసుకాన్
దుర్యోధనః సహామాత్యో వినశ్యతి నసంశయః'[2]

ఈ మాటలు కుమారవ్యాసుని భారతమున లేవు. ఈ విధముగనే సంజయుడు ఉపప్లావ్యమునుండి తిరిగివచ్చి కౌరవసభలో ధృతరాష్ట్రునకు నివేదించు సందర్భమున

మూలము——

'తత్రానిమిత్తతో వైవాత్మానం కశ్మలమావిశత్
తదాచ వక్షే విదురః సభాయాం కురుసంసి ది
సంజయోఽయం మహారాజ మూర్ఛితః పతితో భువి
వాచం నసృజతే కాంచిద్దీన ప్రజ్ఞోఽల్పచేతనః'[3]

---

1 వ్యా భా, ఉ ప, అధ్యా 82 శ్లో 28   2 వ్యా భా, ఉ ప, అధ్యా21 శ్లో18,19
3 „ అ, 50 శ్లో 11,12

అని మూర్ఛపోయినట్లు తెలుపగ కుమారవ్యాసుడు అది తీవ్రముగ నున్న దనుకొనెనేమో పరిహరించెను.

### అన్యథాకల్పనము :

మూలమున అర్జునుడు ధర్మరాజుతో పాంచాలాది దేశములు పెక్కులు పేర్కొనగ, అందు మత్స్యదేశము అజ్ఞాతవాసమున కనుకూల మనియు, సుఖకరమనియు ధర్మజుడు నిర్ణయించును. కుమారవ్యాసుని భారతమున ధర్మజుడే దేశములను వివరించుచు.

'బడగలవరదు మూడణరసుగ
ళ్ళొడె గెళెయ రాగిహరు తెంకణ
కడె యవరు కండిహరు కెలబలదవరు కొండెయరు
పడువణవ రతిక్రూరరు నమగె
న్నడగిరలు తెరవావుదెందెనలె'[1]

(ఉత్తరదేశము కౌరవుల అధీనమున నున్నది. తూర్పు దేశమువారు కౌరవులకు అత్యంత స్నేహితులు దక్షిణదేశపు వారు మనలను బాగుగ నెరిగినవారు. చుట్టు ప్రక్కలవారు చాడీకోరులు. పశ్చిమ దిక్కువారు అతిదుష్టులు )

అనిపలికి అయోమయస్థితి నుండగ అర్జునుడు కీచకుడు కౌరవులను పీడించుచు వారికి శత్రువయ్యెను. విరాటునికి అతని అండ కలదు. కనుకనే ప్రసిద్ధులైన కర్ణత్రిగర్తులను సహితము లెక్కింపక అతడు పశ్చిమరాజ్యమును పాలించుచున్నాడు. కావున విరాట నగరమున భయముండదని పలికెను. ఈ రీతిని అజ్ఞాతవాస స్థలమును అర్జునుడు నిర్ణయించెను.

ద్రౌపదిచే తిరస్కృతుడైన కీచకుడు అభిమానహీనుడై సుదేష్ణతో 'సైరంధ్రి నేవిధముగనైన నావశమగునట్లు చేయుము'ని వేడుకొనినట్లుగ మూలమున కలదు. అనువాదమున ద్రౌపదిచే తిర

1 కు వ్యా భా, వి ప సం 1, ప 2

స్మృతుడైన కీచకుడు సుదేష్ణ పాదములపై పడగ సుదేష్ణ 'హేళు చిత్తదసె' (మనసులోనిది చెప్పు) అని అడుగగ కీచకుడు లజ్జాపరుడై -

'బేరె బిన్నహవేను సతియర
నూరుమడి చెలువినలి చిత్తవ
సూరెగొంబవళిహళు నిన్నోలగద సతియరలి
మరిదళు మదనంగె జీవిస
లారె నాకెయ నొళగు మాడిసె
తోరవాడె తన్నాత గొళిసువిహ దిదువె నిర్వాహ'[1]

[అక్కా! వేరు విన్నపమేమున్నది నీపరివార కాంతలలో నా చిత్తమును దోచుకొన్న ఒక సుందరికలదు. ఆమెను నా అధీనము చేసినచో నేను జీవింపగలను లేకున్న నాకు చావుతప్పదు] అని పలికెను మూలమున - సుదేష్ణ తమ్ముని కోరికను తెలిసికొని జాలిపడి వెంటనే సమ్మతించినట్లు కలదు అనువాదమున కుమారవ్యాసుడు సుదేష్ణ తమ్ముని మనసును మళ్లించుటకు ప్రయత్నించి విఫలత చెందినట్లుగ మార్చెను.

కీచకునిచే అవమానితయైన ద్రౌపది రాజసభ కేతెంచి విరాటుని నిందించినట్లు మూలమున నుండగ అనువాదమున ధర్మరాజునే ద్రౌపది నిందించినట్లు కుమారవ్యాసుడు ఈరీతిని పలికించెను-

"ఎలెలె దేసిగ కంకభట్టనె
హలవు ధర్మవ బల్లె గడ నృప
తిలక గఱుహువుదేను సన్యాసి గళిగుచితవిదె"[2]

[ఓ కంకభట్టా! నీకు కొన్ని ధర్మములు తెలియును. రాజులకు వానిని తెలుపుట సన్యాసుల కుచితముకదా!]

త్రిగర్తులు దక్షిణమున గోవులు పట్టుకొనగ విని విరాటుడు యుద్ధసన్నద్ధుడగుచు ధర్మజ భీమ నకుల సహదేవులకు కూడ ఆయుధ

1 కు వ్యాభా, విప సంధి 2, ప 42
2 ,, 3, ప 20

కవచాదులనిచ్చి యుద్ధసన్నద్ధులను గావించినట్లు మూలమున కలదు అనువాదమున ధర్మరాజు యుద్ధమును చూచునెపముతో భీమ, నకుల, సహదేవులను వెంటనిడికొని బయలుదేరినట్లుగ మార్చెను. ఈ పరివర్తనము అనుచితముగా నున్నను దీనికి జానపదప్రభావము కారణమనుకొనవచ్చునేమో

ఉత్తర గోగ్రహణ విజయానంతరము ఉత్తరుడు విరాట సభను ప్రవేశించిన తరువాత అర్జునుడు గూడ లోనికి ప్రవేశించినట్లు మూలమున కలదు అనువాదమున అర్జునుడు అంతఃపురమునకు పోయి రత్నాంబరములను బొమ్మపొత్తికలకై ఉత్తరకిచ్చినట్లుగ మార్చబడినది

నిజస్వరూపములతో సింహాసనాధిష్ఠితులైన పాండవులను విరాటుడు చూచి దురుసుగ మాటాడగ అర్జునుడు తమ నెరుకపరుచుకొనినట్లు మూలమున కలదు విరాటుడు పాండవులనుచూచి ఆశ్చర్యపడగ ఉత్తరుడు వారిని పరిచయము చేసినట్లుగ కుమారవ్యాసుడు ఉచితమగు మార్పు చేసెను.

విదురునింట కృష్ణుడు విందు స్వీకరించు పట్టున మూలమున -
'తతః క్షత్తాఽన్న పానాని శుచీన్ గుణవంతిచ
ఉపాహార దనేకాని కేశవాయ మహాత్మనే
తైస్తర్పయిత్వా ప్రథమం బ్రాహ్మణాన్మధు సూదనః
వేద విద్భ్యో దదౌ కృష్ణః పరమద్రవిణాన్యపి'[1]

అని మధురాహారములతో విదురుడు మృష్టాన్నతృప్తులను గావించినట్లు చెప్పబడియుండ కుమారవ్యాసునిచే విదురుని ఇంట కృష్ణుని ఆతిథ్యము నిరాడంబరముగ చిత్రింపబడినది.

కృష్ణుడు తన ఇంటికి వచ్చుటనుచూచి విదురుడు ఆనందముతో నాట్యము చేసినాడని అనువాదము-

---

1 వ్యా భా, ఉ ప, అ 89, శ్లో 89

'నోడిదను మనదణియ మిగె కొం
డాడిదను బీదియలి హరిదెడె
యాడిదను భ్రమె యాయ్తు విదురంగెంబ గావళియ
కూడి కుణిదను మనెయ ముఱిదీ
డాడిదను మైమఱెదు హరుషద
గాడికెయొళప్రతిమ నెసెదను భక్తికేళియొళు

[మనస్సు సంతృప్తి చెందునట్లు చూచెను. అధికముగ కొనియాడెను. వీధిలోనికి పరుగిడి అటుఇటు గంతులు వేయసాగెను. విదురునకు మతిస్థిరము తప్పినదనునట్లు నాట్యము చేయసాగెను. ఇల్లంతయు విడువక తిరుగసాగెను హర్షాతిరేకమున మైమరచెను. ఈ విధముగ విదురుడు భక్తికేళిలో అప్రతిముడుగ ప్రకాశించెను ]

అంతియేగాక విదురుడు కొంచెముపాలు పాత్రము కృష్ణునికిచ్చి నట్లు అనువాదము—

పాల్గణ

లోకవ మలగువ విష్ణు విదురన
నిళయదొళి గొక్కుడితె పాలన హసివ నూకిదను
హాలబుగెవసిద నిఖిళ నిగమం
గళను తన్న తికెయలి భజకం
గొలిదు తానైతరలు కరుణద ఘనతెయెనె లోక'[2]

[పాలసంద్రమున పవళించు విష్ణువు విదురుని ఇంటియందు గ్రుక్కెడు పాలతో ఆకలి తీర్చుకొనెను తన్ను తెలిసికొన దలచిన నిగమములకును అందని అతడు భక్తునిపై గల ప్రేమచే తానేవచ్చెను. కరుణయొక్క ఘనతయని లోకము మెచ్చెను.]

కృష్ణుడు కౌరవ సభకు రాయబారిగ పోయినపుడు ముందుగ శకుని దుర్యోధనాదులువచ్చి సభకు రమ్మని ఆహ్వానించినట్లుగ మూలమున.

---

1,2 ఏ. వ్యా ౯, ఉ ప, సంధి 8, ప11,14

'అథ దుర్యోధనః కృష్ణం శకుని శ్చాపి సౌబలః
సంధ్యాతిష్ఠంత మభ్యేత్య దాశార్హ మపరాజితమ్
ఆచక్షే తాంతు కృష్ణస్య ధృతరాష్ట్రం సభాగతమ్'[1]

అనియుండగ కుమారవ్యాసుని భారతమున విదురుడు వెళ్ళి దుర్యోధనునితో కృష్ణుని రాకను తెలిపినట్లును అందులకు దుర్యోధనుడు మరునాడు సభలో కనబడుమని చెప్పినట్లును మార్చబడినది విదురుని దుర్యోధనుని చెంతకు కృష్ణుడే పంపినట్లు అనువాదము—

"మురమథన నాకుంతి గెల్లవ
నొరెదు విదురన కరెదు కౌరవ
నరమనెయ సమయవను నోడిదు నమగె హేళెంద॥
నాళె బర హేళెందు విదురన
బీళుకొట్టను బేహభటరిగె
వీళెయవ నీడిదను హరిదుదు రాయ నాస్థాన"[2]

[మురమథనుడు కుంతికి ఎల్ల విషయములను వివరించెను. ఆపైన విదురుని పిలిచి కౌరవుని అంతఃపుర సమయము చూచి తనకు తెలుపుమనెను

కురుపతి రేపు కనబడుమని చెప్పుమని విదురుని పంపివేసెను వీరులగు భటులకు తాంబూలమునిచ్చెను. అంతటితో సభ చాలించెను]

కృష్ణుని సాహాయ్యము నర్థించుటకై దుర్యోధనుడు ముందుగ పోయినట్లును తదుపరి అర్జునుడు పోయినట్లును మూలమున—

"తతః శయానే గోవిందే ప్రవివేశ సుయోధనః
ఉచ్ఛీర్షతశ్చ కృష్ణస్య నిషసాద వరాసనే
తతః కిరీటీ తస్యాను ప్రవివేశ మహామనాః
పశ్చాచ్చైవ స కృష్ణస్య ప్రహ్వోఽతిష్ఠత్కృతాంజలిః"[3] అని

1 వ్యా భా ఉ ప అ 93, శ్లో 7,8

2 కు వ్యా భా, ఉ ప, సంధి 8, ష 28

3 వ్యా భా, ఉ ప, అ 7, శ్లో 6, 7

యుండ అనువాదమున దుర్యోధనుడు కృష్ణ సహాయము కోరి వెళ్ళు చున్న సంగతి చారులవలన విని అతనికంటె ముందుగనే వెళ్ళదలచి అర్జునుడు దుర్యోధనునికంటె ముందుగ బయలుదేరి కృష్ణుని మందిరము ప్రవేశించినట్లు మార్చబడినది

అనువాదము—

"ముకుళ కరపుటనాగి భయ భర
భకుతి యలి కలి పార్థ నబుజాం
బకన నెబ్బిసలమ్మదియ్యన చరణ సీమెయలి
అకుటిలను సారిదను బళికా
వికళ దుర్యోధనను నిగమ
ప్రకర మాళియ మాళి యత్తలు సార్ద నుంగిసిద"[1]

[చేతులు జోడించి భయ భరిత భక్తితో వినయుడగు పద్మనాభుని అబ్జాంబకుని నిదుర లేపనేరక మెల్లనవెళ్ళి పాదముల చెంత కూర్చుండెను. తరువాత దుష్టుడగు దుర్యోధనుడు వచ్చి నిగమ ప్రకరముల మాళియొక్క మాళి చెంతకు చేరి కూర్చుండెను ]

మాతనకల్పనము :

అరణ్యవాసమును పూర్తిగావించుకొని అజ్ఞాతవాసమును గడుపుటకు నేగు పాండవులు మార్గమధ్యమున వశిష్ఠాశ్రమమును దర్శించినట్లు కుమారవ్యాసుడు కల్పించెను. ఇది అమూలకము.

భీమాదుల అజ్ఞాతవాసకాల, కరాతు నిర్ణయములను విని ధర్మజుడు మిక్కిలి దుఃఖించును. అప్పుడాతని దుఃఖమును నివారించుటకు భీమాదులు ధర్మజునితో

"ఒడల బళి నెళలింగె గతి బే
ర్పడే సిడలడె సుఖ దుఃఖ విగ్ద ని
ష్మడి గళలి తను సొల్కరలి జీవాత్మ సిలుకు గె

1 కు వ్యా భా, ఉ ప, సం 3, ష 34

అడవియే సామ్రాజ్య మిమ్మడి
యెడ నిరలు నీవిల్లదాపుర
వడవి నమగనాడెందు బిన్నవినీదరు భూపతిగె"[1]

[నీడ వృక్షమును విడచి వేరుగ నుండునా? నీవు వృక్షము, మేము నీ నీడలము కాబట్టి సుఖ, దుఃఖములను నీతోనే అనుభవించెదము. మా యీ నాలుగు శరీరములకు నీవే జీవాత్మవు. నీవు చెంతనున్నపుడు మాకు అడవియే సామ్రాజ్యము. నీవులేని పట్టణము కారడవియే] అని పలికిరి ఇది చాల యుత్కృష్టమగు కల్పనము

శమీ వృక్షముపై పాండవులు తమ ఆయుధములను దాచిరి అపుడు ధర్మరాజు దిక్పాలుర నిట్లు ప్రార్థించెను

"ఈవుదా జేడిదరె పార్థం
గీవు నీయజ్ఞాతవాస దొ
ళ్ విగడ భీమంగె కోపదిరి యెనలు ఖతి గొండ
నీవు కుంతియ మక్కళాదిరి
నావు దుర్యోధన నవరు త
ప్పావుదు దిదకిం దనిల సుత నొడొత్తి గర్జిసిద
సునికర కాదిరలి మేణ్
ధరణి కొడె సెందెనలి హాస్తిన
పురకె బాళియ నిడువె నమ రర మొరెగళ తివిడు
ఉరుతరాస్త్రవ నొయ్యెనెంద"[2]

[తనకు (ధర్మజునకు) అర్జునునకు తప్ప ఆయుధములను భీమునకు గాని అన్యులకు గాని ఈయవద్దని ధర్మజుడు వేడుకొనగ భీముడు కోపదగ్రుడై మీరే కుంతీపుత్రులు. మేము దుర్యోధనుని పక్షమువారము ఈ ఆయుధములకు దేవతలు కావలియున్నను,

1 కు వ్యా భా, వి ప, సంధి 1; ష 9
2 ,, ష 14, 15

భూదేవి ఈయకపోయినను నేనుమాత్రము పడిలిపెట్టక ఈ అస్త్రములను తీసికొని హస్తినపై దాడిచేయుదును] అని ఆర్భాటము చేసెను. జానపదరీతి కుచితమగు ఈ భీముని ఆవేశము అమూలకమగు పక్కని రచనము.

కీచక వధను వర్ణింపుటకు ముందు-

"రావణను మున్నందు సీతా
దేవి గళుహిద కథెయ వోలు సం
భావిసె కీచక విడంబన వెండనా మునిప"[1]

[వెనుకటికి రావణుడు సీతాదేవిని దుఃఖపెట్టిన కథను బోలినది కీచకుని కథ] అని చెప్పెను. ఇట కవి ద్రౌపదీ కీచకులను సీతా రావణులతో పోల్చెను భావనాపరమగు నియ్యది అమూలకము.

కీచక వధ వృత్తాంతమును తెలిసికొనిన దుర్యోధనుడు స్త్రీ కారణముగ కీచక వధ కావింపబడినది. కావున 'ఆ స్త్రీ ద్రౌపది యనియు, చంపిన గంధర్వుడు భీముడే యని నిశ్చయించి ఈ విధముగ తలపోసెను.

"దూషి యులి సమబలరు భీమ స
గాధ దలి బలభద్ర, కీచక, శల్య రెంబవరు"[2]

[భీమ, బలభద్ర, కీచక, శల్యులు సమాన బలము కలవారు] కావున భీముచే కీచకుని చంపెనని నిశ్చయించుట అమూలకము. కౌరవులు ఉత్తర దిక్కున గోవులను వశపరచుకొని అచటనున్న గోపాలకుని నాసికపైన సున్నపు గుర్తు పెట్టి అతనిని అపహాస్యము చేసి విరాట నగరమునకు పంపినట్లు అనువాదమున కలదు. జనపదుల ఆసక్తికరమగు హాస్య నిరూపణమే ఈ కల్పనము.

---

1 కు వ్యా భా, సంధి 2, ష 2,
2 ,, సంధి 4, ష 9

కౌరవులచే అవమానము పొందిన గోపాలకుఁడు విరాట నగరున ప్రవేశించి స్త్రీజన మధ్యస్థుఁడగు ఉత్తరున కెరిగింపగ

"నూఱు కున్నియ నాహవద భీ
తాకుళను తానీగ హెండిర
సోకి బదుకువ లొల్యతెయ లొత్తైసి బందెనగె
కాక బళసువ నినను తాను
ప్రేకిసువ సమరదలి నిలలు పి
నాకధరనిగె తీరదెందను హెంగళెదిరినలి"[1]

[ఈ కుక్కను కొట్టుడు. బ్రతుకుమీది ఆశతో పారిపోయి వచ్చి నన్నే యుద్రేక పరచుచున్నాడు. నన్నెదిరించుటకు నాకాధిపతికిని సాధ్యము కానిపని] అని ఉత్తరుడౌద్ధత్యమున గోపాలకు నవమాన పరచుట వక్కాని హాస్య సన్నివేశ కల్పనమే.

దుర్యోధనుడు, అర్జునుడును తన సాయము కోరి వచ్చినపుడు మూలమున కృష్ణుడు-

'తవ పూర్వాభిగమనాత్ పూర్వం చాప్యస్య దర్శనాత్
సాహాయ్యముభయోరేవ కరిష్యామి సుయోధన'[2]

అని దుర్యోధనునకు వెంటనే సాహాయ్యము చేయుటకు సిద్ధపడినట్లు చెప్పబడియుండ కుమారవ్యాసునిచే కృష్ణుఁడు దుర్యోధనుని నీతి గరపినట్లుగ ఒక నూతన ఘట్టము కల్పింపబడినది. కృష్ణుని ఉదాత్తతను ప్రకటించుటకిది వక్కాని కల్పనము

కౌరవేశ్వర కేళు ధరణీ
నారి యూరొడె నొక్కతన వి
ద్దార మెచ్చిదళార సంగత పురియ హోయిదళు
భూరి మమకార దొళు నృపరు వి

1 కు వ్యా భా సంధి 6, ష 13
2 వ్యా భా, ఉ ప, అధ్యా 67, శ్లో 14

చారిసదె ధరె తమ్మదెందే
నారకద సామ్రాజ్యకైదువరెందు హరి నుడిద!
నాడిగోసుగ సోదరరు హో
ర్దాడి హరిహంచాదరెంబుద
నాడ దిహుదే లోక కమలజను సిరి హొన్నబర
బేడకట నిమ్మొళగె నీవ్ కై
గూడి బదుకువు దొళ్ళితాంవ్ నెరె
నోడి సంతస బడువె నెందను దానవ ధ్వంసీ!

తగరెరప ఖతిగొళిసి బలుగా
ళగవ నోడువరంతె నిమ్మను
తెగెతెగెదు కలిమాడి బిడువరు ఖుల్లరాదవరు
నగుత హెరె హింగువరు పిసుణరు
బగుళిదవదిరు బళికకడెయొళు
హొగువిరై సీవిబ్బరపకీరితియ హోదరకే"[1]

[కౌరవేశ్వరా! విను ఈ ధరణీ నారి ఎవరితోనైన ఒక్కరితో నిలిచినదా? ఎవరినైన మెచ్చినదా? ఎవరితోనైన అగ్ని ప్రవేశము చేసినదా? రాజులు అధికముగ మమకారము పెట్టుకొని కొంచెము కూడ విచారింపక ఈ భూమి తమసేయని భావించుకొని నరక సామ్రాజ్యమును చేరుదురు

రాజ్యముకొరకు సోదరులు పోట్లాడి నశించిరని లోకము బ్రహ్మదేవుడు ఆయువు నిచ్చినంతకాలము నిందించును అయ్యో! వద్దు మీలో మీరు ఒకటిగ కలసి బ్రదుకుట మంచిది అదిచూచి మేము సంతోషపడుదుము రెండుపొట్టేళ్ళను రెచ్చగొట్టి ఒకదానితో నొకటి పోరాడునట్లుచేసి వినోదమును చూచువారివలె దుర్మార్గులు మిమ్ములను గుచ్చి గుచ్చి రెచ్చకొట్టుదురు మీరు కలహించు

1 కు వా భా, సంధి 1, ప 28 నుండి 30

కొనునప్పుడు అపహాస్యము చేయుచు తమకు తాముగా జారుకొందురు. ఏవంబె మీరిరువురును అపకీర్తికి గురియగుదురు ]

కృష్ణుడు దుర్యోధనార్జునులకు సహాయము చేయగోరి యుద్ధముచేయని తానొక పక్షము, యుద్ధముచేయు సైన్యమంతయును నొక పక్షము అని నిర్ణయించి అర్జునుని కోరుకొనుమనగ కృష్ణుని మాటను సందేహించి దుర్యోధనుడు తాను ఆయుధము పట్టనను మాట నిలుపుకొనుమని కృష్ణుని ప్రార్థించుటయు దానికి కృష్ణుని సమాధానమును అను ఈ చిన్ని వేళ కల్పనము దుర్యోధనుని దుశ్శీలతను కృష్ణుని పురుషోత్తమత్త్వమును ప్రకటించుచు కుమారవ్యాసుని కల్పనా శక్తికి ప్రతీక యగుచున్నది.

ఈటువ కార్యకె కడెయొళావే
హోరగు నాకంతిరలి నీ హొ
క్కాటియలాగదు మత్తాయుధవనే బేడి కొళ్ళెను"[1]

[విశేష కార్యము కలిగినప్పుడు చివరకు మేమే పరాయి వారము. పోనీ, ఆ విషయమట్లుండ నిమ్ము. నీవు యుద్ధమున ఆయుధమును ధరింపరాదు. మరల అదే వేడుకొనుచున్నాను.]

అని దుర్యోధనుడు పలుకగ దానికి కృష్ణుడు
"మొలెయ నుంబంగొబ్బ దనుజెయ
హిళిదుకొండెవు శకటనను తను
గళెదె నగ హాయు వత్స ధేనుక వృషభ భుజగరను
బలుగజవ మల్లరను మావన
సెళెదు మాగధ బలవ బత్తి తై
దళిసిదెవు బానవర హిండిదెవు హాహావ్యగ్రగాళెరు!
కాలయవనన దంతవక్త్రన
సీళిదెవు ముర నరక శంబర

1 కు వ్యా భా, ఉ ప, సంధి 1, ప 88

సాలువన పౌండ్రకన శిబికన హంస మోహారవ
కాళగ నొళ్ళట్టిదెడు బాణన
తోళ తఱివందాన్త్రు భాళా
ధూళి యాగాహవ విందు మాళియొళెమగె మునిసినొళు!
హాసుళెతన మొదలాగి గలుర
కర్కస దొణన తలెమెత్తి రణ దా
యసువ నైరిసి హొద్దు కొందెవు కోటి దానవర
మిసుక లారెవు చక్ర భండా
రిసితు ముక్కన జవ్వనద బల
మసిళె తాపుండాకె భట్టరు నృపతి కేళెంద! [2]

[పాలు త్రాగి ఒక రక్కసిని సంహరించితిని. శకటుని చంపితిని. పాపులగు అశ్వ, ధేనుక, కాళిందులను, వీరులగు మల్లురను, మహామయగు కంసుని సంహరించితిని. మగధ సైన్యములను జయించితిని, రాక్షసుల శిరములను యుద్ధభూమియం దెగుర గొట్టితిని కాలయవనుని, దంతవక్త్రుని చంపితిని. ముర, నరక, శుంభులను, సాలువుని, పౌండ్రకుని, డిభకుని, హంసుని యుద్ధభూమికి బలి చేసితిని. బాణాసురుని చర్మమొలిచితిని. నేను కోపించిన చంద్రశేఖరుడును నా యెదుట నిలువడు చాలమంది రాక్షసులతో పోరాడి పోరాడి అలసిపోయితిని కోట్ల దానవుల సంహరించినది చాలును. చక్రము మొరటుపోయినది మునుపటి యౌవనము సడలి బలము తగ్గినది. మేము తిని కూర్చుండవలసిన వారమైతిమి.

**యథాతథానువాదము :**

కుమారవ్యాసుడు బ్రాహ్మణ మతాభిమాని. కావుననే తనకు పూర్వము భారతమును రచించిన 'పంప' మున్నగువారు తమతము మత

2 కు వ్యా భా, ఉ ప, సంధి 1, ప 37 నుండి 39

ప్రభావము ననుసరించి కథను యథేచ్ఛగ మార్చివైచియుండ తాను యథాతథముగ ననుసరించెనేగాని ప్రధాన కథాసరణికి భంగకారులగు స్వకీయములగు కల్పనలేమియు చేయలేదు. కుమారవ్యాసుడని నామధేయము నుంచుకొనినందులకుగాను ఇది వ్యాసునకు చెల్లించిన గౌరవముగ మనమూహింప వచ్చును. భారతమును పలుమార్లు పఠించి కథను ఆత్మసాక్షాత్కారము గావించుకొని రచించిన వాడైనను మూలమునందలి శ్లోకములను యథాతథముగ ననువదించినవియు పెక్కుగలవు. అట్టి వానినన్నింటిని చూపుట అసాధ్యము. కావున కొన్నిటిని మాత్రము పరిశీలింతము.

మూలము—

'ఉవాచ కృష్ణాం పరిసాంత్వయం స్తదా
మృగేంద్ర కన్యామివజంబుకోవనే'[1]

అనువాదము—

'బలిదు సింహద సతిగె నరి మన
వసువు వంతిరె .. . . ..
. . .. .. బిదిద బాలకియబళిగె'[2]

మూలము—

'కా శక్తిర్మమ సారథ్యం కర్తుం సంగ్రామ మూర్ధని
గీతం వా యదివా నృత్తం వాదిత్రంవా పృథగ్విధం
తత్కరిష్యామి భద్రంతే సారథ్యంతు కుతోమమ'[3]

అనువాదము—

'భరత విద్యా విషయగలి పరి
చరియుతెన నమగల్లదీ సం
గరద సారథితనవ మరెదెవు హేలవుకాలదలి'[4]

మూలము—

1 వ్యా భా వి ప అ 14, శ్లో 11    2 కు వ్యా భా, వి ప సంధి 2 ష 13
3 వ్యా భా, వి ప, అధ్యా 37 శ్లో 20,21    4 ,, 4, ష 40

'ఉత్తిష్ఠ గచ్ఛ సైరంధ్రి కీచకస్య నివేశనం
పానమానయ కల్యాణి పిపాసా మాం ప్రబాధతే'[1]

అనువాదము—

'... .. .. పాంచాలియను కరసిదళో
నయవిహీనె సుదేష్ణె బందా
కెయను బెససిద కెలెగె అనుజా
లయదొళుత్తమ మధువ నీఘుడి తెయలి తహొందెందు'[2]

మూలము—

'అనిత్యాని శరీరాణి విభవో నైవ శాశ్వతః
నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యో ధర్మసంగ్రహః'[3]

అనువాదము—

'కాయవిదు నెలెయల్ల సిరి తా
మాయరూపిన మృత్యుదేవతె
బాయబిడుతిహుళాపురదీలన కాలగతి యెందు
దాయవళిదు మహాత్మరెదకెస
హాయ ధర్మవ రచిసువుదు ని
ర్దాయదొళె కైసూరె గొళ్వుదు ముక్తిరాజ్యవను'[4]

[దేహము, సంపద శాశ్వతములు కావు. మాయారూపమైన మృత్యువు కాలము కొరకు నోరు తెరచుకొని యుండును. కావున ధర్మాచరణము గావించి ముక్తిని పొందవలెను]

మూలము—

'తే పుణ్యమాసాద్య సురేంద్రలోకమశ్నన్తి
దివ్యాన్ దివి దేవభోగాన్
తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి'[5]

---

1 వ్యాభా, వి ప, అధ్యా 14 శ్లో 10 2 కు వ్యాభా, వి ప, సంధి, 3 ష 1
3 „ అధ్యా 18 శ్లో 18 4 „ సంధి 4 ష 11
5 „ అ 9 శ్లో 20

అనువాదము—

"అతిశయద సుకృతవను విరచిసి
గళిపడెదు స్వర్గాది భోగో
న్నతికెయను భోగిసిద నమన్తరదొ శివనిగొబు
పతన తప్పదు."[1]

[అధిక పుణ్యమువలన స్వర్గాది భోగములు లభించును. భోగము లనుభవించిన తరువాత మరలభూమిపై పతనము తప్పదు.]

మూలము—

'రాజ రాష్ట్రకృతం పాపం రాజపాపం పురోహితః
భర్తా చ స్త్రీకృతం పాపం శిష్యపాపం గురుర్వ్రజేత్'[2]

అనువాదము—

"పృథవి గొళిళ గుపయిసువ పాతక
విషదు భూపనదు పురోహిత
నడెగె బళికా మూర్ఖ శిష్యన దోష గురువింగె
మడది మాడిద పాతకవు పతి
గొదలిహుదు పరమార్థదీ పరి
విడియ నతియదె కెణుతిహుదు జనవెందనా మునిప"[3]

[ప్రజలచేత చేయబడిన పాపము రాజును పొందును. రాజకృతపాపము పురోహితుని పొందును. మూర్ఖశిష్యుని పాపము గురువును, భార్యచేసిన పాపము భర్తను పొందును. ఈ పరమార్థము తెలియక జనులు చెడిపోవుచున్నారు.]

మూలము—

'అగ్నిర్దేవో ద్విజాతీనాం మునీనాం హృది దైవతం
ప్రతిమా స్వల్పబుద్ధీనాం సర్వత్ర సమదర్శినామ్'[4]

అనువాదము—

1 కు వ్యాఖ్యా, ఉ ప సంధి 4 ష 14    2 వ్యాఖ్యా ఉ ప, అ 4 శ్లో ౭౭
3 ,, ,, 4, ష 19    4 ,, అ08, శ్లో 28

'సిలెయ రూపను మూఢరుగళ
గ్గళెయ పావకనను మహీసుర
రికరొళగె పరమాత్మనే పరదైవ తానెందు
ఒలిదు పూజిసుతిహరు హృదయాం
గళదొళగె పరయోగిగళు కై
వళసువుదు జగదీప్రకారదొ కరసకేళెంది'[1]

[విగ్రహమును మూర్ఖులు ఆరాధింతురు బ్రాహ్మణులు అగ్నినారాధింతురు. యోగులు తమహృదయాంగణమునందే పరమాత్మను ధ్యానింతురు.]

మూలము—

'త్రిభిర్వర్షైః త్రిభిర్మాసైః త్రిభిఃపక్షైః త్రిభిర్దినైః
అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవ ఫలమశ్నుతే'[2]

అనువాదము—

'వరుష మూఱుమాస మేఱా
అఱొళు పక్షత్రయ దొళగె బం
దఱుహువుదు దిన మూఱఱొళు సందేహవేనిదకె
ధరెయొళుత్కట పుణ్యపాప
త్కరద ఫలవిహుదల్లి సూచిసి
మరళువుదు పరలోకదెడె గవనీశ కేళెంది'[3]

[మూడు వర్షములు, మూడు మాసములు, మూడు పక్షములు సందేహమేల? మూడుదినములలోనే పాపపుణ్యముల ఫలము లభించును. పాపపుణ్యముల ఫలితమును ఈ భూమియందే అనుభవించి పరలోకము చేరవలెను.]

మూలము—

1 కు వ్యా భా, ఉ ప, సంధి 4, ప 28   2 వ్యా భా ఉ ప, అ 13 శ్లో 38
3 " " ప 27

స్వగృహే పూజ్యతే మూర్ఖః స్వగ్రామే పూజ్యతే ధనీ
స్వదేశే పూజ్యతే రాజా విద్వాన్ సర్వత్ర పూజ్యతే"[1]

అనువాదము—

'తన్న గృహదొళు మూర్ఖనతి సం
పన్న పూజ్యను భూమిపాలను
తన్న దేశదొళధిక స్వగ్రామదొళు ధని పూజ్య
భిన్నవిల్లదె హోద గావినొ
ళన్య కెనిసదె విశ్వదొళు సం
పన్న పూజ్యా పాత్రరై విద్వాంసరుగళెంద'[2]

[మూర్ఖుడు తన గృహమునందును రాజు తన రాజ్యము నందును ధనికుడు తన గ్రామము నందును పూజింపబడుదురు విద్వాంసులు భిన్నతలేక వెళ్ళినచోట నెల్ల విశ్వమునందెల్లెడలను పూజా పాత్రులు]

మూలము—

'శతేషు జాయతే శూరః సహస్రేషు చ పండితః
వక్తా దశ సహస్రేషు దాతా భవతి వా న వా'[3]

అనువాదము—

'ఒర్వ నహన్నై శూర నూర్వ
రొళొర్వ నహను సావిరకె పండిత
నొర్వ నహన్నై వక్త దశసావిరకె లోకదొళు
ఒర్వ దానియు కాణ్నై'[4]

[శూరుడు నూటికొకడుండ వచ్చును. పండితుడు వేయికొకడుండవచ్చును. వక్త పదివేలకొకడుండవచ్చును. లోకమున దాత యొక్కడును గనబడడు]

1 వ్యా భా ఉ ప, అ 20 శ్లో 15 2 కు వ్యా భా, ఉ.ప సం 4, ప 44
3 ,, శ్లో 16 4 ,, ప 45

## తులనాత్మక పరిశీలనము :

తిక్కన, కుమారవ్యాసుల భారతముల తులనాత్మక పరిశీలనము పరిశోధనాంశ మగుటవలన వారి అనువాదసరణిని పరిశీలింపగ తిక్కన వ్యాసునకు విధేయుడై భాషాంతరీకరించె ననియు వ్యాస భారతమును కుమారవ్యాసుడు ఛాయామాత్రముగ గ్రహించె ననియు తెలియుచున్నది వ్యాసుడు కొన్ని తావుల రేఖామాత్ర ముగ భాసింపజేసిన విషయములను తిక్కన, కుమార వ్యాసులు విపులీకరించిరి స్పష్టముగ, విస్తారముగ చెప్పిన విషయములలోని సారాంశమును కావ్యదృష్టితో సంగ్రహించిరి మహాభారత బద్ధ నిరూపితార్థమును ప్రదర్శించుటయే అనువాదకుల ప్రధానలక్ష్యము

పాండవులు విరటుని కొలువులోనికి ప్రవేశించుటలో వ్యాసుడు పాటించిన క్రమమును అనువాద కవులిరువురును పాటించ లేదు. వ్యాసభారతమున ధర్మరాజ, భీమ, ద్రౌపది, సహదేవార్జున, నకులులు వరుసగ ప్రవేశింతురు. తిక్కన, కుమారవ్యాసుల భారతము లందు ధర్మరాజ, భీమార్జున, నకుల, సహదేవులును పిమ్మట ద్రౌప దియు విరటుని కొలువున ప్రవేశింతురు

అజ్ఞాతవాసమున భీముని నామమును వ్యాసుడు 'పౌరోగవో బ్రువాణో௨హం వల్లవో నామ భారత'[1] అని వల్లవుడుగ పేర్కొనెను. అనువాదమున తిక్కన, కుమారవ్యాసులు 'వలలుండను సమాఖ్య వహింతు'[2] 'వలల నెంబభిదానదలి నృపనిళయవను సారువెను'[3] అని వలలునిగ పేర్కొనిరి

శమీవృక్షముపై నుంచిన ఆయుధములను భీమునకు నొసంగవలదని తదీయ అధిదైవతములను ధర్మరాజు ప్రార్థించినట్లు మూలమునలేని విధమున తిక్కన, కుమారవ్యాసులు వర్ణించిరి

1 వ్యా. భా. వి. ప. అ. 2 శ్లో. 1  2 తి. భా. వి. ప. ప్ర. ఆ. ప. 81

3 కు. వ్యా. భా. వి. ప. సంధి 1, ప 7

తిక్కన- 'భీముడు ధార్తరాష్ట్రకుల భీషణ రోషుడు చిత్తమెప్పుడే
ట్లై మద మెత్తునో యతని యాగ్రహవృత్తికి లోనుగాక వి-
రామియునైన వందన వహించి తొలంగుట మత్స్యమీహితం
జేయుటకుంతగా వలయు నిర్విషమూర్ఖముతోన నాతనిన్'[1]

కుమారవ్యాసుడు- 'ఈవుదా బేగి వెరె పార్థం
గీవుదీ యజ్ఞాత వాస దొ
ళీవిగడ భీమంగ కొడదిరి[2]

[ఈ అజ్ఞాతవాస కాలమున కోరినచో పార్థున కిచ్చునది
దుడుకు భీమున కీయకుండుడు ]

సభలోనికి వచ్చిన బృహన్నల నపుంసకత్వమును విరా-
టుడు పరీక్షింప చేసినట్లు మూలమున-

'సమ్మంత్ర్య రాజా వివిధైః స్వమన్త్రిభిః
పరీక్ష్య చైనం ప్రమదాభి రాశు వై
అపుంస్త్వ మప్యస్య నిశమ్య చ స్థిరం
తతః కుమారీపుర ముత్ససర్జ తామ్.[3]' అని కలదు.

ఇది బట్టబిప్పినట్లు ఉచితముగా లేదని కాబోలు తిక్కన, కుమారవ్యాసు
లిరువురును విడిచిపెట్టిరి

కీచకవధ ఘట్టము శృంగారాభాసమునకు చక్కగ పాఠకుల
హృదయాహ్లాదమునకు చెట్టుగ తిక్కన, కుమారవ్యాసులు చక్కగ
ప్రదర్శించిరి సుందరమైన వర్ణనములతో అనువాదకవులిరువురును
మూలమును మరపించిరి. కీచకుని విరహావర్ణన సందర్భమునను,
సూర్యోదయ, సూర్యాస్తమయాది వర్ణనములందును ఇది మనకు
స్పష్టమగుచున్నది ఇందులకుదాహరణముగ-

తిక్కన సూర్యాస్తమయ వర్ణనము -

"చుక్కలు తోడు తోడ దలచూప గ్రసింగె మనోభవుండు వి
త్రొక్కిడి చక్రవాకముల యిక్కలు రోయగజొచ్చె నేలకెం

1 తి భా విప, ప్రఅ, ప 177 2 కు వ్యా భా, విప, సం1 ష 14
3 వ్యా భా, విప, అ 11, శ్లో 12

పెర్చుచు వచ్చె దీవియల యుత్తల సోయగమందె సందడుల్
దక్కె పురంబు వీధుల మదంబొలసెన్ విట చిత్తవృత్తులన్"[1]

కుమారవ్యాసుని సూర్యాస్తమయ వర్ణనము-

'బెచ్చిదవు చక్రాంగయుగ తాన్
కచ్చిదవు మరిదుంబి కుముదవ
ముచ్చిదవు ముసుకుగళి నంబుజ రాజి తవతవగె
హెచ్చిదవు సాగరద తెరెగళు
బెచ్చిదరు జారెయరు చంద్రమ
కిచ్చనిక్కిద నకట సకల వియోగి జనమనకె'[2]

[చక్రవాక పక్షులు తాము భయపడినవి. తుమ్మెదలు కలువలను కరచుచున్నవి. పద్మములు తమతమ ముసుగులలో దాగుచున్నవి. సముద్రపు అలలు అధికమగుచున్నవి. జారిణులు భయపడుచుండిరి. విటజనుల మనములకు వెన్నెల నిప్పుపెట్టినది.]

ఉత్తర గోగ్రహణ సందర్భమున సారథిలేమికి విచారించుచున్న ఉత్తరునకు బృహన్నల సామర్థ్యమును గూర్చి ద్రౌపది స్వయముగ తెల్పినట్లు మూలము.

"అథైన ముపసంగమ్య స్త్రీముఖ్యాత్ సా తపస్వినీ
ప్రేమమాణేన శనకై రిదం వచన మబ్రవీత్."[3]

అనువాదమున తిక్కన, కుమారవ్యాసు లిరువురును ఈ విషయమును ఉత్తరచే చెప్పించిరి. ఉత్తరకు ద్రౌపదియే చెప్పినది. తిక్కన- "సైరంధ్రి యుత్తర యున్న యెడకుం బోయి[4]

యమ్ముదితయు తానును జని యతనికి నత్తెఱంగు సముచితముగ జెప్పిన"[5]

కుమారవ్యాసుడు- "తరుణి కేళర్జునన సారథి
వర బృహన్నళె ఖాండవాగ్నియ
సారెగెడెనవ తానెందు సతి యుత్తరగె హేళిదళు[6]

1 ఆ భా, వి ప, ద్వి ఆ, ప ౪౧౮ 2 కు. వ్యా భా, వి ప, సంధి, ౭ ష ౧
3 వ్యా భా వి ప అ 36 శ్లో 16 4,5 తి భా, వి ప చ ఆ, ప14, ప17
6 కు. వ్యా భా, వి ప, సంధి 6, ష 27

“కేళి హరుషితె యాద ఉత్తరె
ఓలగకె బందణ్ణ నంఘ్రిగె
లోలలోచనె యెరగి కైముగి దెందళె హదన”[1]

[“తరుణీ! వినుము. శ్రేష్ఠుడగు బృహన్నల అర్జునుని సారథి. ఖాండవ దహనము నితడే గావించెను” అని ద్రౌపది ఉత్తరకు చెప్పెను.

విని ఉత్తర హర్షముతో సభకు వచ్చి అన్న పాదములకు నమస్కరించి ఈ విధముగ తెలిపెను.]

వ్యాసభారతమునందలి ఒక శ్లోకములోని మొదటి పాదమును కుమారవ్యాసుడును, రెండవ పాదమును తిక్కనయు తమదగు రీతిని వర్ణించిన తీరు పరమ సుందరము.

మూలము . “తదనీకం మహత్తేషాం విబభౌ సాగరోపమమ్
సర్పమాణ మివాకాశం వనం బహుల పాదపమ్”[2]

ఇందు మొదటిపాదమున కౌరవసైన్యము సాగరోపమానముగ వర్ణింపబడినదానిని కుమారవ్యాసుడు-

“కరి ఘటావళి గొబ్బుగల్లిన
తురగ నికరద తెరెయ తేరిన
హారళిగళ సుళి యాత ప్రతద బహళ బుద్బుదద
నర నికాయద జలచరౌఘద
తురద వాద్యధ్వనియ రవ దు
ష్బర దొళిదిద్దు బహళ జలనిధి యంతె కురుసేన”[3]

[ఏనుగులు తీరమునందలి గుంటలు, అశ్వములు కెరటములు, రథములు సుడులు, ఆతపత్రములు పెద్దనీటి బుడగలు, సైనిక సమూహము జలచరములు, గొప్ప వాద్యముల ధ్వని తీరముచేరు కెరటముల

1 కు వ్యా భా వి ప సంధి 6, ష 28
2 వ్యా భా వి ప అ 33 శ్లో 6
3 కు వ్యా భా, వి ప, సంధి 8; ష 2

సవ్యాడి ఇట్లు కురుసేన సముద్రమును బోలియున్నది.] అని విస్తరించి యుండఁ రెండవ పాదమున కౌరవసైన్యము సుందరోద్యానవనముగ పోల్చబడిన దానిని చేకొని తిక్కన సోమయాజి ఇట్లు ప్రపంచించెను.

"అభినవ జలధర శ్యామంబులగు నీల లాకు జొంపంబుల ననుకరింప సాంధ్యరాగోపమ చ్ఛాయంబులగు పల్లుకిసల రౌహాత్తిరముల శ్రేణిసేయ రాజమరాళగౌరములగు చోటులు దెలుపు బూబోదల చందంబునొంద హారిద్రరుచి సమానాకృతులగు గొవ్వులతరిగు పుష్పాదులట్లు మెఱయ గాయ నెగసి ధరాధూళి లలితవనము వివిక నలిగాపుపోయెడు

తెలుగు దాల్ప

గోగణము ముంగలిగ నేలగోడిపడగ నడుమ కౌరవరాజ సైన్యంబు గనియె"[1]

అజ్ఞాతవాస సమయావధిని గూర్చి మూలమున .

"ఏషా మభ్యధికా మాసాః పంచచ ద్వాదశ క్షపాః
త్రయోదశానాం వర్షాణామితి మే వర్తతే మతిః"[2]

అని భీష్ముడు అయిదునెలల పన్నెండురోజులు అధికముగ గడచినట్లు పేర్కొనియుండ తిక్కన, కుమారవ్యాసులు నిన్నటి తోడనే పూర్తియైనదని పేర్కొనిరి. ఇది గమనార్హము

ముందుగ తిక్కన అనువాదము '

"రెండవయేట నొక్కం పధిమాస మిన్నింటిన యన్నెలలెల్ల గూర్చి
కొన బదుమూడు హాయనములు దప్పక నిన్నటి తోడన నిండనింత
యెఱిగియు తను పూన్కి యెల్లను దీర్చితిపుని నా నసూన
నర్జునుండు గేడు'[3]

ఇక కుమారవ్యాసునిది :

మగన కేళిగైదు వరుష కె
మిగువ నెరడెమూడ మాసా

1 తి భా, వి ప, ద ఆ, ప ౬౦
2 వ్యా భా, వి ప, అ ౫౨, శ్లో ౬
3 తి భా, వి ప, ద ఆ, ప ౨౪౨

దిగళ వవరనుభవిసిదరు హదిమూరు వత్సరవ
మిగు వవధి బుధ రరియె నిన్నిన
హగలు నిన్నదు పాండు తనయరు
నిగ్గాగువ డింబిన దివస వవరదు కండ కేళెంద[1]

[కుమారా! ప్రతి రెండు ఐదు సంవత్సరములకు రెండు మాసములు మిగులును. ఆ కాలమును కలిపిన వారు 13 వత్సరములను పూర్తిగ అనుభవించిరి నిన్నటి దినము నీది పాండుపుత్రులు బయటపడు ఈ దినము వారిది.]

ఉత్తర గోగ్రహణ విజయము బృహన్నల సారథ్యము వలననే సాధ్యమయినదని ధర్మజుడు పలుక విరటుడు ఆతనిని పాచికతో కొట్టును అపుడు తన రక్తము భూమిపై పడిన అరిష్టమని ధర్మజుడే తెల్పినట్లు మూలము

'యదిహ్యేత త్పతే ద్భూమౌ రుధిరం మమ నస్తతః
స రాష్ట్రస్త్వం మహారాజ! వినశ్యేథా న సంశయః'[2]

ఇది స్వోత్కర్ష యగునని అనువాదమున తిక్కన, కుమార వ్యాసులు ఈ మాటలను ద్రౌపది చే అనిపించిరి.

తిక్కన 'మత్స్య మహీవల్లభుం డీశోణితంబు పైచీర బట్టుటకు
గతంబేమియని తన్నడిగిన నతని కిట్లనియె'[3]

కుమారవ్యాసుడు 'హిడిదె రకుతవ నేకె కామిని
నుడె నిధానవ నివరు నొందరె
మిడుక లేతకె నీవెనుత దురుపదియ జెసగొండ'[4]

---

1 కు వ్యా భా, వి ప, సంధి 7, ప 22
2 వ్యా భా, వి ప, అధ్యా 68 శ్లో 64
3 తి భా వి ప, పం ఆ, ప 260
4 కు వ్యా భా, వి ప, సం 9, ప 21

["కామినీ! ఈ రక్తమును పట్టుమంటివేల ? యథార్థమును తెలుపుము. ఈతనికి బాధ కలిగిన నీవు కలత నొందుటేల?' అని ద్రౌపదిని ప్రశ్నించెను.]

దక్షిణోత్తర గోగ్రహణ విజయానంతరము పాండవులు అయిదుగురును చేరి తమ తమ విజయ వార్తలను తెలుపుకొనినట్లు మూలమున లేని విధముగ తిక్కన, కుమారవ్యాసులు తెలిపిరి.

తిక్కన. "ఇవ్విధంబున కృత కృత్యులయి యథాపూర్వంబున మజ్జన భోజనంబులు సలిపి ధర్మతనయుఁ నివాసంబునం దేకాంత స్థలంబున దా నేవురును ద్రౌపదియును గూడబడునట్టి తెఱంగు సంఘటించి సమాగమ సముచిత ప్రకారంబు నడపి గోగణ నివర్తనంబును, రణ ప్రవర్తనంబును అన్యోన్య విదితంబైన యనంతరము సుగ్రీవు నుద్దేశించి భీభత్సుఁడు భీమసేనున కిట్లనియె"[1]

కుమారవ్యాసుడు. 'ఉళిద నాల్వరు కలి త్రిగర్తర
గెలిద పరియను పార్థ కౌరవ
బలవ భంగకె తంద పరియను పేళు తెరతెరలు[2]

[మిగిలిన నలుగురు త్రిగర్తుని గెలిచిన విధమును, పార్థుఁడు కౌరవ బలమును భంగపరచిన రీతిని వివరించు చుండగ]

అజ్ఞాతవాస పరిసమాప్త్యనంతరము పాండవులు తమ్ము మూడవ దినమున ప్రకటించుకొనినట్లు మూలమున :

'తతః తృతీయే దివసే భ్రాతరః పంచ పాండవాః'[3]

తిక్కన, కుమారవ్యాసులు మరుచటిరోజు ఉదయముననే తమను ప్రకటించు కొనినట్లు చెప్పిరి.

తిక్కన. 'యామిని గడపి వేగుటయుం గృతస్నానులయి'[4]

---

1 తి భా వి ప, పం ఆ, ప 305

2 కు వ్యా భా, వి ప, సంధి 9, ప 34

3 వ్యా భా వి ప, అధ్యా 70, శ్లో 1

4 తి. భా, వి ప, పం. ఆ, ప 314

కుమారవ్యాసుడు. "ఉదయదలి జా నిలిసి యాతిన
సడ నడలి నృపపీఠవను గ
ర్వ్దదలి నెమ్మ వెవు "[1]

[ఉదయమునసే మనము ఆతని ఆస్థానమున రాజపీఠము నాక్రమించుకొంటిము]

తిక్కన, కుమారవ్యాసులు వర్ణనల విషయమున ప్రబంధోచిత ప్రాధాన్యము నొసగిరి. అందునను కుమారవ్యాసుడు తన కావ్యమున అష్టాదశ వర్ణనలకు వీలు కల్పించుకొని వర్ణించుట విశేషాంశము. అందుల కతడు గావించిన ద్వారకానగర వర్ణనము, హస్తినాపురోద్యాన వర్ణనము, కీచక విరహ వర్ణనము, ఉత్తరాభిమన్యుల వివాహ వర్ణనము, మల్లయుద్ధము, స్త్రీవర్ణనము ఇత్యాదులు పరిశీలనార్హములు.

ఈ పై అంశములను పరిశీలింప తిక్కన కుమారవ్యాసులు కొన్ని అంశములను మూలాతిరిక్తముగ అనువదించుటలో పోలియున్నందున తిక్కన భారతమును కుమారవ్యాసుడు చూచియుండెనని కొందరు నిర్ణయించిరి. ఇది సాహసమనక తప్పదు. అనువాదములందువలె పోలియున్న విషయములు కథాంశమునకంత ప్రాధాన్యము చేకూర్చునట్టివి కాకపోవుట మనమిచట గమనింపవలసి యున్నది.

భీముడు వలలుడైనను, వల్లవుడైనను, అటులనే అర్జునుడు ముందుగ ప్రవేశించినను, ద్రౌపది ముందుగ ప్రవేశించినను కథాంశమున నూతనత్వమేర్పడదు.

కథాంశమున ప్రాధాన్యముగల ఉత్తర గోగ్రహణము, సంజయుని రాయబారము, కృష్ణుని రాయబారము మున్నగునవి తిక్కన ప్రావీణ్యమును ప్రదర్శించుచున్నవి. విదురుని ఆతిథ్యము,

1 కు. వ్యా. భా. వి. ప., సంధి 9, ప. 41

146 తెలుగు కన్నడ భారతములు

సాగస్నజాతి పర్వము, కర్ణుని వృత్తాంతము మున్నగునవి కుమార వ్యాసుని తీర్పును ప్రదర్శించుచున్నవి ఈ అంశములపై ఒకరి ప్రభావము మరొకరిపై కనబడదు

కావున సందేహమున కాస్పదమగు విషయములను నిశితముగ పరిశీలింప ఇంతకు పూర్వము తెలుపబడిన విధముగనే తిక్కన, కుమారవ్యాసులు అనుసరించిన మూలభారతము ఇపుడు మనకు లభించు భారత ప్రతులలో ఏ యొక్కటియు కాకపోవుచున్నది అది లభించువరకు నిశ్చితాభిప్రాయము తెలుపుట తొందరపాటు కాగలదేమో !



# చతుర్థాధ్యాయము - వస్తు విన్యాసము

తృతీయాధ్యాయములో తిక్కన, కుమారవ్యాసులు వ్యాస భారతమును అనువదించిన తీరుతెన్నులను పరిశీలించితిమి. ఈ అధ్యాయమున వారు వస్తు విన్యాసమును ప్రదర్శించిన తీరు పరిశీలింతము.

కథాకథనము అనగ కథను చెప్పుట. ఇది రెండు పద్ధతుల. ఒకటి కథకు ప్రాణభూతమైన అంశమును పట్టుకొని సాగును. రెండవది వివిధములైన కథాంశములను పట్టుకొని సాగును. భారతమున ప్రధాన కథకు సంబంధములేని ఉపాఖ్యానములను గమనించి వానికి ప్రధాన కథతోగల సంబంధమును తిక్కన, కుమారవ్యాసులు దృష్టి పరచిరి. భారతోపాఖ్యానములు అనంతముఖ పరిష్కరణ గలవి అను వారిరువురు ఉపాఖ్యానములను తిరస్కరింపను లేదు. అటులని ఉన్నదున్నట్లుగ గ్రహింపనులేదు. తమ కావ్యోద్దేశములకు భిన్నములైనవో నిస్సంశయముగ విడిచిపుచ్చిరి. గ్రహించిన వానిని కథానుకూలముగ మలచుకొనిరి.

విరాటోద్యోగ పర్వములు సంధి పర్వములు. అరణ్య పర్వమువరకు కౌరవ దుశ్చర్యలకు ప్రతీకారము తలపెట్టని పాండవులు విరాటపర్వాంతమున తిరుగబడుట జరిగినది. కథ ఇక్కడి నుండి రమ్యతరమైనది. దాని కనుగుణముగనే తిక్కన కథాకథన శైలినుండి నాటకీయ శైలికి మార్చినాడు. కథాగమనమున జరిగినదానికి జరుగవలసినదానికి ఘర్షణ ప్రారంభమైనది. ప్రథమాశ్వాసమున ధర్మరాజు మాటలలో ఈ ఘర్షణమునకు బీజారోపము చేయబడినది. విరాటుని కొలువున అజ్ఞాతవాసము జయప్రదమైనదని వివర అర్జునుని వాక్యములుగ చెప్పబడినది. దీని కంతటికిని మూలము మహిత సముజ్జ్వలాకృతులు[1] అనెడు పద్యము కుమారవ్యాసునను విరాటపర్వ

1 ఆం భా, వి ప, ఆ 1, ప 44

ప్రథమ సంధిలో 'అనుపమిత భుజ సత్త్వులు అంతఃపురాంతరమున అడగియున్న విధమును'[1] అర్థవంతముగ వర్ణించియున్నాడు.

కుమారవ్యాసుడు కథ చెప్పుటలో ప్రతిసంధికి పైన సారాంశ మనునట్లు ఒక అర్ధ షట్పదిని నిబంధించెను అందు సంధిలో చెప్పబోవు కథాసారాంశము కూర్పబడి యుండెను. నాటకమునకు నాందీ పద్యము వంటిది ఈ పద్యము. తిక్కన విరాటపర్వములో పాండవ, కౌరవ వీరులయు, రాజపత్న్యాదులయు చిత్రములను వారి సర్వతోముఖ వైభవమును చక్కగ వర్ణించెను అదియే తర్వాతి పద్యములలో చివరివరకు కాంతులు చిమ్ముచు వ్యాపించినది కథనము నాటకీయముగ జరుగుట తిక్కన ధ్యేయము. కుమారవ్యాసుడు కొన్ని ఘట్టములను నాటకీయముగ రచించినాడు. ఎక్కువ భాగము నన్నయవలె కథనశైలిలోనే రచించినాడు నాటకీయతను ప్రదర్శించునపుడు కుమారవ్యాసుడు భాస నాటకములు మున్నగు పూర్వనాటకములను తనరచనా విధానమున ఉపయోగించుకొనినాడు.

వ్యాసుడు విరాటపర్వమును 'పాండవ ప్రవేశ పర్వము, కీచక వధ పర్వము, గోహరణ పర్వము, వైవాహిక పర్వము అను నాలుగు భాగములుగ విభజించినాడు. ఉద్యోగ పర్వమును 'సేనోద్యోగ పర్వము, సంజయ యాన పర్వము, ప్రజాగర పర్వము, సనత్సుజాత పర్వము, ఉలూక దూతాగమన పర్వము, రథాతిరథ సంఖ్యాన పర్వము, అంబోపాఖ్యాన పర్వము అని పది భాగములుగ విభజించినాడు ఇతిహాసమునకు తగినట్లు కావింపబడిన ఈ విభజనము తిక్కనను, కుమారవ్యాసులు తమ కావ్య కథన దృష్టితో మార్చుకొనిరి

1 కు వ్యా భా, వి ప, సంధి 1, ష 32

## విరాటపర్వ కథానిర్వహణము

### పాండవప్రవేశ పర్వము.

కుమారవ్యాసునకు విరాటపర్వము నాల్గవది. తిక్కనకు ఇది ప్రథమము. కుమారవ్యాసుడు కృష్ణ పారమ్యమును బోధింప నిచ్ఛగలవాడు. కృష్ణప్రాధాన్యము లేనిచోట మిక్కిలి సంగ్రహించి కథను నడపినాడు. ఆ కారణముననే తిక్కన 322 గద్యపద్యములలో ప్రథమాశ్వాసమును రసోదంచితముగ నిర్మింప, కుమారవ్యాసుడు 64 షట్పదులలో ముగించెను. ఈవిషయమున కుమారవ్యాసునకు కన్నడ ఆదికవి 'పంప' ఆదర్శప్రాయుడైనట్లు కనబడుచున్నది.

అరణ్యవాసానంతరము పాండవులు ఒక వటవృక్షము క్రిందకువచ్చి విశ్రమింతురు. ధర్మజుడు అజ్ఞాతవాస విషయమై సోదరులతోను, ధౌమ్యునితోను ఆలోచించెను. దుఃఖించుచున్న ధర్మజుని ధౌమ్యుడాశ్వాసించెను. ధర్మజుడు బ్రాహ్మణులను అజ్ఞాతవాసమునకు అనుమతివేడెను. తన పరివారమును ద్వారకలో గాని, పాంచాల రాజ్యమునగాని ఉండ నియమించెను. ఈ విషయము లేవియు కుమారవ్యాసుడు పేర్కొనలేదు. ధర్మజుడు తనతో పాటుగ నున్న బంధువులను, స్నేహితులను పంపివేసెను. మంచిశకునములతో అగ్నికి ప్రదక్షిణము చేసి, సోదరులతో కూడి ఆ వనాలయమును విడిచి తామజ్ఞాతవాసము చేయబోవు స్థలమునుగూర్చి ఆలోచింపసాగెను. చతుర్దిశల యందలి రాజులను గూర్చియు వారి తత్త్వములను గూర్చియు ధర్మజుడు ఆలోచించెను. అర్జునుడు కీచక రక్షితమైన మత్స్యదేశమును పేర్కొనెను. ధర్మజుడు దానిని అజ్ఞాతవాసయోగ్యముగ నిర్ణయించెను. తిక్కన, కుమారవ్యాసు లిరువురును ఈ విషయమును సమానముగనే తెల్పిరి.

పిమ్మట వారి వృత్తులను గూర్చి ధర్మజుడు ప్రశ్నించెను. తిక్కన ప్రతి పాత్రమును గూర్చి వివరముగ పేర్కొని యుండగ కుమారవ్యాసుడు మిక్కిలి సంగ్రహముగ ఒకటిన్నర షట్పదులలో

ఈసన్నివేశమును ముగించెను. ఇచ్చట తిక్కన తెలుపని విధమున తమ్ములను బాధపెట్టితినని ధర్మజుడు వాపోవుచు వాని తమ్ములు ధర్మజునోదార్చి శరీరమునకును, ఛాయకును ఎడబాటు లేదని, భిన్న గతులుండవని, నాల్గుశరీరములందు ఒకే జీవాత్మవలె ధర్మజుడున్నాడనియు, అతనితో కూడి యున్నపుడు అడవియే సామ్రాజ్యమని, అతడులేనినాడు పట్టణము కారడవి యని వారు కృతజ్ఞులై పలికిరి వశిష్ఠాశ్రమమున సజ్జనుల సంకటముల బోద్రోలి, శమీవృక్షమున ఆయుధములు నిక్షిప్తము చేసిరి ఆయుధములను భీముని పాల బడకుండునట్లు రక్షింపుమని దిక్పాలకులను ప్రార్థించిరి అందులకు భీముడు కోపింపగ ఉచితభాషణముల ధర్మజుడు శాంతపరచెను

ధర్మజుడు మత్స్యపురమును ప్రవేశించెను. జనులతని తేజస్సునకు వెరగంది నమస్కరించు చుండిరి విరాటుడు ఆతనిని తన ఆస్థానములోనికి పిలిపించుకొనెను పాండవులు వనవాసమునకై ఇంద్రప్రస్థము వీడిరనియు, ఆకారణమున ఆనగరము చెడెననియు, ఉదరపోషణకై ఆశ్రయము వెదకుకొనుచుంటి ననియు, తన పేరు 'కంకు'డందురనియు ధర్మజుడు తెలిపెను అతని కక్షమునందు బంగరు పాచికలుగలసంచి కలదని కుమారవ్యాసుడు సూచించెను సామంత రాజుల కిరీటములచే నిగాళింపబడిన పాదములు కలిగిన యుధిష్ఠిర సార్వభౌముడు మత్స్యదేశాధీశుని ఆశ్రయమున బ్రతికెననియు, కాలమెవ్వరినేరీతి జేయునో తెలియలేరని కుమారవ్యాసుడు విచారించెను ఇది కుమారవ్యాసుని మానవత్వము

పిమ్మట భీముడు మత్స్యరాజును వచ్చి చూడగ అతడు భీముని 'నీకు పని ఏది నేర్పుగలదు?' అని ప్రశ్నించెను 'తాను వంటలవాడననియు, భీముని గృహమున ఉండెడివాడననియు, మల్లవిద్యలో విశేష పరిశ్రమ కలవాడనని'యు తెలిపెను రాజాతనిని మన్నించెను అపుడు ఊర్వశీశాపముచే పేడియైన అర్జునుడు రాజాంతఃపురము చేరి ఉత్తరకు నాట్యాచార్యు డయ్యెదనని, నకుల, సహదేవులు అశ్వ

గోపాలురుగ వచ్చి రాజాశ్రయము పొందిరని కుమారవ్యాసుడు సూక్ష్మముగ ముగించెను తిక్కన వారి ఆకారములను, వృత్తి విశేషములను, ప్రవేశ కథనములను వివరముగ చిత్రించెను అర్జునుని పేడితనమునకు పరీక్షకూడ జరిపించెను ఈ రీతిగ పాండవులు విరటుని కొలువున ప్రవేశించిరి అంతట మత్స్య నగరవాసు లబ్బురపడునట్లు ద్రౌపది సుదేష్ణ భవనమును సమీపించెను, మన్మథాటోపము గల వారు ద్రౌపది సౌందర్యమునుగని అలికిరి ఆమె వేణీసౌందర్యము, కనుల కాంతి, శరీర ప్రకాశముగని ఆశ్చర్యము చెందిరి ద్రౌపదిని 'మోహ మహాంబుధి' యనినాడు కుమారవ్యాసుడు. ఇందు కీచకుని మన్మథాటోపమును, వానిదుర్దశను కవి[1] ధ్వనింపజేసినాడు ఆమె సౌందర్యమునకు అబ్బురపడిన మత్స్యరాజపత్నులు మనసున బెదరిరి చెలికత్తెలచే ద్రౌపదిని సుదేష్ణ తన సమీపమునకు పిలిపించుకొన్నది. ఆమె వివరములను తెలిసికొన్నది దానికి 'సైరంధ్రి' వేషమున నున్న ద్రౌపది 'తనభర్తలు గంధర్వులనియు, వారు తన మనసునకు నొప్పి గల్గించిరనియు, అందుచే వారిని విడిచి సంవత్సరకాలము వ్రతముగ ద్రౌపదీదేవిని సేవించుచుంటి ననియు, పాండవులు అడవుల పాలగుటచే తానిట్లు రావలసి వచ్చినదనియు, తన శిల్పకారికా వృత్తిని గూర్చియు' పలికినది. విరటుని భార్య ఆమెనేర్పును గూర్చి ప్రశ్నించగ 'ఏమిచెప్పినను ప్రీతితో చేయగల దానన'ని పలికినది. తన్ను నీచపు పనులకు వినియోగింప కొనరాదని తిక్కనగారి ద్రౌపది నిర్ణయము చేసికొన్నది. ఈ రీతిగ పాండవులు, ద్రౌపదితో కలసి విరటుని కొలువున ప్రవేశించి అజ్ఞాతవాస సమయోచితముగ కాలము గడుపుచుండిరి.

**కీచకవధ పర్వము :**

ఈ ఘట్టమును తిక్కన, కుమారవ్యాసు లిరువురును ఇంచుమించుగ్గ ఒకేవిధమున నిర్వహించిరి తిక్కన 410 గద్యపద్యములలోను

1 కు వ్యా భా, వి ప, సంధి 1, ష 24 27

కుమారవ్యాసుడు 166 షట్పదులలోను అనువదించిరి. రావణుడు సీతాదేవిని మోహించిన విధమున ఒకకథ నడిచినదని కుమార వ్యాసుడు కీచక వంశనాశనము సూచించినాడు. ఇది నూతనమైన కల్పన ద్రౌపదిని చూచినపుడు ఆతడు నక్షత్రములలో రోహిణి, తారలలో ఊర్వశి అనిఅనుకొనెను వానిమనసున కలిగినమార్పు లను తిక్కన, కుమారవ్యాసులు చక్కగ వర్ణించిరి ఇచ్చట సుదేష్ణ కీచకునికి వెంటనే సమాధానము చెప్పినది సైరంధ్రి తన పవిత్ర వర్తనము ఆమెభర్తల పరాక్రమమును గూర్చి కచ్చితముగ తెలిపి నది తిక్కనగారి సుదేష్ణ కీచకుని మాటలను మొదట లెక్కచేయదు కుమారవ్యాసుని కీచకుడు తెలిసియు సైరంధ్రి వెంట తగిలినాడు. ఆమె సౌందర్యమును గూర్చి ఆలోచించుచు వాడు ద్రౌపదిని గూడ తలంచుట ఒకవిశేషము వాని జ్ఞానము తలక్రిందులగుట, లజ్జతొలగి పోవుట, ధైర్యము జారిపోవుట, మహిమ అడగుట జరిగినది తిక్కన 'నయనం ప్రధానముమాట కీచకునియెడ సార్థకమైనదని తెలుపగ కుమారవ్యాసుడు 'చూపులతో ద్రౌపది రూపమును మ్రింగె నని' నాడు. మనసునచే చెరపట్టినాడు కుమారవ్యాసుని కీచకుడు సుదేష్ణ మాటలతో ఇంటికి వెళ్లుటకు వెనుతిరిగినాడు తిక్కన కీచకుడు సుదేష్ణమాట ఇచ్చువరకు ఇంటికి మరలలేదు. కుమారవ్యాసుని కీచకుడు మరునాడు వచ్చి ద్రౌపదిని మరలచూచినాడు వానిరాకలో కవి దేశీయాచారములను నిక్షిప్తము చేసినాడు [1]

ఒకసింహము కొరకు ఆశపడి చేరు నక్కవలె, గరుడుని రాణిని కోరి ఒక పాము సమీపించినట్లు కీచకుడు ద్రౌపదిని సమీపించినాడని కుమారవ్యాసుని వాణి ద్రౌపది వానికి నీతులుచెప్పి వెనుకకు పంపు టకు ప్రయత్నించినది [2] తిక్కన ద్రౌపది కేవలము తన వికృతరూప ముతోబాటు పాతివ్రత్యమును కూడ చెప్పినది కుమారవ్యాసుని

1 2 కు వ్యా భా, వి ప, సం 2 ష 10, 18

కీచకుడు మన్మథబాణ పాతమునకు ఔషధము సైరంధ్రికి తెలియు ననియు కరుణాదృష్టి అతనిపై ప్రసరించి బ్రతికింపుమని నమస్కరించి నాడు[1]. తిక్కన ఈ నమస్కారమును చరణయుగ్మసేవ వరకు కొని పోయినాడు. కీచకుడు పరలోకమునుగూర్చిగాని, బంధువుల ధిక్కా రమును గూర్చిగాని, రాజుల కోపమును గూర్చిగాని లెక్కచేయు లేదు. ఆమె చిరునవ్వు వెన్నెలలు తన తాపమును పరిహరింపవలె ననియు, మాటలనెడి అమృతము దాహమును, కుచ కలశలక్ష్మి మనోదైన్యమును పోగొట్టవలెనని ప్రార్థించినాడు. ఇవి అన్నియు తిక్కనకంటె భిన్నములు విలక్షణత గలవి. వాని మాటలకు ద్రౌపది తలచి దేవుని తలచినది. "హర హరా! శూలపాణీ! ముకుందా!" ఇత్యాదిగ ఘోషించినది. వాని వంశనాశనమగునని వారించినది. భార్యా పుత్రులతో సుఖముగ జీవింపక మృత్యువును వరించుచున్నా వని బాధపడినది. మనుజుడు మనసు చలించినను నిగ్రహించుకొని నడువవలెనని హితవు చెప్పినది. తిక్కన వలెనే ఇందును కీచకుడు కాముని బాణములతో తనకు చావు తప్పదని తన్ను కృపచూడుమని వేడుకొనినాడు.

ఇచ్చట కుమారవ్యాసుని ద్రౌపది చేతితో ఒకగడ్డిపోచను పట్టుకొని తనభర్తల పరాక్రమమును వర్ణించి, వారు అతని పాపకార్య మును సహింపని బల్లిదులని, వ్యర్థ ప్రలాపములు మానుమని హెచ్చరించినది. ఇట్లు గడ్డిపోచను పట్టుకొని మాటాడుట రామా యణములోని సీతాదేవిని తలపింపచేయుచున్నది. ఆమె రావణునితో మాటాడినపుడు గడ్డిపోచ నుద్దేశించియే మాటాడినది. ఇట్టి సంభాషణ వైచిత్రి తిక్కనలో కనబడదు.

లోక ప్రసిద్ధములైన అనుభావములచే రసమును పోషించుట నాటకీయతకు ప్రధాన లక్షణము. ద్రౌపదీ పాతివ్రత్యమును, కీచకుని

1 కు వ్యా భా, వి ప, సంధి 2, ప 20

గార్ద్యమును పాఠకహృదయముల స్థిరముగనాటుటకు ఇట్టి కథనము తోడ్పడును. తిక్కన "అందని ద్రాక్షపండ్లకు అఱ్ఱులు చాపవద్దని, మునుచెడిన రావణాదుల వినవే అని, నన్ను అనురక్తితో సేవించు స్త్రీలుండ నీరసాకార సైరంధ్రి గోరదగదని, మాసిన చందము మదన వికృతి గల్గించుట నిషిద్ధమని, ఓ యన్నా! అని, తోబుట్టువవని" మనసున కెక్కునట్లు బలికించి దేశీయమగు శైలిని రచనము నిర్వహించెను. కావ్యమున మరొక కావ్యమునుగాని, నాటకమును గాని ప్రసక్తికి తెచ్చి శోభను కల్పించుట కన్నడకవులలో పంపని నాటినుండియు ఆచారముగ నుండినట్లు కనబడుచున్నది. సృజనాత్మక ప్రతిభకలవా రన్యమార్గముల గ్రహింపరు తానట్లు గ్రహింపనని కుమారవ్యాసుడు పీఠికలో ప్రతిజ్ఞ చేసినాడు. అయినను 'దూతవాక్యము, ఊరుభంగము, వేణీ సంహారము' మొదలగు భాస, భట్టనారాయణాది కవుల రచనలచే ప్రభావితుడై అందలి అంశములను కావ్యగతముగ చేసి కావ్య శోభను పెంచినాడు తిక్కన అట్లు పూర్వకవులను అనుసరింపలేదు. తనకు వ్యాసభగవానుడే పరమప్రమాణము అంతియేగాక స్వీయ కథన ప్రౌఢిలో 'నానేర్చిన భంగిజెప్పి వరణీయుడ య్యెద' అని తిక్కన అన్య కథన విధిని తిరస్కరించి "తన కావించిన సృష్టి" ఇత్యాదిగ ప్రశంసలు పొందుట గమనార్హము.

కుమారవ్యాసుని కీచకుడు స్వాతిశయమును ప్రకటించుచు తాను మార్కొని నిలచినచో ఆ పినాకియు వెనుదిరుగునని పలికినాడు.[1] శశి, వసంతులు, చల్లనిగాలి, మాకందములు, మన్మథుడు ఇవన్నియు ఎవనిచే వర్జితము లగుచున్నవో తెల్పుమని, అట్లే ఆమెచే వలపుగొనక చచ్చుచుంటినని బాధ చెందినాడు.[2] ఇట్టిమాటలు తిక్కనలో లేవు. సైరంధ్రి కీచకునితో "అతని సంహరింప గలవారితరులు

1 కు వ్యా భా, వి ప, సంధి 2 ష 29

2 ,, ష 30

గలదనియు, ఒక్క కీచకుని నెపమున వంశనాశనమగునని ఆ అపకీర్తి ఒకటియే మిగులునని, తనకు హంత్రియను దుర్యశము కలుగునని వారించినది. పూర్వము సీతాపహరణముచే వానర సైన్యము చుట్టుముట్టి రావణుని అంతకుని నగరమునకు పంపలేదా?'[1] అని ఈ రీతిగ కుమారవ్యాసుడు కథనమున రామాయణ ప్రసక్తిని పలుమార్లు తెచ్చినాడు. గదగు నారాయణునిపై గల భక్తి, దాస వాఙ్మయ రక్తి, బ్రాహ్మణయుగ కవిత్వశక్తి ఇట్టి రచనా విధానమునకు ఆధారములు కానోపును, కీచకుడు మరల మరల సైరంధ్రిని బలాత్కారము చేయుట, ఆమె పెక్కుసార్లు ప్రత్యుత్తరమిచ్చుట తిక్కనలో లేవు తిక్కన సైరంధ్రి కేవలము రెండుసార్లు సంభాషించినది కీచకుని ప్రతి మాటకు ఆమె ఆవేశము చెందలేదు వాని కోర్కెను తిరస్కరించి నడచి ముందునకు సాగిపోయినది.

కీచకుడు సుదేష్ణాదేవి పాదములపై పడినాడు. ఆమె వానికి ధర్మబోధ చేసినది. వాని దీనదశకు మనసున మరగినది దుఃఖకారణ మడిగినది వాని బాధ తెలిసికొన్నదై తన పరివారములోని వేరొక స్త్రీ సేవకినైనను కోరుకొమ్మన్నది. తిక్కన సుదేష్ణ కొంచెము గడుసుగ తెలిపినది "సైరంధ్రి నీరసాకారయనియు, లలితంబుగాగు మట్టెల చప్పుడు ఇంపగునట్లు హంసవలె అల్లనల్లన వచ్చు నెలతలు కలరనియు గుర్తునకు తెచ్చినది. కుమారవ్యాసుని సుదేష్ణ ఆ ప్రయత్నమున వంశనాశన మగునని బెదరినది. రాజపుత్రుల ధర్మమును బోధించినది. రావణుని ఆర్తి పొందగలవని భయమున వణకినది[1] దానికి కీచకుడు తన యీ బలియైన దశ చినిగిన ప్రేవులుగల లేడి పిల్లను పోలియున్నదని, సైరంధ్రి యుండే తన మనసు వేరూని యున్నదని, ఇతరులతో మనువు మనసులేని కేవల శరీరమునకే జరిగిన

1 కు వ్యా భా, వి ప, సం 2, ప 48, 44

2 ,, ప 47

దానితో సమానమగునని కావున సైరంధ్రిని తనకు కూర్పుమని ప్రార్థించినాడు. ఈ అభివ్యక్తి అంతయు తిక్కనలో లేనిది. తనసోదరి గంధర్వుల విషయము జ్ఞాపకము చేసినప్పుడు తిక్కన కీచకుడు స్వాతిశయమును చాటినాడు. ప్రతి నాయకునికి శోభాహేతువైన ప్రల్లదములతో 'వనితా! ఏనొక పల్లుపల్లైద జతుర్వారాశి మధ్యంబునన్' ఇత్యాది పద్యములచే తిక్కన కథను రంజిలచేసెను. కుమారవ్యాసుని కీచకుడు ఈ సందర్భమున మారు పలుకడు.

ఆసవమునకై పంపుటకు తిక్కన సుదేష్ణ స్పష్టముగ అంగీకరించినది. కుమారవ్యాసుని సుదేష్ణ 'రేపు నేను పంపగలను. కాని పరసతీ సంగమము మంచిదికాదు యోచింపుము' అనుచు సోదరుని హెచ్చరించినది. ఆమె మాటలలో తిక్కన సుదేష్ణలోని నిష్కర్ష లేక అంగీకారములోనే తిరస్కృతి కనబడుచున్నది. కీచకుడు సంతోషముతో ద్రౌపది కటాక్షమునకు పాత్రుడ నగుట తన భాగ్యమని మరులుగొని ఉబ్బిపోయి తనమందిరమున కేగినాడు. సూర్యాస్తమయమైనది. క్రమముగ దినకరుడు అస్తాద్రిని మరుగుపడినాడు. హిమకరోదయమైనది. పరదిగంగన పెట్టిన చందన తిలకమో, మన్మథుని రాణిచేతి దర్పణమో, మన్మథునిడాలో, విరహులను దహించు అగ్నిగోళమో అనునట్లు ఉదయించిన చంద్రుని కాంతిచే భూమి ప్రకాశింపసాగినది. అప్పుడు చక్రవాకములు బెదరినవి. తుమ్మెదలు కలువపూలను కరచినవి. కమలములు ముఖములు ముడిచినవి. సముద్రతరంగములు హెచ్చినవి. జారులు బెదరిరి. వియోగిజనుల మనసులను హిమకరుడు దహింపసాగెను[1]. కీచక విరహమున కిట్లు పూర్వరంగము సిద్ధమైనది. పై వివరణము లన్నియు తిక్కన భారతమున లేనట్టివి. ప్రబంధ రచనమునకు సహజ లక్షణములైనట్టివి. కుమారవ్యాసునకుగల కావ్యశాస్త్ర ప్రవేశము పై వర్ణనలవలన చక్కగ విశదమగుచున్నది

1 కు. వ్యా. భా., వి. ప., సంధి 2, ష. 50, 51

ఖిన్నుడైన కీచకుడు తనమందిరమున చిగురుటాకుల పాన్పున శయనించి యుండెను. చంద్రుని విజృంభణమును నిరసించినాడు. ద్రౌపదికి సాటిలేని సౌందర్యము నిచ్చిన బ్రహ్మదేవుని పాపియని నిందించినాడు వాని నిట్టూర్పుల తాకిడికి చివురుటాకుల పాన్పు వాడినది తాంబూలము నందలి కర్పూర ఖండములు వాని శరీరమున మండిపోయినవి శ్రీగంధ కర్దమ లేపనము నల్లబడినది శరీరముపై పొరలించు పన్నీటి గొన్నెలు వేడెక్కినవి. వ్యాపించిన వెన్నెల లోహరసమైనది. పతివ్రతా తిలకమైన పరాంగనపై కన్నుంచి ప్రాణములపై ఆశవిడచి చంద్రకాంత శిలావేదికపై సంకటపడుచు పొరలుచుండెను[1] ఇంతలో భళ్ళున తెల్లవారినది సూర్యుడు లోకాంధతను పోద్రోలినాడు. సువాసనలనెడి వస్త్రములను కానుకగ నిచ్చి తామరలు తుమ్మెదలను పిలిపించినవి. కీచకుడు కాతరము చెంది యుండెను

తిక్కనకూడ కీచకుని విరహమును వీనులవిందుగనే వర్ణించినాడు అదంతయు పాంచాలీ రూపమును, చూపులను, చిరునవ్వును గూర్చినట్టిది. అవన్నియు తన్నెలుకొనుటనుగూర్చినట్టివి నర్తనశాల సంకేతముగ వినిన తరువాత కీచకుని మోహపరితాపమును, ఉద్యానవనవిహారమును తిక్కన విపులముగ వర్ణించినాడు. సుదేష్ణ ఆసవమునకు తన నివాసమునకు పంపెనని నప్పుడు కేవలము అయిదుపద్యములలో వర్ణించిన కవిబ్రహ్మ రెండవసారి ఉద్యానవన సంచారమున కమలవనము పొంత నునుగాడ్పునకు బెదరి తీవజొంపములోనికి జొరబారుట, పుప్పొడి తనుగప్పునని బెదరుట, తేనియలు కురియునని లతాగుల్మముల సమీపమునకు పర్వెడుట, పిమ్మట అలిదంపతులను, మనోరమ నియ్యకొలుపు మరాళవిభుని, ఫలరసములను పంచుకొనెడి శుకమిథునములను, తలిరుజొంపములకు మొయిమొయి డాగు పికదంపతులను చూచుచు కోర్కెలు విజృంభింపగా చిడిముడిపడి, ప్రమానుపడి.

1 కు వ్యా ఖ్యా, వి ప, సంధి 2, ష 52 నుండి 64

వెగడుపడి, తల్లడపడి దురంతచింత నొందెను. ఈ సందర్భమున ఇరు వురి విరహ వర్ణనములను తులనాత్మకముగ పరిశీలించిన కుమార వ్యాసునది వ్యక్తినిష్ఠము, తిక్కనలో ద్రౌపదీ చేష్టాదికము కారణ ముగ కీచక ఆత్మనిష్ఠమైన విరహము ప్రకృతిలో ప్రతిబింబించి విశ్వ జనీనత పొందినది

పిమ్మట కీచకుడా కీవయింటనుండు చంద్రకాంత తల్ప మును చేరినాడు. సైరంధ్రి నభిమత క్రీడల నలరింతు ననుకొనెను. సూర్యుని మాయకవియని, అది రాత్రిలేని దీర్ఘదివసమని, పొద్దు కుంకింప కాకున్నదని వంతచే ఆలోచించి, దుఃఖించి, బాధచెంది, పరితపించెను. ఇట తిక్కన మాయావియని, కుమారవ్యాసుడు నళినసైరి ప్రకాశము తనకు ప్రాణాంతకమైనదని సూర్యుని ఉపాలం భింప జేసిరి

సుదేష్ణ కీచకునింటికి అసవమునకై సైరంధ్రిని పొమ్ము మనినది. అపుడు కుమారవ్యాసుని ద్రౌపది కీచకుని దౌష్ట్యమును గూర్చి స్పష్టముగ ఆమెకు చెప్పివేసినది.[1] తిక్కన ద్రౌపది అట్లు చెప్పక అదినీచపు పనియని[2] ఆక్షేపించినది. అంతట సుదేష్ణ "అదిలాతి యుల్లో తమహృదయంబున నెవ్వరేని నిన్నరుగరె ? అతిహీన విభా వనియుక్తచేతగా దలచుట నెయ్యము తియ్యము కల్మిరే సఖి!" అనికపట ప్రీతితో మాటమెత్తదనము, లోపాడితనము పర్వంగ ద్రౌపది నంగీకరింప జేసినది. ఇచట కుమారవ్యాసుని సుదేష్ణ కోప ముతో విజృంభించినది 'సైరంధ్రి గర్వపడుచున్నదని, ఆమె వలన తనకుగాని, తనవారికిగాని హానివృద్ధులుండవని, మాటలు చాలించి కీచకునింటికి పోయిరమ్మని తర్జించినది[3] సైరంధ్రిగ సుదేష్ణ కొలువున ప్రవేశించునప్పుడు ఎంగిలికి లోబడుపుట జరుగరాదని, నీచమగుపనులకు తన్ను నియోగింపరాదని, తిక్కన ద్రౌపది నియమమేర్పరచుకొన్నది.

---

1 కు వ్యా భా, వి ప, సం ౩, ష ౨ 2 తి భా, వి ప, ద్వి ఆ, ప ౯౮

3 ,, ,, ష ౪

కుమారవ్యాసుని ద్రౌపదికిట్టి నియమములేవియును లేవు తిక్కన
సుదేష్ణ మహాప్రాగల్భ్య మాటమెత్తదనమును, మనసు కఱకుతన
మును కలది. కుమారవ్యాసుని సుదేష్ణ మోటుతనమున వ్యవహరించి
నది

అపుడు ద్రౌపది శ్రీహరిని తలంచినది. సేవావృత్తిలో గల
కష్టమును తలపోసికొన్నది. 'ఓ శ్రీకాంతా ! నేను గతి చెడితిని
నాటివస్త్రాపహరణ కష్టము నేడు మరల వచ్చినది' అని
దిక్పాలురకు సూర్యునకు నమస్కరించినది.[1] దిక్పాలురగూర్చి చేసిన
ధ్యానము కుమారవ్యాసునిలో తిక్కన కంటె అధికము. సేవకా
వృత్తిచే కల్గిన కష్టము తిక్కన ద్రౌపది భీమునితో 'బల్లరు రాజు
దేవులును కాయలుగాచె చూచితే' 'గొంతికి నంత
చెలువ-' ఇత్యాదిగ చెప్పుకొన్నది సూర్యుడు రాక్షసుని పంపుట
తిక్కన కుమారవ్యాసు లిరువురును తెల్పిరి.

ద్రౌపది కీచకుని అంతఃపురము చేరినది. అంతట "భవన
మయూరములు నాట్యము చేసినవి ఆమె శరీర సౌరభమునకు అళి
కులము చాలుకట్టి వచ్చినది ఆమె కందర్ప మహామంత్రాధి దేవత,
సాకార సంసారసుఖము" ఇత్యాదిగ కుమారవ్యాసుడు వర్ణించెను.
ఇది తిక్కన భారతమునలేదు. అంతియేగాక ద్రౌపది సౌందర్యమును
కుమారవ్యాసుడు సుదీర్ఘముగ వర్ణించినాడు కీచకుడు రభసమున
సైరంధ్రిని పట్టకడంగుట, ఆమె పర్వెత్తుట, వాడు వెన్నడుగుట ఇరువు
రును తెల్పిరి సూర్యప్రేషిత దైత్యుడు తిక్కనలో మానధారికాగా
కుమారవ్యాసునిలో బొబ్బలిడుచు కీచకునిపైబడి చావుదెబ్బలు
కొట్టినాడు కీచకుడు తత్‌క్షణముపైకిలేచి తన నివాసమునకు పరుగిడి
నాడు తిక్కనలో విరటుని సాంత్వవచనము విని కీచకుడు వెనుతిరిగి
నాడు కీచకునిచే తాడితయైన కుమారవ్యాసుని ద్రౌపది రక్తము

1 కు వ్యా భా, వి ప, సం 3 ష 4,5,6

క్రిక్కినది ఝంఝూ మారుతమునకు కూలిన కదళివలె నున్నది
ఒరగాలేచి తరుమున కంటుకొన్న పరాగము విదిలించుకొని, ఎదపై
గల చెంగు సవరించుకొని, చెక్కిళ్ళపైగల రక్తధారలను తుడుచు
కొనుచు మెల్లగ రాజసభలోని పెద్దల నుపాలంభింప గోపించినది ఈ
ప్రదేశమున తన కట్టూర్పులు పాపులైన తన భర్తలను తాకునని
భర్తలను తిట్టినది. విరటుని జోలికి పోలేదు నిరపరాధుల బాధను
పోగొట్టని జనసమూహము ఘోరారణ్యమని గోడు చెందినది కంకు
భట్టు నుద్దేశించి ధర్మక్రమము రాజునకు తెల్పుచున్నది

తిక్కన కుమారవ్యాసు లిరువురును ద్రౌపదిచే సభలో
వ్యంగ్యరీతిని భాషింపచేసిరి. కీచకుని ఉద్దండ వర్తనము సర్వలోక
విదితము గావించిరి. భీముడు వృక్షోత్పాటన యత్నము గావించుట,
ధర్మజుడు వారించుట ఇత్యాదిమూలమున భావికీచకవధకు చక్కని
పరోక్షపీఠికను నిర్వహించిరి దేశికుఁడు దేశికులే ఆధారకుని, కర్మంది
డైనవాడు మానము వహించి యుండరాదని ద్రౌపదీవాక్యము.
ధర్మజుడు ధైర్యముపూని మానము వహించి యుండెను ద్రౌపది
వంకనైనను చూడలేదు మిగిలిన సోదరులు ధర్మజునాజ్ఞ లేక కళవళ
పడిరి. భీముడొక మహావృక్షమును పెరుకదలచెను. "వంటకట్టియలకు
వలయు వృక్షములు ఊరిబెలుపల చాలగలవ"ని చెప్పి ధర్మజుడా
తనిని వారించెను. తిక్కన ధర్మజుడు భీమునకు కనుసైగ కూడ చేసి
నాడు. పిమ్మట ధర్మజుడు ద్రౌపదితో మాటాడుచు కీచకుని శిక్షించు
శక్తి సభకు లేదని, అతడు మాత్స్యుని లెక్కింపడని, సంకటము
విడువుమని, క్షమ సర్వమును సాధించునని ఆమె నూరడింపజూచెను.
అందులకు ద్రౌపది నీరు మూడు పర్యాయములు మానవుని బయటకు
వేయుననియు తరువాత రక్షింపదనియు ప్రాణము పోవుట నిశ్చయ
మనియు గూఢముగ పలికినది. ద్రౌపది అవమానమునకు అవి

తృతీయ పర్యాయమని కుమారవ్యాసుడు ఆమెచే ధ్వనింప చేసెను. సైరణకు అవధి మీరినదనియు, పౌరుషము గొడ్డుపోయినదనియు, కంకుడు నేర్పుతో జారుకొనుచున్నాడనియు కుమారవ్యాసుని ద్రౌపది వ్యాఖ్యానించినది. ఇది తిక్కన భారతమున లేనిది. కంకుడు సైరంధ్రికిగల మాటకారితనము నాక్షేపించుట ఇరువురిలోనుకలదు. భీముని ప్రేరేపింపవలయునను ఆలోచనాబీజము కుమారవ్యాసుని ద్రౌపదికి సభలోననే స్ఫురించినది. తిక్కన ద్రౌపదికి తన శయనాగారమున పరుండి ఆలోచించునపుడు స్ఫురించినది దీనివలన ప్రతీకార వేగమున గల భేదము ప్రదర్శితము.

ద్రౌపది నోదార్చుటలో తిక్కన సుదేష్ణకు పలుకు వేరొక భంగిదైనది. ఆమె అసత్యసంవాదిని ఈ మాటలను కుమారవ్యాసుడు సుదేష్ణచే అనలేదు. అచట ద్రౌపది "తన్ను కాపాడెడి శక్తిలేక పోయినచో పంపించివేయుమ"[1]ని సుదేష్ణను గద్దించి అడిగినది. తిక్కన ద్రౌపది ఈరీతి నడుగలేదు 'కుమారవ్యాసుడు చిత్రించిన ద్రౌపదీ భీమ సంవాదము వినూత్నముగ నున్నది. ద్రౌపది తన మందిరము నకు పోయి ఆత్మహత్య మహాపాతకమని తలపోసినది సృష్టిలో తన వంటి పాతకి ఎవ్వరును లేరని కలతచెందినది. తన భర్తల యోగ్యతలను తలంచుకొన్నది. భీముడే సమర్థుడని నిశ్చయించుకొన్నది[2]. కీచకుడనెడు కుక్కను చంపుటకు కవలలు సమర్థులు కారని తేల్చుకొన్నది. కష్ట నష్టములకు వెనుకాడక ముందున కురుకువాడు భీముడను నిశ్చయముతో ముందునకు సాగినది అతడంగీకరింపనిచో విష ప్రాశనమున చత్తునని నిశ్చయించుకొన్నది.

ద్రౌపది భీముని నివాసమునకు బయలుదేరినది. ఆమె కన్నుల కాంతి చీకటిని పోగొట్టినదని, కంకణఝంకారముతో మూగ

1. కు వ్యా భా: వి ప, సం 8, ష 29
2 " ష 34

నేత్రమై భుజలత నుండి జారునట్టి పైట చెరగును చక్కబరచుకొన్నట్లు కుమారవ్యాసుడు వర్ణించెను. భీమనివాసమునగల వివిధ భోజన పదార్థములను చూచి భీముని సూపకారకౌశలమునకు చిరునవ్వు నవ్వుకొన్నది పైముసుగు తీసి అతని చెక్కిలి గట్టిగ నొక్కినది. భీముడు ఆమెను గుర్తించి అచటి జనులు రాజపక్షమువారని, రహస్యమును కాపాడుమని పల్కెను. ఆమె రక్షణకు తాను బాధ్యుడను కానని, ఆ అపకీర్తికి తనకు బాధ్యత లేదని, మిగిలిన నల్వురకు చెప్పకొమ్మని వెళ్ళుమని చెప్పినాడు. ఇది తిక్కన భారతమున లేదు. అందులకు ద్రౌపది వారు క్షమింతురుగాని, మానావమానములు వచ్చినపుడు నిర్గమింతురు వారు ఔచిత్యహీనులు. నీవే దయగావలయును. ఆ దుర్మార్గుని యముని యొద్దకు పంపుము'. అని నమస్కరించినది. ఈ మాటలుకూడ తిక్కన భారతమున లేవు.

"యుద్ధమునకై వచోషమును, సంతోషించుటకు వారలునా? కొందరుకష్టపడుటయును,మరికొందరు అనుభవించి జారుకొనుటయునా? నేను బెదరి నడచువాడనుగాను. నీకష్ట కార్పణ్యములను మిగిలిన వారికి చెప్పకొనుము. నాకు ధర్మరాజన్న చో భయము[1]" అనిన భీమునితో ద్రౌపది "మానరక్షణకై భర్తయొక్కడున్నను శత్రువుల మర్దించును లేదా ప్రాణములు ధారవోయును మీరు అయిదుగురుండి ఒక భార్యను పాలింపలేకున్నారు. మీరు భర్తలేనా ? లజ్జాహీనులా ? నాడు కౌరవ శునకము సభలోని కీడ్చుకొనివచ్చి అట్లు చేసెను. నేడు క్షుద్రుడైన కీచకుడు రాజసభలో నన్ను తాచెను. నాటికి నేటికి తక్కువేమి ? మీరు బలవంతులని ఆశ్రయించగ ఒక స్త్రీని బాధపెట్టుచుండిరి[2] అని దుఃఖముతో పరితపించినది. 'మానవ దానవులలో ఎవ్వడేమన్న నాకేమి? ఈ నపుంసకుల తోడబుట్టి నేనును

---

1 కు వ్యా భా, వి ప, సం 3, ష 45

2 " ష 46, 47

శక్తిహీనుడనైతిని. ఆనాడు దుశ్శాసనునిపై విజృంభింపగ కోపమున ధర్మరాజు నన్ను వెనుకకు నెట్టినాడు. నేను కీచకుని చంపుటకు వృత్తమును వెల్లడింప వలదని వారించినాడు. కుంతీకుమారుడు అన్న ఆనతి మీరినాడను నింద నాకేల? అన్నతో చెప్పుకొనుము. నేను ఆయన ఆజ్ఞతో పనిచేయువాడను' అని భీముని సమాధానము.

తిక్కన రచన దీనికి భిన్నము. భీముడు తన విజృంభణము అజ్ఞాతవాస భంగమునకు కారణమగునని సోదరుని యాజ్ఞ పాటించితి నన్నాడు[1]. తాను ద్రౌపదితో సంబంధము లేనివాడనని, ధర్మాధర్మ ప్రశంస తన కక్కర లేదని, మిగిలిన నల్వురే ఆమెను బ్రోవవలెనని, తన్ను ప్రార్థించినచో ఫలసిద్ధి లేద[2]ని కుమారవ్యాసుని భీముడు గట్టిగ చెప్పినాడు. దానికి ద్రౌపది దుఃఖించినది. తన కర్మమును గూర్చి పశ్చాత్తాపము చెందినది. శైలతటము నుండి దుమికి చచ్చుటకు, విషపానము చేయుటకు, నీట దుముకుటకు, శూలమును కౌగలించుకొనుటకు, అగ్నిలో దుముకుటకు సిద్ధపడినది. వస్త్రాపహరణము, సైంధవుని దుర్మార్గము, కీచకుని విశృంఖల విహారము తలచుకొని ఏడ్చినది. రాజగృహమున తనసేవలను గూర్చి నివేదించినది. పాండవుల మౌనమును గర్హించినది. భర్తలను పాపులని రాజవంశములో పుట్టదగనివారని వ్యర్థముగ కూడుకుడుచువారని అందువలననే దుర్యోధనుడు చతురంగ బలమును, రాజ్యమును గుంజుకొని వారిని బయటకు వెళ్ళగొట్టినాడని నిందించినది. తన్ను ఈనాడు కీచకుని బారికి పడవైచినారని దూరినది. ఆ అయిదుగురకు ఇకపై మేలగుననియు, బావయైన దుర్యోధనుడు దేవభాగ్యమును గల్గియున్నాడనియు, వీరు పరుల సేవలో పొట్టపోసికొనుచున్నారనియు, చావునకు సిద్ధమైన తాను వేరొకరికి వెరవనక్కర లేదనియు భీముడు ధర్మరాజు నాజ్ఞను

1 తి. భా. వి. ప. తృ. ఆ. ప. 179 నుండి 181

2 కు. వ్యా. భా. వి. ప. సం. 3, ప. 53, 58

పాలించి బ్రతుకవలసినదనియు, తనకు చచ్చుట కాజ్ఞనీయవలసినదనియు, భవిష్యత్తులో కామినీకేళిలో నున్నప్పుడు తన్ను జ్ఞాపకముంచుకొన వలెననియు, హద్దుమీరి తానాడిన మాటల నోర్వవలెననియు పలికి పాదముల కెరగినది[1]. ద్రౌపది చేసిన యీ విపరీత భాషణము తిక్కన చేకొనలేదు.

తిక్కన ద్రౌపది భీముని అనుమానము పోవుటకు యుధిష్ఠిరుని మహోన్నత వ్యక్తిత్వము మొదలుకొని సహదేవుని వరకు వర్ణించినది తనకు కలిగిన కష్టనష్టములను విపులముగ చెప్పినది. సుదేష్ణాదులు భీముని దుర్దశకు కన్నీరుగార్చు తనపై గుసగుసలు పోవుట వివరించినది అన్ని కష్టములను తాను ఓర్చుకొంటిననియు, కీచకుని దుర్మార్గము ఓర్వరానిదిగ నున్నదనియు వానిని సంహరింపకున్న ఆత్మహత్య తప్ప గత్యంతరము లేదని భీముని ఎదలో వ్రాలి విలపించినది. భీముడు ఆమె దీనస్థితికి, తన అసహాయతకు కన్నీరునించి ధైర్యము వహించి ఆమె కభయమిచ్చి కీచక వధకు సంకేతస్థలము చెప్పి పంపుట అతి మనోహరమైన నిర్మాణకౌశలము.

కుమారవ్యాసుని ద్రౌపది పల్కిన జాలిగొలుపు మాటలు భీముని కదలించినవి. కన్నీరు నించినది. ఆమె చెరగుతో కన్నీటిని తుడిచి కురుల చక్కనొత్తి చెంతనున్న గిండియందలి నీటితో ఆమె ముఖమును కడిగినాడు. కీచకు నుదరము చీల్చివైతునని ప్రతిజ్ఞ చేసినాడు. ఎదిరించినచో విరాటవంశమును, అజ్ఞాతవాస భంగమైనచో కౌరవవంశమును నాశనముచేసెద ననెను. దేవతలడ్డము వచ్చినను వారి ముఖముల నమరాద్రికి రాచివైతుననెను సహదేవుని మాట లెక్కింపక, కృష్ణుడే అడ్డము వచ్చినను మీరిపోగల ననెను. తనకు సమాను లెవ్వరును లేరనెను. కీచక వంశమును కూల్తుననెను.

1 కు వ్యా భా, వి ప, సంధి 3; ప 66 నుండి 68

ఇన్నాళ్ళును తమయన్న ఆజ్ఞాపాశమున కట్టుబడి యుంటిననియు సింహాని నక్కలు చెనకినట్లు కౌరవ కీచకాదులు ద్రౌపదిని చెనకిరనియు వారి ఋణమును వడ్డీతో గూడ తీర్తుననియు, కౌరవ కీచకుల ప్రాణములకు సంచకారమును తీసికొనవలెననియు పల్కినాడు. కోపావేశమే కల్గిన నీత్యవి నీతులు దా లెక్కింప ననియు ద్రౌపదీ యోగక్షేమములు తనవనియు, జారత్వముగల కీచక శునకమునకు నాట్యమంటపము సంకేతముగ చెప్పుమనియు చీకటిలో మరుగునవచ్చి ఆ దుర్మార్గుని యెదచీల్చి రక్తము శాకినులకు జల్లెదననియు, ప్రక్కనారు చూచిన వారికీయవలసిన యౌషధము తనకు తెలియుననియు నిశ్చయముగ పలికి ఆమెను పీడ్కొల్పెను. ద్రౌపదీదేవి హర్షమునను పొంగి భీముడు పురుషులకు పురుషుడని, పుణ్యోదయ ఫలమని పొగడుచు ఆత్మావాసము చేరినది. భీముడు ద్రౌపది నోదార్చిన పద్ధతిలో ఇరువురు కవులును భిన్నమార్గముల నవలంబించిరి. కుమారవ్యాసునిది ఆవేశపూరితముకాగా, తిక్కనది కోమలవాణి.

ఇంతలో సూర్యుడు పద్మద్వారముల బీగములు తెరచినాడు. వృకోదర వల్లభను కీచకుడు చూచినాడు. గడచిన రాత్రి యుగమై గడచినదనియు కుసుమశరుడు యముడై బాధించెననియు, దానికి కారణము ద్రౌపదికి తెలియు ననియు చమత్కారముగ భాషించినాడు. పరస్త్రీల కాసపడు దురాత్ములు భూమిమోయ లేదని ద్రౌపది నీతులు పల్కినది. కీచకుడు దానిని లెక్కింపక ద్రౌపదీ కరుణాకటాక్ష కవచమును తన శరీరమునకు తొడుగుమనెను. అపుడు కాముని బాణములు తనకు తగులవనెను. అంతట సంకేత స్థలము నాట్యశాలగ తెల్పి పెరవారికి తెలియకుండగ ఏకాంతముగ వచ్చి కాచియుండుమనెను.

కీచకునకు సంకేత స్థలము నిర్ణయించి వెడలిన తిక్కన ద్రౌపది మొదటిసారి భీమునకు చెప్పుటకు, రెండవసారి నాట్యశాలకు తోడ్కొని పోవుటకు వచ్చినది. కుమారవ్యాసుని ద్రౌపది సంకేత స్థలము నెరిగించుటలో వాని ఆయువు మూడినదని నిందించుచునే పల్కినది. తిక్కన ద్రౌపది నటించుచు అనురాగాయత్త చిత్తవోలె తన ఉరులలో కీచకుని చిక్కించుకొన్నది. సంకేతస్థలమును విన్న కీచకుని సంతసమును నీవును పరికించితివిగదా ! అని తిక్కన భీముడు గాఢము, గాఢమునైన పరీక్ష చేసెను. ఇది ఇరువురి నిర్వహణమునకునుగల వ్యత్యాసము. ఇటతిక్కన రెండవసారి దీర్ఘముగ విరహావర్ణనముగావించెను. ఇది కుమారవ్యాసుని భారతమున లేదు.

కుమారవ్యాసుని భీముడు మల్లయుద్ధపు వేషము ధరించినాడు. ద్రౌపదీదేవి తిలకముపెట్టి సేసలు చల్లినది. కీచకుడును శృంగారము చేసికొని, పూలుచుట్టుకొని, జవాజి కస్తురివంటి సుగంధద్రవ్యములను పూసికొని ఖడ్గమును త్రిప్పుచు తన ఇంటినుండి బయలుదేరినాడు. కాలపాశమున చిక్కిన కృతాంతుని గహ్వరము ప్రవేశించునట్లు నాట్యాలయమున ప్రవేశించెను, అపశకునములు గల్గినను లెక్కింపలేదు. చీకటిలో తడుముకొనుచు నాట్యాలయమందలి మంచమును సమీపించెను. భీముని శరీరమును తాకి ఆ కర్కశత్వమునకు బెదరినాడు పరసతులను కోరినవానికి అమృతము విషమగుననియు, కోమలత కర్కశత్వమగుననియు భీముడు వానిముంగల పట్టినాడు. అప్పటికిని వాడు సైరంధ్రియను భావముతో చేయి ముందునకు చాచినాడు. భీముడు వెనుకకుతగ్గి వానితలను పట్టినాడు గంధర్వునిగ భావించి కీచకుడు బలమున పోరాడ దొడగినాడు. వారు మందరపర్వతముల జంటవలె పోరుచుండగ ద్రౌపది నవ్వుచు ప్రక్కగ నుండినది కీచకుడు పైబడగ భీముడు ఔడుగరచి పర్వతముపై పిడుగుపడినట్లు వాని శిరముపై బలముగకొట్టినాడు. ఆ ప్రేటునకు వానితల పిడినది

శరీరమువణకినది. ఏనుగు సింహమునుకొట్టగ అది మార్కొనునట్లు కీచకుడు తిరిగి భీముని ప్రక్కలను మోకాలితో నొత్తినాడు. కూలు మని గర్జించినాడు. ఆ దెబ్బను తాళుకొని భీముడు కీచకుని ఱొమ్మును మరల నొక్కినాడు వానియెద చీలి ప్రేవులు బయటపడినవి. శరీరము దబ్బున నేలకూలినది. భీముడు వానిమొడలోనికి శిరస్సును గుక్కి నాడు కాలుసేతులను కడుపులోనికి త్రోసి వికృతముగ చంపి ద్రౌపదిని పిలిచి వానిని చూపెట్టినాడు. యమధర్మరాజు దున్నపోతు త్రొక్కగ నేలపడినట్లున్న కీచకుని గని భీముని కౌగలించుకొని కొనియాడినది. ఆతడామె కౌగిలిని తప్పించుకొని ముందునకు సాగిపోయినాడు.

ఇచట తిక్కన భీముడు 'చింతాశల్యము వాసెనే' ఇత్యాది పద్యములతో ద్రౌపదిని సంబోధించి తన కార్యసాధకత్వమును వ్యంగ్య ధోరణిలో చెప్పి తన ధీరత్వమును ప్రకటించుకొనెను.'

తిక్కన ద్రౌపది సూచీముఖ సంఘటిత నాసికాగ్రయై 'దీనికై కీచక యింత చేసితె ? సుఖిత్వము పొందుదుగాక ! అట్లైచిన నిటుగాకుండునే ఇత్యాదిగ పల్కినది అంతియేగాక భీముని ఉత్తమ నాయకత్వము సమయోచితముగ సంఘటింపబడినది. కథపై దృష్టి గల కుమారవ్యాసు కిట్టి వేమియు పట్టించుకొనలేదు. పిమ్మట కావలి వారి కెరిగించుటనుండి కథాంతము వరకును తిక్కన కుమారవ్యాసుల రచనలు దాదాపు సమానముగనే నడచినవి.

### దక్షిణ గోగ్రహణము :

ఈపర్వమును తిక్కన 237 గద్యపద్యములలోను, కుమార వ్యాసుడు 61 షట్పదులలోను వివరించిరి.

చారులుకొనివచ్చిన వార్త వినిన దుర్యోధనుడు కీచక వధకు ఆశ్చర్యమును ప్రకటించెను 'ఏదీ! మరొక్కమారు చెప్పుడు.

[illegible] నార్చి విరటుడు బాధపడుట మానవ ప్రకృతి సహజముగ నున్నది.

తిక్కన సుదీర్ఘమైన యుద్ధవర్ణనము గావించెను కుమార వ్యాసుడు సంగ్రహముగనే తెలిపెను. కథావేగముపైని, కృష్ణ [illegible]ముపైని దృష్టినిల్పిన కుమారవ్యాసుడు మిగిలిన వాని నన్నిటిని అనుషంగికములుగ చేసివైచెను. మాత్స్యుడు విజృంభింపగ సుశర్మ [illegible]రికినాడు. విరటుని వెన్నాడి బంధించినాడు విరటుని సేనలు [illegible]వరి[illegible]నవి. ఇది ధర్మరాజు చూచినాడు. సైన్యము నాయక [illegible]నమగుచుండ నూరకుండుట న్యాయముగాదని, విరటుని బంధ విముక్తుని చేయుమని భీమునకు చెప్పినాడు అతడు సమీపమునందలి వృక్షమును పెకలింపబోవగ తిక్కన ధర్మజుడును సమయభంగమగుట [illegible]ల్పి వారించినాడు అంతటభీముడు ఆక్షేపించుదురో ర్యథనునిగూడ చంపి [illegible] తమ్ముని ఆక్షేపించువారు లేకుండపోవుదురని కోపమున పల్కెను. [illegible]ముని ఈ విజృంభణము కుమారవ్యాసుని ఆవేశపూరితమైన మార్గము నకును, పనిచినట్లు చేసెదనను తిక్కన భీముని పల్కులు అతని సం[illegible]నకును గల స్పష్టమైన భేదము.

విరటుడు విడిపింపబడినాడు సుశర్మ బంధింపబడినాడు. [illegible]వులు విడిపింపబడినవి. విరటుడు పాండవసోదరులతో 'మీరే దేశము వారు? మీ సేవలో నుండెదన'ని మనఃపూర్వకముగ పలికెను. ధర్మజుడు విరటుని సమ్మానము తోడనే సంతుష్టుల మైతిమని, [illegible]త్స్యదేశము తమదేయని పలికెను సుశర్మ తలపై ముసుగు వేసి కొని తనదేశమునకు మరలెను. తిక్కనలో లేని ఈ దేశీయాచారము [illegible]మారవ్యాసుని లోకజ్ఞతను చూపుచున్నది. తిక్కనవలె పోలికలని [illegible] కుమారవ్యాసుడు గావింపలేదు. ఇంతలో ప్రజల నిద్రాముద్రను [illegible]లగ చేయుచు సూర్యోదయమైనది

### ఉత్తరగోగ్రహణము :

కీచకవధానంతరము విరాటపర్వమున రసవత్తరమగు ఈ ఘట్టమును తిక్కన 628 గద్యపద్యభాగములలోను, కుమారవ్యాసుడు 825 షట్పదులలోను వర్ణించిరి

కౌరవసైన్యము ఉత్తర గోగ్రహణము గావించినది గోపాలురెదురొడ్డి తీవ్రముగ పోరాడిరి. తిక్కనలో లేని విధమున ఒక గోపాలుని పట్టుకొని కౌరవులు ముక్కుపై సున్నము పెట్టి పంపిరి. గోపాధ్యక్షుని స్థితి దయనీయముగ వర్ణితము ఎదురువచ్చిన ప్రజ వానిని ప్రశ్నించినది వాడు కేవలము యుద్ధము సామాన్యమైనది కాదని మాత్రము తెల్పుచు పర్వెత్తెను దక్షిణ గోగ్రహణమును గూర్చి ఉత్తరుడు విచారించుట, కౌరవ సైన్యమును గూర్చిన దీర్ఘవర్ణనము తిక్కన గావింపలేదు ఉత్తరుడు గోపాధ్యక్షుని అసమర్థతను నిందించి, తాను యుద్ధమునకు పోయినచో ఈశ్వరుడును మార్కొనలేడని పల్కెను. ఉత్తరుని ప్రక్కనగల కాంతాజనము కౌరవులనుజయింపుమని ఆతని ప్రోత్సహింతురు. జూదమున పాండవుల నోడించుట, హస్తినాపురము స్వాధీనపరచుకొనుట, ద్రౌపదిని పరిభవించుట, పొగరెక్కుట అను దుర్యోధనుని లక్షణములు తనయొద్ద సాగవని, తాను యుధిష్ఠిరునివలె బలహీనుడనుగానని, పాండవులను బాధపెట్టిన గర్వము వారిని యమునియొద్దకుపంపునని కావుననే వారికి గోగ్రహణము చేయ బుద్ధిపుట్టినదని, తనవంటి వానితో వైరము పెట్టుకొన్న దుర్యోధనుడు రాజ్యమేలజాలడని, తన్ను చెనకుట యముని సమీపమునకు పట్టిలాగుటయని, సింహమును చెనకుటయని, బుద్ధిలేక యుద్ధమునకు వచ్చిన కౌరవుడు చెడెనని ఇత్యాదులున్నియు తిక్కనకు భిన్నములైన కుమారవ్యాసుని ఉత్తరుని హాస్యపూరితములైన ప్రసంగములు తిక్కన ఉత్తరుడు భీరువు కుమారవ్యాసుని

ఉత్తరుడు వాచాలుడైన పరమ హాస్యభీరువు. తాను యుద్ధమునకు పోయినచో కొందరు యమపురమునకు పోవుట, కొందరు పారిపోవుట జరుగుననియు, దేశపాలకులు గోవుల పట్టరాగని, కౌరవులు చక్రవర్తులవలె గాక సామంతులవలె ప్రవర్తించుచున్నారని, వారి కపకీర్తి మిగులునని డంబమున పల్కెను. జనసామాన్యాకర్షకమును, సామాన్య జనజీవన ప్రతిబింబ సమర్థమునునైన శైలి కుమారవ్యాసుని పద్ధతి. దేశ, కాల, సంఘ, రాజకీయ, సాంస్కృతికాది కారణములతో తదనుగుణమైన సరళము, సుబోధమునైన శైలి నెంచుకొనుటలో తిక్కన, కుమారవ్యాసు లిరువురును సఫలీకృతులైరి.

పై ఉత్తరుని మాటలను కుమారవ్యాసుని అర్జునుడు విని నాడు తిక్కనలో సమయోచితమగు మార్పుతో ఆ మాటలను ద్రౌపది విన్నది. కుమారవ్యాసుని అర్జునుడు పాంచాలిని పిలిచి మన మూరక కుండరాదు, అజ్ఞాతవాసము పూర్తియైనది. రాజ్యభాగము గైకొనవలసి యున్నది. కౌరవసైన్యము రాక మనకొరకే. కావున ఉత్తరునకు నన్ను సారథిగ చేయుము' అనిన, ఉత్తరుని అనుజ్ఞ చేత ద్రౌపది ఉత్తరుని చేరి బృహన్నల విషయము నెఱింగించి అతని తోడ్కొని వచ్చునట్లు చేసినది తిక్కన భారతమున ద్రౌపది బృహన్నల విషయము ఉత్తరకు తెలుప ఆమె తన సోదరునకు తెలిపెను. ఉత్తరుడు తొలుత వేడినిగూర్చి మలకనగ మాటాడెను. కుమారవ్యాసునిలో నిది కనబడదు. అతడు వెన్వెంటనే బృహన్నలను పిలుచుకొని రమ్మనెను. తిక్కన ఉత్తర బృహన్నల కడకు పోయి వినయ సంభ్రమములతో రమ్మని ప్రార్థించెను. కుమారవ్యాసుని ఉత్తర మాట నెరవేర్పగలిగినచో కోరిక బయట పెట్టెదనన్నది. ఇది గడుసరితనము. తిక్కన బృహన్నల విషయమును విని ఉత్తరుతో "జగతీవరపుత్రి! నాకు సారథ్యము నేర్పగలదే?" అని ప్రశ్నించెను కుమారవ్యాసుని బృహన్నల తన అశక్తతను ప్రక

టింపలేదు. ఉత్తరమాట మీరజాలనని బయలుదేరి వచ్చెను ఉత్త రుని ఎదుట భీష్మాదుల పరాక్రమమును వర్ణించి తాను సారథ్యము మరచితి ననెను దానికి ఉత్తరుడు తానుండగ భీష్మాదుల వలని భయము లేదనెను. బృహన్నల యంగీకరించి రథము సిద్ధముచేసెను. కవచము తలక్రిందులుసేయ ఉత్తరుడు సరిదిద్దెను. అదిచూచి స్త్రీ జనము నవ్వెను బొమ్మపొత్తికలకు కురుపీరుల రత్నాంబ రాభరణ ములు తెమ్మని ఉత్తరకోరెను బృహన్నల రథవేగము ననుసరింప లేక చతురంగబలములు ఇంటిమొన్ననే నిలచిపోయినవని కుమార వ్యాసుడు వర్ణించెను తిక్కన విరటుని చతురంగబలములు గక్షిణ గోగ్రహణమునకు పోయినట్లు చెప్పుటచే మరల నాప్రసక్తి తీసికొని రాలేదు.

కౌరవసైన్యము సముద్రమువలె నున్నది కరిఘటములు చెలియలి కట్టగను, అశ్వసైన్యములు అలలుగను, రథసమూహములు ఆవర్తములుగను, ఛత్రములు నురగుగను, సైన్య సమూహములు జలచరములుగను. వాద్యధ్వనులు అలలసవ్వడిగను ఉపమించెను. అంతియేగాక ఆసైన్యము దావానలమువలెకనబడెను. పీరులు కత్తులు ఝుళిపించుటచో కనిపించుకొలువు మెఱుగులుగను, భటులరాద్రి రభసమే ఛటఛట ధ్వనిగను సైన్యమువలన లేచిన ధూళి పొగగను కన్పించెను దానిని చూచిన ఉత్తరుడు కాలకూట విషప్రవాహమో మృత్యుదేవతా కంఠమునగల చిఱువాలుకయో, యముని ఘంటికా నినాదమో, కాలకంఠుని తృతీయ నేత్రపుటగ్నియో అని తలంచెను. ఇచ్చట తిక్కన 'అభినవ జలధర శ్యామంబు లగుసేనలు' అనుచు ఒక రమ్యమైన దృశ్యమునుచెప్పి కౌరవసైన్య సామర్థ్యమును వర్ణిం చెను. తిక్కన వర్ణన గావించునపుడు పాత్రసామర్థ్యమును గూడ దృష్టిలో నుంచుకొనెను. కుమారవ్యాసునకు పోతనవలె శబ్దాలంకార ములపై ప్రీతిమెండు. కావుననే తన కవిత్వము శ్రవణ సుధావినూతన కథనమనెను కవిత గానయోగ్యమని అతని ఉద్దేశము షట్పది

గేయానుకూలమైన రచన సమకాలీన ప్రభావమున మార్గశైలిని త్రోసిరాజని ఈశైలి ప్రకాశించినది తిక్కన అర్థపుష్టితో రసధ్వని పూర్ణముగ అనన్య సామాన్యరీతిలో వ్రాయుటకును సమకాలీన ప్రభావమే కారణము. శివకవుల ప్రాచుర్యము లేనిచో తిక్కన రచన ఇట్లుండజాలెడిదికాదేమో? నిర్వచనోత్తర రామాయణము వ్రాసి శివకవుల ఆవేశ జలధికి, వేదబాహ్య మతాంభోధికి చెలియలికట్టవైచి పరిణత దశలో ఆంధ్రావళికి మోదమును గూర్చు లక్ష్యమున భారతరచనమునకు గడంగెను నన్నయ అనుసరించిన మార్గశైలిచే శివకవుల ఆట కట్టింపలేమని తలంచి వారినుండి పాత్రసంభాషణ పూరితము, దేశీయ సంప్రదాయ భూయిష్ఠము, మనస్తత్త్వ పరిశీలనా సమగ్రము, సామాన్య మానవోద్బోధన పటిష్ఠము, రసనిర్భరమునైన నాటకీయ శైలినే గ్రహించెను ఇదివారి భిన్నశైలీ నిర్వహణమునకు కారణములు

ఉత్తరుడు ఆసైన్య సముద్రమును తానీదలేననియు ఎదిరించి బ్రతుకలేననియు, ప్రాణమున్నచో ఏమైనను చేయవచ్చుననియు నేల ఈనినట్లున్న సైన్యము నెదుర్కొనుటకు పరమేశ్వరుడొక్కడే చాలుననియు, గుఱ్ఱములవాపి తోత్రమును పారవేయుమని సారథి నాజ్ఞాపించెను లయకాలుని ముసుగు నెవ్వరును తొలగింప లేరనియు, యుద్ధము చేయుట తనకశక్యమనియు నిశ్చయముగ తెల్పెను. దాని కర్జునుడు నవ్వుచు ప్రథమచుంబనమున పండ్లూరలి నట్లున్నదని, యుద్ధము చేయకయే భయపడుట కులమునకు అపకీర్తి కరమని, గెలుతుమని యుద్ధము చేయవలెనని రథమును ముందుకు నడపెను. కౌరవసైన్యము చేరువగు కొలది ఉత్తరుడు బెదరిపోవ సాగెను వాని మేను గరుపారినది. కాలు సేతులు వణకినవి పెదవులు నాలుక తడియారినవి. అరచేత ముఖమును కప్పుకొనెను. తన కుత్తుకను కోయవలదని బృహన్నలను వేడుకొనెను. ముందున్న సేనా సమూహమును జూచిన దేవతలకును జయింప శక్యము గానిదని

ఉత్తరుడు పలికెను చేతిలోని విల్లమ్ములు జారిపోయినవి. తన్ను కాదని రథము తోలికొనిపోవుట స్వామిద్రోహమని ఎలికినను బృహన్నల వినకపోవుటచే ప్రాణభీతుడై రథమునుండి దుమికి పరుగిడసాగెను అది గనిన అర్జునుడు వెతజెంది, 'వెన్నాడి, పరుగెత్తినచో శిర ముత్తరింతునని బెదరించి, శతపద మాత్రమున పట్టుకొనగల్గెను. ఉత్తరుని భయమునంతను కుమారవ్యాసుడు అర్జునుడు ఉత్తరుని పట్టుక పూర్వమే వర్ణించెను తిక్కన పట్టితెచ్చిన పిమ్మట వర్ణించెను.

అర్జునుడు ఉత్తరుని వెంట పరుగెత్తుట చూచి కౌరవసేనలు నవ్వినట్లును, ఆ నవ్వినవారిలో కొందరజ్ఞులనియు, సూక్ష్మరేఖ నరయగల కొందరు విజ్ఞులు అర్జునుని పోల్చుకొన గలిగిరనియు తిక్కన పేర్కొనెను. తన్ను శత్రువులచే చంపింపక బృహన్నలనే చంపుమని ఉత్తరుడనెను అర్జునుడు రాజధానియందు ఉత్తరుని బీరములను జ్ఞప్తికిదెచ్చి శత్రువు నెదిరింపుమనెను. ఉత్తరుడు బ్రతుకుపైగల ఆశను, పిరికితనమును, ప్రాణభీతిని బయటపెట్టి తన్ను ముక్తుని చేయుమనెను. అంతట అర్జునుడు రాబోవు అపకీర్తిని గూర్చి తెలిపి, వీరుడై శత్రుసైన్యమును మార్కొనినచో వచ్చు అశ్వమేధాది ఫలమును, దేవతాస్త్రీల సేవను, యుద్ధముచేయకపోవుటచే వచ్చు పాపమును వివరించి[1] చెప్పెను దానికి ఉత్తరుడు 'తన అంతఃపుర కాంతలే తనకు చాలుననియు, దేవతాస్త్రీల సేవ వలదనియు, అశ్వమేధ యాగము తానాచరింప గలననియు, తనకుగల రాజపదవియే ఇంద్ర పదవి యని' మారుపల్కెను. ఈ పల్కులన్నియు తిక్కనకు భిన్నములు తిక్కన ఉత్తరుని హాస్యపాత్రగ నిర్వహించినను సంయమము పాటించి సంభాషణాదులు విజయవంతముగ నిర్వహించెను

పిమ్మట అర్జునుడు 'రాజ సభలో వేశ్యలముందు బీరములాడుట, యుద్ధము వచ్చినప్పుడు కాలికి బుద్ధి చెప్పుట జరిగినచో

1 కు వ్యా భా, వి ప, సం 0, ష 22 23

సభలో గౌరవము మిగులున'ని పలికెను. దాని కుత్తరుడు బృహన్న
లకు అగ్రహారాదుల నాశ చూపెను. తన తండ్రి చేసిన మేలునకు
చేయవలసిన ప్రత్యుపకార మిదికాదని దీనముగ పలికెను. ఆవేశ
పూరిత రచన కిట్టిది యుదాహరణము. ఉత్తరుని రాజబాహ్యుడనియు,
రాజవంశమున బుట్టి శరీరము దాచుకొనువాడనియు పలికి రథికుడుగ
గాకున్న సారథివై మెలగుమని ఉపదేశించెను. అంగీకరింపని యుత్త
రుని విసిరి వేసారిన యర్జునుడు జుట్టుపట్టి తెచ్చి రథము నెక్కించెను[1]

ఉత్తరుడు శమీవృక్షము నెక్కి శవమును వస్త్రము పైకెత్తి
కట్టినాడని, చెరగు సరిచేసికొన్నాడని కుమారవ్యాసుడు తెలిపెను.
ఆయుధములజూచి కాలభుజగము నాలుకయని, బృహన్నల తన్ను
చంపినాడని తలంచెను. బెదరుచున్న ఉత్తరునకు అర్జునుని స్మరించు
కొమ్మని ఆయుధములు వశమగునని బృహన్నల చెప్పెను. గాండీ
వము ధరించిన అర్జునుడు చిత్రజ్ఞత్వమున దేవదత్తము వచ్చినట్లు
తిక్కన పేర్కొనెను. కుమారవ్యాసుడు ఉత్తరుడు ఆయుధముల కట్ట
నుండి తీసి యిచ్చినట్లు పేర్కొనెను,

ఆయుధ పరిచయమునకు పిమ్మట కుమారవ్యాసుని ఉత్తరుడు
బృహన్నలను 'నీవు అర్జునుడవా? నకులుడవా? మరుత్సుతుడవా? సహ
దేవుడవా?' అని ప్రశ్నింప, తిక్కన ఉత్తరుడు ఆయుధముల నిచట
పెట్టి పాండవు లెచటి కేగినారో తెలియజెప్పుమని ప్రశ్నించినాడు.
తిక్కన అర్జునుడు తమ్ము తీగించుచు 'ఇంత కొఱతపెట్టనేల యేనర్జును
డన్' అని ఆశ్చర్యకరముగ చెప్పెను. కుమారవ్యాసుని అర్జునుడు
తొలుతనే తన్ను తగించుకొనెను. తిక్కన అర్జునుడు తన దివ్యనామములను
వ్యుత్పత్తులతో నిచ్చినాడు. కుమారవ్యాసుడు ఈ వ్యుత్పత్తులు
చెప్పలేదు. ఉత్తరుడు మహోత్సాహమున రథసారథ్యము స్వీక
రించెను. కౌరవ వీరులను పరిచయము చేయుమని కుమారవ్యాసుని

1 కు వ్యా భా, వి ప, సం 8, ప 28

ఉత్తరుడడిగెను. తిక్కనలో అర్జునుడు స్వయముగనే వేసెను. వీరు లను పరిచయము చేయుచు తిక్కన అర్జునుడు వారి పతాకలనుగూర్చి తెలిపెను. కుమారవ్యాసుడు వారి సంపూర్ణ వివరముల నిచ్చెను. కౌరవసైన్య పరిమాణమును తెల్పుచు "అంధాసురుని సేనకు రెండు రెట్లును, రావణుని సేనకు మూడురెట్లును" అని చెప్పెను

కావ్యార్థ పరిస్ఫూర్తికి సన్నివేశ నిర్వహణకు మూల గ్రంథమునేకాక ఇతర గ్రంథములను కూడ ఆశ్రయించుట కుమార వ్యాసుని లక్షణము కాగా తిక్కన మూలగ్రంథమును తక్క వేరు గ్రంథమును దేనిని గ్రహింపలేదు.

దేవదత్త ఘోషము తలపై పిడుగు పడినట్లుకాగా ఉత్తరుడు మూర్ఛిల్లెను కన్నీరు ధారగట్టినది పార్థుడు తన చెఱగున విసరి యాతని కుపచరించినాడు మరల చక్కజేసి కూర్చుండబెట్టినాడు ఉత్తరుడు తానాశబ్దము నోర్వజాలనని, శరీరము వ్రేలిపోవునట్లైన దని, తనువు కంపింప చేయుచున్నదని పలికెను. ఆ అద్భుతధ్వనికి బెదరకుండుమని పార్థుడు పలికెను

కుమారవ్యాసుడు తిక్కనవలె ద్రోణునితో నిగూఢ భాషణము చేయింపలేదు ద్రోణుడపశకునములను గూర్చి తెలిపి భీష్ముని కి అర్జునుని సూచించును. తిక్కనలో ఇది దుర్యోధనునకు చెప్ప బడినది. అజ్ఞాతవాసమును గూర్చి దుర్యోధనుడు భీష్ముని ప్రశ్నింప సమయావధి మీరుట తెల్పి కర్తవ్యమును బోధించుచు పశుసమూహ మును తోలుకొని పొమ్మని చెప్పెను. ద్రోణ, భీష్ములు కలిసి వ్యూహరచన చేసినట్లు తిక్కన తెలిపెను. కుమారవ్యాసునిలో భీష్ముడే చేసినాడు పార్థుడు గోవులను మరలించుట ప్రథమ కర్తవ్య మని కురుపతిని తాకబోయిన కృపద్రోణులు అడ్డుపడిరి పార్థుడు నమస్కార బాణములతో వారిని తరించి సాగిపోయెను ఆంజనేయుని గర్జన, అర్జునుని ధనష్టంకారము అతిరథుల కాశ్చర్యమును కల్గించెను.

గోవులకడ్డపడిన సైనికులు కత్తులు తెగునని బెదరిరని కుమార వ్యాసుడు వ్రాసెను. ఇది తిక్కన చెప్పలేదు.

పార్థుని యుద్ధకౌశలముగనిన కేతనమువనున్న హనుమ ఆశ్చర్యపడి రామలక్ష్మణులలో, ఇంద్రజిత్తులో, ఆబాణ సంధాన లాఘవములేదని పొగడినట్లు కుమారవ్యాసుడు ఒక చిత్రమైన కథ నము[1] గావించెను. గోవులబట్టిన సైన్యవిభాగము బెదరి పారిపోయిరి. గోపాలురు గోవులను పొలిమేర పట్టించిరి, ఉత్తరుడు ఆనందప్రవాహ ములో మునిగిపోయెను. ఇచట కుమారవ్యాసుడు చక్కని దేశీయ మగు వర్ణన గావించెను. ఆవుల పొదుగులనుండి పాలు ప్రవాహముగ స్రవించుచున్నవి. అవి తోకలనెత్తి దిక్కు దిక్కుల చూచుచు పర్వ లెత్తినవి గంజవిడుచుచు, పేడవేయుచు, క్రొత్తి వారికి బెదరినట్లు కన్పించుచున్నవి. ఇట్లు దిగ్భ్రాంతి చెందిన గోవులను గోపాలకులు సమాధానపఱచి మందగూర్చిరి దారి చూపించుచు ముందు వెనకల నడచిరి అవి ధూళిరేపుచు ఊరివైపు నడచినవి.

ఆవుల మళ్లించిన గర్వపర్వతమునకు వజ్రాయుధమును, సేనోడించిన ఉత్సవజలధికి బడబానలమును, రారాజు చేజిక్కెనని జయగర్వమునవున్న నసికి వేసవికాలపు తీవ్రతాపమును అని వీరా లాపములాడుచు అతిరథులు అర్జును నాక్రమించిరి. సంకుల సమర మయ్యెను 'అడవిని కాల్చినంత, గాయకులను గెల్చినంత, యంత్ర మీనమును కొట్టినంత, శివునితో పోరాడినంత, ఆడుదాని చెఱగుపట్టి పోయినంత మాత్రమున నీవు విరుడవగుదువా?' అనిరి. ఆ అతిరథుల మాటలకు 'సిగ్గు విడిచినవారు మాటాడినను మాన్యులు మారాడ[2]ర' ని అర్జునుడు శరవర్షము కురిపించెను. ఇప్పట్టున తిక్కన వివరముగ 'ఆచార్యుండెబ్బదియమ్ముల[3] అను పద్యమును సంధానించెను. అర్జు నుని పూర్వవిజయములను సేనలచే పరిశీలింపజేసి పూర్వపరార్ధయుక్తి

1 కు వ్యా భా వి ప, సంధి 7, ష 44 2 కు వ్యా భా, వి ప, సం8, ష 8
3 తి భా వి ప, ఆ 5, ప 69

సాధించి కావ్యలక్షణమును ప్రధాన కథాప్రవాహామువైపు సాగించి
నాడు కుమారవ్యాసుడు కవచిన కథను ప్రస్తుత కథాంశముతో
సమయోచితముగ మేళవించి కథనల్లుట మహోద్భుత కథనశిల్ప
విషయము

అశ్వత్థామ కర్ణుని ప్రేరేపించుచు కర్ణార్జునుల యుద్ధము,
అంతకన్న వారి సంభాషణము తిక్కన పరమ సుందరముగ తీర్చిదిద్ది
నాడు అర్జునుని ధర్మనిర్వహణమును, సోదరాజ్ఞా బంధిత స్థితిని కర్ణు
డాక్షేపించెను 'వనవాసాజ్ఞాతవాస సమయములకు పిమ్మట రాజ్య
మిత్తురని వేచియున్న వాడని, ధైర్యసారము లేనివాడ'ని కర్ణుడు అధిక్షే
పించెను కర్ణార్జునులకు ఘోరయుద్ధము జరిగినది భార్గవసాంప్రదాయ
మని అర్జునుడు, ఈశ్వర సాంప్రదాయమని కర్ణుడు పరస్పరము దెప్పి
కొనిరి చివరకుఅర్జునుడు నిమిషమాత్రమున కర్ణసారథిని, ఐదమ్ములతో
గుఱ్ఱములను, నాల్గమ్ములతో కర్ణుని వింటిని విరిచెను. కర్ణుడుచేయునది
లేక వెనుతిరిగెను

అంతట ద్రోణుడర్జును నెదిరించెను. అర్జునుడు నమస్కార
బాణము ప్రయోగించెను. ద్రోణుడది మెచ్చక యుద్ధమున నెదిరించి
నిలబడుట క్షత్రియ ధర్మమని శరముల సంధించెను ఇట తిక్కన
'మీరు వేసినగాని వేయన[1]ని' అర్జునునిచే పలికించెను కుమారవ్యాసుని
అర్జునుడు 'నీచెప్పిన విద్య మెప్పింతు[2]న'ని పలికి గురువుపై విల్లెక్కు
పెట్టెను ద్రోణుడు 'అశ్వత్థామ తనకు విషయలంపటముచే పుట్టిన
సంతానమనియు, పార్థుడే ప్రియ పుత్రుడ[3]నియు ప్రశంసించెను పార్థుని
బాణవర్షమున సారథిపాటుతో ద్రోణుడు రథమును ప్రక్కకుత్రిప్పెను
కృపాచార్యునితో అర్జునుడు రథముపైనను, కత్తిడాలు ధరించియు
యుద్ధము చేసినట్లుగ తిక్కన వర్ణించెను కుమారవ్యాసుడు అర్థ

1 తి భా, వి ప అ 5, ప 1 4

2, 3 కు వ్యా భా, వి ప, సం 8, ప 33, 34

వీరందరు ఒక్కమారు ముట్టుముట్టగ ఉత్తరుడు చింతించెను మేఘపటలము పవనుని చేతఁగు చట్టిచెల్లుకాగా అర్జునుడు సమ్మోహనాస్త్రమును ప్రయోగించెను సమ్మోహనాస్త్ర ప్రభావమును కుమారవ్యాసుడు మిక్కిలి విపులముగను, దేశీయముగను, అనుకూలకముగను, తిక్కనకంటె భిన్నముగను వర్ణించెను. ఏనుగులు, మావటీండ్రు, కురుసేన, తురగములు, రాహుత్తులు, భీష్ముడు తక్క మిగిలిన వారెల్లరు మూర్ఛచెందియున్న స్థితిని చక్కగా వర్ణించెను. కౌరవ సైన్యమంతయు సంహారమున జీవరాశి వలె మునిగినట్లుండ, అవస్థాత్రయమును దాటి తురీయదశలో నుండు వానివలె భాగీరథనందను డుండెనట పదునొకండక్షౌహిణుల సైన్యమును అర్జునుడొక్కడే జయింప అమరులు పుష్పవృష్టి కురిపించిరి అర్జునుడు రథావతరణము చేసి భీష్మద్రోణాదులకు నమస్కరించి బొమ్మపొత్తికలకై ఉష్ణీషముల తెమ్మని ఉత్తరుని ఆజ్ఞాపించి అతడు తిరిగి రాగానే ఎదిరించిన భీష్ముని బాణములలో ముంచి వెనుదిరిగెను తిక్కన కురురాజ కిరీటమణులు పడగొట్టె, కుమారవ్యాసుడు కురురాజ కిరీటమునే పడగొట్టెను కైదువులను శమీవృక్షమున చేర్చి యథాపూర్వకముగ బయలుదేరెను ఇచట తిక్కన దేవతలు యుద్ధవార్తలను స్మరించుకొనుచు వెనుతిరిగిరని చక్కగ ముగించెను 'ఓడిన కౌరవులు ముఖములకు ముసుగులు వేసికొనిరి, వాద్య ధ్వనులు లేకనే పురప్రవేశము చేసిరి' అను కుమారవ్యాసుని రచనము తిక్కనలో లేనిది దేశీయమైనది

ఉత్తరునిచే ప్రేషితులైన గోపాలురు విజయోత్సవముల విషయము మాటాడుచు వచ్చుచుండిరి వారు ఉత్తరుని 'కురుకుల గజ పంచాస్యుడని, రిపురాజ కుమార కుఠారుడని ప్రశంసించుచు వచ్చిరి. తిక్కనలో గోపాలురు "కురుబలముం జయించి
తత్తురంగ రథ ధ్వజాలి నొక్క త్రుప్పుడు రాలదు మము బిల్చి వేమరి

నెత్తురింపుచున్న నృపపుంగవ వచ్చితి మేము నాపుడున్[1]' అని పలికిరి ఉత్తరుని విజయవార్త విన్న విరాటునకు రోషమాంచమగుట, మనస్సానందమయమగుట, దూతల కిష్ఠారముల నిచ్చుట జరిగినది. తిక్కన ఉత్తరు నెదుర్కొనవలసిన పద్ధతిని గూర్చి చెప్పినాడు. కుమారవ్యాసుడు చేసి చూపినాడు. ఉత్తరకుమార విజయవార్త శ్రవణమున తనకు సంతోషముప్పొంగి వచ్చుచున్నదని విరటుడే వాచ్యము చేయుట కుమారవ్యాసుని రచనము కంకునిచే చెప్పించు వ్యంగ్య వాక్య రచనా విన్యాసము తిక్కనది పాత్రల అతిశయమును ప్రక్కపాత్రలచే చెప్పించుట తిక్కన పద్ధతి

జూదమాడదలచిన విరటునకు కంకుడు పాండవుల జూదమును గూర్చి తెలిపెను తాను పణమొడ్డి ఆడుటలేదని, కుమారుని విజయాభ్యుదయమున హెచ్చిన సంతోషమున ఆడుచుంటినని విరటుడు పల్కెను కంకుడు గెలుపు బృహన్నలదనియు, విరటునకు మోహపు కన్నులు గలవని, సంసారభ్రమ కలదని భ్రమవిడిచి చూచినచో గెలుపు బృహన్నలదిగ తెలియునని చెప్పెను కంకుని విరటుడు అసహనపరుడై పాచికతో కొట్టెను. అప్పుడు కన్నులలో నిప్పులు గ్రక్కుట, ఔడుగరచుట, పండ్లుకొరుకుట మొదలగు లక్షణములు విరటునిలో కనబడినవి తిక్కనలో "పవగనెత్తు ఉరగ సోలు రేఖ" "కన్నులు కెంపు గదుర" "సక్రోధ హాసోల్లాస వికృతాననుడై" ఇత్యాదిగ కోపము క్రమక్రమముగ వికాసము చెందుట గమనింపగలము తిక్కన రంగభూమిపై ప్రతి కదలికయు గమనించి పోషించి నడిపించు సూత్రధారునివలె పాత్రల విన్యాసమును బహు జాగరూకతతో నడిపించెను

కంకుడు రుధిర ధారను దోసిలిలో పట్టినట్లును, సైరంధ్రి చెఱగును తడిపి ఆ రక్తమును తుడిచి, దానిని భూమిపై పడకుండ

1 తి భా, వి ప, పం ఆ, ప 288

చేసినట్లును చెప్పబడినది కంకుని రక్తము భూమిపై పడునట్లు చేసినవానిని బృహన్నల చంపక మానదని ద్రౌపది విరటునకు తెల్పెను తిక్కన ద్రౌపది కంకుని రక్తము భూపతితమైన కఱవు వచ్చునని పల్కినది విరటునకు కంకుభట్టు, సైరంధ్రి, బృహన్నలాదుల సంబంధ మూహింపబోయి, తన కేలయని తూష్ణీభావము వహించెను ప్రజలు ఉత్తరుని విజయమునుగూర్చి భిన్నాభిప్రాయములు వెలిబుచ్చిరి విజయి బృహన్నలయేయని ఊహించినవారు లేకపోలేదు ఈ ప్రజావాక్యము కుమారవ్యాసునిదే.

తనగాయమునకు కారణము తిక్కన ధర్మజుడు తానే వివరించెను. కుమారవ్యాసుడు దాచెను. అనవధానతవలన కలిగిన దనెను పిమ్మట ద్రౌపది సాహాయ్యమున నొట్టుపెట్టుకొని బృహన్నల తెలిసికొనెను విరటునిపై భీమార్జునుల విజృంభణము, ధర్మజునోదార్పు ఇరువురును తెల్పిరి భూమిపై రక్తము పడలేదని ద్రౌపది చెఱగు తడిసినదని కుమారవ్యాసుని సమయోచితాభిప్రాయము వారి నూఱడించినది

కీచకుని వలన కలిగిన యవమానమునకు ధర్మజుడే కారణమని, పదుమూడు వత్సరములనుండియు ధర్మజాజ్ఞమున తాము ఒడలు మరచి చేతులు కట్టుకొని యుంటిమనియు, తమ్ము స్వేచ్ఛగ వదలిపెట్టుమని భీముడువాదించుట కుమారవ్యాసుని ఆవేశపూరిత రచనకు మరియొక ఉదాహరణము

పంచపాండవులు తమ్మెరిగించుకొనుట తిక్కన, కుమారవ్యాసులు భిన్నముగ తెల్పిరి కుమారవ్యాసుడు పాండవాజ్ఞాతవాసములను చేతికందించు వానివలె మాసోదయ మయ్యెనని వర్ణించెను. పిమ్మట దీర్ఘమైన సూర్యోదయ వర్ణనము కలదు పాండవులు భగవన్నామ స్మరణతో మేల్కాంచిరి జీవభ్రమ కవచమును తొలగించిన ఆత్మవలె ధర్మజుడు ప్రకాశించెను. సూర్యునివలె క్షాత్రతేజస్సుని

ప్రకాశింప జేసెను. భీమాది సోదరులతో, ద్రౌపదితో సభ నలంక రించెను వారిని చూచి అచటి సేవకులు పరుగునవచ్చి ఇంద్రుడో, శంకరుడో, నారాయణుడో సభకువచ్చి కూర్చుండిరని విన్నవించుట నూతనాంశము తిక్కన పంచపాండవులను పంచాగ్నులనెను. ఉత్త రునితో విరటుడు స్వయముగ తానై కదలి వచ్చినాడు. కుమార వ్యాసుని రచనలో పురోహిత ప్రధానసమేతముగ వచ్చినట్లున్నది ధర్మజుడు సోదరులతో గూడి పంచముఖుడైన శివుడని కుమారవ్యాసుడు వర్ణించెను వారిని కొందరు గుర్తించిరి కొందరు సురలోక పాలకు లనిరి ఉత్తరుడు ముందునకు వచ్చెను అర్జునుని, పాండవుల నంద రను వరుసగ పరిచయ మొనర్చినాడు. విరటుడు కానుకలొసంగి వారికి సాష్టాంగ పడినాడు అపరాధములు సైచుమని వేడకొన్నాడు. సుదేష్ణాదేవి ఉత్తరతో వచ్చి ద్రౌపదికి కానుక లందించి నమస్క రించినది సకల పరివారము వారి ననుసరించినది తిక్కన ద్రౌపది సభకు రాలేదు కుమారవ్యాసుడు ధర్మజుని ప్రక్క రాజ్ఞివలె ద్రౌపది వెలుగొందుచున్నదని స్పష్టము చేసెను

ధర్మజుడు కూర్చుండుమని విరటుని పిల్వగ ప్రక్కన కూర్చుండక దూరముగ కూర్చుండెను. ధర్మజుడు వినయ రసాభి షేకము చాలుననియు, కానుకలు పునరభిషేకమగుననియు కౌర వులపై గల పగను, దంపతుల్ర తను ధర్మజుడు వాచ్యముగ స్పృశించి నాడు తిక్కన అనువాదములో ఆ పలుకులు విరటుడు పల్కినాడు. విరటుడు తానై సాయము చేయవత్తుననుట ధర్మజ పాత్రమునకొక గాంభీర్యమును చేకూర్చుచున్నది.

### వైవాహిక పర్వము :

ఈ పర్వమును తిక్కన 54 గద్యపద్యములలోను, కుమార వ్యాసుడు 58 షట్పదులలోను నిర్వహించిరి. ఉత్తరుడు అర్జుననిపై

ఉత్తరను భార్యగనిత్తునని పలికెను. అర్జునుఁడందుల కంగీకరింపక కోడలిగ స్వీకరింతునని తెల్పెను. వివాహనిశ్చయము కొరకు కృష్ణుని అభిమతము గైకొనవలెనని కుమారవ్యాసుడు ప్రత్యేకముగ పేర్కొనెను. పాండవులు కృష్ణునకు వ్రాసి పంపినలేఖ, అతనిప్రత్యుత్తరము, వారలకుచేసిన మర్యాదలు, ఉపప్లావ్య నగరనిర్మాణము, వాసుదేవుడు సబాంధవముగవచ్చుట, పట్టణము నలంకరించుట, కృష్ణుడు పురమును సమీపించుట, విరాటధర్మజుల ఎదుర్కోలు, పరియాణమున అలసివచ్చిన కృష్ణునిస్వరూపవర్ణనము, బంధువుల మన్నించినవిధము, వసుదేవుని దుఃఖము, కృష్ణునిగూర్చి వసుదేవుని కీర్తనము గమనార్హములు.

కృష్ణుడు సోదరుల అతిశయమునుగూర్చి ధర్మజుని పరామర్శింప అందుకు బదులుగ ధర్మజుడు 'నీవుదేహివి మేము నీ దేహతుల్యులము. దీనిలోమాకు గర్వపడు నవకాశమెక్కడిది?' అని ఆధ్యాత్మిక దృష్టితో ప్రత్యుత్తర మిచ్చెను. ఇట సాయం సంధ్యా వర్ణనముకలదు అది కథతో కలిసిపోయినది పురజనులను వేత్రహస్తులు కృష్ణుని నగరప్రవేశ సమయమున అడ్డుకొనుట జరిగినది. కురుభూపాలుని ఓటమినిగూర్చి కృష్ణుడు పరిసంగించినాడు. ఉత్తరా వివాహనిర్ణయము, భావికార్య నిరూపణము తిక్కనకంటె భిన్నముగ నిర్వహించెను.

ఉత్తరా వివాహమునకు శ్రీకృష్ణ డనుమతించినాక ముహూర్తనిర్ణయము, మంగళవాద్య ఘోషము, అభిమన్యుశృంగారము, వేదోక్త విధానమున కన్యావరణము, జీలకఱ్ఱ బెల్లములను సిద్ధముచేయుట, పుణ్యాహ నిర్వహణము, మంటపమునకు కన్యను తెచ్చుట, తలంబ్రాలు సిద్ధముచేయుట, ఋషులు హోమము నిర్వహించుచుండ అగ్నిసాక్షిగ పాణిగ్రహణము చేయుట, ఉత్తర అభిమన్యుని వామభాగమున కూర్చుండుట, చదివింపులు, ముత్తైదువుల ఆశీర్వాదములు, వివాహమంటప వర్ణనము, ఊరేగింపు, మరునాటి

వసంతములు, విరాటుపరణములిచ్చుట, బంధువుల వస్త్రవాహనము లతో మన్నించుట, సత్యమును పాలించితిమని భావికాలమునదారి చూపుమని గదగు వీరనారాయణస్వామిని ప్రార్థించుట ఇవన్నియు కుమారవ్యాసుని దేశీయమగు రచనావిన్యాసములు

తిక్కన ఈ వివాహపర్వ ఘట్టమును శృంగార రసమునకు ఆటపట్టుగ దేశీయాచారములకు ప్రదర్శనముగ మలచినాడు మందిరము నలంకరించుట, పురోహితులు వైదిక, లౌకిక వస్తువులతో వేదికను పొలుపొందచేయుట, పెండ్లికూతు నలంకరించుట, లగ్నవేళ ధర్మ తనయు బిలిపించుట, అభిమన్యుడు సింగారించుకొని భద్రగజాధి రూఢుడై పుణ్యాంగనా జనముతో, మంగళతూర్య నాదములతో, విప్రాశీర్వాదములతో, వందిమాగధ గానములతో చెలగుచు వాసుదేవ పురస్సరముగ విరటునింటికి వచ్చుట, శంఖ, జయఘంటా, పణవాది నాదములతో ఎదుర్కోలు, వధూవరులమధ్య తెరపట్టుట, విప్రవృద్ధ జనులు పుణ్యకర్మ పరంపరలు నడపుట, వధూవరులు అన్యోన్యము చూపులు కలుపుట, తలంబ్రాలు పోయించుట, పాణిగ్రహణము, పీఠాసనమున కూర్చుండుట, హోమసమయమునగల్గు గాఢసంస్పర్శలు, కర్పూరాది సుగంధ ద్రవ్యములు, మణి భూషణములు, ద్రౌపదీ సుభద్రలకు అనురూపాభరణముల నిప్పించుట, విరటు డరణమిచ్చుట, పుణ్యాంగనలచేత, నృత్తగీతములచేత రాజసూనుల విహారములచేత, బంధువులచేత, ఆనందోపేతులైన పాండుకుమారులచేత విరాటుని గృహము ప్రకాశించుట- తిక్కన పనిగట్టుకొనిమూల భిన్నముగ తన సమకాలీన ప్రభావముతో చేసిన చక్కని దేశీయమైన వైవాహిక వర్ణనము పరమ రమణీయము

ఈవివాహము విరాటపర్వము మంగళాంత మగుటకు తోడ్పడినది విరాటపర్వమునొక నాటకముగ భావించినచో 'మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని కావ్యాని' అన్న రీతిని విరాటుని కొల్వున నిర్విఘ్నముగ ప్రవేశించిన పాండవులు

కీచకసంహారముతో వృద్ధినిపొంది అభిమన్యుని వివాహముతో తేజ
స్వంతులైరి.

### ఉద్యోగపర్వ కథానిర్వహణము

ఉద్యోగ పర్వము కుమారవ్యాసుడు చెక్కుకొన్న అంద
మైన భక్తిమయ శిల్పము కన్నడ భక్తిసాహిత్యమున నుండు
లక్ష్మీశునికావ్యము బసవనిచే మొదలై దాసకూటముచే పరిపుష్టమై
కుమారవ్యాసుని భారతమున సాకారముగ మానవ జీవితముతో కలసి
నడచినది. తెలుగున పోతనామాత్యుడు, హిందీలో తులసీదాసు,
కన్నడమున కుమారవ్యాసుడు ఇట్టి సాహిత్యమును సృష్టించిరి. వారి
రచనలు ఎంత ఆధ్యాత్మికములో అంత భౌతికములు. ఉత్తమ
మానవత్వమును ఎలుగెత్తిచాటిన కవులువారు ఆధ్యాత్మికతత్త్వమే
సాకారమై మానవుల నావరించి నడచిన ఎట్లుండునో ప్రాయోగిక
ముగ ఉద్యోగపర్వమున కుంతి, విదుర, కర్ణ, ధృతరాష్ట్ర, దుర్యోధ
నాదుల జీవితములలో కుమారవ్యాసుడు చిత్రించి చూపినాడు.
కుమారవ్యాసుని భారతమున కృష్ణుడు సర్వతంత్ర స్వతంత్రుడయ్యును
మనుష్యుని జీవనస్వాయత్తతకు పెరుగుదలకు భంగము రానీయడు
ఈరీతిగ ఉద్యోగ పర్వము దైవమానవ సంబంధమును నిరూపించు
ఒకరసమయ ప్రపంచముగ కుమారవ్యాసుడు నిర్వహించెను. యుధిష్ఠి
రుని పాదములకు నమస్కరించుచు అతడు లేచిన లేచుచు, కూరుచున్న
కూర్చుండుచు కృష్ణుడు సమస్త వేదములును ఎవరిని వర్ణించుచు
తనివితీరక తమనాల్కలు ఎండిపోగా నుండిపోయినవో అట్టి ఘనతను
కూడ ప్రక్కకుపెట్టి ధర్మజునియందు వినయము చూపెను

కృష్ణుడు అభిమన్యుని వివాహానంతరము సభచేర్పరచుట,
పాండవుల గతచరిత్రను స్మరించుట కుమారవ్యాసుడు సూక్ష్మముగ
తేల్చివేసెను తిక్కన వానిని దీర్ఘముగ వర్ణించెను పాండవులుపడ్డపాట్లు,
ధృతరాష్ట్రుని ఆలోచనలు యుద్ధమునకు దారితీయునని తిక్కన పేర్కొ-

నెను. మాయాద్యూతము, వనవాసము, అజ్ఞాతవాసము పునఃరాజ్య ప్రాప్తి అనునాలుగు మాటలతో కుమారవ్యాసుడు పాండవుల గతి చరిత్రను కృష్ణుని మాటలుగ నడపినాడు.

దానికి వెంటనే ద్రుపదుడు 'కృష్ణుని బావయగు ధర్మజుని మానావమానముల భారము కృష్ణునిదేయనియు, హరణాభరణములు అతనికే తెలియుననియు, ఆయన పాదములు స్పృశించి చేయుమని యాజ్ఞాపించినపని చేయుటకు మాత్రమే తమకు తెలియుననియు' పలికెను ఈకథన విశేషము తిక్కనకంటె భిన్నము. తిక్కన భారత మున కృష్ణవాక్యము తరువాత బలరాముడు మాటాడును కృష్ణుడే రాయబారమును సూచించును. కుమారవ్యాసునిలో కృష్ణుని తరు వాత ద్రుపదుడు మాటాడినాడు. రాయబారమును సూచించినది కూడ ద్రుపదుడే. పిమ్మట బలరాముడు మాటాడుట కలదు. తిక్కన బలరాముడు కృష్ణవాక్యమునకు పోషకముగ మాటాడి, కౌరవులు అధర్మపరులని నిందించుటకు వీలులేదని పల్కెను కుమారవ్యాసుని బలరాముడు కృష్ణుని అభిప్రాయమునకు విరుద్ధముగ పల్కెను. యుధిష్ఠిరుడే మరల జూదమున గెలువవలసి యుండుననియు. సుయోధ నునిలో తప్పులేదనియు ఆతడు తెల్పినాడు వెంటనే సాత్యకి బల రాముని విమర్శించుచు పలికిన పలుకులు మూగుమట్పదులలో కలవు. రాజ్యమును క్షత్రియులు బాణము కొననుండియే సాధింపవలెననియు, సామము పనికిరాదనియు, యుద్ధము చేతనే అదిసాధ్యమనియు, శత్రువు శిరముపై సబళము నాటి రాజ్యము గైకొనవలెననియు, ముఖమున మట్టిపూసికొని, దర్భలుగైకొని, స్వస్తివాచకములు పలుకు బ్రాహ్మ ణులవలె శత్రువులను రాజ్యము వేడుకొనరాదని నిశ్చయించి పలి కెను. ఇవి కుమారవ్యాసుని వీరరస పోషకవాక్యములు ఇచట తిక్కన సాత్యకి 'దైన్యము తక్కి దూత యుచితంబుగ . తత్ఫల మాతడం దెడిన్' అనిపల్కిన పల్కు లెంతయు సముచితములు,సందర్భోచితములు.

ద్రుపదుడు సాత్యకితో ఏకీభవించుచు రాయబారమును పంపుటను సూచించినాడు

కృష్ణుడు సేనా సమీకరణము సూచించెను తిక్కనలో మొదట ద్రుపదుడే సేనా సమీకరణము సూచించెను అవసరము వెంబడి తమ్ము పిలిపించుకొనుమనియు, పెళ్ళికనివచ్చిన తాను వెడలి పోవుచుంటి ననియు పలికి పాండవులను, ద్రౌపదిని, అభిమన్యుని, సుభద్రను వీడ్కొని చనెను. ద్రుపద విరాటులకు బుద్ధిమంతుడగు దూతను కౌరవ సభకు పంపవలెననియు, విహారములలో పాండవుల విషయమున మిక్కిలి జాగరూకులై యుండవలెననియు, వారితో ఎల్లప్పుడును జతగూడి యుండవలెననియు, ఎక్కువ తక్కువలను చూపరాదనియు చెప్పి కృష్ణుడు సపరివారముగ ద్వారకకు బయలు దేరెను మరల దుర్యోధనాదులతో పాండవులు వ్యవహారమున చిక్కుకొనరాదని కృష్ణుని తలంపు. అతడు సాల్వునితో యుద్ధమునకు పోయినపుడు శకుని కపట ద్యూతమున రాజ్యము నపహరించి అడవులకు వెడలునట్లు చేసెనుగదా! అంతకు పూర్వము వారణావతమున తన పరోక్షమున హత్యాప్రయత్నము జరిగినదికదా! తిక్కన కృష్ణుడు బలదేవాదులతో ద్వారకకుమరలిపోవుచు ద్రుపదునిపై కార్యభారము నుంచెను. ఆతని వాక్యమును భీష్ముడు, ద్రోణుడు, ధృతరాష్ట్రుడు మన్నింతురని తెల్పెను.

పాండవుల ఆజ్ఞపై సేనా సమీకరణమునకు దూతలు బయలుదేరిరి ఆ రీతిగనే ద్రుపద పురోహితుడును పాండవుల రాజ్య భాగముకొరకు రాయబార మేగినాడు. ఉభయపక్షములను చేరుటకు సైన్యములు రా దొడగినవి. అవి కౌరవ పాండవ కటకములకు వేర్వేరుగ పోయినవి. ఎవరెవరి కెంత సైన్యము చేరినది ? ఏదేశ సైన్యములు వచ్చి చేరినవి? కుమారవ్యాసుడు పేర్కొనలేదు సైన్యములు విడియుటకు స్థలముచాలలేదట. ఇంతమాత్రమే తెలిపి కుమార

వ్యాసుగా మిన్నకుండెను తిరిగి పదునొకండవ సంధిలో సైన్య విషయముల నేకరువు పెట్టినాఁడు

తిక్కన పాండవ పక్షమున సాత్యకి ఒక అక్షోహిణి సైన్యముతోను, ధృష్టకేతుడు, జరాసంధ నందనుడు చెరొక అక్షోహిణి బలముతోను, కేకయ పతులు ఒక అక్షోహిణితోను, ద్రుపదుడొక అక్షోహిణితోను, మత్స్యనాథుడొక అక్షోహిణితోను, పాండ్య విభుడు మొదలైన రాజులు ఒక అక్షోహిణితోను మొత్తము ఏడక్షోహిణుల సైన్యము వచ్చి చేరినట్లు పేర్కొనెను

కౌరవ పక్షమున భగదత్తుడు ఒక అక్షోహిణితోను, శల్యుడొక అక్షోహిణితోను, కాంభోజ రాజైన సుదక్షిణు డొక అక్షోహిణితోను, జయద్రథ ప్రముఖులైన సింధుసౌవీర పతులు ఒక అక్షోహిణితోను వచ్చి చేరిరి పలుదెసల నుండి వచ్చిన రాజులు మూడక్షోహిణులతోను, అవంతీశ్వరులగు విందాను విందులు చెరియొక అక్షోహిణితోను, మాహిష్మతి రాజు, యాదవుడగు కృతవర్మ ఒక్కొక్క అక్షోహిణితోను వచ్చిరి మొత్తము కౌరవపక్షము పదునొకండక్షోహిణుల సైన్య మేర్పడెను

ఇట తిక్కన వచ్చిన ముఖ్యులలో సాత్యకి "బాహుబల గర్వ నిర్వహణ విద్యాప్రౌఢి సంరూఢుడ"ట మత్స్యనాథుడు "చిందముల మ్రోత పగతుర కెండంబుల తోడ దిక్తటసంధులు అందంద పగులగొట్టు ఆ రూపితో వచ్చినాడ"ట. అతడు కుంతీనందనులకు తోడ్పాటు ఇచట విరటుని సేనా సామర్థ్యమును తిక్కన చక్కగ చిత్రించెను. అట్లే పాండవులది "క్రూరాహవ సంక్రీడా వినోదమట" కౌరవసేనకు తిక్కన ఈ ఘట్టమున విశేషణములను వేయలేదు. పదునొకండక్షోహిణుల పేర్కొననేగాని, పాండవులసైన్యమునకుగల యుత్సాహము వారియందు వర్ణింపబడలేదు.

### ద్రుపదపురోహితుని రాయబారము :

ఈ రాయబారమును కుమారవ్యాసుడు "ఒకనాడు ఆలోచనజేసి సంతోషముతో కౌరవుని రాజధానికి పురోహితుని పంపినాడు" అని సంగ్రహముగ తెలిపెను. అట్లే కురుసభలోని మాటలను "విపుల మతితో తావచ్చిన రాజకార్యమును మాటాడినాడు" అని ఒక్క ముక్కలో చెప్పెను. కృపణత్వముతో కౌరవుడు గురు, కృప, భీష్ములమాట నంగీకరింపక చపలుడైన కర్ణునిగూడి యుద్ధమును నిశ్చయించినాడు. రాయబార ఫలితము వెంటనే తేలిపోయినది. ఈ రాయబారమున కౌరవుల మనస్తత్వము పాండవులకు ప్రకాశమానమైనది. అంతియేగాక పరోక్షముగ సంజయ, కృష్ణుల రాయబారములకు కారణమైనది. పురోహితుని పంపుట భారతీయ సంప్రదాయము. శుభము ఉభయపక్షములకు కావలెనని కృష్ణ, ద్రుపదులు పలుకుట వారి మహోదార దృష్టిని చాటుచున్నది. అది విఫలమగుట దైవేచ్ఛ. సంధికై, రాజ్యభాగమునకై సామమునవలంబించిన పాండవుల మంచితనము నిది చాటుచున్నది.

కుమారవ్యాసుడు ఒకటిన్నర షట్పదులలో ముగించిన పురోహితుని రాయబారమును తిక్కన విపులముగ వర్ణించెను. పురోహితుని సభలో పల్కిన పల్కులతో భీష్ముడేకీభవించెను. 'కర్ణుడు కనలుట, భీష్ముడాతనితో వాదించుట, ధృతరాష్ట్రుడాతని వారించుట, రాయబారినొకరిని పంపుదుననుట, భూషణాంబరములతో పురోహితుని సత్కరించి పంపుట అను విషయములతో రాయబారము నడచినది. ఈ సందర్భమున పురోహితు డర్జుననిగూర్చి తెలుపుచు "భండనమున గాండీవిని మార్కొందుననుట కొండం గని తగరు తాకబోవుట'గా వర్ణించి "అతని భూరి భుజబలము, శరవిద్యా కౌశలము. పందికై బవరముచేసిన హరుడు మెఱుంగు"నని చెప్పెను. పాండవుల పక్షమున కృష్ణుని ఉనికిని గూర్చి, తెలుపుచు "వివిధోపాయ పరాయణుడును,

రిపుదోర్వీర్యాపహారకక్రియా ప్రవీణోద్యోగుడు, మంత్రలక్షణ కళా ప్రావీణ్యగణ్యుడు, ధైర్య వివేకాది గుణోత్తరుండు, అఖిల విద్యా జాల సంవేది" అని వర్ణించెను

విరాటమున భీమార్జునులకు ఉద్యోగమున కృష్ణునకు ప్రాముఖ్యమీయబడినది. కృష్ణునకు ద్రుపద పురోహిత రాయబారము నాటికే గణ్యమైన చరిత్రయున్నది. అప్పటికాయన రాజసూయయాగము చేయించినాడు జరాసంధుని చంపించియున్నాడు బాల్యమాదిగ ఎన్నియో దుష్టశత్రువులను మట్టుబెట్టినాడు. ద్రౌపదికి అక్షయవస్త్ర మిచ్చుటచేతను, దుర్వాసుని గర్వమణచుట, కంస, సాళ్వ, కాలయవన, శిశుపాలాది వీరులను దునుముట చేతను, ఖాండవదహనాది కృత్యములు చేయించుట చేతను. గంధమాదన, పుష్కర, ప్రభాసతీర్థ, బదరీవన, సరస్వతీ ప్రాంతముల కఠోర తపస్సుల నాచరించుటచేతను, రుక్మిణీ సహితముగ బ్రహ్మచర్యము బూని శీతనగముపై తపమొనర్చి చక్రాయుధము పొందుటచేతను, సాందీపనికడ విద్యాభ్యాసము చేయుటచేతను అతడు లోక ప్రసిద్ధుడై యుండెను

## కృష్ణసారథ్య స్వీకారము :

ఈ ఘట్టమును తిక్కన ముప్పది పద్యములలోను, కుమార వ్యాసుడు ఇరువదితొమ్మిది షట్పదులలోను నిర్వహించిరి. కృష్ణ ప్రమేయముగల ఘట్టమగుటచే కుమారవ్యాసుడు పెంచి విపులముగా వ్రాసెను. ఇది తిక్కన రచనముకంటె భిన్నము. సేనలుచేరుటచూచి దుర్యోధనుడు రహస్యముగ కృష్ణుని లోబరచుకొనవలెనని ద్వారకా పురమునకు పోయెను. దానిని చారులవలన వినిన యమసూనుడు బెదరి అర్జునుని ద్వారకకు పంపెను. మార్గమున కుమారవ్యాసుడు ప్రకృతి వర్ణనమును సుందరముగా గావించెను. పశు పక్ష్యాదులు,

సముద్రము వర్ణింపబడినవి. ద్వారకానగరమును ఆధ్యాత్మిక దృష్టితో వర్ణించెను కృష్ణుని నిద్ర వర్ణింపబడినది. తిక్కన భారతమున సుయోధనుడు తొలుత కృష్ణుని చేరబోయెననియుండ కుమారవ్యాసుడు అర్జునుడే మొదట చేరెనని వ్రాసెను కృష్ణుడు దుర్యోధనార్జునులను వరించుటలోను, మర్యాద చేయుటలోను, దుర్యోధనుని విషయ నివేదన చేయుటలోను కృష్ణుడు వారికి సంధినిగూర్చి యుపదేశించుటలోను, సుయోధనుడు విసిగికొనుటలోను, సేనావిభాగము చేయుటలోను, అర్జునుడు సేనను నిరాకరించుటలోను, దుర్యోధనుడు పాండవ పక్షపాతమునుగూర్చి కృష్ణునితో పరుషముగా మాటాడుటలోను, కృష్ణుడు తన పరాక్రమము తగ్గిపోయినదనుటలోను, యుద్ధము చేయని తన్నేల కోరుకొంటివని అడుగుటలోను, అర్జునుని ప్రత్యుత్తరములోను తిక్కనకంటె భిన్నమై సంపూర్ణముగ కృష్ణ పారమ్యమును బోధించినది

ఈ ఘట్టము కృష్ణప్రమేయము కలది. ప్రమేయము లేకున్నను ఏదోయొక నెపమున అవకాశము కలిగించుకొనియైనను కృష్ణుని కీర్తించు కుమారవ్యాసుడు ఇట్టి సందర్భములలో స్వతంత్రించుట అతిశయోక్తి కానేరదు అర్జునుడు ద్వారకకు పోవుచు చూచిన ప్రకృతి దృశ్యములు పరమాత్ముని సన్నిధి కేగునట్టి భక్తుని చూచునట్టివి ద్వారకానగర వర్ణనకు భక్తుని పారవశ్యమును సూచించును. "ఆ ద్వారక పరమ నారాయణ పరాయణుని నెలవు, పరతర ప్రదేశము, మురహరుని నెలసిన తావు, ముక్తి ఆ ద్వారకయందు కరతలామలకము, తాపసుల నుజ్జీవించు స్థలము, జనన మరణములు జీవుల విడిచిపోవు స్థలము" ఇత్యాదిగ వర్ణించెను

శ్రీకృష్ణుని నిదురనుగూర్చి "అగధరుడు నిద్రాంగనకేళిలో నున్నాడు సొగసు మిగులునట్లు ఒరగా తెరచిన కనులు చక్కగా సమతించిన సుషుప్తి బిగువున భ్రాంతియోగమున ప్రకాశించుచుండెను" అని వ్రాసెను.

అర్జునుఁడే మొదట కృష్ణ సాహాయ్యమునకు పోయినాఁడని చెప్పుట, కొండిక గావున అర్జునుఁడే మొదట కోరుకొనవలెనను మాట విడుమట, సైన్యవిభాగము కృష్ణునిచే చేయించుట, యుద్ధము చేయువారిలో బలరాముని పేర్కొనుట తిక్కన పేర్కొననివి కుమార వ్యాసుఁడు కల్పించుకొన్నవి. 'సైన్యమును తాను సాకలేననియు, రాజ్యవిహీనుఁడనై యడవుల పడియుంటిననియు, పేరలకు బలమైన కృష్ణుఁడు తనకు చాలుననియు' పలుకుట కూడ విలక్షణము. కుమార వ్యాసుని అర్జునుఁడు తిక్కనవలె గాంభీర్యము పాటింపలేదు. దుర్యోధ నార్జునులు వచ్చినపుడు వారికి తాంబూలము లిచ్చుట, కుశలాదిక మడుగుట వర్ణించి నాటిలోకాచారమును ప్రతిబింబింపజేసెను వా రిరువురి మాటలు విని యుద్ధము వలదని, రాజ్యముకొరకు పోరాడిన అప కీర్తి కలుగునని స్నేహముగ నుండుట మేలని అది అందరకు శ్రేయో దాయకమని దుర్మార్గుల మాటలకు లొంగి ఉద్రేకించి యుద్ధమునకు దిగినచో కష్టపడువారు కురుపాండవులేయని ప్రబోధించెను ఈ ధర్మ బోధ కుమారవ్యాసుని స్వతంత్రరచనము కుమారవ్యాసుని భారతము నకు కథానాయకుఁడు కృష్ణుఁడగుటచే అతని దృష్టితో ధర్మబోధ చేయ గల అధికారము కృష్ణునకే గలదు

పాండవ పక్షపాతము నాపాదించిన దుర్యోధనునితో తన పూర్వ విక్రమములను వరుసగ చెప్పి ప్రస్తుతము యౌవన బలము లేదని తాను భోజన పండితుఁడనే అనిపలుకుట రసమయ సన్నివేశము. కుమారవ్యాసుని కృష్ణుఁడు సర్వతంత్ర స్వతంత్రుఁడయ్యును మనుష్య భావనపోషణకు, పెరుగుదలకు భంగము రానీయఁడు అర్జునుఁడు తన్ను కోరుకొనుట కత్తిని పారవైచి ఒరను పట్టుకొన్నట్లున్నదని కృష్ణుఁడు పలికెను అతని సోదరులు కోపపడకపోరని అనుమానము రేకెత్తించెను అర్జునుఁడు 'శిష్యుఁడనైన నాకడ ఇంద్రజాలము వలదు మీతో నాకనుభవమున్నది నా సోదరులును మీ మహిమ నెరిగినవారు' అని

నిష్కర్షగ పలికెను. ఇది భక్తునికి స్వామిపైగల ప్రత్యయము. సారథిగ నుండి తన్ను కాపాడుమని హరిపాదపీఠి కెరగినాడు. భృత్య వర్గముపై ఆయన కరుణ బలిచక్రవర్తికి ద్వారపాలకుడగుటలోను, కిరీటికి సారథి యగుటలోను ఉన్నదని కుమారవ్యాసుడు తన ఆరాధ్య దైవమైన గదుగు వీరనారాయణస్వామి కథనము కల్పించి చెప్పెను.

ఈ కథా ఘట్టమును ప్రారంభించుచు తిక్కన సకలరాజులకు దూతలను పంపినట్లుగ గోపాలదేవుని పాలికి దూతను పంపుట పాడి గాదని విచారించి రారాజు తానే కొలదిమంది పరివారముతో వేగిరంపు పయనంబుల వెళ్ళినాడు. కృష్ణుడు నిదురించుచుండ దుర్యోధనుడు శిరము కడను, అర్జునుడు పాదముల కడను కూర్చుండిరి. కృష్ణుడు మేల్కొని వారి ప్రయత్నముల విని తెరగు నేర్పరచెను. ముందు అర్జునుడు, మిగిలినది దుర్యోధనుడు కోరుకొనిరి. కృష్ణుని కోరుకొనుటను అర్జునుడు సమర్థించుకొనెను. ఈ ఘట్టమునందలి దుర్యోధనార్జునుల మార్గములు ప్రవృత్తి నివృత్తుల నుద్దేశించినవి.

ఈ ఘట్టమున కృష్ణుని చెంత దుర్యోధనుడున్నంతసేపును అర్జునుడు మాటాడడు. అతడు వెడలిన తరువాత కృష్ణునిచే ప్రశ్నింపబడి అర్జునుడాడిన మాటలలో అతని ధీరత, గాంభీర్యము, కృష్ణునియెడ గల వినయము ప్రకటింపబడినవి. పిమ్మట కృష్ణుడు కార్యాలోచనమునకై యుధిష్ఠిరుని చేరబోయెను.

### సంజయుని రాయబారము :

కుమారవ్యాసుని భారతమున దుర్యోధనుడే సంజయుని పిలిపించి ధర్మజుని చెంతకు పంపుచు ద్రుపద పురోహితుని మూలమున ధర్మజుడు రాజ్యభాగము కోరుట తెలిసెననియు, ఆ భాగము రణమున అసిధారతో నీయబడుననియు, ఊరక పంచియిచ్చుట ధర్మముకాదని సందేశమును పంపెను. ఇట తిక్కన భారతమున ధృతరాష్ట్రుడు సంజయుని రావించి పాండవుల పరాక్రమమును వరుసగ వర్ణించుచు విపర

"పరమేశ్వరునకైన సహింపరాని ధర్మపుత్రుని కోపమునకుఁ దలఁక వలదె" అనినాఁడు. ప్రథమాశ్వాసమున సంజయుని రాయబార ఘట్టమున గల మూఁడు వచనములు ధృతరాష్ట్రుని కపటవర్తనమును ప్రకటించు నాయువుపట్లు. చిట్టచివర "శాంతిప్రకారమున కార్యము నడపి రమ్ము ఒక్కటియై మనుటకొఱకుఁ గూర్చి రమ్ము రథమెక్కి పొమ్ము" అనెను. దీనివలన ధృతరాష్ట్ర సందేశము శుష్కప్రియములు శూన్యహస్తములునైనది

కుమారవ్యాసుని సంజయుడు రాయబారిగ బయలుదేరి ఉపప్లావ్యముననున్న ధర్మజుని చేరెను సంక్షేపకారుడగు కుమారవ్యాసుడు ఇట నాలుగున్నర షట్పదులలో వాసుదేవుని మొదలుకొని ధర్మరాజు సభలోని వారినందరను వరుసగ వర్ణించెను. పాండవులకు రాజ్యవైభవము లేకున్నను ఆతని సభావైభవమున కేమియు కొదువలేదని చాటుటకే ఈ సభా వర్ణనమును కొనవలయును ద్వాదశవర్షము లటవీ ప్రాంతము లందుండినను నళిన నాభుని దయతో పాండవులకదృష్టము ప్రాప్తించినదని కృష్ణ ప్రభావమును మనసున కొనియాడెను ఇది తిక్కనలో లేనిది సంజయుడు ధృతరాష్ట్రుఁడంపిన కానుకలందించెను. ధర్మజుడు బంధువుల క్షేమమును గూర్చి ప్రశ్నించెను సంజయుడు ప్రత్యుత్తరమిచ్చెను. ధర్మజుడు నన్నువ ధృతరాష్ట్రుఁడిట్టులై తన కుమారుల మించిపోజలఁడని పల్కెను శ్రీకృష్ణుఁడు రాయబారపు సందేశము వినుపింపుమనెను సంజయుడు 8 షట్పదులలో దానిని వినిపించెను. "రాజ్యము వేడుట సుక్షత్రియ ధర్మము కాదు. పాండుసుతుల జననమునకు తగినట్లు వారు వేడుచున్నారు ఏమి చేయవచ్చును యమ నందనునకు మొదట బ్రహ్మచర్యము, పెండ్లికి పిమ్మట వనవాసము అనెడి నాశ్రమము జరిగినది ఇక ఆతనికి మిగిలినది సన్న్యాసము భీమార్జునులు గర్వమున ఉబ్బియున్నారు లోలోన వైరము నాటిపెంచు కృష్ణుడే వారికి శత్రువు మిగిలినవారు విరాటద్రుపదులు

వారుతమంత తాము దూరమై పోగలరు ధర్మజునకుపాట్లు తప్పవు' అని కురుపతి సందేశమును సంజయుడు సభలో వినిపించెను

తిక్కన సంజయుడు శాంతిసందేశమును గైకొని ధర్మజుని కడకు వచ్చెను. క్షేమసమాచారము లడిగిన సంజయుడు ధర్మజుని ప్రత్యుత్తరములోని కరకుదనము చవిచూచెను అంతట నాతడు సుయోధనుని తప్పిదములనుచెప్పి, 'మడుగుచీర యందు మసిదాకినట్లు కులములో వానివలన వచ్చిన మచ్చను పోగొట్టు కార్యనిపుణ హృదయుడు ధర్మరాజని, శాంతియే అనుష్ఠేయమని, కోపముడుగు మ'ని ప్రార్థించెను రాజ్యభాగము లేక సంధి దుస్సాధమని ధర్మజుడు పలుక సంజయుడు యుద్ధమువలన నష్టములను పేర్కొని రాజ్యభాగ మీయకున్నను ధర్మజుడు యుద్ధముచేయుట తగదని బోధించెను అంతట ధర్మజుడు తాను కృష్ణుని ఆజ్ఞానువర్తిగ నుందునని పల్కెను. శ్రీకృష్ణుడు పాండవులకు జరిగిన అన్యాయములను వివరించి కౌరవుని చంపుట పాండవులకు ధర్మమని నిర్ణయించెను. సంధికై ధృతరాష్ట్రుని సభకు తానే వచ్చుచుంటినని పల్కెను

కుమారవ్యాసుని భారతమున సంజయుని సందేశము వినిన వెంటనే సభలో భీముడు విజృంభించినాడు 'సుయోధనునిచీల్చి శాకినులు రక్తముతో వసంతమాడునట్లు చేయుదు' ననెను పిమ్మట 'సుయోధనుని కులమును దిక్కుదిక్కులకు బలివేయుదు'మని ఘటోత్కచుడు, అభిమన్యుడు, సాత్యకి పటుశౌర్యమున పలుకుదురు. 'పండ్లు రాల్చి వేయుదుము. శత్రువుల చర్మము ఒలిచివేయుదుము శూలమున పేగులు లాగివైతుము' అని అతిరథులు నిలిచిరి ఇది యంతయు తిక్కన పేర్కొనని కుమారవ్యాసుని ఆవేశపూరిత స్వతంత్ర నిర్వహణము.

ధర్మజుడు తమకు వనవాసము పెక్కెండ్లనుభవమై కలత చెందించెననియు, ఇట్టి సందేశములతో ఒరగునదేమియు లేదనియు

సంజయుడు దూతగాన అతడు చేయగలిగిన దేమియు లేదనియు శాంత
పఱచినాడు. సంజయుని విడిదికిపంపి మరునాడు కృష్ణార్జునులతో వివేక
వంతమైన మాటలచే అతని ప్రబోధించి అర్హమైన మర్యాదలతో
వీడ్కొల్పెను

ఈ సంజయ రాయబారము ఉద్యోగపర్వమున అతిముఖ్య
మైన విభాగము. సంజయ సందేశానంతరము ప్రజాగర, సనత్సుజాత,
యానసంధి పర్వములు చక్కగా పోషింపబడినవి ధర్మజునిర్దేశమున
తిక్కన శ్రీకృష్ణుడు చేసిన గంభీరోపన్యాసము గతించిన కథను ఆక
ళింతకు తెచ్చినది.

"ఏనీపకై వచ్చెద దానొప్పదలంచె నొండె దప్పక దలచెన్ దానన
నగజెడ మేమమ్మనవ నాధునకు జెప్పు మామత మెల్లన్" అను
కృష్ణుని మాటలు యానసంధి పర్వమునకు, భగవద్యాన పర్వమునకు
బీజప్రాయములై యున్నవి. అయిదూళ్ళిచ్చినను సంధికి సమ్మతమే
యనుట ధర్మజప్రతిపాదనము. శ్రీకృష్ణుని భాషణమున రోషమయ
మహాతరువుగ దుర్యోధనుడును, తత్సహాయులును, ధర్మమయ
మహాతరువుగ ధర్మజుడును, తదనుయాయులును వర్ణితులు.

### కృష్ణరాయబార పూర్వరంగము:

ఈ ఘట్టమును తొంబదితొమ్మిది గద్యపద్యములుగ
తిక్కనయు, ముప్పది షట్పదులలో కుమారవ్యాసుగను నిర్వహిం
చిరి

సంజయుడు రాయబారమునకై వచ్చి వెళ్ళిన పిమ్మట
ధర్మజుడు కర్తవ్యమునుగూర్చి ఆలోచించుచు లక్ష్మీలోలునితో
ధార్తరాష్ట్రుల మూర్ఖత్వమునుగూర్చి వ్యాఖ్యానించుచు సంధియో,
సమరమో నిర్ణయింపుమనగ కృష్ణుడు నిర్ణయము ధర్మరాజునకే
వదలెను

తిక్కన కృష్ణరాయబారమునకు తిలకప్రాయముగ 'ఆపద
గడవంబెట్టగ, నోపి శుభంబైన దాని నొందగూర్పను మాకీ పుట్టువు

నకు బొంకుత్సాత్మ పాలుడు నిన్నుచూపి చనియె మహాత్మా!" అని కృష్ణుని శరణువేడెను. రాజ్యావసరమునుగూర్చి తెలుపుచు 'సిరినాకే లందునే గ్రాసవాసో దైన్యంబులువచ్చు నాలరయు నీచుట్టాలకున్' అని ధార్మికముగ పల్కినాడు. పగ, దాని పరిణామమును గూర్చి తిక్కన ధర్మజుడు వర్ణించినట్లు కుమారవ్యాసుని ధర్మజుడు వర్ణింపలేదు. తిక్కన ధర్మజుడు ఐదూళ్ళను కోరెనేగాని నాలుగూళ్ళ పేరులను మాత్రమే తెలిపెను. కుమారవ్యాసుడు ఐదు పేరులను గూడ పేర్కొనెను.

కుమారవ్యాసుని ధర్మజుడు ఉచితానుచితములను తెలిసి నిర్ణయించుశక్తి కృష్ణునకే గలదనియు, కృష్ణుని అధీనములోనే వారి అభ్యుదయము కలదనిపలుకగ, తిక్కనయు ధర్మజునిచే మమ్మెఱుగుదెదిరి నెఱుగుదు పొమ్మెవ్వడ చేను నీకు బుద్ధులు సెప్పన్' అని పలికించెను. ధర్మజునిమాటకు మురాంతకుడు బెదరినాడట, అతని అవతార కార్యమైన భూభార పరిహారము నెరవేరదని తనలో భావించుట కుమారవ్యాసుని నూతన నిర్మాణము. ఇందు కావ్యనిర్మాణ పరమార్థము నిక్షేపింపబడినది. భూదేవి ప్రార్థింపగా, భూభార పరిహారార్థము యదువంశము నందవతరించిన కృష్ణుడు ఈకావ్యమునకు నాయకుడై యున్నాడు. అతని ఉద్దేశము దుష్టశిక్షణ, శిష్టరక్షణ. తదనుకూలముగ భారతయుద్ధము ఘటిల్ల చేయదలచినాడు కృష్ణుడు. ధర్మజుని వాక్యము శాంత సమన్వితమగుటతో అసురారి ఉలికిపడెనని వ్రాయుటలో ఎంతేని ఔచిత్యము కలదు.

తిక్కన కృష్ణుడు కౌరవుల దుర్ణయములు ఏకరువు పెట్టి ధర్మజుని యుద్ధమునకు ప్రేరేపించును. కుమారవ్యాసునిలో దుర్యోధనుని మాత్రమే పేర్కొనినట్లు గలదు. ద్రౌపదియును, పంచపాండవులును తమసందేశములను కృష్ణుని ముఖమున కౌరవసభకు తెలియజేసిరి. సభలో వాసుదేవ సందేశమునకు వీరిమాటలు పోషకములై యొప్పినవి. తిక్కనలో ఈ సన్నివేశమున ఆద్యంతము ద్రౌపది

యున్నది. కుమారవ్యాసుడు ద్రౌపదిని అంతఃపురమునుండి పిలిపించి నాడు. ప్రతిహారి చెంతనే ద్రౌపది పాండవుల సంధి ప్రయత్నమును నిరసించుట ఆమె ప్రకృతిలోని తీక్ష్ణతను సూచించుచున్నది.

భీముడు సంధి కోరినపుడు కృష్ణుడాతని యుద్ధోన్ముఖుని చేయుటకు హాలాహలము సుధారసమయ్యెనని, వజ్రమునకు సౌమ్యత కల్గినదనియు, అగ్ని చల్లబడినదనియు ఎగతాళి చేసెను. దానికి ప్రతిక్రియగ భీముడు చేసిన సంభాషణమేమియు లేదు. తిక్కనలో సమీర కుమారుని తీవ్రవిజృంభణము, కృష్ణుడాతని సమచిత్తుని చేయుట గలదు. అర్జునునివాక్యమున దైవమానుష చర్యలను గూర్చిన విశేష ప్రస్తావన తిక్కన గావించెను. కుమారవ్యాసునిలో కృష్ణునభిమతానుసారమున నడచుకొందునని మాత్రమే కలదు. నకులుని వాక్యము తిక్కన విపులముగ వర్ణించెను. కుమారవ్యాసుడు ఉభయ రాజకులములను రక్షింపుమని ఒకే వాక్యమును పలికించినాడు. తిక్కన సహదేవుని ప్రతిపాదనము రాజనీతి భాసురము. ద్రౌపదీ వాక్యము లారంభమగుటకు పూర్వము కుమారవ్యాసుడు ఆమె పల్లకి దిగిన విధము కావ్యరీతిలో 'మెఱుపుతో గూడిన మేఘమువలెనున్న దని ఉపమించెను. ఆమె వచ్చుటతోడనే భీమునితో ముఖాముఖి సంభాషణచేయుట నూతన నిర్మాణము. కుమారవ్యాసునిలో ద్రౌపదిని కృష్ణుడు కాక తొలుత భీముడోదార్చినాడు. తిక్కనలో కృష్ణుని వాక్యముతో భీముడు సంసిద్ధతను ప్రకటింపగ కుమారవ్యాసునిలో ద్రౌపదివాక్యములాతని ప్రేరేచినవి. ధర్మజని అభిప్రాయమును ద్వేషించితినని భీముడు స్పష్టముగ ప్రకటించుట ఇందుగలదు. అగ్రజుని ఆజ్ఞ మీరితిననుట- ఆవేశపూరితముగ నున్నది. 'అన్న ఆజ్ఞ దాటితిన'ని తిక్కన భీముడు వాచ్యముగ చెప్పడు.

ఈ ఘట్టమున ద్రౌపదికోపము మిక్కిలి ఆవేశమును సూచింపుచు కీచకవధ ఘట్టమును తలపించుచున్నది. కావ్యనాయకుడైన శ్రీకృష్ణు నవతార ప్రయోజనమిందు ప్రతిపాదింపబడినది.

హస్తినాపురికి కృష్ణుని రథము కదలునపుడు తిక్కనలో భీముడును, ద్రౌపదియును మాటాడలేదు కుమారవ్యాసునిలో వారిరువురే మాటాడిరి ఇట ఆవేశపూరితరచన, ఆవేశపూరిత పాత్రలు చక్కగా ధ్వనించును కృష్ణుడు వారిఅంతర్యమున కనుగుణముగ నడచుకొందు నని ప్రతిన చేసెను ఇట ద్రౌపది చేసిన కృష్ణప్రశంస కుమారవ్యా సుని భక్త్యావేశపూరిత కథనమును ధ్వనించుచున్నది స్థావర జంగమ ములను నీవే ప్రేరకుడవు. సమస్తము ప్రేరేపించి నడపించు వాడవు నీవే వారి అంతర్భావమును సంధికార్యమున దృఢపడుపరాదు అని ప్రార్థించినది ధర్మజుని వాక్యమున గోపనము చెందిన పాండవ ప్రతీ కారవాంఛ, కృష్ణుడు తలచిన భూభార పరిహారణము అను విషయ ములు సహదేవ కథనముతోను, ద్రౌపదీప్రేరిత భీమప్రతిజ్ఞా కరణ ముతోను, కృష్ణ ప్రతిజ్ఞతోను స్ఫురణచెంది ఈ కథాసన్నివేశము రమ్యతర మగుచున్నది

ఈ ఘట్టమున భవితవ్యము అవ్యక్తమైయున్నది. అవ్యక్తు డైన కృష్ణున కదివ్యక్తము. ఉపాధిబద్ధులై కర్మానుసారముగ నడచు జీవుని మనఃస్థితికిది ప్రతిబింబము అవ్యక్తముగనున్న మనస్సునందలి సంకటమే ధర్మజునికిందేర్పడినది. అతడు సాత్త్విక ప్రకృతికలవాడగు టచే అపకీర్తికి వెరచి సంధిని ప్రేరేపించుచున్నాడు చివరకు గీతా బోధనమున అర్జునునివలె 'కరిష్యే వచనంతవ' అనుస్థితికి వచ్చినాడు తీవ్రప్రకృతిగల ద్రౌపది, భీమ, సహదేవులు అవ్యక్తమైన మనస్సు నకు ఉద్వేగమును ఫలితముగ బొందినాడు అందువలన రథముకదలు నపుడు శత్రువులతో కలహము ప్రేరేపింపుమని భీముడును, ధర్మ రాజు వాక్యమును రాయబార సమయమున దృఢపడుపరాదని ద్రౌపదియు వ్యక్తపరిచిరి ఇట్లు భారతము స్ఫురణ గోపనములతో వ్యక్తావ్యక్త సంఘర్షణములతో రస్యమాన మగుచున్నది

ద్రౌపదీ దుఃఖమునుచూచి భీముడామె కథయు విచ్చుట పూర్వసభాపర్వ కథను వ్యక్తమొనర్చుచు తిక్కన కథనమున భేదిల్లి

నది సంజయుని రాయబారమునకు పిమ్మట అవ్యక్తస్థితిలో నున్న ధర్మజుని మనస్తత్వము చిత్రించుటకు కుమారవ్యాసుడు తెల్పిన మూడునాలుగు షట్పదులు అతని భాషాంతరీకరణ పటుత్వమును వ్యక్తపరుచు చున్నది పాండవుల సాయము లేకున్నను తన తండ్రితోను, సోదరులతోను, ఉపపాండవులతోను, అభిమన్యు ఘటోత్కచులతోను కౌరవులపై పగసాధింతునని ద్రౌపది చెప్పుట తిక్కన గ్రహింపలేదు భీముడు సంధికిచ్ఛగించెననియు, బహుమతము నంగీకరించె ననియు, పరాక్రమము నీటగలిపెననియు, దుర్యోధను నభిమానించెననియు, శశికులమును నరకమునకు దించెననియు ద్రౌపది పలుకుట శ్రీకృష్ణుని యాక్షేపణము కంటెను తీవ్రతరమైన తాకిడిగ నున్నది సుర నరోరగులలో పాండవులను మించినవా రెవ్వరును లేరనియు, ఒక అబలా వ్యవహారమున కర్తవ్యచ్యుతి జెంది అపకీర్తికి గురికావలదని ద్రౌపది పలుకుట భీమునకు కర్తవ్యోపదేశము చేయుట యైనది.

### కృష్ణప్రస్థానము :

రాయబారమునకై పాండవుల కడనుండి సందేశము నందుకొని కురుసభకు కృష్ణుడు బయలుదేరుటకు ధర్మజు డనుమతించినాడు. ఈసన్నివేశమును తిక్కన 119 గద్యపద్యములలోను, కుమారవ్యాసుడు 108 షట్పదులలోను నిర్వహించిరి

కుమారవ్యాసుని విదురుని ఆతిథ్యము విలక్షణమైన భక్తిరస పూర్ణ కళాఖండము భక్తకవియగు కుమారవ్యాసుని కృష్ణభక్తిని ఋజువు చేయుటకు హారమునందలి నాయకమణివలె ఉద్యోగపర్వమున ఈఘట్టము ప్రకాశించుచున్నది. నాటకీయమైన నిండైన కథనముగల ఈఘట్టమును మరింత రసవత్తరము చేయుటకు భాసనాటక భాగమును ఈ కథానిర్మాణమున కుమారవ్యాసు డుపయోగించు కొనెను. హాస్తినాపురోద్యాన వర్ణనము గావించి కావ్యోచితమైన హృద

యంగము వర్ణనమునకు తావొసంగెను. దాసవాఙ్మయ ప్రభావితు
డైన కుమారవ్యాసుడు నిర్మాణమున పంపనివలె స్వాతంత్ర్యము
వహించినను వైదికమతానుగూయియై కృష్ణ నాయకత్వమును తన
గ్రంథమున నెలకొల్పుటచేత కన్నడ సాహిత్య దేవాలయమునకు
భక్తిమయమైన బంగారుగోపురము కట్టినాడు.

విదురుడు తన నివాసమునకు కృష్ణుడు వచ్చుట తోడనే
పట్టరాని ఆనందమున గంతులువేసెను. ఆకలితోనున్న తనకు ఆతి
థ్యము నొసగుమని కృష్ణుడు స్వయముగ అడిగెను. విదురునకిది
ఎదురుచూడని సంఘటన మగుటచే అతనియింటనేమియు నుండమి
అతడు కొద్ది పాలను మాత్రము నిచ్చెను. భక్తితోనిచ్చిన పత్రమైన,
పుష్పమైన, ఫలమైన, నీరైనను భగవంతుడు ప్రీతితో స్వీకరించు
ననుటకిది నిదర్శనము. పాలకడలిలో శయనించిన శ్రీమహావిష్ణు
విదురునింట పాలు త్రాగుటకు వచ్చెను. అది దుర్యోధనునకు కడుపు
మంటయైనది. తనయింట షడ్రసోపేత భోజనమును కాదని దరిద్రు
డగు విదురునింటికి పోయితివిగదా! అని సభలో ప్రవేశింపగనే దుర్యో
ధనుడు కృష్ణుని పరిహాసము చేసెను. దానికి శ్రీకృష్ణుడు మౌనము
వహించినను విదురుడు కోపముతో తనవిల్లును విరిచి దుర్యోధనునకు
తన సాహాయ్యమును నిరాకరించెను. విదురుడు యుద్ధమున పాల్గొనక
పోవుటకు కుమారవ్యాసుడు చక్కని సమర్థనమును గావించినాడు.
కశస్థలమున కృష్ణుడు విడిసినప్పుడు చారులవలన ఆవార్తను వినిన
ధృతరాష్ట్రుడు వ్యక్తము చేసిన ఆనందము, కృష్ణుని కొరకు చేయుడు
నన్న మర్యాద ఇరువురును సమానముగనే తెల్పిరి. కాని రారాజు
చేసిన కృష్ణబంధన ప్రస్తావనకు కుమారవ్యాసుని ధృతరాష్ట్రుడు
ప్రతిభాషణము చేయలేదు. తిక్కనలో ధృతరాష్ట్రుడు అదరిపడి
మిక్కిలి ఆక్షేపించెను. తిక్కన విదురుడు ధృతరాష్ట్రుని కాపట్యమును
నిర్దాక్షిణ్యముగ గర్హించెను. కుమారవ్యాసుడు దానిని తొలగిం

చేసు కృష్ణాగమనసమయములో హాస్తినాపురములోని ప్రతిప్రదేశము కృష్ణమయముగ కుమారవ్యాసుడు భావించెను. కృష్ణుని హాస్తినాపుర ప్రవేశ వర్ణనము సమకాలీన రాజదూత విహారవిధాన ప్రభావమును చాటుచున్నది.

శ్రీకృష్ణుడు తనరాకనుగూర్చి విదురునిచే దుర్యోధనునకు వార్తనంపుట కుమారవ్యాసునిమార్పు తిక్కనలో దుర్యోధనుడు వచ్చి కృష్ణుని సభాస్థలికి కొనిపోయెను కుమారవ్యాసునిలో దూతలు వచ్చి కొనిపోవుదురు. గాంధారీ దర్శనము కుమారవ్యాసుని ప్రత్యేక కల్పనము అట్లనే కుంతీదేవి చెంత కృష్ణుని ప్రవర్తనము కూడ గమనార్హము. కుంతిదేవి కృష్ణుని ప్రశంసించుట, అతని రాకతో పొందిన ఆనందము, కృష్ణుడామెకు చేసిన ఉపచారము ఒక భక్తునకు భగవంతునకుగల సంబంధమును వివరించును తిక్కనలో కృష్ణుడు కుంతీదేవి నివాసమునకు వెడలియుండగ కుమారవ్యాసునిలో కుంతియే విదురునింట నుండగ వచ్చినట్లు చెప్పబడినది

కుమారవ్యాసుడు చేసిన తరువాతి వర్ణనము కౌరవ సభకు సంబంధించినది వరుసగ సామంతరాజులు, ధృతరాష్ట్రుడు, వేదపండితులు, సమస్త కళావిదులు, శకుని, సైంధవ, కాంభోజ, భూరిశ్రవ ప్రభృతులు పిమ్మట లక్ష్మణాది కుమారులు, మంత్రులు, ఉపాధ్యాయులు, ఉత్ప్రేక్షా రూపకాది అలంకృతి చమత్కృతిగల చతుర్భాషావిశారదులైన కవులు, తర్కపండితులు, భట్టులు, శ్రీకరణులు, ఆశ్వికులు, రాయబారులు, గజయూథపులు, మహోకనైపు స్త్రీ సందోహము, తురుష్క, మాళవ, కొంకణ, గౌడ, ఘూర్జర, వంగ, హమ్మీర త్రిగర్త దేశీయులు కైకొట్టుచుండగ చామరగ్రాహిణులచే సేవలందుకొనుచు, కౌరవపతి యొప్పుచుండెను. కుమారవ్యాసుని సభలోని వారందరును మహాభారత కాలమునాటివారు కాకపోవుట గమనార్హము సమకాలీన ప్రభావమునకిది యుదాహరణము.

గాంగేయాదులు శ్రీకృష్ణునకు పాదప్రక్షాళనముచేసి గౌరవించియుండ భాసనాటకానుసారముగ దుర్యోధనుడు తాను సింహాసన చ్యుతుడై అవమానమును పొందుటచే కృష్ణునకు ఆతిథ్యమును నిరాకరించుటను సభలో నిందించెను తిక్కనలో రాయబారమున రాజనీతికే ప్రధానస్థానము కల్గియుండ ఇట భక్తిక అగ్రస్థాన మీయబడుట చూడనగును

## శ్రీకృష్ణుని రాయబారము :

కృష్ణసందేశ కథనము నుండి విశ్వరూప ప్రదర్శనము వరకు విస్తరించియున్న ఈ భాగమును తిక్కన 156 గద్యపద్యముల లోను, కుమారవ్యాసుడు 80 షట్పదులలోను విరచించెను

తిక్కన చాలవరకు మూలము ననుసరించెను. కుమారవ్యాసుడు కథను ఛాయగగొని నిర్మాణ శిల్పమునను, కథన శిల్పమునను మిక్కిలి స్వాతంత్ర్యమును పాటించెను. రాయబారము విఫలమగునని తెలిసియు, ద్రౌపదిచే నిరుత్సాహపరచబడియు తుది ఆశగా వచ్చినవాడు రాయబారియైన తిక్కన కృష్ణుడు ఇది మహా మారణ హోమము నాపుటకు చేసిన నిష్కపట ప్రయత్నము రాయబారిపు సభలో జనక్షయ నివారణముకొరకు దుర్యోధను నొక్కని దునుము మార్గమాలోచింపుమని సూచించిన తిక్కన కృష్ణుని మానవలోక రక్షణాసక్తి మనకవగతమగుచున్నది

ధర్మజుడు సంధికే వాంఛించినది శత్రువులకు వెరచి కాదను నది సుస్పష్టము కృష్ణుడాతని హృదయమును మహోదాత్తముగ సభలో నావిష్కరించినాడు పాండవులు వెరచి సంధి యొనర్చ కోరుచున్నారను భావము కౌరవులకు రారాదని కృష్ణుడు ప్రయత్నించినాడు ఇట్టి సందర్భములలో చక్కని వాగ్మియైనగాని విషయము నావిష్కరించుటలో కృతార్థుడు కాలేడు, తిక్కన మంత్రిమణి, మహాకవి, ఋషి సత్తముడు దండనాథుడు రాయబారమున కేగి

తన మేలికను పునః సింహాసన స్థితుని గావించిన మహామనీషి, రాజ
కీయములలో తలపండినవాడు కాన రాయబారములో లోపము రానీక
ఎవరికేది ఎట్టిక్రమమున ఎంతవరకు ఏ అభివ్యక్తితో మాటాడవలెనో
తిక్కన నిర్వహించిన తీరు అతని రచనాశిల్పమునకు నికషోపలము వం
టిది ఇందు వివిధ వ్యక్తుల భాషణములో విషయ సారాంశ మొకటి
యైనను అభివ్యక్తిలో వైవిధ్యము కనబడుచుండెను

సుయోధనునకు సంధిని సూచించుట, అతడు తిరస్కరించుట
గోగ్రహణ కాలమున జరిగినది ఉద్యోగసంధి పర్వమున పెద్దలాతని
కిదే బుద్ధి గఱపిరి ప్రజాగర పర్వసారాంశము కౌరవ పాండవ సంధా
నము మంచిదని ఎత్తిచాటినది సంజయు రాయబారమున ఐదూళ్ళ
నడుగవలెనను భావము కలదు ఇట్లు బహు పర్యాయ ప్రతిపాదిత
విషయము క్రమముగ పోషింపబడి ఈ ఘట్ట నిర్మాణమున పరిణ
తావస్థకు చేరినది. 'ఏమునువారును పంచుకొని యేలుట కల్గదు
అను దుర్యోధనుని వాక్యము, చతుర్థాశ్వాసమున కృష్ణుని ఫలితాం
శపు మాటలుగ "ఏనును నోపినంత సామవాదంబు లాడితి, నారదాది
మహామునులు సుయోధనునకు బుద్ధులు చెప్పునట్లు చేసితి, ఏమి చెప్పి
నను నెంతటం బోకున్నం గినుక రెచ్చుకొని జంకించియు, భంగించియు,
ధిక్కరించియు, తృణీకరించియుం జూచితి కార్యంబు భిన్నంబగుట
నొల్లక నెంతయు శాంతవచనంబులు పల్కితి, అతండశక్త దుర్జనతి
సేయం బూనిన అమానుషంబులగు వానిం గొన్ని నెపమాయలంబన్ని
పెద్దపోకలం బోయితి ఎన్ని భంగుల సంధియ కావలయునని పొరల
గలయంతయు బోరలితి"నని చెప్పించినాడు ఇది తిక్కన చెప్పిన కృష్ణ
దౌత్య సారాంశము

తిక్కన కృష్ణుడు ధృతరాష్ట్రునికే తొలుత పాండవ సందేశ
మును వినిపించెను కాని కుమారవ్యాసునిలో పాండవ సందేశము
దుర్యోధనునికే వినిపింపబడినది. పరశురాము, కణ్వ, నారదులు

చెప్పిన ఉపాఖ్యానములు నామమాత్రములై నీతులుమాత్రము ప్రధానముగా ప్రకాశము చేయబడినవి దంభోద్భవ, గరుత్మద్గాలవ, యయాత్యుపాఖ్యానములు కవిద్వయము ఒకే క్రమమున చేర్చెను. ఋషుల హితబోధానంతరము తిక్కన దుర్యోధనుం బ్రత్యుత్తరం బిచ్చెను కుమారవ్యాసునిలో ఋషివాక్యముల పిమ్మట కృష్ణుడే పల్కెను ఋషుల పక్షపాతరహిత నిర్ణయమును కుమారవ్యాసుడు స్పష్టముగ ప్రశంసించెను తిక్కనలో కృష్ణసందేశమైన పిమ్మట ఋషులు హితము నుపదేశింతురు. దానిపై భీష్మించుకొనియున్న దుర్యోధనుని వైఖరికి క్షమాపణ చెప్పుకొనుచు తన కుమారుని సరి దిద్దుమని ధృతరాష్ట్రుడు కృష్ణునికి చెప్పెను. అంతట కృష్ణుడు సుయోధనునితో భాషించెను భీష్మ ద్రోణులు వాసుదేవ సందేశమునే దిటవుచేసి పలికిరి దుర్యోధనుడు తన తప్పేమియును లేదని పల్కినమీదట ఆతని దుర్నయములను కృష్ణుడు ఖండించెను దానిక మదినొచ్చి దుశ్శాసనుని ప్రేరణతో మర్యాదవీడి సభా భవనమును విడిచిపెట్టిన సుయోధనుడు కృష్ణుని బంధింప తంత్రము చేసెను. కృష్ణుడు తన మహిమలనుగూర్చి కంస వధాదులను చెప్పుట, గాంధారి హితబోధనము గలదు పిమ్మట సాత్యకి కృష్ణబంధన విషయము తెలిసి జాగ్రత్తపడినట్లు వర్ణితము ఇది కథాక్రమమున, సన్నివేశ క్రమమున తిక్కన మార్గము

కుమారవ్యాసునిలో విషయమును, కథనమును భిన్నము. మునుల పలుకులు నిష్పక్షపాతములని కృష్ణుడు పలికెను దుర్యోధనుని తిరస్కార వాక్యములు, కృష్ణుడు కురువంశ గౌరవము పాండవుల సౌజన్యమును గూర్చి పలుకుట వరుసగాసాగినవి దుర్యోధనుడు పాండవుల సౌజన్యమును తిరస్కరించి పలుకుచు దుశ్శాసనుని చూచెను దుశ్శాసనుడు 'సూర్యున కంధకారమెట్లు చేరదో అట్లే తమతో పాండవులు చేరుట కనర్హుల'నను కృష్ణుడు ధృతరాష్ట్రునకు పాండుసుతుల

రాజ్యమీయకున్న జరుగు వంశనాశనమునకు అతడెట్లు మూలకారణ
మగునో వివరించెను దుర్యోధనుని ముందుచూపు లేనివానిని ఆక్షే
పించుచు ధృతరాష్ట్రుడే దుర్యోధను నొడంబడ జేయవలెననియెను.
ఇది కృష్ణునకే ధృతరాష్ట్రుడు చెప్పినట్లు తిక్కన వ్రాసెను. సర్వా
నర్థములకు ధృతరాష్ట్రుడే మూలకారకుడనెను. దుర్యోధనుడు ఆత్మ
కృత నైచ్యమును స్పష్టపరచెను తన రాజ్యలోభమును స్పష్టము
చేసెను మరల కృష్ణుడు ఐదూళ్ళ విషయము ప్రస్తావించెను విదు
రుడు పైవారి పల్కులను సమీక్షించి కర్తవ్యము బోధించెను

దుర్యోధనుడు పాండవులు కోరిన ఊళ్ళ ప్రాముఖ్యమును
పేర్కొని వామనావతారమున మూడడుగులతో త్రివిక్రముడైన
హరిప్రస్తావనదెచ్చి తనకు బలిచక్రవర్తివలె ఎట్టిగతివచ్చునో, ఏ
పదవి లభించునోయని అనుమానము వెల్లబుచ్చెను చివరకు ఒక
ఊరినైనను ఇయ్యనని[1] కృష్ణుడనుగుట తిక్కనలో లేని కుమార
వ్యాసుని స్వతంత్ర నిర్మాణము తిక్కన ఐదూళ్ళ విషయమును
కూడ రాయబారమున ఎత్తలేదు సుయోధనుడు కృష్ణుని బాగడినట్లే
బాగడి అతనివంటివాడు రాయబారమునకు వచ్చుట తగదనెను
తాను ముల్లుమొన మోపినంతయు భూమినీయనని కృష్ణునిపై నొట్టు
పెట్టెను దుర్యోధనుని బంధింపవలెనని భీష్మ, విదుర, ధృతరాష్ట్రులు
తలచి[2] రనుట కుమారవ్యాసునిదే

కుమారవ్యాసునిలో విశ్వరూపమును ఒక్క దుర్యోధనుడు
తప్ప మిగిలిన వారెల్లరును దర్శించిరి ఇచటకూడ కుమారవ్యాసుడు
భాసుని అనుకరించినట్లు కనబడుచున్నది బాహ్యాంతరములలో తన
కంటె నెవ్వరు లేరని కృష్ణుడు ప్రకాశించెను కృష్ణు లెందరో
కన్పించుచుండిరి ఆ మహా మహిముని కట్టుటెట్లని చెక్కిట చేయి

1 కు వ్యా భా, ఉ ప, సం ౮, ష ౩౩
2 ,, ష ౩౮

పూస ఆశ్చర్యపడిరి. విశ్వరూపమును గాంధారి భానుమతి, ధృత
రాష్ట్రుడు మొదలగువారు వ్యక్తిగతముగ ధ్యానించిరి. చివరి
మాటగ దుర్యోధనుడు కృష్ణావతార రహస్యమును తిరస్కృతితో విపుల
ముగ నుపన్యసించెను. ఇది విలక్షణ నిర్మాణము. కృష్ణరాయబారము
సంజయ రాయబారము ధృతరాష్ట్రుని ముఖమున నడచుట తిక్కన
విధానము కాగా దుర్యోధనుని ముఖమున నడచుట కుమారవ్యాసుని
రీతి. పాండవులకు రాజ్యమిచ్చి 'పాండవ ప్రతిష్ఠాపనాచార్య' బిరుదు
నందుమనుట సమకాలీన ప్రభావము. కృష్ణునితో దుర్యోధనుడు
'మీరు మాపై ప్రేలిడి మెనవ్వు నవ్వుచు కర్ణాదుల మూగుగు
కృష్ణుని మాటలు పెడచెవిని పెట్టి మారాడెనట' ఇది నాటకీయకథ
నము. వారి రాజకార్యము నాతడు మెచ్చెనట, యుద్ధము వలసిన
నడుగవచ్చెనట, వారిపక్షమున ద్రుపద విరాటులతో కృష్ణుడాసం
చేరెనట. సుయోధనుడు నిస్సహాయుడట, సంధిని మరచిపోవలె[1]నట'
ఇది దుర్యోధనుని వ్యంగ్యపూరితమైన ప్రత్యుత్తరము.

తిక్కన సుయోధనుడు తనకు రాజ్యప్రాప్తి యగుట
మిక్కిలి నేర్పుగ ప్రకటించెను. కుమారవ్యాసుని దుర్యోధనుడు
తనది యసంబద్ధరీతియనియు, రాజ్యలోభమనియు, పాండవుల రాజ్యము
జూదమున గెలిచితిననియు ననినాడు. సభలో కృష్ణునితో ముఖాముఖ
దుశ్శాసనుని భాషణము తిక్కనలో లేదు. తిక్కన రాజసభా సంభా
షను కడుజాగరూకతతో నిర్వహించెను. కృష్ణబంధనమునకు కార
ణము [1]శ్రీకృష్ణుని భేదోపాయము. అతడే కౌరవులకు శత్రువట[2]
కృష్ణుడు పవనుడని, పాండవులగ్నులని గాలిలేని అగ్ని ఆరిపోవునని
చెప్పుట రమ్యముగ నున్నది. కృష్ణవిరహితులైన పాండవులు కోరలు
పుచ్చిన ఉరగములని తిక్కన దుర్యోధనుడు పేర్కొనెను. కృష్ణ
బంధనమునకు ప్రతీకారముగ సాత్యకి భాషణము తిక్కన చక్కని

1,2 కు వ్యా భా, ఉ ప, సం 8, ష 41, 42

వ్యంగ్యవైభవముతో వెలుగొందజేసెను కుమారవ్యాసుడు తన సహజ తీవ్రతను ప్రకటింపజేసెను సైన్యమును హెచ్చరించుచు సాత్యకి 'భామిని రారాజునెత్తుటితో తడుపవలెననెను' కృష్ణబంధన యత్నములు తెలిసికొని వలయు ప్రతిచర్యలు సిద్ధము చేసెను. కృష్ణుని చెవికడకు వచ్చి నిలిచి ముఖమును ముందునకు చాచి చిఱునవ్వుతో విన్నపము చేసినాడట. ఇది చక్కని నాటకీయ ప్రదర్శనము.

తిక్కనలో గాంధారీ దేవ్యాగమనము, ప్రబోధము, కృష్ణ బంధన నిశ్చయమునకు పూర్వమే గలదు కుమారవ్యాసుడు ఈ సన్నివేశమున గాంధారిని ప్రవేశపెట్టి కృష్ణబంధనమును గూర్చి ఏమారునాక్షేపించెను భీష్ముడు గూడ దూతను బంధించుట రాజ నీతిని విస్మరించుట యనెను తిక్కన గాంధారి ధృతరాష్ట్రుని రాజ్య భాగ ప్రదాన విషయమున స్వతంత్రత వహింపుచున్నది. కుమార వ్యాసుని గాంధారి ఈనిష్పాపెట్టుచర్య ధృతరాష్ట్రునిదని తీవ్రముగ పల్కెను కృష్ణబంధనము వారించుచు విదురుడు చేసిన భాషణము కుమారవ్యాసుని భక్తిని ఉత్కృష్టమైన స్థాయిలో సాక్షాత్కరింప జేసినది. తిక్కన ఇట సంయమము వహించుట విశేషము. విశ్వరూప ప్రదర్శనానంతరము కృష్ణావతారోద్దేశమును స్పష్టముగ వెలువరించెను

### కర్ణ కృష్ణ సంవాదము :

ఈఘట్టము నిరువురుకవులును సంక్షేపించిరి. కర్ణ జననమును గూర్చి తిక్కన సూక్ష్మముగ తెలిపినాడు. కుమారవ్యాసుని కృష్ణుడు పాండవుల వివరములు స్పష్టముగ పేర్కొనెను. పాండవ పక్షమున చేరిన కర్ణుడు పాండవులచే పొందుసేవలను తిక్కన వివరముగ తెలిపెను. కుమారవ్యాసుడు ఇట కర్ణుని పెంచినవారలగు రాధాతిరథుల విషయముగాని, ద్రౌపది ఆరవ భర్తగా స్వీకరించుననిగాని తెలుప

లేదు కృష్ణుడు చెప్పువరకును కుమారవ్యాసుని కర్ణునకు తనజన్మ
రహస్యము తెలియదు తిక్కన భారతమున సూర్యసాహాయ్యమున
కర్ణుడు తన జన్మవృత్తాంతమును ముందుగనే తెలిసికొని
యున్నాడు. ఇది తిక్కన కుమారవ్యాసుల కథా కథనమున
గుర్తింపవగిన భేదము తనకు ఒక్కసారిగ సుక్షత్రియ వంశమున
స్థానము లభించుటతో కర్ణునకు సంభ్రమాశ్చర్యములు ముప్పిరి
గొన్నవి కృష్ణుడును కర్ణుని చేరదీయుటలో మరదిగా వలసినమర్యాద
చేసినాడట. తిక్కన కర్ణునివలె కుమారవ్యాసుని కర్ణుడు గడుసరికాడు.

రాయబార ఫలితముగ కృష్ణుడు విదురునిచే దుర్యోధనుని
రక్షణకై పూనిన విల్లును విరిపించెను. కర్ణుని కతని జన్మరహస్యము
చెప్పి అతని మనస్సు విరిచెను. కుంతీదేవిని కర్ణునాశ్రయింపుమని
చెప్పుటతో దుర్యోధనుని నిర్వీర్యుని చేసినాడు.

తన జన్మరహస్యమును గూర్చి వినిన కర్ణునకున్నీరు కార్చి
నాడు. కురుపతికి కీడుమాడినదని బాధ చెందినాడు శ్రీకృష్ణుని పగ
తోడిపూనిక దుర్యోధన వంశనాశనము చేయక వీడదని చింతించినాడు
యుద్ధము చేసి చంపుటకు పాండవులు సోదరులైరి. యుద్ధము చేయ
కున్నచో కౌరవరాజునకు రాజ్యము లభింపదు మధుసూదనుడే భేదో
పాయమున పోటుపొడిచెనని చింతాసముద్రమున మునిగెను. కారణ
మడిగిన కృష్ణునకు తన దాతకు (దుర్యోధనునకు) అర్జునాదివీరుల
శిరస్సులను సమర్పించు ప్రయత్నములోనున్న తనకు తన జన్మ
వృత్తాంతమును చెప్పి తన బాణములచే పాండవుల బలిచేయు పరిస్థితి
తప్పించినాడని, ఇక మాటలవలన లాభములేదని, పాండవులను రాజ్య
పాలనమున నిలుపుమని తన పరాక్రమము మరునాటి యుద్ధమున
చూపింతునని, వీరకౌరవ రాయుడైన దుర్యోధనుడు తనకు దాత
యని తాను బ్రదుకుట చాలమందికి ఇష్టములేదని, దుర్యోధనుడు

తప్ప తన కెవ్వరు నా ప్తులు లేరని, ఆతని కీర్తికి లోటు లేకుండ చేయుదు
నని కౌరవుని పగ తీర్చుటయే తన కర్తవ్యమని పల్కెను.

కుమారవ్యాసుడిట హోమద్రవ్యములను పోలిక తెచ్చి తన
విశిష్టతను ప్రకటించుకొనినాడు 'అరుణజల మాజ్యమగునని, ప్రేవుల
సమూహము హవిస్సని, ఎముకల ప్రోగులు సమిధని, కేశౌఘములు
దర్భాంకురములని, నర కపాలములు పాత్రములని, తానుయుద్ధ దీక్షితు
డనని' కర్ణుడు పల్కెను.

మారికి పండుగయయ్యెనని, కౌరవుని ఋణము తీర్చుటకు
చతురంగ బలములతో పోరాడి దేహమును విడుతునని, పాండవులను
తాను నొప్పింపననియు, అందులకు సూర్యుడే సాక్షియనియు కర్ణుడు
పల్కెను కర్ణుని దృఢనిశ్చయము వినిన కృష్ణుడు 'మందమతియైన
దుర్యోధనునితో చెప్పి తమ్ములకు రాజ్యమిప్పింపుమని, అతనిమాట
దుర్యోధనుడు త్రోయడని' చెప్పినాడు. ఇదియును కుమార
వ్యాసుని కల్పనము దానికి కర్ణుడు కౌరవునకు సంధి రుచింపదనియు,
తన పరాక్రమమున కది మచ్చయగుననియు కావున సంధివిషయము
తనకు తెలియదని పల్కెను అంతియేకాక "దీర్ఘకాలము తాము
మంతనములాడుట చాడీలుచెప్పువారి కవకాశమునిచ్చి నట్లగునని,
పుట్టపైనున్న త్రాటినిగూడ పాముగ భావింతురని, తనకు సెలవీయు
మని" కృష్ణునిపాదములకు ప్రణమిల్లెను

ఈవిధముగ కర్ణుని పాత్రచిత్రణమున కుమారవ్యాసుడు
అసాగడగునను విలక్షణత చూపించెను. ఈఘట్టమును మొదలిడు
మునే 'భగవంతుడు తన్ను నమ్మినవారి సుక్షేమింపచేయు దీక్షగల
వాడనియు, అవసరమగుచో తలవ్రాతలను మార్చగల శక్తిశాలి
యనియు, నళిననాభుడు భజించువారల కాధారమాతడనియు,
స్నేహోపాయమున కౌరవబలము నాశనముచేయ సమకట్టెనని-యు'
వైశంపాయనుడు వివరించెను. తాను పాండవాగ్రజుడనని ధర్మజు

నను తెలుపవలదని తిక్కన కర్ణుడు కృష్ణుని ప్రార్థించెను. కుమార
వ్యాసు డీనిని చెప్ప లేదు. అతని కోరసమయమైన తనకు రాజ్యలాభము
కల్గునని గాని, ఉన్నతపదము లభించినదని గాని సంతోషము లేదు.
అప్పుడును రారా క్షేమమునే కోరినాడు. కుమారవ్యాసుడు కర్ణ
నిలో నిగూఢములుగనున్న భావములను బయల్పరచి కర్ణుని వ్యక్తి
త్వమును మహోన్నతముగ తీర్చిదిద్దినాడు.

### కర్ణ—కుంతీ సంవాదము :

కుమారవ్యాసుడీ ఘట్టమును నూతన విషయములతో
రసవత్తరముగ మార్పులుచేసి నిర్మించినాడు. రవివారమున ఈ ఘట్ట
మునకు ప్రత్యేక దినమేర్పరచుటలోనే కుమారవ్యాసుని నూత
నత్వము కనబడుచున్నది. తిక్కన శాంతమునవలె విదురుని మన
స్తాపము వినినతరువాత కర్ణునికడకు కుంతిపోయినట్లు కుమారవ్యాసుడు
తెలుపలేదు. రాయబారము విఫలమైనదని, పాండవ రక్షణకై
కర్ణుని వేడుట కర్తవ్యమని కృష్ణుడే కుంతిని నియమించినాడు. తిక్కన
భారతమున కుంతి తనకు తాను ఆలోచించుకొని కర్ణునికడకు పోయెను.
కావున ఈ ఘటననిర్మాణమునందే తిక్కన, కుమారవ్యాసులకు
వ్యత్యాసము కలదు.

కుమారవ్యాసుని భారతమున కర్ణుడు తన గోత్రనామములు
చెప్పుకొనుట లేదు. అతని ధ్యానము పూర్తియగు వఱకును కుంతీదేవి
వేచియుండినట్లుకూడ లేదు. తల్లిని గాంచగనే కర్ణుడు నమస్కరించి
నాడు. ఆమె కుమారుని కౌగలించుకొన్నది. సంతోషబాష్పములు
రాల్చినది. మరల బాష్పపూరిత నయనకాగా గంగాదేవి సాక్షి వేష
మున వచ్చి కుంతీదేవికి కుమారునప్పగించినది. ఇంతలో రవి యచటి
కేతెంచి కుమారునేకాంతమునకు పిలిచి కృష్ణుని సహాయమై వచ్చిన
కుంతికి మాటయిచ్చి కవచకుండలముల నిచ్చిననాటి అవివేకమును
ప్రదర్శింపవలదని హెచ్చరించెను. కుంతి కర్ణుని పాండవాగ్రజునిగ

రాజ్యాధికారము పూనుమనెను. కర్ణుడు తాను రాజ్యము నాశించుట దాతయొక్క భార్య నాశించుటయే యనెను. రాజ్యకాంక్ష తనకు లేదని కృతఘ్నుడను కాలేనని నిశ్చయముగ పల్కెను. తనకీనాడు వచ్చిన యర్హతలను గాక తన వ్యక్తిత్వమును గౌరవించిన దుర్యోధనుని యెడబాసి, తాను పాండవులకడకు చేరవచ్చిన లోకము నవ్వదా? అని అనెను. ఇటులు కుమారవ్యాసుడు ఈ విషయములను సంగ్రహముగ సుందరముగ పేర్కొనెను.

కుంతీదేవి తనపుత్రులేవురను రక్షింపుమని, దురాగ్రహము పూనవలదని, ప్రయోగించిన బాణము మరల సంధింపవలదని కోరి, కర్ణుని అంగీకారము పడసి వెనుతిరిగినది. కవచకుండలములను పోగొట్టు కొనిన కర్ణుని అవివేకమును సూర్యుడు ఆక్షేపించెను. ఇది తిక్కన భారతమున లేదు. తనకు కన్యావస్థలో జరిగిన పుత్రోదయమునుగూర్చి చెప్పుటకు కుంతికిని, వినుటకు కర్ణునకును చాల బాధాకరము. కావున ఆ విషయమును కర్ణుడు కృష్ణునిచే వినియున్నాడు. సూర్యుడా సమయమున వచ్చి కర్ణునేకాంతమునకు పిలిచి అతని తల్లి కుంతియని సాక్ష్యమిచ్చినట్లు చాల ఔచిత్యముతో తీర్చిదిద్దినాడు.

కర్ణుడు కుంతి యడిగిన వరముల నన్నిటిని ఇచ్చుట అతని దాతృత్వమునకు, ఔదార్యమునకు పోషకములైనను ఆవేశమునకే ఇట ప్రాధాన్యము కనబడుచున్నది. తిక్కన కర్ణుడు ఎవరిని వదలి నను సవ్యసాచిని వదలనని తన ధీరప్రవృత్తిని ప్రకటించుకొనెను.

## వ్యాసుని వస్తువిన్యాసము :

ఇంతవరకును తిక్కన కుమారవ్యాసుల వస్తువిన్యాసమును పరిశీలించితిమి. వీరిరువురకును మార్గదర్శకుడు వ్యాసుడును విషయము మాటవలేనిది. వస్తువిన్యాసము విషయమునను ఈ కవులిరువురకును వ్యాసభగవానుడు అగ్రగామియై నిలిచెను. కొన్ని ప్రధాన సన్ని వేశముల నిచట పరిస్పర్శించుట అసంమజసము కానేరదు

విరాటపర్వము ఆరంభమే వ్యాసుని వస్తువిన్యాసమునకొక అగ్నిపరీక్షయై నిలిచినది. ఈ పర్వమున పాండవులు అజ్ఞాతవాసము చేయవలసియున్నది. వారు సచ్చరిత్రులు, సత్యవంతులు. అగుచో అసత్యము పలుకకుండ విరాటరాజు కొలువున ప్రవేశించుటెట్లు? ప్రవేశించి తమ సచ్చరిత్రల కప్పిపుచ్చుకొనుటెట్లు? ఇదీ సమస్య. "అశ్వత్థామా హతః కుంజరః" అని పలుకుటలోనే ధర్మరాజుని అసత్యవాదియని పేర్కొనుచుంటిమిగదా! విరాటుని చెంత అవసరార్థమైనను అసత్యమాడిన సహింతుమా? ఇపుడు కవి ఏమిచేయవలయును?

ఇచట వ్యాసుని నిర్మాణ మెంతటి చక్కనిదో పరిశీలింప దగినది. ధర్మరాజు కంకుడను పేరు దాల్చెను[1]. కంక శబ్దమునకు కపటబ్రాహ్మణుడనియు, యముడనియు అర్థము. ప్రస్తుతవేషమున కపట బ్రాహ్మణుడే. "ఆత్మా వై పుత్రనామాసి" అని వేదము కనుక ధర్మరాజు యముడయ్యెను. అంతియేకాక యుధిష్ఠిరునకు ప్రాణసఖుడ[2]ననెను అనగ యుధిష్ఠిర నామముగల దేహమునకు ప్రాణమైన సఖుడు అని అర్థము చెప్పవలెను. అపుడు ధర్మరాజు తాను యుధిష్ఠిరుడనని చెప్పినట్లగును. అసత్యము లేదు. భీముడు పౌరోగవు[3]నిగ తెల్పుకొందుననెను. పౌరోగవుడన వంటశాల కధిపతి. పురోగవు అనగా వాయువు. అతని కుమారుడు పౌరోగవుడు. భీముని పేరు వల్లవుడు. దానికిని వంటలవాడని, భీముడని అర్థము. అటులనే భీముడు ఆరాలికుడు, గోవికర్త, సూపకర్త, నియోధకుడు[4] అని తెల్పుకొందుననెను. ఆరాలికుడన అన్నము వండువాడు. ఆరాలమునన

---

1 కంకోనామ ద్విజోభూత్వా - వి ప, ఆ 1, శ్లో 23

2 అ సం యుధిష్ఠిరస్యాహం పురా ప్రాణసమః సఖా ఇతి వక్ష్యామి
వి ప, ఆ 1 శ్లో 26

3 పౌరోగవో బ్రువాణోహం వల్లవో నామ భారత - వి ప ఆ 2, శ్లో 1

4 ఆరాలికో, గోవికర్తా, సూపకర్తా, నియోధకః - వి ప ఆ 3 శ్లో 9.

మదపుటేనుగులు. వానితో యుద్ధముచేయువాఁడు గోవికర్త అన శైలా స్త్రము చేయువాఁడు. గోవికర్త అన పెద్ద ఆబోతులను అణచువాఁడు సూపకర్త అన పప్పు కూరలువండువాఁడు ఉపకర్త అన ఎక్కువ ఉపకారముచేయువాఁడు, నియోధకుఁడన మల్లయుద్ధము చేయువాఁడని అర్థము

అర్జునుఁడు షండకుఁ[1]డుగ తెల్పుకొనుచున్నాఁడు షండకుఁడన నపుంసకుఁడు, గోపాలకుఁడు అని అర్థములు గోపాలకుఁడగు కృష్ణునకు మారురూపమే అర్జునుఁడు కావున నపుంసక బృహన్నల యనుటలో నర్థమున్నది "రల'లకు అభేదము బృహాల్ నరః' గొప్పనరుఁడు. నారాయణ సఖుఁడైన నరుఁడని అర్థము అర్జునుఁడు ద్రౌపది పరిచారిక[2]నని తెల్పుకొనుచున్నది ఇచట పరిచర్యయన భర్తగ భార్యకు చేయు పనులు అని తెల్పిన ద్రౌపదికి భర్తయను సత్యార్థము వ్యక్తమగును. నకులుఁడు 'గ్రన్థికుఁ'[3]. అనగ గ్రంథములను-ఆయుర్వేదమును అధ్వర్యవమును తెలిసినవాఁడు నకులుఁడు దేవవైద్యులగు అశ్వినులకుమారుఁడు కావున యథార్థమే! అటులనే "అశ్వాదికృతుఁడ'[4]నని పేర్కొనెను శ్వ అనగ రేపు అని అర్థము, అశ్వ అనగ రేపులేనివాఁడు, రేపు బ్రదుకుదునని ఆశ లేనివాఁడు వీరుఁడు అట్టివారిలో ముఖ్యుఁడు నకులుఁడు వేరొక యుద్ధమున గుఱ్ఱముల కధికారి సహదేవుఁడు "తన్తిపాలుఁడు"[5] ఎద్దులను త్రాళ్లతో కట్టుటకుపయోగించు పెద్దమోకను "తంతి" అందురు దానిని పరిరక్షించువాఁడు తంతిపాలుఁడు. తంతి అనగ వాక్కు దానిని పాలించువాఁడు సహదేవుఁడు

1 ప్రతిజ్ఞాం షణ్డకోఽస్మీతి కరిష్యామి — వి ప, అ 2 శ్లో 25
2 యుధిష్ఠిరస్య గేహే వై ద్రౌపద్యాః పరిచారికా ఉషితాస్మీతి వక్ష్యామి - వి ప, అ 2, శ్లో 31
3 గ్రన్థికో నామ నామ్నాహం — వి ప, అ 3, శ్లో 4
4 పాండునైవ పురా తాత అశ్వాధ్యక్షః కృతః పురా - వి ప, అ 3, శ్లో 6
5 తన్తిపాల ఇతి ఖ్యాతో నామ్నాహం విదితః — వి ప, అ 3, శ్లో 9

ద్రౌపది సైరంధ్రి నగుదుననెను. సీరమును-నాగను ధరించు నది సీరంధ్రి సీరంధ్రియే సైరంధ్రి అనగ అంతఃపుర పరిచారిక ఏస్త్రీకొరకు తెరపట్టబడునో-ఆమెయు సీరంధ్రియే అనగ రాజభార్య అని అర్థము. ద్రౌపది "సైరంధ్రులు భుజిష్య"[1] లనెను "భుజిష్య" అను మాటకు పాలింపదగినది, పాలించునది అని అర్థము. మొదటిది గూఢార్థము, రెండవది సత్యకథనము ధర్మజునింట 'ద్రౌపదీ పరిచారిక'[2]గ నుంటినని తెల్పుకొందుననెను. ఇది రాహువుయొక్క శిరస్సు అనుటవంటిది 'రాహువే శిరస్సు వానికి మిగిలిన దేహము లేదు ద్రౌపదీ పరిచారిక అన ద్రౌపదియను పరిచారిక అని భావము

విరాటపర్వమునకు ప్రబంధరూపము నిచ్చినది కీచక వధ దీనిని వ్యాసుడు పురాణపద్ధతిలో వివరణాత్మకముగ, సీతిస్ఫోరకముగ పేర్కొనియుండ తిక్కన, కుమారవ్యాసులు ప్రబంధోచితముగ రస స్ఫోరకముగ నాటకీయ పద్ధతిని వర్ణించియుండిరి. కీచకుడు ద్రౌపదిని కాంక్షింప, సుదేష్ణ నిరటుకుంకూడ ఆమెను కామించెననియు, ఆమె భర్తలకు భయపడి వెనుకడుగువేసెననియు[3] కీచకుని బెదరించెను ద్రౌపదియు, సుదేష్ణయు యథాశక్తి నీతులను బోధించి కీచకుని వారింప చూతురు ఈ సందర్భమున వ్యాసుడు కీచకుని పరిచయమును జనమేజయుని ప్రశ్నమునకు బదులుగ చెప్పెను. దీనిని తిక్కన, కుమారవ్యాసులు చేకొనలేదు. ద్రౌపది భీమునిచెంత తన మనో వేదనను వెల్లడించుకొనుట వ్యాసుడు సుదీర్ఘముగ మూడు[4] అధ్యాయములలో వర్ణించెను.

1 సైరంధ్రో రక్షితాలోకే భుజిష్యాః సన్తి భారత - వి ప, అ 3, శ్లో 18

2 యుధిష్ఠిరస్య గేహేస్మై ద్రౌపద్యాః పరిచారికా - వి ప, అ 3, శ్లో 19

3 వి, ప, అ 15, శ్లో 7, 8

4 వి ప, అ 18, 19, 20

విరాటపర్వమునగల వేరొక సుందర వస్తువిన్యాసము ఉత్తర గోగ్రహణ సన్నివేశము. ఉత్తరుని ప్రాగల్భ్యములను యుద్ధ భూమిని చేరగనే ప్రదర్శించు పిరికితనమును వ్యాసుడు చాల హాస్య భరితముగ వర్ణించెను. ఉత్తరుడు అర్జునునకు సారథిగ నుండ నంగీక రించెను. ఆతని ఆయుధములను జమ్మిచెట్టునుండి తెచ్చియిచ్చెను. ఉత్తరుడు అర్జునునిపై గౌరవముకలవాడయ్యెను ఆతని శక్తిపై విశ్వా సము చాలనివాడయ్యెను. కావుననే 'ఓ పాండవశ్రేష్ఠుడా! నీవు ఒక్కడవు అవల అస్త్రశస్త్రములన్నిటిలో ఆరితేరిన మహారథులు పలువురుండిరి. యుద్ధమున వీరి నెట్లు గెలువుదువు? నీకు తోడు లేదు. ఆ కౌరవులో సహాయ సంపదకలవారు ఓ మహాబాహూ! నీ ముందు భయముతో[1] నిలిచి యున్నాను.' అని ప్రశ్నింప అర్జునుడు పెద్దగానవ్వి ఓయివీరుడా! ఘోష యాత్రసమయమున గొప్ప బలముకల గంధర్వులతో పోరాడునప్పుడు, దేవదానవులకు భయము పుట్టించిన ఖాండవదహన సమయ పోరాట మప్పుడు, ఇంద్రునికొఱకు నివాత కవచులతోను, మహా బలులగు పౌలోములతోను యుద్ధమాడినప్పుడు, ద్రౌపదీ స్వయంవరమున అనేక రాజవరులతో పోరాడినప్పుడు నాకు సహాయ మెవరు చేసిరి ఈ కౌర వులతో పోరాడు టెంతపని ? గుండె దిగులు వీడి శీఘ్రముగ రథమును పోనిమ్ము[2] అని ఉత్తరునకు ధైర్యము పలుకుట సందర్భమున కెం తయు తగియున్నది యుద్ధరంగమున కర్ణుని ప్రలాపములు వ్యాసుడు విపరముగ పలికించెను. ముందు మాట ఇచ్చిన ప్రకారము అర్జునుని చంపి దుర్యోధనుని తరుగని ఋణమును తీర్తు[3]నని కర్ణుడు పలికెను

యుద్ధరంగమున వీరాలాపములు వస్తువిన్యాసమున కొంత యుంచిపట్టు. ఇచట పూర్వకథాంశము లనేకములు పునశ్చరణము

1 వి ప, అ 45, శ్లో 33, 34
2 ,, శ్లో 36, 37, 38, 39
3 వి ప, అ 48, శ్లో 10

లగుచుండగను అర్జునుడు దుర్యోధనుని కర్ణుని ఎత్తిపొడుచుచు 'ఇదిగో! నీ మామ తెలివిగలవాడు, క్షత్రధర్మమున పండితుడు, కపట ద్యూతమున నేర్పరి అట్టి గాంధారరాజు శకుని కలడుగదా! అతడు ఇచట యుద్ధమాడవలెను గాండీవము పాచికలను ప్రయోగింపదు కృతము, త్రేతా, ద్వాపర మనువానికిచట స్థానములేదు![1]' అని పలికెను కృతము, త్రేతా, ద్వాపర, కలి అనునవి ద్యూత పరిభాషలు ఒకగుర్తున్న ప్రదేశము - కలి, రెండున్నది - ద్వాపరము, మూడున్నది - త్రేత, నాలుగున్నది - కృతము. ఇది వ్యాసుని విశేష పరిజ్ఞానమునకు గుర్తు

అర్జునుని యుద్ధరంగ వీరవిజయ విహారమును వ్యాసుడెంతయు సుందరముగ, విపులముగ వర్ణించెను అర్జునుని బాణములు శత్రువుల శరీరమున నిలువలేదట అట్లే అతని రథమును శత్రుసేనల నడుమ నిలువనేరదట[2] ఇది అర్జునుని బాణతీవ్రతను, ఉత్తరుని సారథ్య చాతుర్యమును తెలుపకయే తెలుపుచున్నది వ్యాసుడు పురాణపద్ధతినాశ్రయించిన వాడయ్యును, అలంకారయుక్త సరసరచనమున అందెవేసినచేయి 'అర్జున శత్రువుల వనములు అర్జునుడను గాలిచే విరిగి రక్తధారలచే భూమిని రక్తమయము చేసినవట[3] ఇచట వనములనుమాటకు ఆలయములనియు తాత్పర్యము యుద్ధభీతుడగు నుత్తరుడు అర్జున రథ సారథ్యము నంగీకరించి పరమోత్సాహము ప్రదర్శించుట కథాసన్నివేశమున కెంతయు ప్రయోజనకరము కావుననే వ్యాసుడు ఉత్తరునిచే అర్జునుతో ఓ జయశీలీ! నా సారథ్యమునను్న రథమున చక్కగ నుండి ఏ సేనపై పోరాడదలచితివి ? చెప్పుము అందు పోయెద[4]న'ని పలికించెను.

---

1 వి ప, అ 50, శ్లో 23, 24
2 వి ప, అ 56, శ్లో 21
3 ,, శ్లో 32
4 ,, శ్లో 40

ఎట్టి క్లిష్ట సన్నివేశములందైనను ధర్మమును వీడరాదనునది వ్యాసుని ప్రబోధ లక్ష్యము. కావుననే యుద్ధరంగమున ద్రోణుని ఉత్తరునకు చూపి అర్జునుడు 'ఆయన నాకెల్లప్పుడు పూజనీయుడు. శస్త్రము పట్టిన వారెల్లరకును మాన్యుడు, ఆ మహావీరునకు ప్రదక్షిణముగ మన రథమును పోనిమ్ము. ఇది సనాతన ధర్మము ద్రోణుడు నా శరీరమున ముందు బాణము వేసినప్పుడు మాత్రమే నేను బాణము వేయుదు[1]'నని పలుకుట అర్జునునికన్న వ్యాసునకు గల ధర్మప్రవచనాసక్తినే వెల్లడి చేయుచున్నది యుద్ధ పరిసమాప్త్యనంతరము యుద్ధరంగ వర్ణనము వ్యాసుని సునిశిత పరిశీలనా దృష్టికి అపార మేధా సంపత్తికి ప్రబల నిదర్శనము. యుద్ధభూమి రక్తమనెడు జలముకలది. ఎముకలనెడు నాచుతో దట్టమైనది యుగాంతమున కాలుడుచేసిన నదివలె నున్న ఘోరమైన నదిని అర్జునుడు ప్రవహింపచేసెను అందు బాణములు, విండ్లు తెప్పలవలెనున్నవి. కేశములు నాచువలెనున్నవి మై పలువులు, శిరస్త్రాణములు కిక్కిరిసి తాబేళ్ళు, జలగజములుగ నున్నవి. వాడి ఆయుధములు మొసళ్ళుగ నున్నవి. ముత్యాల హారములు తరంగములుగ, చిత్రమైన ఆభరణములు బుడగలుగ కానవచ్చుచున్నవి గుములు కట్టిన బాణములు పెద్దసుడులుగ, ఏనుగులు మొసళ్ళుగ, మహారథములు ద్వీపములుగ ఆ నది[2]యందున్నవి.

ఇట్లు పరమ సంగర వస్తు విన్యాసమును ప్రదర్శించిన వ్యాసు నూతగా గొనియె తిక్కన, కుమారవ్యాసులు సఫలీకృతులైనారనుట నిర్వివాదాంశము.

---

1 వి ప అ 55, శ్లో 44, 45

2 వి ప, అ 62, శ్లో 17, 18 19, 20 21



# పంచమాధ్యాయము - పాత్రచిత్రణము

చతుర్థాధ్యాయమున టిక్కన, కుమారవ్యాసుల వస్తు విన్యాసమును పరిశీలించితిమి ఈ అధ్యాయమున వారి పాత్రచిత్రణా రీతిని పరిశీలింతము.

కొన్ని వందల సంవత్సరముల క్రిందట మనకంటె భిన్నమగు ఒకానొక సామాజిక వ్యవస్థలో రచింపబడిన సాహిత్య కృతియందు మనము పరిశీలింప వలసినదేమి ? ఈ ప్రశ్నము అనేక సాహిత్య, సాహిత్యేతర సమస్యలకు తావిచ్చుచున్నది. వస్తునిష్ఠమగు ఆసామాజిక స్థితియొక్క విశ్లేషణకు సహాయపడు ఐతిహాసిక విశేషములను మనము సాహిత్యకృతియందు పరిశీలించుటకు వీలుపడదు ఏలయన సాహితీవ్యక్తిత్వమున సమాజము ప్రతిబింబించు ననుమాట యథార్థమే యైనను ఒకవ్యక్తియొక్క వైయుక్తిక నిష్ఠ, అనుభవములే అతని సామాజిక ధోరణులను నిర్ధారించుచున్నవి

ఆకారణమున మనము ఒకానొక సాహిత్యకృతియందు అది అస్తిత్వమునకు వచ్చిన కాలమానమునకు సంబంధించియు, సంబంధితాంశములుగురించియు, మానవలోకమంతకును విభిన్న దేశకాలములందు సమానములగు కొన్ని భావ సంకీర్ణములను (emotional complex) గురించియు పరిశీలింతుమనిచెప్పుట సమంజసము. ప్రతిసాహిత్య సన్నివేశము కూడ పాఠకుని మనస్సునందు పునరభినీతమగుట వలననే తన సార్థక్యమును పొందును ఈ పునరభినయ యశస్సు పాఠకుని చిత్తవృత్తి ననుసరించి, సాహిత్య సన్నివేశము పొందునట్టి సమానాంశముల బాహుళ్యము ననుసరించి యుండునేగాని దాని విశిష్టత ననుసరించి యుండదు. సాహిత్యకృతి యందు పాఠకునకు అన్యమగు అపరిచితాంశముల ప్రమాణమధిక మగుకొలది వారిరువురి మధ్యగల అంతర మధికమగుచుండును ఎన్నియో ప్రసిద్ధ పాశ్చాత్య

కృతులు మనకు రుచింపకపోవుటకు ఈవిధమగు అప్రస్తుతె తిహాసిక వివరముల విపులతియే కారణము.

ఆకారణముననే తిక్కన, కుమారవ్యాసుల వంటి అత్యంత ప్రసిద్ధకవులను పరిశీలించునప్పుడు వారి ప్రాశస్త్యమునకు గల కారణములను సరిగ అర్థము చేసికొనవలసి యున్నది. ఒక కవియొక్క నిజమగు గుణగణముల నుపేక్షించి ఆతని అమహాత్వ పూర్ణ యోగ్యతలకుగాను, ఆతనిని ప్రశంసించుటవలన ఆ కవికిని, ఆతని కృతులకును అపచారము చేసినట్లగుచున్నది

పాత్రచిత్రణముయొక్క సాఫల్యమును విఫలతను సిద్ధాంతీకరించుటకు ఈక్రింది సూచనలను ప్రమాణములుగ పెట్టుకొనవలసి యున్నది.

1. వివిధ సన్నివేశములందు ఒకవ్యక్తియొక్క ప్రతిస్పందన (Reaction) గమనించు అవకాశము మనకు ఒక సాహిత్యకృతియందు లభించును. కాని ఆతని వ్యక్తిత్వము కేవలము ఈ ప్రతిస్పందనల మొత్తము కాకుండగ ఇంకను ఎక్కువ సమగ్రముగ, సంకీర్ణముగ నుండును. ఈప్రతిస్పందనలన్నియు, ఒక సంకీర్ణవ్యక్తిత్వముయొక్క వేరువేరు ప్రచోదనలకు సంబంధితములగుట వలన, వీనియన్నిటికిమధ్య ఒక సుసంబద్ధత, పరస్పరపోషకత ఉండవలసి యున్నది అట్లుకాక ఆపాత్రిప్రవర్తనమున అసమర్థనీయములగు పరస్పర విరోధము కనబడినచో అది ఆకవియొక్క దౌర్బల్యమునకు సాక్షియగును.

అపరాధియొక్క అనేక భావచిత్రములను పరిశీలించిన పత్తేదారు వాని స్వరూపమును ఊహించుకొనుటకు ప్రయత్నించునట్లు పాఠకుడు వివిధ సందర్భములందు ఒకపాత్రము యొక్క ప్రవర్తనమును పరిశీలించి మూలవ్యక్తియొక్క స్వరూప కల్పనమును కావించుకొనవలసియున్నది.

౨. నిర్దిష్ట సన్నివేశమున ఒకపాత్రయొక్క ప్రతిస్పందన లేదా ప్రవర్తన పరిసరముల వలన ప్రచోదితమగు అనేక మానసిక స్థితుల తుది అభివ్యక్తియై యుండును మిగిలిన మానసిక ప్రతిక్రియ లన్నియును అంతరంగముననే నశించి బహిరంగముగ ఆస్ఫోటన పొందుట మాటలలోను, కృతులందును మాత్రమే ఈ బహిరంగ అభివ్యక్తి యొక్క స్వరూపము పరిసరములు, వ్యక్తియొక్క అంతవరకుగల అనుభవ సమగ్రతచే తీర్మానింపబడును

ఒక గణితశాస్త్ర సమస్యను పరిష్కరించుటకు ఒకదాని తరువాత నొకటిగ తర్కబద్ధమగు విధానమున నడచి చివరకు సర్వసమ్మతమగు నిర్ధారణమును కనుగొనునట్లు, ఒకపాత్ర ప్రవర్తన గూడ తర్కబద్ధమగు విశ్లేషణ సాధ్యమగు మనశ్శాస్త్ర పూర్వరంగమును పొందియుండవలసియున్నది. ఈవిశ్లేషణమునందు కనబడునట్టి సంబంధేతర సూక్ష్మాంశములు పాత్రచిత్రణము యొక్క వైఫల్యమునకు నిదర్శనములు

౩. ఒకసాహిత్య కృతియందలి పాత్రలు సాహిత్యాభిప్రాయములను ప్రకటించుటకు వేదికలు కారాదు. అనగా సాహిత్యము సంపూర్ణముగ 'పరకాయప్రవేశము' చేయుశక్తి కలిగియుండవలెను కవికూడ తన పాత్రలతోకూడి తాత్కాలికముగ నైనను భావనాత్మకమైన ఐక్యమును పొందియుండవలయును. అప్పుడు మాత్రమే తన వ్యక్తిగత ఇష్టానిష్టములను మరచి అనుభవమగ్నుడగుటకు ఆతనికి సాధ్యమగును

ఒకనిర్దిష్ట సాహిత్యకృతియందు పరిమిత సంఖ్యాకమగు పాత్రలు మాత్రముండుటకు సాధ్యము. కాని యథార్థమునకు గొప్ప సాహిత్యకృతి ఒకసమగ్ర సామాజిక సన్నివేశములయొక్క సంకీర్ణ రూపమైయుండుట వలన అందలిపాత్రలు ప్రాతినిధ్యము వహించుట అనివార్యమును, ఆవశ్యకమును అగుచున్నది ఇట్లనుటవలన సమర్థ

నగు కవి సమాజమునందలి పలుతరగతుల మనుష్యుల జీవనానుభవసారమును సంవహనము చేయవలయునని యర్థము.

మహాకావ్యములందలి పాత్రరచనా విధానమును గూర్చిన ఒక అంశము నిచట వివరించుట అవసరము. అందువచ్చు పాత్రలు ఎవరో సమకాలీన వ్యక్తియొక్క వాస్తవ చిత్రణముకాక, గుణసమగ్రతకు ప్రతిబింబము ఁగుట సంభవము అట్లుచేయుట వలన ఆ పాత్రలు ప్రతిబింబింపవలసిన గుణసమగ్రతల నుపేక్షించి మిగిలిన గుణగణముల నవలోకింపవ ంసి యున్నది. ఇట్లుచేయుట మహాకావ్యరచనా విధానమునందలి ఒక పద్ధతియేకాని కవియొక్క అసామర్థ్యమునకు పరిణామముగ కనబడునట్టి దోషముకాదు.

ఉదాహరణమునకు సాత్త్విక తామసిక శక్తులమధ్య జరుగు నిరంతర సంఘర్షణమున సాత్త్విక శక్తియొక్క గెలుపును నిరూపించుట మహాకావ్యమురొయుక్క ఉద్దేశమగు చుండును. అపుడు కావ్యనాయకుడు సాత్త్వికశక్తికి ప్రతీకగనిలుపబడిన సంకేతముగ నుండును అతనిని గుణదోషములు రెండింటిని పొందునట్టి సామాన్య మనుష్యునిగ చిత్రించుట జరుగదు అదేవిధమున ప్రతినాయకుని దుష్టగుణములకు సంకేతముగ నిలిపి అతని సద్గుణములను చెప్పక పోవుటయో జరుగును.

ఈవిధానమును గుణసమగ్రతలకు వ్యక్తుల రూపములను కల్పనచేయు సాహిత్యక పద్ధతియని చెప్పవచ్చును.

ఇట్లు పేర్కొనుటవలన మహాకావ్యము నందలి పాత్రములన్నియు నిదేరీతి నుండునని అర్థము చేసికొనరాదు ప్రముఖ పాత్రములకు ఈతత్త్వము నన్వయించి మిగిలిన పాత్రములు సహజములుగనే చిత్రితములు కావచ్చును. అట్లుకాక కవియొక్క బుద్ధిపూర్వక నియంత్రణమును మీరి కొన్నితావుల పాత్రల అనపేక్షితగుణములును అభివ్యక్తములు కావచ్చును.

సాంప్రదాయిక మహాకావ్యమగు వ్యాసభారతమునందు, అందునను ప్రముఖపాత్రముల విచారణమున ఈపద్ధతి ఆచరణ యోగ్యమనుటలో సందేహాధిక్యమునకు స్థానములేదు. కాని ఇంత వరకు వివరింపబడిన ఈ ప్రమాణములను యథాతథముగ తిక్కన, కుమారవ్యాసుల భారతములకు అన్వయించుట సాధ్యముకాదు ఏలయన అవిరెండును స్వతంత్ర సాహిత్య కృతులుకాక సంస్కృత కావ్యమునకు పునరవతరణము లగుటచే వాని విశ్లేషణము తమదే యగు కొన్ని విశిష్ట సమస్యలపైపు మనదృష్టి నాకర్షించును.

మహాభారతమున పాత్రపోషణ మనునది చాల క్లిష్ట కార్యము వ్యాసుడు భారత కథకు ఆద్యబ్రహ్మ యగుటచే ఆయా పాత్రల వర్తనముల నతడు భారతేతిహాసమున యథాతథముగ నిరూపించుచు పోయెను. కాని కావ్యముగ తీర్చబడిన తిక్కన, కుమారవ్యాసులభారతములందు అట్టివిధానము ఒకచో రసభంగమునకు దారి తీయగలదు కావుననే వ్యాసుని పాత్రచిత్రణమునకు, వీరిరువురి పాత్రచిత్రణమునకు చాలభేదమున్నది. వ్యాసునిది ఐతిహాసిక దృష్టి, అనువాదకులది కావ్యదృష్టి అందువలననే తిక్కన, కుమారవ్యాసుల పాత్రలు సహజత్వముతో బాటు సౌందర్యమును గూడ సంతరించు కొన్నవి.

వ్యాసుని భారతమున చిన్నచిన్న పాత్రలు తాత్కాలిక ముగ నేదియో ఒకప్రయోజనమును సాధించి నిష్క్రమించును తిక్కన తీర్చిన పాత్రలు అట్టి ప్రయోజనమును సాధించుటయే గాక కావ్యమునకు జీవాత్మయగు రసపోషణమున కుపకరించి తమ వ్యక్తిత్వమునకు చోటు సంపాదించుకొన్నవి కావుననే తిక్కన 'తన కావించిన సృష్టి తక్కొరులచేతం గాదునా' ప్రశంసింపబడినాడు రసము ద్రవపదార్థము. అది ఆధారము నపేక్షించును దానికి లోక మున పాత్రయను వ్యవహారము ప్రసిద్ధము కావ్యమున శృంగారాది రసములుండును. వానికాలంబనములైనవి పాత్రలు. సజీవపాత్ర

నిర్మాణము మహాకవి ప్రతిభా నిరూపణకు నికషోపలప్రాయము.
కుమారవ్యాసుడును పాత్రల వ్యక్తిత్వ విషయమున చాలశ్రద్ధ
వహించి తన కావ్యమునకు రససిద్ధిని సంతరించుకొనినాడు.

మహాభారత పాత్రలు వాస్తవికతా మనోహరములు. ఏ
యుగములోనైన, ఏకాలములోనైన అగుపించు వ్యక్తులకవి శాశ్వత
ప్రతిబింబములు మహాభారత కథతో వ్యాసునికి ప్రత్యక్ష సంబంధ
మున్నది ఆకథలోని వివిధవ్యక్తుల శీలస్వభావములను ఆయన స్వయ
ముగా చూచినవాడు అందలి ధర్మాధర్మములను దర్శించినవాడు.
అందుచే ఒక్కొక్క వ్యక్తిస్వభావములోని శిఖరములను, లోయలను,
మలుపులను ధర్మదీపకాంతిలో మహాభారతమున మనోహరముగ
ప్రదర్శింప గలిగినాడు. ఆకథలో తానొక పాత్రయైనను తామరాకు
మీది నీటిబొట్టువలె నిలిచినాడు ఈదృష్టితో కొన్ని భారత పాత్ర
ములను వాని చిత్రీకరణ విధానమును పరిశీలింతము

### కృష్ణద్వైపాయనుడు :

వ్యాసమహర్షి కురుపాండవ వ్యవహారములలో నెచటను
ప్రత్యక్షముగ జోక్యము పెట్టుకొనలేదు కౌరవపాండవుల కిరువుర
కును హితముపదేశించినాడు విన్నవారు బాగు పడినారు. విననివారు
చెడినారు ఆయన మాత్రము రాగద్వేషములు పెంచుకొనలేదు

ఉద్యోగపర్వమున వ్యాసుడు సంజయుని రాయబారము
తరువాత గాంధారి కోరికపై ప్రత్యక్షమగును. అయినను తనకు
తానుగ ధృతరాష్ట్రునకు హితోపదేశము చేయమొదలిడలేదు అత
డడుగబోవు విషయమును ముందుగ నే గ్రహించి సంజయునివైపుచూచి

నీవు సమస్తము నెఱుగుదు
గావున నీ కూరకుండగా జగదు ధరి
త్రీవల్లభుఁ డెడగినపని
యీ విధమని తెలియఁ బలుకు మేను వినంగన్[1]

1 తి భా, ఉ ప, ద్వి ఆ ప 306

అని చెప్పవలసిన దాని నంతను సంజయునిచే చెప్పించెను. ఇంతకును వ్యాసుడు చెప్పకపోవుటలోని విశేషమేమగును? ధృతరాష్ట్రుడు మంచిచెడ్డలు తెలియని మూర్ఖుడేమియును కాడు. అతని మనసులోని సంశయము పాండవులకు రాజ్యమునిచ్చు విషయమునుగూర్చియును కాదు. బలాబలముల నిర్ణయము ఇపుడాతనికి ప్రధానము. తనకొడుకులకు, పాండవులకు యుద్ధము తప్పకున్న ఎవరు గెలుతురు? ఎవరి బలమధికము? అనునది అతని ఆలోచనము. అట్టి అనుచితాలోచనమునకు ధృతరాష్ట్రుడు తగినవాడు కాని సమాధానము చెప్పుట వ్యాసునకు తగునా? అందుచేతనే సంజయునిచేత వాసుదేవుని మాహాత్మ్యమును వినిపింపజేసినాడు. అతని శరణుజొచ్చి బ్రతుకుమని హెచ్చరించినాడు. ధృతరాష్ట్రునిచేత నేను వాసుదేవుని శరణుజొచ్చి బ్రదుకువాడనని పలికించి కృష్ణుని పాత్రమునకు ప్రాధాన్యమును సంతరించుటయేగాక కృష్ణుని రాయబారమునకు చక్కని పునాది నేర్పరచి నిర్మించినాడు. ఇట్లు లెక్కన వ్యాసమహర్షి పాత్రమును పులకపెంగిన ముత్యమువలె చక్కగ చిత్రింప కుమారవ్యాసుడు ఈసందర్భమున వ్యాసుని ప్రవేశము అనవసరమని తలచెనో, గ్రంథవిస్తరభీతిచేతనో ఈఘట్టమును తన గ్రంథమున ఎత్తుకొనక విడిచిపెట్టెను.

## యుధిష్ఠిరుడు

మహాభారతమునకు నాయకునిగ గుర్తింపదగు ధర్మరాజు సాత్త్విక శిరోమణియని కీర్తిగాంచెను. ధర్మరాజు కరుణాశీలుడై సత్యాహింసల మూలమున విరోధుల మనఃపరివర్తనను సాధింపదలచిన మహాత్ముడు. 'క్షమా శక్తస్య లక్షణం' అనునది అతనికి తగిన మాట. అతడు సత్యసంధుడు. కాని కృష్ణుని ప్రేరణచే విధిలేని పరిస్థితిలో 'అశ్వత్థామా హతః' అని అబద్ధమాడెను. దీనిబట్టి వ్యాసుడు ఉత్తమపాత్రలను గూడ వారి లోపదోషములనుబట్టి వాస్తవికముగ చిత్రించెనని చెప్పవచ్చును. ధర్మరాజు తాను గౌరవించు వ్యక్తుల ప్రభావమునకులోంగి వారికిష్టమగురీతిని ప్రవర్తించుట కొన్నితావుల

కన్నట్టును ధృతరాష్ట్రుని పితృసమానునిగను కారణముచేగౌరవించును. అట్లే శ్రీకృష్ణునియొక్కయు, కుంతీదేవియొక్కయు ప్రభావము అతని పై విశేషముగ కనబడును. అతనియందు కొన్ని దోషములు లేక పోలేదు ఎవరినైనను నమ్మినచో పూర్తిగ నమ్ముట ధర్మజుని లక్షణము వారిలోని ద్వేషము, వైరమువంటి దోషములు అతనికి కనబడవు. 'బెర్నార్డ్ షా' చెప్పినట్లు 'చాల మంచితనమే అపకారి' అగుట ధర్మజుని విషయమున స్పష్టము

ధర్మజుని గూర్చి ప్రజలిట్లను కొనినట్లు చెప్పబడినది. 'పాండవ జ్యేష్ఠుఁడయిన యుధిష్ఠిరునకు రాజ్యాభిషేకంబు సేయుద మతండు తరుణుండయ్యు గుణవృద్ధుండు, ధర్మశీలుండు పరాక్రమ వంతులైన తమ్ములు గలవాఁడు. రాజ్యప్రతిష్ఠితుండై వృద్ధుల, సమాత్యుల, బంధుమిత్రుల తొల్లిటికంటె మిక్కిలిగ పూజార్హులనెల్ల పూజించును పితామహుండైన భీష్ముని, సపుత్రకుండైన ధృత రాష్ట్రుని అభీష్టభోగానుభవ పరులంగా సుఖంబునుచును' అనిరి

ధర్మజుడు వాసుదేవుని సహాయమున, తమ్ముల పరాక్రమముచే కష్టార్జితముగ సాధించిన రాజ్యమును, అంతతో ఆగక తమ్ములను, తన్నును, తుదకు భార్యను ఒక్కపెట్టున జూదములో ఓడిపోయెను అడవులలోననేక కష్టముల ననుభవింపవలసి వచ్చెను. అయినను అతని వ్యసన పరతను దాని దారుణఫలితముల ననుభవింప వలసివచ్చిన భార్యయు, తమ్ములును సహించిరి ఇట్టి సమయముననే ఆవేశపరులు తొందరపాటుతో విజృంభింతురు దానివలన అపజయము పాలగుటయో, జయించినను అపకీర్తి పాలగుటయో సంభవము ధర్మజుడు సమతా గుణశోభితుడు కార్యసాధకు లెన్నడును తొందరపాటుచూపరు శత్రువుల దుశ్చర్యలను లోకమునకు చాటిచెప్పి వారి సానుభూతిని సంపాదింతురు అటులనే ధర్మజుడును సమయము కొరకు వేచియుండి కౌరవులపై దండెత్తి స్థిరవిజయమును, సుస్థిర కీర్తిని సాధించెను.

అజ్ఞాతవాసకాలమున తనపరిస్థితిని విస్మరించి క్రోధముతో సమీప వృక్షమును పెకలించి కీచకునిపై పడదలచిన వృకోదరుని వారించుటయందును, కీచకుని చేతిలో అవమానింపబడిన ద్రౌపది విరటుని కొలువున ఉద్రేకముతో పలుక, మందలించి పంపి తమ్ము మరుగు పరచుకొన వలసిన స్థితిని కాపాడుకొనుట యందును ధర్మజుని దూరదృష్టి, నేర్పు, ఓర్పు నిరుపమానములు. అటులనే దక్షిణ గోగ్రహణ సమయమున భీమ, నకుల, సహదేవులను విరాటుడు గాని, అతని సైన్యముగాని అనుమానించుటకు వీలు లేకుండునట్లు, తమ సాయమును కాదనుటకు వీలులేకుండునట్లును నిపుణతతో యుద్ధమునకు చేకొనిపోయెను. యుద్ధభూమిలో సుశర్మ విరటుని బంధించినపుడు భీముని జాగ్రత్తపరచి ఆతని బంధవిముక్తుని చేయునప్పుడు, భీముడు సహజ రోషముతో సాల వృక్షమును పెకలింప నెంచ భీమునిగ గుర్తింతురని హెచ్చరించుటయందును అనువాదకవుల పాత్ర నిర్మాణము ప్రశంసనీయము

ధర్మజుని ప్రాజ్ఞత, దూరదృష్టి, మాటనేర్పు, ఓర్పు అమోఘములు సంధిప్రయత్నములో పదును తగ్గకుండ, పాకము చెడకుండ ధర్మజుడు ప్రదర్శించిన పైనాలుగు ప్రజ్ఞలు పెద్దల సానుభూతిని సంపాదించినవి ప్రజల అభిమానమును పొందినవి తప్పంతయు కౌరవులదే అనిపించినవి అవసరమైన అనేకుల సాయము నార్జించినవి శల్యుని విషయమున ధర్మజుని ప్రవర్తన అసామాన్యము. అతడెన్నినను కౌరవ పక్షమున చేరెను దానిని గూర్చి తర్కించుట గత జలసేతు బంధనము వీలైనచో శత్రు పక్షమునకు అపకారము చేయునట్లు చేయుట రాజనీతి "సమర సమయమున నిరాకరించి పలికి కర్ణుని చిత్తంబునకు కలంక పుట్టించి పార్థు రక్షింప వలయు"నని ప్రార్థించి మాట నేర్పుతో ఏ నోట అతడు కౌరవునకు సాయము చేయుదునని అనియుండెనో ఆ నోటనే "కౌరవనాథుడా నహుషుడై పడి నాశము పొందు"నని పలికించినాడు

సంజయు రాయబారము ధర్మజుని ఓర్పు మాట నేర్పులకు మరొక గీటురాయి. యోగక్షేమములు విచారింప మా తండ్రి పంపె నని సంజయుడనగ-

"ఆ రాజు మా దెసం గల
కారుణ్యము కతమునను సుఖంబున నిట్లున్నారము"[1]

అని గాయము కనబడకుండగ ఎదురుదెబ్బ తీసెను. సంజయుడు మాటల వెనుక దోబూచులాడుచుండ "సంజయా! పక్షపాతవృత్తి విడువుమా!" అని సూటిగ నిలదీసి ప్రశ్నించినాడు. కావుననే సంజయుడు ధర్మజుని హృదయమును చక్కగా నవగతము చేసికొని ధృతరాష్ట్రునితో "ధర్మజుడు మెత్తని పులి, ఎల్లవారలు నధర్మము నీవయి పెట్టనంతకు వినడు, కానడు విడువ నీకును నాకు మరల్ప వచ్చునే' అని "సాధు రేగనేని తలపాలమునగాని నిలువద'ని తెలియ చెప్పినాడు.

శ్రీకృష్ణుని రాయబార మంపునపుడు ధర్మజుడు చూపిన ప్రాజ్ఞత, వాక్చతురత శిఖరప్రాయములు. చెప్పవలసిన విషయము లన్నియు చెప్పి చివరకు శ్రీకృష్ణుడేమనుకొనునోయని తలంచి-

మమ్మెరుగు దెదిరి నెఱుగుదు
నెమ్మి యెఱుగు దర్థసిద్ధి నెఱి యెరుగుదు వా
క్యమ్ముల పద్ధతి నెఱుగుదు
వమ్మెవ్వడ నేను నీకు బుద్ధులు సెప్పన్

అని అతనికి సంధి విగ్రహములను నిర్ణయించు అధికారము నొసంగినాడు. సంధి విఫలమైన తరువాత కృష్ణుడు వచ్చి సమరము అవశ్య కర్తవ్యమని తెలుపగనే-

శౌరి నిశ్చయించ సంశయం బేటికి
సంఘటింపు డుగ్ర సమర విధము

1 తి భా, ఉ ప, తృ. ఆ, ప 34

అని తమ్ములతో తెగించిచెప్పి సమస్త సంగ్రామ భారమును కృష్ణుని భుజస్కంధములపై మోపినాడు.

కుమారవ్యాసుని భారతమున ధర్మజుని మానవ స్వభావ చిత్రణము చక్కగావర్ణింపబడిన ఘట్టముల నొకటి, రెండు చూతము. అజ్ఞాతవాసమునకు పోవ సమకట్టి తమ తమ వేషములను ధరించు కొనుచున్నపుడు ధర్మజుడు ఈ కష్టములు కన్నిటికిని తానే కారణమని దుఃఖించును అపుడు సోదరులెల్లరును "నీవున్న చోటె మాకు సామ్రాజ్యము, నీవున్న అరణ్యమే మాకు పట్టణము, నీవు దేహివి మేము ఆత్మలము" అని పలుకుట వారి సోదర ప్రేమకు పరాకాష్ఠ

అటులనే దుర్యోధనుడు కృష్ణుని సాయమునకై పోయెనని తెలిసి ధర్మజుడు అర్జునుని కృష్ణుని తమపక్షమునకు సాయము కోర పంపును ఆ సమయమున అర్జునుని రాకకై నిరీక్షించు ధర్మజుడు కృష్ణుడు కౌరవుని కోరిక మన్నించి వారి పక్షమున చేరునేమో యని చింతించును సంస్కృతాంధ్ర భారతములకంటె కన్నడ భారతమున ధర్మజుడు కృష్ణునిపై అధికముగ నాధారపడుట కనబడును తెలుగున ధర్మజుడు కృష్ణుని తన మిత్రునిగ, శ్రేయోభిలాషిగ, బంధువుగ తలంప కుమారవ్యాసుని ధర్మజుడు పరమాత్మునిగ తప్ప వేరు భావమునే రానీయడు తెలుగున ధర్మజునకు గల ప్రాజ్ఞత, దూరదృష్టి, మాటనేర్పు, ఓర్పు అంత సమర్థముగ లేకపోయినను కుమారవ్యాసుని ధర్మజునియందు నై లక్షణములు చక్కగనే పోషింపబడినవి

దుర్యోధనుడు :

దుర్యోధనుడు ఈర్ష్యా ద్వేషాహంకారపరుడుగ భారతమున కన్పట్టును అహంకారముతో దాయాదులైన పాండవులను నాశనము చేయుటకు అసాధారణ కృత్యములనైనను చేయుటకు వెను దీయడు. కర్ణునితోడి అతని స్నేహమునకును స్వార్థమే కారణము.

దుర్యోధనుని జన్మమే అసూయకు ఆకరము కుంతికి సంతానము కలిగెనని విని గాంధారి తన గర్భమును బాదుకొనగ కౌరవులు జన్మించిరను అద్భుత విషయము "అనువంశికత యొక్క ప్రభావమును చూపుచున్నది. పాండవులయొక్క తేజోవైభవములే, వారి మీద అతని కేర్పడిన అసూయా క్రోధములే కౌరవ వంశ నాశనమునకు కారణభూతములైనవి

పాండవుల సంపదకు కన్ను కుట్టినవాడై ప్రత్యక్షముగ వారి నెదిరింప సమర్థుడు కాని కారణమున మామయగు శకునిచే ప్రేరితుడై మాయా ద్యూతమున వారి సంపదనెల్ల వారించుటయే గాక అవమానపరచి, అడవుల పాల్జేసెను. అంతతో చాలక తన ప్రతాపమును చూపి వారిని మరింత అవమాన పరుపదలచిన దుర్యోధనుడు పలుసార్లు భంగపడినాడు. అయినను వానికి బుద్ధి వచ్చుటకు బదులు అతని అసూయా క్రోధములు మరింత పెరిగినవి దాని పర్యవసానమే విరాట పర్వమునందలి ఉత్తర గోగ్రహణ ఘట్టము. భీష్ముడు ద్రోణుడు వారించినను కర్ణుని ప్రోద్బలమున పాండవులను తిరిగి అరణ్యవాసమున కంప నెంచిన దుర్యోధనుడు పార్థుని చేతిలో ససైన్యముగ చావుదెబ్బ తినినాడు. మరల దాని సంగతిని వెంటనే మరచిపోయినాడు. కావుననే పాండవ బలాధిక్యమును తలచి భయపడు తండ్రితో దుర్యోధనుడు కర్ణుని బల పరాక్రమములను వర్ణించి చెప్పెను. పాండవ పక్షమున అతని నెదురుకొనెడి నేను భీముని జయింపగలనని "ఇంత యెత్తి పెంచ కాదె దేహమున్నైనను, దమకు జాలు ననియె ధర్మసుతుడు" అని పాండవుల సాధుత్వమును బలహీనతగ పరిగణించమని పలికినాడు. పాండవులు అరణ్యాజ్ఞాతవాసములు సలుపుటకు కారణము వారి దిక్కులేని తనమని వారికి నాకుంబోలె మహానుభావము గలిగిన బదుమూడు వత్సరము లబ్బంగి నిడుమలం బడుదురె" అని ప్రశ్నించినాడు. "పనలిగిన వారల సుర

లై నరక్షింప నోపరని తన్ను తాను ప్రశంసించుకొనినాడు. పాండవు లను గెలువగలమన్న ధైర్యము తోడనే సంధిప్రయత్నములు నన్ని టిని కాలదన్నినాడు.

'ఏమునువారు బంచికొని యేలుట గల్గదు కల్కకుండు మిం
కేమియు వాడి సూదిమొన యించుక మోపిన యంత మాత్రమున్
భూమి యొనర్చి పాండునృప పుత్రులకిత్తునె యెవ్వరైన సం
గ్రామమునన్ జయంబుగొని రాజ్యముసేయుట నిశ్చయించితిన్'[1]

ఎవరు తన్ను గెలిపింపకున్నను కర్ణుడు తన్ను గెలిపింపగలడని దుర్యోధనునకు కొండంత నమ్మకము. కావుననే భీష్మద్రోణుల సహాయము ఎదిరించుటకు సిద్ధపడినాడు. కృష్ణుని బంధింప దలచుట దుర్యోధనుని మదాంధతకు పరాకాష్ఠ. యుద్ధము తప్పదని నిశ్చయించుకొని కృష్ణుని ముందుగనే తనపక్షమునకు వేడుకొనదలచుట ఆతని ధూర్తనీతికి నిదర్శనము. కవిత్రయభారతమున ఈసందర్భమున కృష్ణుడు హాస్యోక్తులు పలుక 'ధర్మశ్రవణమునకు తాము రాలేదని' అసహనమును ప్రకటించి అర్జునుడు కృష్ణుని కోరుకొనగనే పరమానంద భరితుడై సైన్యమును చేకొనిపోయెను. భేదనీతియందును నిపుణుడై శల్యుని సైన్యమునకు మార్గమున సౌకర్యముల నేర్పరచి ఆతనిని తనపక్షమున కాకర్షించుకొనెను. కవిత్రయభారతమున విదురుడు సభామధ్యముననున్న దుర్యోధనునకు కృష్ణుని రాగమనమును తెలుపగనే ఆతడు గర్వముతో 'రేపు సభలో కనబడుమ'ని పలుకుటయేగాక కృష్ణుడు సభాప్రవేశము చేయుతఱి తాను సింహాసనమునుండి లేవక అతని నవమానింప దల చెను. ఇది యతని యహంకారమునకు నిదర్శనము. తన యింట షడ్రసోపేత భోజనమును సిద్ధపరుప విదురుని యింట విడిదిసేయుట తనకవమానముగ రారాజు భావించును. పాండవులనుగూర్చి పలుకుచు అర్ధరాజ్యమును కోరువారు బంధువులు కారనును. అయిదూళ్ళను కోరుటనుగూర్చి వేసిన ఒక్కొక్క ఊరు తన రాజ్యమునకు తలమాని

1 తి భా, ఉ ప, ద్వి ఆ, ప 288

కము లనును. ఆ అయిదూళ్ళ నిచ్చి వేసిన తనకు మిగులునది హాస్తినా
నగర మొక్కటే యనును. పాండవులతో గలసి బ్రదుకుట కన్న
హిమాలయమున తపము చేసికొనుట మంచిదనియు, భూకాంత తన
దనియు ఆతను వేరొకరి కిచ్చు ప్రశ్న లేదనియు చెప్పును.

## దుర్యోధనుడు – రావణుడు :

కుమారవ్యాసుడు తరచుగ దుర్యోధనుని రావణునితో
పోల్చుచుండును కావున రావణ, దుర్యోధనుల పాత్రలను తుల
నాత్మకముగ పరిశీలించుట సమంజసము. వీరిద్దరును దుష్టులైనను
వీరి చేష్టలలో పోలికతక్కువ రావణునివలె దుర్యోధనునకు కనబడిన
సుందరీమణులనెల్ల మోహించు, అపహరించు గుణములేదు విభీషణుడు
తెలిపినట్లు రావణుడు ఉదార ప్రభువు, అరిభయంకరుడు. దుర్యోధ
నుడు ఔదార్యవంతుడే కాని రావణుని యంత పరాక్రమశాలి కాడు.
రావణుడు అపరిమితమైన మహత్త్వాకాంక్ష కలవాడు. ఆతని దిగ్వి
జయ కాంక్ష ముల్లోకములను ఆవరించునట్టిది గోగ్రహణమును సేతు
నిర్మాణమును చూచి కావలెనని యుద్ధమునకు దిగిన దుర్యోధన, రావణా
సురు లిరువురును మూర్ఖులని భారతసావిత్రి స్తోత్రమునందు కలదు.

దుర్యోధనుడు ఈ భూమండలము నంతను తానే ఏలవలెనని
కోరిక కలవాడు. మంచివారందరికి కష్టములు కలిగించు స్వభావము
గలవాడు కాడు. ఆతని దౌష్ట్యము దాయాదులకు మాత్రమే పరిమి
తము రావణుని దుర్మదాంధతను, దుర్యోధనుని దుర్మదాంధత పోలి
యున్నది రావణుని మదమునకు ఆతని దేహబలము కారణము కాగా
దుర్యోధనుని మదమునకు అతిరథ, మహారథులగు ఆతని సుహృద్బాం
ధవుల బలము పోషకమగుచున్నది. రావణుని పోలియున్న వీడు చావు
నకు భయపడువాడు కాడు అని కుమారవ్యాసుడు ఇద్దరి అపరిమితమైన
మదమును గుర్తించి పోల్చి పేర్కొనియున్నాడు.

భీముడు :

భారత భీముని పాత్ర చాలమాననీయ మైనది. వాస్తవిక మైనది పాఠకునకు హృదయాకర్షక మైనది. భీముడు దుర్యోధనునకు శత్రువగుట మాత్రమేగాక స్వభావము చేతను అతినికంటె పూర్తిగ భిన్నుడని చెప్పవచ్చును. దుర్యోధనునకు గల సూక్ష్మబుద్ధి, వ్యంగ్యముగ మాటాడుశక్తి భీమునకు లేవు తోచినది తోచినట్లు చేయు నీతని ప్రవర్తనమే దుర్యోధనునిలో ద్వేషమును ప్రవేశింపచినది. ఇతనిలోనున్న సద్గుణమేమన ధర్మజుని వ్యక్తిత్వమును, స్థిరచిత్తను మిగిలిన సోదరులకన్న ఇతడే ఎక్కువగ తెలిసికొని యున్నాడు. అసంతృప్తి తోడనే అన్న మాట నంగీకరించుచు, అంతరంగమున రాజసమగు కోపము ననుభవించును. విరాటపర్వమున సమీప వృక్షమును పెకలించి కీచకుని సంహారింప దలచిన భీముడు, నిశరాత్రి వంటయింటికి వచ్చిన ద్రౌపది తన అవమానమునకు ప్రతీకారము కోరుచు 'కీచకుడు దన్నంగనెట్టులు సూడనేర్చె ధర్మసూనుడపుడు[1]' అని ప్రశ్నింప భీముడు ధర్మజుని ధైర్యహిమాచలుడు, సత్యవ్రత నిష్ఠుడు అని పొగడుటయేగాక 'ధర్మసుతుడమ్మాయి వారణసేయు కున్న సమయభంగ మయ్యెడిద'ని ధర్మసుతునిపై విశ్వాసమును ప్రకటించును కన్నడభారతమున భీముడు 'కొందరు సంపాదించు వారు. కొందరనుభవించు వారనునట్లు కలహాముసకు మేమును భోగించుటకు వారునా![2]' అని విరసముగ పలుకును అటులనే శమీవృక్షముపై ఆయుధములనుంచి ధర్మజుడు అవసరమగుచో నర్జునునకు లొంగుదుగాని భీమునకు లొంగవలదని పలుకగనే భీమునకు నిజముగనే కోపమువచ్చినది. తన అన్నకు తనపై నమ్మకము లేదను భావతీవ్రతతో 'మీరు కుంతిబిడ్డలు, నేను దుర్యోధనుని వాడను

---

1 తి భా వి ప, ద్వి ఆ ప 177

2 కు వ్యా భా, వి ప, సం 8, ప 45

తప్పేమి?[1]' అని పండ్లుకొరుకుచు గర్జించును ఇట్టిపరిస్థితులలో భీముడు అప్రతిమాన వీరుడగ, మానవ సమాజమును బలహీనతలకు ప్రతిబింబ ముగ కనబడును. ధర్మజునిసైగల గౌరవమే భీముని సంధి కంగీకరింప చేసినది. కావుననే కృష్ణుడు రెచ్చగొట్టినను ఈసారికి పోయెమ్మ, ఈభీముడు ఱ్ఱత్తి మాటలను కోపింపజాలను. ఇటులు తిక్కన, కుమార వ్యాసులిరువురును భీముని పాత్రమును ఉదాత్తముగను, కడు గంభీర ముగను తీర్చిదిద్దిరి

### భీష్ముడు - ద్రోణుడు :

ఈరెండు పాత్రలను సమానముగ భావింపవచ్చును కేవ లము వయోవృద్ధులనియేగాక శౌర్యపరాక్రమముల చేతను కూడ నాటికాలమున అత్యంత మాననీయమైన వ్యక్తిత్వముగల పాత్రలు. వీరిరువురి మానము పాఠకుని మనసున కుతూహలము రేకెత్తించును. అందునను తనవంశముయొక్క వినాశనమునకు ప్రత్యక్షముగ సాక్షీ భూతముకావలసి వచ్చిన భీష్ముని సంకటము, అతడే సృష్టించుకొన్న ధర్మసంకటముకన్నను ఎక్కువ వాస్తవికమైనది. ఈతని అసహాయ తకు మూలమెక్కడ ప్రారంభమయ్యెనను విషయము తేల్చుట కష్టము వివాహములేక, రాజ్యములేక దుస్సహమగు ఏకాంత జీవన ముకు తమ్ములకోరికను, తమ్ములబిడ్డల కోరికను ప్రేమకై వలసి వచ్చిన ఈ ముదుసలి తనజీవిత చివరి భాగమున ఈ విషయమున అనాసక్తుడై యుండిపోయినట్లు కనబడును. మన ఊహాకందని అతని మానసిక వేదన అతనివ్యక్తిత్వమును చాలవరకు బలహీనము చేసినది. ఆకారణము ననే తిన్న ఋణము తీర్చుకొనుటకు అర్ధమనుష్యుడుగనే దుర్యోధనుని పక్షమున యుద్ధముచేయుట తక్క మిగిలిన మహాభారత కథయందంతటను అతడు నిష్క్రియుడుగనే మిగిలినాడు. అంతియేగాక కృష్ణుని శక్తి, సామర్థ్యములను గుర్తించి మౌనముగ నుండిపోయి

1 కు వ్యా భా ఏ ప, సం 2, ప 14

నాడు. నిష్కర్షగ మనోభిప్రాయములను వెల్లడింపనేరని ఈతడు కొన్ని తావుల గంభీరముగ మాటాడుటయు, కొన్ని తావుల అన్యమనస్కముగ మాటాడుటయు జరుగుట పాఠకునికి సందేహమునే మిగుల్చుచున్నది.

ఈ దాయాద కలహముమధ్య చిక్కుపడిన బ్రాహ్మణుడగు ద్రోణుడు భీష్మునననుసరించుట ఆశ్చర్యపడవలసిన సంగతికాదు. ద్రోణ-దుర్యోధనుల మధ్య గురు-శిష్యసంబంధము మాయమైరాజు-ఆశ్రితుల సంబంధము ప్రవేశించినది. మొదట ద్రోణునికి వ్యక్తిత్వము శూన్యము. భీష్మునివలెనే పోషించిన కౌరవులకుగాని, మెచ్చిన పాండవులకుగాని మనస్ఫూర్తిగ సహకరింపక పోవుట వీరి ద్వంద్వ మానసిక నీతికి దర్పణము పట్టుచున్నది.

### ధృతరాష్ట్రుడు :

శ్రేష్ఠుడగు మనోవైజ్ఞానికుడగు వ్యాసుడు సర్వకాలముల యందును కనబడునట్టి మానవస్వభావము లందలి ప్రకృతి, వికృతులను తన అద్భుతమైన ప్రతిభతో చూచి తన భారతమున సాటిలేని సజీవములగు పాత్రలను సృష్టించి యున్నాడు. ధృతరాష్ట్రుడు శారీరకముగనేగాక పుత్రవ్యామోహము చేతను అంధుడు. అతడు మొదట సాత్వికుడై తరువాత దుష్టుడుకాలేదు. అధికారము లేకపోవుటచేతను అవకాశము రాకపోవుట చేతను అతని దౌష్ట్యము బయల్పడలేదు. పాండురాజు చేతినుండి అధికారము పూర్తిగ తనచేతికి రాగానే అతనిలో అజ్ఞాతముగనున్న లోభము తనకుమారులకు రాజ్యము నప్పగింప ప్రేరేపించినది. తన దుష్టత్వమును పైకి కనబడకుండ సాధువువలె నటించుటలో ధృతరాష్ట్రుడు ఆరితేరినవాడు. తన అశ్రద్ధవలన తన కుమారులకు ఆపద కలుగవచ్చునని తెలిసియు వారిని వారింపక వారి దౌష్ట్యముఫలించు నేమోయను ఆశతో మిన్నకుండుట పలు

మార్గ్ల చూడగలము. ధృతరాష్ట్రుని పాత్రమున వ్యాసుడు మనో దౌర్బల్యము కారణముగ కలుగు అస్థిరబుద్ధియొక్క వ్యక్తిత్వమును నిరూపించియున్నాడు. అతడు పూర్తిగ మంచివాడుకాడు అటులని పూర్తిగ చెడ్డవాడునుకాడు. ఈ రెండింటి మధ్య చిక్కుకున్న వాడు' అతని పాపమేమన అతడు చంచలచిత్తుడు, అశక్తుడు నగుట మంచి చెడ్డలనడుమ 'పెండ్యులము' వలె ఊగులాడినాడు[1] అని Dr సుక్తాంకర్ గారి అభిప్రాయ మెంతయు సమంజసము.

ఆంధ్రభారతమున ధృతరాష్ట్రుడు పాండవులు కోపముతో తన కొడుకులమీద పడకుండ రాయబారము వచ్చిన ద్రుపద పురోహితుని తియ్యని మాటలతో, భూషణాంబర సహిత తాంబూలముతో సంతృప్తి పరచి పంపినాడు సంజయుని పిలిపించి 'వాసుదేవ సహితముగ పాండవులగని వారి విషాద మెమ్మెయిమాను నమ్మెయి తగ పలుక వలయున'నిచెప్పి రాయబారమంపినాడు. సంజయుడు తిరిగివచ్చి చెప్పినమాటలు వినుటతోడనే అతని మనసు కలత చెందినది. ఆ రాత్రి యంతయు కన్ను మూత పడలేదు. విదురుని పిలిపించుకొని నాడు. అతడు లోభముడుగుట అన్నిటికంటె మేలైన శాంతికారణమని సూటిగ చెప్పినాడు. అయినను ధృతరాష్ట్రుడు తననైజముమీఱక

> 'నీవు సెప్పిన మాటలు నిర్మలములు
> నిపుణసమ్మతములు రాజనీతిమార్గ
> బోధకంబులునై నను బుత్రవిరావ
> నోప'ధర్మో జయతి' యని యుండువాడ'[2] అని

తన పుత్రస్నేహమును, నిస్సహాయతను ప్రకటించుకొనెను. అతని ఆందోళన తగ్గదాయెను మరల సనత్సుజాతుని పిలిపించుకొని ఆధ్యాత్మిక తత్త్వబోధ గావించుకొనినాడు

---

1 On the meaning of Mahabharata, p 55 to 57

2 తి భా, ఉ ప ద్వి ఆ, ప 90

తెల్లవార సభాసమక్షమున సంజయుడు పాండవ, శ్రీకృష్ణుల సందేశములను వినిపింపగనే ధృతరాష్ట్రుని గుండె లదిరినవి. పుత్రునికి నీతిగఱపుటకు ప్రయత్నించినాడు. అతడు వినకయున్నను తాను పుత్రుని శాసింపలేడు. అతని విడువలేడు. ఇంకేమిచేయును ? పోరుసంభవించిన తనపుత్రుడు నెగ్గగలడా? లేడా? అనిచూచుకొనెను సంజయుడు కృష్ణమాహాత్మ్యమును గూర్చి తెలుప ధృతరాష్ట్రుడు సంధి సంధాతగవచ్చు శ్రీకృష్ణునికే లంచమిచ్చి తనవైపు త్రిప్పుకొనజూచెను. ఇది అతని అవివేకమునకు పరమావధి శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని నిజస్వరూపము సభలో బట్టబయలుచేసి సూటిగ రాజ్యభాగ విషయము నెత్తుకొనినాడు ధృతరాష్ట్రుడు ఎటుపోవుటకు దారి లేక, ఏమిచేయుటకు పాలుపోక నిరుత్తరుడైనాడు ధృతరాష్ట్రుని స్వభావమున వింతగొలుపు విషయము శ్రీకృష్ణుడిచ్చిన దృష్టిని విశ్వరూప సందర్శనానంతరము మరల నుపసంహరింపుమని కోరుట. పుట్టుగ్రుడ్డివానికి దృష్టిలభించుట కంటె ఆనందమేమి? దీనినిబట్టి అతి చెంత పుత్రమమకార పీడితుడైనను, ఉపేక్షాభావ సమూపేతుడైనను లోభస్వభావ దూషితుడైనను అంతరాంతరమున అంతులేని ధర్మ సంఘర్షణము ననుభవించినట్లు గూడ మనకు తెలియును

కుమారవ్యాసుని భారతమునందును ధృతరాష్ట్రుని పాత్ర పైరీతిగనే పోషింపబడినది ముఖ్యభేదమేమన తిక్కన భారతమున రాయబారములన్నియు ధృతరాష్ట్రుని ముఖమున జరుగ కన్నడభారతమున వానికన్నిటికిని దుర్యోధనుడే బాధ్యుడగుచున్నాడు భీష్మాదులవలె ధృతరాష్ట్రుడు సభ్యుడు మాత్రమే ఇట్లు మితిమీరిన పుత్రమమకారముతో వారినదుపులో నుంచక, తరువాత వారి నదుపులో నుంచుశక్తి లేక సుతుల మరణమునకు పరోక్ష కారకుడైన పాత్రగ ధృతరాష్ట్రునిపాత్ర మిక్కిలి సమర్థవంతముగ తీర్చిదిద్ద బడినది

## కర్ణుడు :

కర్ణుడు అసాధారణ శక్తి, సామర్థ్య శోభితుడు, మహా వీరుడు. అతని బలపరాక్రమములు కౌరవపక్షమునేగాక పాండవ పక్షమున గూడ పెక్కు ప్రశంసల నందుకొన్నవి. మానవుని కాత్మ బలము నిచ్చు వానిలో అవర్ణ్యములు ప్రధానములు దాతృత్వము కర్ణుని ఉన్న ఔదార్యము ఇతడు బాల్యము నుండియు సూతపుత్రుడని అవహేళనకు గురియయ్యెను. పదిమందిలో తన ప్రత్యేకతను చూపుకొనవలెననెడి ఆతురత కర్ణునిలో అధికము లేనిచో అంత అవహేళనకు గురికావలసిన అవసరము లేదు కర్ణుడు బాల్యమునుండియు వ్యక్తిగత కారణమేమియు లేకుండగనే పాండవులతో శత్రుత్వము పెంచుకొనెను. తన యోగ్యతకు తగిన స్థానము లభింపకపోవుటయే గాక హీనజాతివాడుగ తిరస్కరింపబడుట చేతను తన ప్రతిస్పర్ధియగు అర్జునునకు తనకంటె అధిక గౌరవము లభించుట చేతను కర్ణునకు అర్జునునితో విరోధము అధికమయ్యెను. అతని దానగుణము గూర్చి డా॥ వి. ఎస్. సుక్తాంకర్ ఇట్లు చెప్పియున్నాడు 'With his frustration complex unresolved he was capable of real sacrifice or true charity[1]. అస్త్ర విద్యాప్రదర్శనము కర్ణుని జీవితమున గొప్ప మలుపు. కర్ణ, దుర్యోధనుల గాఢ మైత్రికి, కర్ణుని స్వామి భక్తికి వెనుకనున్న సన్నివేశమిది దుర్యోధనునకు అర్జునునివలన భయము లేదను ధైర్యమును కర్ణుడు కలిగించినాడు తమ్ముల మాట కంటె గురువుల మాటకంటె కడకు తల్లిదండ్రులమాట కంటె కర్ణుని మాటనే రారాజు మిన్నగ గౌరవించినాడు. కర్ణుడును పాండవులు తన తమ్ములని తెలిసినను, అఖిల సామ్రాజ్యము హస్తగత మగునని, ద్రౌపది తనను వరించునని శ్రీకృష్ణుడు ఆశ పెట్టినను తాను, తనపక్షము పాండవుల చేత నాశనము కాక తప్పదని తెలిసియు, కన్నతల్లి కుంతి కౌంతేయుల చేరుమని చేతులొగ్గి అర్థించినను ఆనర్వ్య ప్రేరితుడై

1 On the meaning of Maha Bharata - P 51

రమునకై దుర్యోధనునితో కలిపినచేతిని విడదీయక ఆత్మార్ప
ణకు సిద్ధపడినాడు. కర్ణుని జీవితమున ఏర్పడిన పరిస్థితులను, అతని
స్తత్వమును గుర్తింపక, అపకీర్తి కరములైన పాపకార్యములలో
ర్యోధనునకు సహకరించుట స్వామిభక్తి యగునా? అని కర్ణుని
శ్నించుట సరిగాదు.[1] కర్ణుని అభ్యుదయమునకు కురుపాండవ
మే మూలము. అర్జునునిపై అతని మత్సరము తీరుటకు, అతనిని
మాపు చూచు సంఘమునకు బుద్ధివచ్చునట్లు తన గొప్పతనము
పుటకు, తనను ఉద్ధరించిన రారాజు ఋణముతీర్చుకొనుటకు, నాటి
ంఘమున ఒకగొప్ప వ్యక్తిగా ప్రకాశించుటకు కురుపాండవ వైరము
యకారియైనది. ఆ వైరమే లేనినాడు కర్ణుడే లేడు. కావుననే
డు కురుపాండవుల మైత్రిని ద్వేషించినాడు.

పాండవ పక్షమున కృష్ణున కేర్పడిన స్థానము కౌరవ
మున కర్ణున కున్నదని చెప్పవచ్చును. కౌరవపక్షమున కార్య
తి కర్ణుడే. కావుననే కర్ణునితల భారతమైనది. కాని భీష్ముడు బ్రతికి
న్నంతకాలము కత్తిపట్టనని కర్ణుడు ప్రతిజ్ఞ చేయుట ఒక విచిత్రమైన
ఘటన. దీనివలన దుర్యోధనునకు కలుగునష్టము నాతడాలోచింప
ు ఆవేశమునకులోనై అవతలివారి కుపకారి యైనాడు. భీష్ముని
క్తిత్వము ముందు కర్ణుని వ్యక్తిత్వము నిలువలేక పోయినది.
వునే విచక్షణ కోల్పోయి.

'సీ॥ నాలావు తోడ్పాటు లేక యుండగ
వయ్యు నీతెగునంతకు గలన నిలువ
నాయుధంబులు విడిచితి నంత మీద
మెలసి బలవిక్రమంబుల నెఱపువాడ'[2] అని పలికి తనకు తానే
కేలు వేసి కొనినాడు.

---

1 వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి, మహాభారత తత్త్వకథనము p 1281

2 భా. ఉ. ప. ద్వి ఆ., ప. 89

శ్రీకృష్ణుని రాయబారము తరువాత కర్ణుని జీవితము విషాదోన్ముఖమైనది. అతడు విషాదాంత నాయకుడు (Tragic Hero) కురుపాండవ వైరమును తెన్నగ రగిల్చినాడు. పాండవులు తనతమ్ములని గుర్తించునాటికి పరిస్థితులు విషమించినవి. 'To be or not to be is the question[1]' అనుస్థితి ఏర్పడినది. రాయబారము విఫలమైన తరువాత కృష్ణుడు వెనుతిరిగి పోవుచు కర్ణుని తన రథమెక్కించుకొని అతని జన్మరహస్యమును తెలుపును. సార్వభౌమత్వము, పాంచాలి పొందు ఆశపెట్టును. ఇచట కుమారవ్యాసుడు పాంచాలి పొందు విషయమును మాత్రము చెప్పలేదు. స్వామిభక్తి, సోదర ప్రేముల మధ్య కర్ణుని హృదయమున గొప్ప సంఘర్షణ చెలరేగినది. స్వామిభక్తియే జయించినది. కర్ణుని జీవితమున నింతకంటె బలమైన సన్నివేశము-- కన్నతల్లి వచ్చి జన్మరహస్యము చెప్పి పాండవ పక్షమున చేరుమనుట పుత్రభిక్ష కోరుట. మరల కర్ణుని హృదయమున ద్వైధీభావము చెలరేగినది. చివరకు కర్ణుడు అతిచక్కగా కన్నతల్లి ప్రార్థనకు, కౌరవపతి కోరికకు సమన్వయము కూర్చెను. అర్జునునితప్ప తక్కిన వారిని సంహరింపనని మాటయిచ్చి తల్లిని, అర్జునుని సంహరింతునని తనస్వామిభక్తిభావమును అతడు సంతృప్తిపరచెను. కుమారవ్యాసుని కర్ణుడు పాండవుల నయిదుగురిని చంపనని మాట యిచ్చెను. వేసిన బాణము మరల వేయనని కూడ ప్రతిజ్ఞ చేసెను. అంతియేగాక కుమారవ్యాసుని కర్ణుడు పాండవపక్షమునకు రాకపోవుటకు మరొక చక్కని కారణము చెప్పెను. 'ధర్మజునకు తాను అన్నయని తెలిసిన తప్పక తనకు రాజ్యాధికారము నప్పగించును. ఆ రాజ్యము తనచేతికి వచ్చిన తాను మరల దానిని దుర్యోధనునకే యిచ్చివేయుదును' ఈ రీతిని ధర్మసంకటమునకు లోనగి అసహాయస్థితిలోనున్న కర్ణుని దురంతచిత్రము ఎట్టివారి మనసునైనను కరగించితీరును.

1 Shakesphere, Hamlet, Act III

## శల్యుడు :

మహాభారతమందలి వీరులలో శల్యుడ కడు 'ఛలదోళ్ మద్రేశన్' అని పంప చెప్పియున్నాడు. పాండవులకు మేనమామ యగు శల్యుడు కౌరవపక్షమున యుద్ధముచేయుట ఆతని దురదృష్టము. దుర్యోధనుని మోసమునకు ప్రతిక్రియగా ధర్మరాజునకు మాట యిచ్చి కర్ణుని తేజోవధ గావించినాడు. ఉపచారములకు, పొగడ్తలకు లొంగిపోవుటయే ఆతని బలహీనత. ఆడంబరమగు సత్కారమునకు లొంగి కౌరవపక్షమున చేరెను. కన్నడ భారతమున దుర్యోధనుడు 'అళియెగ్గళెనదటె శల్యనృపాలకన తిరుహుల్గొండొ గెలువుదు కాళగవు నమగె'[1] అని శల్యుడు తమపక్షమున చేరిన తమకు గెలుపు లభ్యమని తలంచెను. మార్గమధ్యమున సకలోపచారముల నేర్పరిచెను శల్యుడు ఆవన్నియు ధర్మరాజే ఏర్పరిచెననుకొనెను. అందులకే 'ఇట్లు చతురంబుగా మనకు వలయువాని సంపాదించుటకు ప్రవర్తకులైన యుధిష్ఠిరామాత్యులెవ్వారు?' అని ప్రశ్నించును. కన్నడభారతమున 'ఈ ఉపచారములు గావించునది ధర్మరాజా? దుర్యోధనుడా?' అని శల్యునకు సందేహము కలుగును. సుయోధనుడని తెలిసి ఆతని కోరికను మన్నించి పాండవులను చూడదలచెను. కురుపతి శల్యుని పాండవుల చెంతకు సాగనంపుడు వరములు మఱవకుండవలయు ననెను. కన్నడభారతమున శల్యుని సైన్యమును దుర్యోధనుడు హస్తినాపురమునకు కొనిపోయెను. శల్యుడొక్కడే పాండవులచూడ బోయెను. కావున వరముమాట మఱవకుమని చెప్పనవసరములేక పోయినది. ధర్మరాజు విషయము నెరింగి మీకుం గర్ణసారథ్యంబు కర్తవ్యంబుగా గలయది. సమర సమయంబున నిరాకరించి పలికి కర్ణుని చిత్తంబునకు కలంక పుట్టింపవలెనని ప్రార్థించెను. మర్యాదతో మైగ అచిన శల్యుడు 'ఇదియొక చేల? నీవు మదినెయ్యది కోరిన చేయువాడ' నని నిర్విచార

---

1. కు వ్యా భా, వి ప, సం 2, ష 7

ముగా పలికినాడు. ధర్మజుడు తనను పెద్దజేసి, తన కౌరవపక్షమున చేరకను సమర్థించి నహుషోపాఖ్యానము చెప్పుమని కోరుటకు శల్యుడు పొంగిపోయినాడు. ఏనోటితో దుర్యోధనునకు సాయము చేయుదు నన్నాడో అదేనోటితో 'కౌరవనాథుడా నహుషుకైవడి నాశము బొందుట తప్పదు నీకు జయంబ'ని పలికియున్నాడు.

రథసారథ్యమున శల్యుడు సమర్థుడు. తాను కృష్ణునకైన యధి ఆతనిభావన. కృష్ణునితోగల ప్రతిభటత్వము కూడ శల్యుడు కౌరవపక్షమున చేరుటకు కొంత కారణమున వచ్చును. దానిచే భీష్ముడు 'వాసుదేవుతోడి యీరువా తల్లుర విరిచె నిన్ను నూడి[1]' అని పలికినాడు. "శల్యసారథ్యము" అనుమాట లోకమున ప్రసిద్ధము. కురుక్షేత్రసంగ్రామమున చివరిదినమున శల్యుడు కౌరవసేనాధ్యక్షుడైనాడు. శల్యుని మనస్తత్వమును, పరిస్థితుల ప్రభావమును గుర్తించి కృష్ణుడు ధర్మజుని పాండవపక్ష సైన్యాధ్యక్షుని చేసెను. ధర్మజుని శల్యుడు యుద్ధారంభమునకు పూర్వమే యాశీర్వదించెను గదా! ఇపుడాతనిపై విజృంభించుటెట్లు? శల్యునియందు వెరుకాదా! అయినను శల్యుడు యథాశక్తి పోరాడినాడు. ధర్మజుడు మూర్ఛపోయినాడు. చివరకు ధర్మజుని శక్తి ప్రహారమునకు శల్యుడు బలియైనాడు.

## విదురుడు

విదురుడు న్యాయనిష్ఠచే యమధర్మరాజు అవతారమని కీర్తింపబడెను. పాండవులకు రక్షణదేవత యయ్యెను. విదురుడు నీతికోవిదుడు, సమతాగుణ శోభితుడు, స్వార్థరహితుడు. పరేంగితజ్ఞుడు, అంతియేగాక ఇటు కౌరవులతోను అటు పాండవులతోను అనుబంధము కలవాడు. ఇరుపక్షముల మేలుకోరువాడు. అధర్మమునకు పాల్పడిన ధృతరాష్ట్రుని, అతని కుమారులను పలుమార్లు సరిదిద్ద జూచినాడు

1 తి భా వి. ద ఆ ప 22

ఎన్నియో హితవాక్యములు బోధించినాడు. సంజయుని రాయబారము తరువాత చింతాక్రాంతుడైన ధృతరాష్ట్రుడు 'భవద్వచనామృతము నాయుల్లంబు చల్లఁగాలుపుమని' కోర లోకోత్తరములైన నీతివాక్యములుపదేశించినాడు. ఆతని దురాశ 'మీనులోలతన్ గ్రక్కున నామిషంబు చని గాలము మ్రింగినచాడ్పు నగు'నని హెచ్చరించెను. కృష్ణునకు లంచమిచ్చి వశపరచుకొనదలచు ధృతరాష్ట్రునకు అదిసాధ్యము కాదని ఆతని రాయబారము సఫలము చేయుటయే ఆతనికి సంతోషమని చెప్పెను. విదురుడు బ్రహ్మజ్ఞానియయ్యు శూద్రయోనిజనితుడగుటచే నేలిన్మ్రసార్థమును తననోట వక్కాణించుట కూడదని ధృతరాష్ట్రునకు సనత్సుజాతునిచే ఉపదేశము చేయించెను. ఇచట విదురుని అహంకార రాహిత్యము, సంప్రదాయ తత్పరత దర్శనీయములు. తన యింటికి విచ్చేసిన కృష్ణునకు పరమభక్తితో సపర్యచేసినాడు. ఆతనికి చక్కని విందుచేసినాడు. శ్రీకృష్ణుని కోరికపై కౌరవుల స్థితిగతులను, వారిచిత్తవృత్తులను తెలియజెప్పినాడు. మరునాడు కౌరవ సభకు పోవలదనికూడ హెచ్చరించినాడు.

కన్నడభారతమున శ్రీకృష్ణుని రాయబారమును గూర్చి విదురుడే దుర్యోధనునకు తెలుపును. తనయింటికి విచ్చేసిన కృష్ణుని చూచి విదురుడు భక్తితో మైమరచి నాట్యము చేయును. ఆకలితో నేనురాగా నీవు ఆతిథ్య మీయవేమని కృష్ణుడు హాస్యమాడెను. విదురునకు ఇది ఎదురుచూడని సంఘటన మగుటచే ఆతని యింట నేమియు నుండదు. ఆతడు కొద్దిపాలను మాత్రమిచ్చెను. భక్తితో నిచ్చిన పత్రమైన, పుష్పమైన, ఫలమైన, నీరైనను భగవంతుడు ప్రీతితో స్వీకరించుననుటకు ఇది చక్కని నిదర్శనము. పాలకడలిలో శయనించినవాడగు శ్రీమహావిష్ణువు విదురుని యింట పాలుత్రాగుటకు వచ్చియున్నాడని. అది దుర్యోధనునకు కడుపుమంట యైనది. 'మాయింట షడ్రసోపేత భోజనముగాదని దరిద్రుడగు విదురుని

యింటికి పోయితివిగదా!' అని సభలో ప్రవేశింపగనే దుర్యో
కృష్ణుని పరిహాసము చేసెను దానికి శ్రీకృష్ణుడు పరాభవము
నను విదురుడు కోపము నాపుకొనలేక తనవిల్లును విఱచి దు
నకు తనసహాయమును నిరాకరించెను విదురుడు యుద్ధము
వహింపక పోవుటకు కుమారవ్యాసుడు చక్కని సమర్థనము
యున్నాడు

## సంజయ

సంజయుడు సూత పుత్రుడైనను జ్ఞానియు, ధ
డునై ధృతరాష్ట్రుని అంతరాత్మ వలెనే రాయబారము నుండి
తప్పదారిన బోకుండ పలుమార్లు పదేశమును గావించెను.
చోట్ల కటువుగా నిందించెను. అప్రియమైనను యథార్థ్యమ
కెను ఇరుపక్షముల శ్రేయస్సును కోరినాడు అటులని విడి
ఆపదలో పాండవులకు సాయము చేసినవాడు కాడు రాజ
వాడు ధృతరాష్ట్రునకు అంతరంగిక కార్యదర్శి ద్రుపద పుర
రాయబారము తరువాత వ్యథిత హృదయులు, ఆగ్రహో
సమర సంరంభులునైన పాండవుల ఆగ్రహమును రాజ్యభా
గాక, ప్రియవాక్యములతో గల్లార్చుట దుర్ఘటము
మును సంధింపగలవాడు సంజయుడే యని కురుపతి గ్రహిం
రాయబారిగ పంపినాడు రాయబారమునకు ఎంపునప్పుడు
భాగమును గూర్చి మాటాడు స్వాతంత్ర్యమును ఇంజయున
ఊరకనే నుప్రియములు పలుకుమని సౌమ్య హా
పంపెను

సంజయుడు పాండవ సభయందు తనరాకను చక
ప్రాతము చెప్పుకొనెను. అనంతరము కౌరవపక్ష దోషములు
ఎంచి ధృతరాష్ట్రుని లోపములను చర్చకు రానీయక వా
వాదకము క్రింద కప్పిపుచ్చి క్రమముగా దర్మజుని యజాతి

మును, శాంతచిత్తతను, ధర్మప్రవీణతను ప్రశంసించి ముంగాళ్ళకు మెలకువగ బంధము వేసినాడు. శాంతినందుట భీష్మద్రోణులకును సంతోషమగునదేను సంజయుని ప్రాజ్ఞత, మాటనేర్పు అనుపమానములు కాని రాజ్యభాగమును గూర్చి ధర్మజుడు నిలదీసి యడుగుటతో పాపము సంజయునికెట్టి సమాధానము లేక పోయినది ఇంకొకరైన వెట్టిమొగము చేయవలసినదే! సంజయుడు చాల చతురముగ సమర్థింప శక్యముకాని ధృతరాష్ట్రుని వైఖరిని ప్రక్కకునెట్టి ధర్మజుని ధర్మవర్తనమును, శాంతతత్త్వమును ప్రశంసించి-

'పాలిక కౌరవులు దు
శ్శీలతఁ జెడఁదలఁచిరేనిఁ జెప్పెద రుధిరా
భీలాన్నంబున కంటెను
మేలగు భిక్షాన్నమైన మీకనఁ జనికిన్'[1]
అల్పులకు మ్రింగఁ జేదైన [illegible]
భంగి బొంగెడు కోపంబు మ్రింగికొనఁగ
నీఁగళువెన్న నిన్నన్నఁబోలు[2]

అని సమాధానపరుప ప్రయత్నించినాడు. చివరకు కృష్ణుడు తాను హస్తినకు వత్తునన తానువచ్చిన పనిగాకున్నను గనుకుందనమున తాను వచ్చినపని సఫలమైనదని పలికి హస్తినకు పయనమాయెను ధర్మజుడు ఆతనిసాగనంపుచు 'దుర్నయమును, బెట్టిదమును, బెంతును నగు పలుకొందువదు నీకు లుకకు నయోన్నత యొప్పుడున్' అని పలికిన వాక్యము సంజయుని వాక్చతురతకు నిదర్శనము.

సంజయుడు పాండవులయొద్దనుండి తిరిగివచ్చి ధృతరాష్ట్రుని బలహీనతను విప్పిచెప్పి 'నీ మతమొప్ప దెంతయున్' అని వెరగ మోటము లేక పలికినాడు ధర్మజుని తత్త్వము తెలిసికొని వచ్చినాడు గనుక సాదు రేగనేనిన్నాను తలపోలముగనగాని కలుపెదసుమిత్ర

1,2 తి భా ఉ ప, ప్ర అ, ప 8 9,888

అని, ధర్మసూతి మెత్తని పులి అని, ఎల్లవారలు సధర్మము నీవయి
చెప్పునంతకు స్వీయగుణముగా నడుం బిదప నీకును నాకు మరల్ప వచ్చునే
అనియు హెచ్చరించినాడు. కురుపాండవబలముల గూర్చి పర్యా
లోచన చేయు ధృతరాష్ట్రునకు నిష్పక్షపాతముగ-

'ఆసేనకు నీసేనకు
వాసి యెఱిగెదీవు నన్ను వసుదేవ సుతుం
డేసేనగలడు తత్సము
నీసేనం జూపుమా నరేశ్వర నాకున్'[1] అని నిలదీసినాడు

కన్నడ భారతమున సంజయుడు అంతమాట నేర్పరియు, ప్రాజ్ఞుడును
కాడు అసలు సంజయుని రాయబారిగ ధృతరాష్ట్రుడు పంపలేదు
దుర్యోధనుడే పంపెను అతడు ద్రుపద పురోహితునివలె నీతిమాటలు
అచటచెప్పి వారిమాటలను మరలివచ్చి వీరికి చెప్పెను ఇట్లు సంజ
యుని వైదగ్ధ్యము కన్నడభారతమున నీరసమైనది

## ఉత్తరకుమారుడు :

తనలోలేని గొప్పతనము నాపాదించుకొనుట మానవ
దౌర్బల్యము అందునను స్త్రీలయెదుట ఎక్కువగుట దాని స్వభా
వము గత్యంతరములేని పరిస్థితులలో, తన ప్రగల్భములను ప్రద
ర్శించు కొనవలసి వచ్చినప్పుడు ఇట్టివారు భయపడి పారిపోవుదురు
ఉత్తరకుమారు డట్టివాడు. అతడు ముద్దుగ పెరిగి స్త్రీజనము మధ్య
విరాజిల్లినాడు ఇంతకును ఉత్తరుడు అనుభవహీనుడే కాని అసమర్థుడు
మాత్రము కాదు ఈవిషయము నాతడు సారథిగ చూపిన ప్రావీణ్యమే
ప్రదర్శించుచున్నది మన దృష్టిలో ఉత్తరుడు మాటలలో మల్లుడు,
రాణివాసమున సాహసికుడు, పలాయన విద్యలో పండితుడు. ఇతని
పేరు 'భూమింజయుడు' యినను మనకు మాత్రము ఉత్తరకుమారునిగనే

---

1 తి భా, ఉ ప, ద్వి అ, ప 808

పరచితుడు. కౌరవసైన్యము కంటబడువరకు ఉత్తరుడు హాస్యవీరుడు. అప్పటినుండి సారథిత్వ మంగీకరించువరకు నాతనిమాటలు మనకుజాలి కలిగించును కన్నడభారతమున అంతఃపుర స్త్రీజనముకడ ఉత్తరుని ప్రోత్సాహపఱతురు. పొంగిపోయిన ఉత్తరుడు హస్తినాపురమునే జయింతునని ప్రగల్భములాడెను. అతికి కౌరవసైన్యము నతానెదిరింపదగ్గ వీరుడే కానరాదెన్యేను కృపాచార్యుడు, ద్రోణుడు, అశ్వత్థామ బ్రాహ్మణులైరి భీష్ముడు ముదుసలి. కర్ణుడు సూతకులుడు. తనవంటివీరు డెవ్వడును కౌరవపక్షమున లేడు. కౌరవులందురూ! వారు తమపరాక్రమమును అబలలపైననే ప్రదర్శింతురు. అందులకే యుద్ధమున నెదిరింప ధైర్యముచాలక దొంగచాటుగ గోవుల నపహరించుకొని పోవుచుండిరి తనకు ప్రస్తుతము సారథిలేడు. ఒక్కసారథి లభించిన కౌరవులజయించుట పెద్దపని కాదనెను బృహన్నల సారథిగ నుండునని తెలియగనే చేయునదిలేక యుద్ధమునకు సన్నద్ధుడాయెను. కవచముకూడ తొడుగుటరాని సారథియని తెలిసినను తన పిరికితనమును బయటపడనీయలేదు. కౌరవసైన్యము కంటబడగనే ప్రవేశించిన భయము క్షణక్షణప్రవర్ధమానమై బృహన్నలను బ్రతిమాలెను. లంచముపెట్టుటకు దిగి తుదకు విల్లమ్ములను రథముపై విడిచి దుమికి పారిపోవుటకు దారితీసినది

సహజముగ పాండవులపై నభిమానము కలవాడును, తన్ను అర్జునునితో పోల్చుకొనుటలో సంతృప్తిని పొందునట్టి వాడును అగు ఉత్తరుడు అర్జునుడే తనను సారథి కమ్మని కోరుచున్నాడని నిశ్చయముకాగానే మనము కలకదేఱినది చేతులుజోడించి సమ్మతింపగాడు. 'రిపుమర్దన! రథమెక్కుము. నీభుజశక్తి ప్రాపున సారథ్యత్వమున మహత్త్వము చూపెదను. నన్నువసిగొని కౌరవుల నెదిరింపుము గోవుల మరలింపుము.' అని తనకు తానుగా సారథిత్వమంగీకరించి అపూర్వ ధైర్యమును, అత్యంతోత్సాహమును ప్రదర్శించి

పేర్కొనెను 'శివ శివ బెసిరిపోయెను, హా తాశుడయ్యెను మూర్ఛ వొక్క నిమిషము[1] నన' అని కుమారవ్యాసుడు పేర్కొనెను ఆతని పోగసుయొక్క భీకర పరిణామమును స్పష్టముగ కనబడునట్లు కవులిరువురును వర్ణించిరి. కామవికారము వెనువెంటనే విజృంభించి మన్మథుని దశావస్థలలో నవమావస్థను చేర్చి విడిచెను ఇక మరణావస్థయొక్కటే మిగిలినది

కీచకుని మన్మథావస్థయొక్క తీవ్రతను గూర్చిన వర్ణనము పరిణామకారిగ నిరూపితమై మానవస్వభావ దోషమునందును అతనిని సహానుభూతికి అర్హునిగా చేసినది ఆతని అసహాయతను కవులిరువురును సమర్థముగ వ్యక్తపరిచిరి సంస్కృత భారతమున కీచకుని మన్మథావస్థ ఇట్టి యవస్థకు చేరికొనినట్లు లేదు ఆంధ్రభారతమున ద్రౌపదితోడి కీచకుని సంభాషణమున ఆతని పరిస్థితియొక్క దారుణ చిత్రణము దర్శనీయము

ఇంతి నీపై గక్కఁజూచుట కోడెద
గనుబాటు వోరయునోయని తలంచి
వదినిర్చినమాట మగువ నీపెంపున
గుదిసి నానాలుక తుదికిరాదు
వెలితి నీకరములు పట్టంగ నివిరి శం
కించి ఎడం కేదు నేలు సూరి
నెఱి నిట్టినని యింతి నీనెమ్మోం బొగ్న
భంగుల నరసిన బట్టువడదు

తే. చెలువ యింక నొకించుక సీఱ నీవ
నాకరింబున నెప్పటియట్ల యున్న
మన్మథుడు సమయించిన మగుడ నన్ను
బడయవచ్చునె యెన్ని యుపాయములను[2]

1 హర హర, హెవగిద హమ్మెసిదను ఖళ నొందు సిమిషదలి

2 తి భా, ఉ ప, ద్వి అ, ప 47

అంశములనే కన్నడ భారతమునను-

'తిరువాలిపచ్చ సద్గతులు నశింపనీ, కాలము చేరువవనీ, బంధువులు నిందించనీ, తనవారందరు తొలగనీ, రాణులు విడువనీ బాలా! నిన్ను వలచుచున్నాను కాముని బాణములు నన్ను మరల నీయుట లేదు లోలలోచనా! మారు మాటాడక నన్నంగీకరింపుము[1]' అని కీచకుఁడు దురపిల్లెను

ఆతరువాత సుదేష్ణను చేరి తిక్కన కీచకుడు దీనముగ 'నా వృద్ధిని కోరుదేని యువిదెవీవు నీవని నన్ను నిట్లు సంబద్ధము లైన వాక్యములు పల్కక కోమలిని వేవిలిపింపు'మని చరణపీఠమున జాగిలి మ్రొక్కెను కుమారవ్యాసుని కీచకుడు 'ఆమె లేనిదే జీవింపలేను' అని ఆర్త్తస్వరమున పల్కెను సింహము గొంతులో చిక్కిన లేడిపిల్లను రక్షింపుమని అక్కపాదములపై పడెను ఆరాత్రి విరహతాపాగ్ని తాపము సహింపలేని వాడయ్యెను బోనులో చిక్కిన పులివలె చిరచిరలాడ సాగెను

సుదేష్ణ కోరికపై చివరకు సైరంధ్రి కీచకునిల్లు చేరినది తిక్కనగారి కీచకుడు కరితురగ రథసమితి నిత్తునని, రుచిర మణిహారాదులంబుల నర్పింతునని, నా కులకాంతలనెల్ల నీకుపనిసేయ నియమింతునని, నేనెకనుసన్నల మెలగెదనని ప్రలోభ పెట్టి మాటాడెను కుమారవ్యాసుని కీచకునకు సైరంధ్రి సౌందర్య ప్రభావమును గూర్చిన ఆశ్చర్యమె యధికముగా నుండెను ఆమెను చూచుట తోడనే ఆతడు పులకితుడయ్యెను ఆమె క్రీగంటిచూపుల అపూర్వశక్తిని కీచకుని వలె అనుభవించి వర్ణింపగలవారెవ్వరు? ఆమెసృష్టి వే[illegible]పడినను

1 వేదస్మృతి హిందు హోగలి
కాలనపద్రె బరలి బంధుగ
ళేళిసలి తన్నవరు తొలగలి రాణియరు బిడలి
బాలె నినగా నొందె కామన
కోలు ఓన్నను మరళీయవు
లోలలోచనె విరుహ నుడియదె తన్ననుపొందు

నెత్తురుకారని కత్తిఅంచు ఆమెమూపు అనెడు పేనినత్రాటితో కొట్టి
నను దేహమున బొబ్బలెక్కవు ఆమె ఓరమూపనెడు నిప్పుతగిలిన
పొగమూకని హృదయమున మంటలు లేచును అని పరమ పతివ్రత
యగు ద్రౌపదియొక్క రోషభీషణమగు దృష్టి కీచకునకు వేరొక
దృష్టిగ కనబడినట్లు కుమారవ్యాసుడు అత్యద్భుతముగ వర్ణించెను

తాపమున కోర్వలేని కీచకుడు సైరంధ్రిని పయిబడి పట్టు
కొనగోర ఆమె అతని క్రింద పడద్రోసినట్లు సంస్కృత భారతమున
కలదు. అది కీచకుని ప్రఖ్యాత సామర్థ్యమును కుంటుపఱుచుచున్నది.
కావున అనువాదకవులిరువురును విదల్చుకొని పరుగిడినట్లు పేర్కొను
టెంతయు యుక్తము

పరాక్రమవంతుడగు కీచకుడు మరుదినమున ద్రౌపదిని
చేరి పలుకరించుటకు బెదరెను తిక్కన కీచకుడు తెచ్చిపెట్టుకొన్న
గాంభీర్యముతో తన అధికారము దర్పము బయల్పడ నామె యను
గ్రహము నర్థించెను. కన్నడభారతమున వెనుకడుగేయక బాణ
ప్రయోగము చేయుచున్న మన్మథుని బాణములనుండి నన్ను
కాపాడు. నీచరణదాసుడ నగుదునని ఆ మూర్ఖుడామె కంజలి ఘటించి
వేడుకొనెను.

నాట్యశాలకు పోవుటకు ముందరి అలంకార వర్ణనమును
రాని కవులిరువురును సొగసుగ వర్ణించిరి. తిక్కన కీచకుని విరహ
మును అధికముగ చేకొనెను. కీచకుడు సింహమున్న గుహలో
ప్రవేశించు మాతంగమువలె భీముడున్న నాట్యాగారము ప్రవేశిం
చెను తన సౌందర్యమును ప్రశంసించుకొను కీచకుడు అంగనాజన
ములు నన్ను చూచి మరుసాయకములు తమ చిత్తము లేపగ విశిష్టధనం
బులు నాకు లంచములిత్తురని నీవొక్కతెవే నన్ను నేలకుంటివని స్వార
స్యముగ పలుకును ఈ కానిమాటలు మగసైరంధ్రితోడనని పాపము
కీచకు డెరుంగడు. నాయొడలు సేర్చినప్పుడ నీయొడలెట్లగునో దాని

నీ వెరిఁగెదవని, నన్ను ముట్టి నీవు వెండియు వనితలసంగతికిఁ బోవుదువా?
అని పల్కిన భీమునిపల్కులు కామాతురుడగు కీచకున కనుమానము
గల్గింపవయ్యెను.

గంధర్వుడను తలంపు గలుగగనే కోపాటోప దీప్తాంగు
డయ్యెను తన యగపాటు వారెరుగుదురని కీచకుడు, సమయ భంగ
మగుటకు భయపడి భీముడు నిగూఢ విమర్దన ప్రహారముల నుల్ల
యుద్ధనైపుణ్యము మెఱయ పోరాడిరి. దేశీయమైన మల్లయుద్ధరీతిని
తిక్కన, కుమారవ్యాసు లిరువురును చక్కగ వర్ణించిరి సుదీర్ఘ సమ
రానంతరము వాయుపుత్రుని బలము పెరుగ సాగినది కీచకాధముని
బలము తరుగ జొచ్చినది. అంతట భీముడు పల్లవ ప్రసూన ఫలభరిత
మగు మ్రానును కూలద్రోయు మత్తగజము వలె వివిధ రత్న భూషణ
భూషితుడగు సూతుని కూల్చెను. భీమునకు కోపము చల్లారలేదు
కీచకుని వికృతపుచావు చంపవలెనని మనసయ్యెను అంతట తల,
చేతులు, కాళ్ళు దేహములోనికి జొనిపి కీచకుని ఒక చక్కని ముద్దగ
చేసివైచెను.

ఇట కీచకుని పాత్రమున దురంత ప్రతాపము కలవాఁ
డయ్యును కామాతురుడగు నరుడు తన నాశనముకోరి తెచ్చుకొన్న
వాడగునని తిక్కన కుమారవ్యాసు లిరువురును నిపుణముగ కావ్యో
చితముగ చేర్కొనిరి. విరాటపర్వ ప్రబంధమునకు ప్రతినాయక
లక్షణములను కీచకునియందు తిక్కన, కుమారవ్యాసులు సమర్థముగ
నిర్వహించిరి

### శ్రీకృష్ణుడు

మహాభారతములోని శ్రీకృష్ణుడు మానవాతీత మహిమలు
కల మహానాయకుడు అసామాన్యుడగు అతని కృత్యముల చేతనే
జీవితకాలముననే భగవానునిగ ప్రఖ్యాతుడైనాడు దివ్యమానవ
వ్యక్తిత్వసంపన్నుడు కారణపురుషుడు జన్మాంతరములను, కర్మ
సిద్ధాంతమును ప్రతిపాదించు భారతీయ ధార్మిక విచారములకు అతని

యవతారము సూచకమగును శ్రీకృష్ణుడు సకల చరాచర లోకము యొక్క సృష్టి స్థితి లయములకు కారణభూతుడగు పరమాత్మయని ఆతని విశ్వరూప సందర్శనము వలన తెలియుచున్నది అందుచేతనే అనేక సంఘర్షణములందు జయము ధర్మమున్నచోట నుండుననియు, ధర్మమున్నచోట కృష్ణుడుండుననియు, కృష్ణుడున్నచోట జయము కలిగి తీరుననియు తెలిపెడిభావములు కృష్ణుడు పరమాత్మ స్వరూపుడని నిరూపించుచున్నవి ప్రతినాయకుడగు దుర్యోధనుడును దైవము ప్రేరేపించినట్లే తాను చేయుదునని చెప్పియున్నాడు. సర్వకర్తృత్వ, సర్వభోక్తృత్వ, సర్వశక్తిమత్వములు శ్రీకృష్ణుని యందున్న విషయమును మహాభారత కారులందరును అంగీకరించిన విషయము

కుమారవ్యాసుడు శ్రీకృష్ణుని యవతార స్వరూపమును, లీలావిహారమును భక్తితో పలు విధముల వర్ణించెను. వివిధపాత్రముల మూలమునను ఆతని మహిమలను వర్ణించెను 'కావ నాతను, కొలువ నాతను, సావె నాతన కైయబాయలి' అని దుర్యోధనుడు శ్రీకృష్ణుని సమస్త ప్రపంచముయొక్క బాగోగులను చూచు లీలామానుష విగ్రహునిగ వర్ణించినాడు బలరాముడును 'నళిననాభను సర్వగత సహను, సర్వజ్ఞను' అనిపొగడి యున్నాడు భీష్మద్రోణాదుల మరణమునకు కృష్ణుడే కారణము. ధర్మసంస్థాపనార్థము యుగయుగముల జన్మింతునని గీతలో చెప్పినట్లుగ అధర్మపరులను సంహరించుటకు ఆతని జీవితమున అధికభాగము వ్యయమయినది దేవదేవుడైన శ్రీకృష్ణుని యందు మానవస్వభావమును కుమారవ్యాసుడు చక్కగా నిరూపించినాడు

మహాత్ములకు స్వార్థముండదు రాజకీయములలో వారు చక్రమును త్రిప్పుదురే కాని సింహాసనమును కోరరు వారి రాజకీయములకు కారణము, ఫలితముగూడ లోకకల్యాణమే యగును వారొకవేళ నీతితో రాజనీతిని మేళవించినను అదిమహోన్నత ఆదర్శసాధ

నకేగాని సంకుచిత స్వార్థప్రయోజనములకు గాదు. మానవులుగ జన్మించిరి గనుక వారి మధ్య మానవులుగనే వారు వ్యవహరింతురు కాన్న విశిష్ట మానవులుగ వ్యవహరింతురు కారణజన్ములు గనుక తమసంకల్ప సఫలతకు అప్పుడప్పుడు మానవాతీత శక్తులను ప్రయోగింతురు ఇది శ్రీకృష్ణుని విషయమున నూటికి నూరుపాళ్ళు యథార్థము శ్రీకృష్ణుడు మహాభారతమున నిర్వహించిన ప్రముఖపాత్ర, ప్రదర్శించిన మహనీయ వ్యక్తిత్వము, ప్రయోగించిన చతుర రాజనీతి పూర్తిగ వ్యక్తగత మగునది సంధి సందర్భమున, యుద్ధసమయమున శ్రీకృష్ణుని యభీష్టము సంధియా? సమరమా? ఇది తర్క-వితర్కములకు గురియైన పెద్దప్రశ్న. రాయబారమునకు వచ్చిన సంజయునితో 'వారికి జోటు మేలు నాకుం జూపకన్' అని పలికెను సంధిచేయుమని ప్రార్థించిన ధర్మజుని యుద్ధోన్ముఖుని చేయుటకు ప్రయత్నించెను. సంధికంగీకరించిన భీముని రెచ్చగొట్టెను. ద్రౌపదిని యుద్ధమవశ్యమని ఊరడించును. అటులనే మరియొక ప్రశ్న కురు పాండవ సంధిప్రయత్నమునకు కృష్ణుడేల పోయెను? దానికి సమాధానముగ కృష్ణుడు-

'చుట్టములలోన నొప్పమి పుట్టినప్డు
నడ్డపడి వారితోఁ గొట్లాడియైన
దానియుడుపంగఁ జూడకున్న వాని గ్రూర
కర్ముఁడని చెప్పుదురు కర్మకాండ విదులు[1]' అని

విదురునితో పలుకుచు దుర్యోధనుడు నామాట వినకయ్యెనేనియు మేలుకోరి యున్నమాట చెప్పకున్న నన్నదమ్ములు దమలోనం బోర కృష్ణుండు వారింపక యుపేక్షించె, దనచేతఁ జక్కంబడదా? యని యజ్ఞులైన జనులాడుదురు అనిపలుకును

పరేంగితజ్ఞత, వాక్చతురత ఈరెండును రాజనీతికి రెండు రెక్కలవంటివి లక్ష్యసాధనయే దాని హృదయము శ్రీకృష్ణుడు

---

1 తి భా, వి ప, తృ ఆ ప 242

సంధి సందర్భములలో, సమర సన్నివేశములలో ప్రదర్శించిన పరేంగి తజ్ఞత, వాక్చాతురత అనుపమములు తనకిష్టమైన పనిచేయుటకై నను ప్రార్థింపచేసికొనుట రాజనీతి లక్షణము దుర్యోధనార్జునులు తనసాయమర్థింపగోరి వచ్చినప్పుడు వారి మనస్తత్వములను కనిపెట్టి చతురముగా మాటాడి చివరకిద్దరిని తృప్తిపఱచి తానుమాత్రము పాండవ పక్షమునకు చేరినపద్ధతి శ్రీకృష్ణుని రాజనీతికి మకుటాయమానమైనది సంజయుని రాయబారము తరువాత తాను హస్తినకేగ దలచియు ధర్మజునిచే పలువిధముల ప్రార్థింప చేసికొనిగాని రాయబారమునకు బయలుదేరడు మరల అపటను ధర్మజునకు సంధిగావింతు నని తెల్పినాడు సంధికంగీకరించిన భీముని రెచ్చగొట్టినాడు. యుద్ధమే జరిగి తీరునని ద్రౌపదికి మాట యిచ్చినాడు. సకలనాటక సూత్రధారి వలెనే ప్రవర్తించి తనకార్య సాఫల్యము గావించుకొనినాడు.

కుమారవ్యాసుని కృష్ణుడు కొంతహాస్యమును కలగలిపెను. సంధికోరు పాండవుల యుద్దేశములు భిన్నముగానుండుట గాంచి మీరు తలకొకమాట చెప్పిన సంధికార్యమున కెగుబెట్లు? అనును భీముడు సంధి కంగీకరింపగ కుంతి యింతభీరువులనుగన్న దేమందువ్యా? అని మేలమాడును.

కుమారవ్యాసుని భారతమున విదురునితో కృష్ణుని ప్రవర్తనము నిరూపమానము తాను భక్తునకు దాసుడనని పలికిన మాటలకు ఆచరణము విదురునింటికి విందుకేగుట. షడ్రసోపేతము లగు పదార్థములను విడిచి గుక్కెడు పాలకొరకు విదురునింటికి వెళ్ళిన శ్రీకృష్ణుడు సంపద ప్రధానము కాదనియు, సద్భక్తి ప్రధాన మనియు నిరూపించినాడు. విదురుడు విందుగావింపలేదు సరిగదా! కృష్ణునికి అతిథిమర్యాది నైనను గావింపలేదు. పరమానందముతో చిందులు వేసెను కృష్ణుడుకోరి ఆతిథ్యము స్వీకరించినాడు.

కృష్ణుని సభాప్రవేశ సమయమున సభవారినివారెల్లరు లేచి నిలబడగ దుర్యోధనుడులేవడు అదిచూచి ఆతడు తనపాదములపై

పడునట్లు చేసికొని యేమియునెరుగని వానివలె సరసోక్తులాడుట కృష్ణుని నటనాచాతుర్యము. కృష్ణ, కర్ణ సంభాషణము కృష్ణుని రాజనీతి పరిజ్ఞానమునకు పరాకాష్ఠ. కర్ణుని మనస్సు కృష్ణునకు సువిదితము. అతడేవిధముగను కౌరవపక్షమును వీడడు. అది తెలిసియే పాండవపక్షమున చేరుమని, అట్లుచేరిన అతనిని ద్రౌపది యారవభర్తగా స్వీకరించుననని, పాండవులు పరిచర్యలు గావింతురని, సంపూర్ణ రాజ్యాధికారము లభించునని ఇట్లు పెక్కురీతుల కర్ణునిపై ఎనలేని యభిమానము నొలకబోయుచు అతని జన్మరహస్యమును వెల్లగించుట మూలమున కర్ణుని మనమును కల్లోలపరిచిపోయెను. అతని మాటపై వెనుకనే కుంతి కర్ణునిచేరి అతనిని పూర్తిగ నిర్వీర్యుని గావించినది ఇటులు శ్రీకృష్ణుడు తన లక్ష్యమైన ధర్మసంస్థాపనమునకు ఎవరినేవిధముగా నుపయోగించుకొనవలయునో వారినావిధముగా నుపయోగించుకొని తానుమాత్రము తామరాకుపై నీటిబొట్టువలె ఏ సమస్యతోను సంబంధము పెట్టుకొనక, అట్లని సంబంధములేదని మిన్నకుండక ఆశ్రితరక్షణము, దుష్టశిక్షణము గావించి తనసర్వేశ్వరత్వము నిలుపుకొనినాడు.

## ద్రౌపది :

మహాభారతమునందలి వీరమణులలో ద్రౌపది శ్రేష్ఠురాలు, ఆమె స్వాభిమానము, కష్టసహిష్ణుత, కర్తవ్యనిష్ఠ, ప్రతీకారవాంఛ అపూర్వమైనవి ఆమె పగబట్టిన ఆడుత్రాచువంటిది హృదయదౌర్బల్యము అర్జునునిలోను, భీమునిలోను ఎప్పుడైన కనబడవచ్చునేమో గాని ఆమె మాటలయందుగాని, చేతలయందుగాని మచ్చునకైన కనబడదు అయిదుగురు భర్తల యందును సమానమైన అనురాగమును చూపి ఆదర్శగృహిణిగ కీర్తిగాంచినది ఆమె అందము పరిచారిక వేషమున నున్నను విరాటనగర ప్రజలనాకర్షించినది సుదేష్ణ

గూడ ఆమె సౌందర్యము ఆడువారినే యాకర్షించునట్టి దన్నది విరా
టుడును ఆమె సౌందర్యాతిశయమును పేర్కొనినాడు కుమార
వ్యాసుడు 'మన్మథ విరించను సృజించెను' 'త్రైలోక్య మోహన
మంత్రవశ్యన్' 'లలనాయర సీమంతమణి' అని ద్రౌపదిని వర్ణించి
యున్నాడు ద్రౌపదీ సౌందర్యమే సైంధవుని అవమానము పాలు
చేసినది సింహబలుని ప్రాణములనే బలిగొన్నది ఈసౌందర్యమునకు
తోడు అటు పుట్టింటి గౌరవము, ఇటు అత్తింటి ఆధిక్యము ఆమెకు
పెట్టని సొమ్ములు ఆమె పాంచాల సార్వభౌముని పుత్రిక, అతిరథు
డైన ధృష్టద్యుమ్నునికి సోదరి, పాండుభూవరునికోడలు, జగద్వంద్యు
లైన పాండవుల ధర్మపత్ని, నీతి విక్రమస్థిరులగు ఉపపాండవులకు
జనని వీనికితోడు ఉదాత్త గంభీర వ్యక్తిత్వము, ఆత్మాభిమానము
ఆమెకలంకారములు

ద్రౌపది అసమాన ధైర్యస్థైర్యములను వాక్చాతుర్య
మును ప్రదర్శించిన ఘట్టము కీచకవధ. కీచకుని పొగడ్తలకు, ప్రలోభ
ములకు, ఆత్మస్తుతికిని లొంగక నిరుపమాన ధైర్యముతో తన్ను
పంచగంధర్వ పతులు కాపాడుచుందురని హెచ్చరించినది సుదేష్ణ
బలవంతముచే మద్యపాత్రను తీసికొని కీచకునియింటికి బయలుదేరినది
తన్ను పట్టుకొనగోరు కీచకుని తప్పించుకొనుటకై ఆమెయట చెంగు
ఆతని చేతచిక్కినది. అంతట ఆమె ఆతనిని పురుగునువిదిల్చినట్లువిదిల్చి
నది. పురవీధులబడి రాజసభకు రక్షణార్థము పరుగిడినది. ప్రతీకారము
చేయప్రయత్నింపని పతులను కోపముతో నిరసించి విరాటుని
ప్రార్థించినది. 'అపారనయ విక్రమ సంపన్నులైన అయిదుగురు
గంధర్వపతులున్న తనకే ఇట్టిగతిపట్టె, ఏయాడుది పరిభవంబును
బొందక బ్రదుకున'ని నిలదీసి యడిగినది. ధర్మజుడు అజ్ఞాతవాస
సమయభంగ భయముతో సభలోనాట్యకత్తెవలె ప్రవర్తింపవలదని
వారింపజూడ ఆతడు నోరెత్తుటకు వీలులేకుండగ, నర్మగర్భముగ

నొత్తిపాడిచినది తనపతి నటుడని, పెద్దవారియట్ల చిన్నవారికి
అందుచే తాను నర్తకినని, అంతియేగాక తనపతి జూదగాడు నని
నాపరిభార్య కిట్టి యవమానములు తప్పవని ధర్మజుని గుండెలు
గ్రుచ్చుకొనునట్లు మాటాడినది

కీచకుని శవమును చూచనిదే ద్రౌపదిమనసు చల్లబడద
ధర్మజునందుల కంగీకరింపడు భీముడేయందులకు తగినవాడు ధర్మ
జుని కాదని ఆతనిరెచ్చగొట్టవలెను అర్ధరాత్రిసమయమున వంట
యింటికిపోయి లత వృక్షము నాలింగనము చేసికొనినట్లు భీము
కౌగలించుకొని మేల్కొల్పినది సింహమును లేపు సింహావలెనున్న
తిక్కన ద్రౌపది మందమంద భాషణములతో సుకుమార పాణిస్పర్శ
లతో భీముని మేల్కొల్పినది. ఆమె మాటలలో తన కష్టమున
గూర్చిన దుఃఖము వెల్లుబికినది. కుమారవ్యాసుని భీముడు మిగిలి
వారితో చెప్పికొనునన 'రమణా! విను, మిగిలినవారు నన్ను రమించు
వారు' అనిపలుకుట అసమంజసమేమైనను తన కర్తవ్యమునకు వీరా
మైనది ఆమె కోపముపట్టజాలక ముల్లోకములను జయింపగల వీరులై
యుండి ఒక్క స్త్రీని రక్షింపలేక పోవుచున్నారు మీరు పురు
షులా? నపుంసకులా? అని ప్రశ్నించెను నీరు మూడుమార్లు కేల్చునని
తనకు దుర్యోధనుని సభలోను, జయద్రథుని వలనను, కీచకుని వల
నను మూడు అవమానములు జరిగినవనియు, ఇకతనకు మరణమే
శరణమనియు పలుకుట కుమారవ్యాసుని లోకజ్ఞతను చాటుచున్నది
ఇచట తిక్కన ద్రౌపది కీచకుని సంహరింపకున్న నీవుగనుగొన నురి
నైన, నీటనైన, నగ్నినైన, విషంబునైన మరణింతునని పల్కినది
తుదకు భీమనిచే రేపాతడు నాచేతపడక తప్పదని పలికించుకొన్నది
నిష్ఠురగిలించి భీమునిచే కీచకుని సంహరింప జేసినది. ఆతని శవమును
గూచి ముక్కుపై వేళ్లు వేసికొని "దీనికై యింతచేసితే ? కీచకా
ఇంక సుఖత్వము బొందుము"ని తన అంతరంగమును శాంతింప చేసి

కొనప్రయత్నించి ది కావలివారిని పిలిచి చెప్పువరకు ఆమెకుశాంతి లేకయ్యెను ఇంతెనను అప్పుడుగాని ఉపకీచకుల వధకు కారణముండదు గదా !

ద్రౌపదికృష్ణభక్తి, ద్రౌపదీకృష్ణుల సౌదర్యము మనోజ్ఞమైనది భక్తియే పరమార్థముగా గల కుంభకారవ్యాసుడు ద్రౌపదియొక్క కృష్ణ భక్తిని మరింత రసభరితముగ చిత్రించినాడు .

కష్టకాలము గడిచినట్లనిపించినది శత్రుసంహారమునకు కాలమాసన్న మాయెనని ద్రౌపది ఆశించినది దుర్యోధనుని అసహానము, కర్ణుని ప్రేరణ కలిసి దుశ్శాసనుని క్రౌర్యము రూపమున ద్రౌపదిని దారుణముగ నవమానించినది స్త్రీకి తనజీవితమున జరగకూడని ఘోరావమానములను జరిపించినవి కావుననే ప్రతీకారవాంఛాపూరితమైన ఆమె హృదయమునకు సంధిప్రయత్నము అశనిపాతమైనది. అది ఆమె చెవుల చొరరానివిషయము కాని పతిదేవులు సంధికావలెనని కోరుచుండిరి సంధి సంధాతగ శ్రీకృష్ణుడు హస్తినకు బయలుదేరినాడు

శ్రీకృష్ణుడు ద్రౌపది అభిప్రాయము తెలిసికొనగోరెను. అపుడామె ప్రదర్శించిన వాక్చాతురి, నిర్వాహకత్వము అనుపమానములు నీవు సుభద్రకంటె కడునెయ్యము, గౌరవముతో ననుసంభావన చేయుదువు, అట్టి నన్ను రాజసూయావభృథంబునందు పవిత్రమైపెనుపొందిన వేణిబట్టి ఈయేవురు చూడగా ఒకడు సభకీడ్చెను. ఎవరైన కులాంగన నిట్లొనర్తురా? అని నిలదీసి ఇట్టి పరాభవము సుభద్రకు జరిగిన తగుదునని సంధిప్రయత్నము గావింతువా? అను భావము తనమాటలలో ధ్వనింప చేసినది. కౌరవసభలో సంధిమాటల సమయమున దుశ్శాసనుడు పట్టి యీడ్వగా సగము ద్రెవ్వి తక్కిన ఈ కురులను స్మరింపుమనుట, పతులకు వ్యతిరేకము కాకుండగ సంధిని తిరస్కరించుచు పలికిన పలుకులు ద్రౌపది వాక్చాతురికి మణి దర్పణములు

కుమారవ్యాసుని భారతమునందు సంధికంగీకరించిన భీముని యందు పౌరుషము రేకెత్తించుటకు ద్రౌపదియే సమర్థురాలైనది. అంతియేగాక ఆమె మరొకఅడుగు ముందుకువైచి సంధికంగీకరించి నాభర్తలే నాకు శత్రువులైరని కృష్ణునియెదుట గొల్లుమన్నది అంతతో ఆగక పాండవులు సంధి కంగీకరించినను తాను తన పుట్టింటి వారి సహాయమున తనపగ తీర్చికొందునని పెగించి పలికినది ఇట్లు తిక్కన ద్రౌపదిలోనున్న వాక్చాతురి కుమారవ్యాసుని ద్రౌపదిలో నున్నను ఆమె నిర్వాహకత్వము ఈమెలో కనబడదు. ఆమెఓర్పును ఈమెలో కొన్నిచోట్ల లోపించుట దర్శనీయము

## సుదేష్ణ

సుదేష్ణ విరాటుని ధర్మపత్ని. కీచకుని సోదరి సైరంధ్రి సౌందర్యమున కప్రతిభురాలై విరాటుడామెను మోహించునేమో యని భయపడినది. ఆపని కీచకుడు చేయగ 'నీచపుపనికి తన్ను వినియోగింపరాదని' సైరంధ్రి ముందుగనే నియమమేర్పరచుకొన్నను పరిక్రకునెట్టి నేర్పుగ కీచకునింటికి పంపినది సుదేష్ణ కీచకుని వారింపక పోలేదు చాలదూరము చెప్పిచూచినది వంశనాశనమగునని భీతిల్లినది కోరిన వనితనిచ్చి పెండ్లి చేయుదునని సైరంధ్రి జోలికి పోవలదని బ్రతిమిలాడినది. తమ్మునిపైగల ప్రేమను, అతని క్షేమముకొరకు ఆమెపడు తాపత్రయమును ఇరువురు కవులును సుందరముగ తీర్చి దిద్దిరి

కీచకు డెంతటి బలవంతుడో అంతటి మూర్ఖుడు దానికి తోడు దురభిమాని, దుష్టుడు అతని మాటకు, చేతకు విరటుని రాజ్యమున నెదురులేదు సైరంధ్రిపై చేయివేసి కీచకుడు బ్రతుకడని సుదేష్ణకు తెలియును. సైరంధ్రిని తానుపంపకున్న విరహముచేత నైనను అతడు మరణించునని యామె గ్రహించినది. మూలభూతమున కీచకునింటికిపోయి మదిరతెమ్మని సుదేష్ణ సాధికారముతో

నాజ్ఞాపించినది. తరువాత, కుమారస్వామిని బిరుదురను బుజ్జగించి, కపటపు మాటలతో పంపినట్లు మూర్ఛట చాలసముచితము

కీచకునిచే తన్నబడి, రాజసభలో తిరస్కరింపబడిన సైరంధ్రిని సుదేష్ణ ఏమియు నెరుగని దానివలె పరామర్శించినది. ఎవ్వరే కారణమున నీకు కీడొనర్చుటకు సాహసించిరి? వారిని చంపుదును. భంగపరుతును. కష్టముల పాల్సేయుదును. అనిచిత్తశుద్ధిలేని మాటలు పల్కెను కీచకుడును, ఉపకీచకులును మరణింపగనే తన్ను కొలువ వచ్చిన సైరంధ్రినిచూచి భయశోకములు పెనగొన వినయపూర్వకముగ, విరాటుని మాటల ప్రోద్బలమున 'నీవు చక్కనిదానవు మగవారు ధైర్యరహిత చిత్తులు కావున రాజు నిన్ను నీవలచు నెడకు ప్రార్థించి పంపుమనినాడు ' అనిపలికినది. అంతియేగాక స్త్రీసహజమగు చేలబుద్ధితో బిరుదుమగలు కలరని వరుసగ జంపించితివి. జనులు నిన్ను గూర్చుటకు భీతిల్లుచున్నారు మాపట్టణమును, రాజ్యమును వదలి ఎచటికైనను పొమ్ము అని కడుపులోని బాధను వెళ్ళగ్రక్కినది. ఇంక పదుమూడు దినములు తనకాశ్రయ మిమ్మని ప్రార్థించిన సైరంధ్రిని కాదనుసాహసము సుదేష్ణకు లేకపోయినది.

మహాభారతమున సుదేష్ణపాత్ర చాలచిన్నది కానిబంగారముతో చేరిన రాగి కూడ విలువకల దగునట్లు సైరంధ్రిగ ద్రౌపది యామె యింట చేరుటతో సుదేష్ణపాత్రము పాఠకులదృష్టి నాకర్షించినది.

## పాత్రచిత్రణము - తులనాత్మక పరిశీలనము :

మానవుడు స్వార్థముతో తన సుఖమును మాత్రమే కోరుకొనును ఒక్కొక్క మానవుని స్వభావము ఒక్కొక్క రీతిగ నుండును. వైవిధ్యము మానవ స్వభావలక్షణము. మానవుని స్వభావము స్వార్థపరమైనను అతని ప్రగతి సంఘము పైననే ఆధారపడి యుండును. ప్రతిమానవుడును తన సంపదను, సౌఖ్యమును, కష్ట

ముదు దుఃఖమును ప్రకృతిలోని పంచభూతములను పొరుగువానితో పంచుకొనగోరును. అందులకే పంపకము మానవజీవితమున విశిష్టమైన భాగమై పోయినది. స్వార్థము బలవత్తరమగుచో పంపకము విషమ సమస్యయగును. పరార్థము ప్రాధాన్యము వహించిన పంపకము సామరస్యముగ సాగిపోవును. మానవస్వభావమును క్రమబద్ధము చేయుట కుద్దేశింపబడినదే ధర్మము. కవి క్రాంతదర్శియై మానవ స్వభావమును, సంఘర్షణలను చక్కగ తన కావ్యమున చిత్రించి ధర్మసూత్రమును మానవాళికి సూచించును

మహాత్ముడగు వ్యాసుడు వేదవాఙ్మయమును తొలుత వ్యవస్థీకరించి తరువాత పురాణశాస్త్ర వాఙ్మయములను నిర్మించెను. ద్వాపరమునాటికి వానిని జీర్ణించుకొనగల శక్తి జనులకు లోపించుటచే కావ్యపద్ధతిని ధర్మబోధచేయవలసి వచ్చినది. ఆ కారణముననే మహాభారత కావ్యసృష్టి జరిగినది. శ్రీకృష్ణుడు నిర్వహించిన ధర్మసంస్థాపన కార్యక్రమమునే వేదవ్యాసుడు సాహితీ ముఖమున నెరవేర్చినాడు.

అనన్యాదృశమైన కవితాశక్తిని ప్రదర్శించిన తిక్కనా కుమారవ్యాసులు పాత్రసృష్టి యందును సూక్ష్మోన్నతమైన కళను ప్రదర్శించిరి. ఇరువురును వ్యాసభారతమునందలి పాత్రములనే చాలా వరకు చిత్రీకరించినవారైనను ఏపాత్రమును యథాతథముగను, మూలపాత్రచ్ఛాయా మాత్రముగను స్వీకరింపలేదు. తిక్కన ప్రధాన కథలో పాత్రల శీలస్వభావ నిరూపణములో, తత్త్వోపదేశములో ప్రత్యేకములైన మార్పులేవియు చేయకుండ వ్యాసహృదయమును సరసముగ సమగ్రముగ ప్రతిఫలించునట్లు శ్రద్ధతీసికొనెను. కవిత్రయము వారి ఈ శ్రద్ధ కారణముననే దేశభాషలలో వెలసిన భారతములన్నిటికంటె తెలుగు భారతము భిన్నమైనది

కుమారవ్యాసుడు భాగవత పరంపరలోనుండి వచ్చినవాడగుటచే ఇందలి చిన్న పెద్ద పాత్రలపై భక్తిప్రభావము కనబడు

చుండును. తిక్కన భారతమున ధర్మజాదులు కృష్ణుని తమబంధువుగ తమ మేలుకోరువానిగ భావించినట్లుండ కుమారవ్యాస భారతమున పాండవులు బాల్యమునుండియు కృష్ణభక్తులైనట్లుగ చెప్పబడినది. పాండవుల కృష్ణభక్తికి ప్రధానముగ విరాటపర్వమునందలి ధర్మరాజు దూతల ద్వారా పంపిన అభిమన్యు వివాహనిశ్చయలేఖ పేర్కొనదగి నది. 'వివాహమనునది నెపము నిజశ్రీపదమును దర్శించుభాగ్యమును ప్రసాదింపవలసినది'గ ప్రార్థించును.

తిక్కన దుర్యోధనుడు కృష్ణునిగూర్చి "అతడు పూజనీయుడగు నేనెఱుంగుదున"ని మాత్రము పేర్కొనియుండ కుమారవ్యాసుడు విశ్వరూప దర్శనానంతరము కృష్ణుడే సంసారనాటక సూత్రధారియని గుర్తించును. కర్ణుడును కృష్ణభక్తుడైనాడు. కుమారవ్యాసుని ఘటోత్కచుడును కృష్ణభక్తుడు.

పుత్రమమకారము మానవ సహజలక్షణము. కావుననే తప్పు చేసిన ఎదుటివారిని దండింపగలిగిన వీరు తమపుత్రుల విషయమున అశ్రద్ధవహింతురు. ఈ అశ్రద్ధయే తుదకు సంఘనాశనమునకు, సర్వనాశనమునకు కారణమగుచుండును. ఇట్టి మమకారముయొక్క ఫలితము ధృతరాష్ట్రునిలో ప్రదర్శింపబడినది. తెలుగు భారతములో కంటెను కన్నడ భారతమున ధృతరాష్ట్రుడు మరింత అసమర్థుడుగ చిత్రింపబడినాడు.

అసూయ నిప్పు వంటిది. క్రోధము దానికి తోడగు గాలి వంటిది. ఈ దుష్టమిత్రులు కలిసినచో అహంకారము పెరుగును. అసూయాగ్రస్తునకు తనకు లేదను బాధకంటె ఎదుటివారి కున్నదను బాధ యధికము. ఈ అసూయకు ఫలము ఆత్మనాశము. అహంకార కారకములైన అసూయాక్రోధములు ఎంతటి ఘోరపరిణామమునకు దారితీయింపునో దుర్యోధనుని పాత్రలో చిత్రింపబడినది. కుమారవ్యాసుడు కృష్ణభక్తుడైనను దుర్యోధనునిచే కృష్ణనిందను గావించుట అతని పాత్రనిష్ఠను వ్యక్తము చేయుచున్నది.

కర్ణుని పాత్రము తాత్త్వికముకంటె నధికముగ మనోవైజ్ఞానికము. త్రోసివేయబడిన యొక్క తెలుగు వైపున కేవలక రాజదు అసాధారణ శక్తిసామర్థ్యములు కలవాడైనను కర్ణుడు సూతపుత్రునిగ సమాజముచే చిన్నచూపు చూడబడినాడు. స్వసామర్థ్యముచేతనే అతడు అంగరాజ్యమును, రారాజు అర్ధాసనమును సాధించుకొనెను. కుమారవ్యాసుని కర్ణపాత్ర చిత్రణమున పంప ప్రభావము కనబడుచున్నది. కర్ణుడు స్వామిభక్తుడగుటచే పాత్రౌశీల్యమునకు కొంతచేటు కలిగినను అతని అంతర్మథనము, ధర్మసంకటము కుమారవ్యాసునిలో ఎక్కువసూక్ష్మముగ చిత్రింపబడినది.

వంశక్షేమముకొరకు తుదివరకు ప్రయత్నించినను ప్రయోజనము కొరవడుటచే తానున్న పక్షము అధర్మపక్షమని తెలిసియు బ్రదుకుమీద విరక్తితో తనువుచాలించు వైరాగ్యభావ మనస్కునిగ భీష్ముని పాత్రము చిత్రింపబడినది.

తనపుత్రుని కోరికను తీర్చుటకొరకే ద్రోణుడు కురురాజ్యమున ప్రవేశించినాడు. ఆ అశ్వత్థామపైగల మమకారమే ద్రోణుని కౌరవపక్షమున నుంచినది. యుద్ధారంభమున ద్రోణాచార్యుడే తన నిస్సహాయస్థితిని ధర్మజునకు చెప్పికొని యున్నాడు.

'అర్థస్య పురుషో దాసో దాసస్త్వర్థో న కస్యచిత్
ఇతి సత్యం మహారాజ బద్ధోఽస్మ్యర్థేన కౌరవైః ।'

కావున ద్రోణుని పాత్రమున మనము పుత్రైషణ, ధనైషణ చూడగలము.

భీముని పాత్రము అత్యుత్తమమైనది. తెలుగు భారతమున భీమునకు తన పరాక్రమముతోపాటు చక్కగా మాటాడ గలవాడు. పరిస్థితుల నర్థము చేసికొన గలవాడు. కుమారవ్యాసుని భీముడు ఆవేశపరుడు నోటికివచ్చినట్లు మాటాడును. కావుననే వంటయింటిలో తన్ను నిద్రలేపిన ద్రౌపదిని 'రక్షించుటకు తానును రమించుటకు

వారునా?' అని ప్రశ్నించెను ఏమి మాటాడినను ద్రౌపదికి ఆతనిపై పట్టు ఎక్కువ కావుననే కృష్ణుని రాయబారపు సందర్భమున యుద్ధ విముఖుడగు భీముని తిక్కన కృష్ణుని మాటలు రెచ్చగొట్టగా కుమారవ్యాసుని ద్రౌపది మాటలే అందులకు సమర్థమైనవి

సమకాలీన సాహిత్యరంగము నందలి స్త్రీపాత్రములలో ద్రౌపది అగ్రస్థానము వహించినది. ద్రౌపదీ కృష్ణుల మధుర సంబంధము తిక్కన, కుమారవ్యాసు లిరువురును పేర్కొనిరి కాని భక్త కవియగు కుమారవ్యాసుని ద్రౌపది కృష్ణభక్తి హృదయ స్పర్శియైనది ఆంధ్రభారతమున కంటె కన్నడభారతమున 'కామినికి కరగు పేను కృష్ణుడు' 'కృష్ణునికి కరగుపలుకామిని' యథార్థమునకు కృష్ణుని చెల్లెలు సుభద్రకాని కృష్ణుని హృదయాంతరవర్తినియగు సోదరి ద్రౌపది మాత్రమే.

విరాటపర్వము నందలి ప్రముఖ పాత్రములలో కీచకు డొకడు ఆంధ్రభారతమున కీచక పాత్రమును దురంత పాత్రముగ చిత్రించుటలో శబ్దబ్రహ్మయగు తిక్కన సఫలీకృతుడైనాడు కుమారవ్యాసుని కీచకుడును ద్రౌపదీ సౌందర్యమను వలలో చిక్కి గిలగిల కొట్టుకొనినాడు అటులనే ద్రౌపదీ సౌందర్యమను సుడిగాలి కీచకుని మనోధైర్యమును నీరుగార్చినది

ఈవిధముగ తిక్కన, కుమారవ్యాసు లిరువురును భారత పాత్రములను చిత్రవిచిత్రములుగ, రసమయములుగ చిత్రించిరి మానవజీవితమును తరింపజేయు మార్గమును ప్రబోధించిరి. తిక్కన ధర్మాద్వైతరూపమును, కుమారవ్యాసుడు కృష్ణరూపాద్వైతరూపమునను అమృతసందేశమును లోకమున కందించిరి.



# షష్ఠాధ్యాయము - కవితాశిల్పము

పంచమాధ్యాయమున తిక్కన, కుమారవ్యాసు లిరువురును వ్యాసభారతము నందలి పాత్రములనే చిత్రీకరించిన వారైనను ఏ పాత్రమును యథాతథముగను, మూలపాత్రములకు ఛాయాపాత్రముగను స్వీకరించి యుండలేదని గ్రహించితిమి ఇరువురును తమ పాత్రములను చిత్రవిచిత్రములుగ, రసగుణములుగ చిత్రించిరి ఈ అధ్యాయమున అనువాదకవుల కవితాశిల్పమును పరిశీలింతము

## తిక్కన-కవితాశిల్పము :

### శైలి :

సాహిత్యపరముగా శైలిని రెండువిధములుగ పరిశీలింపవచ్చును. మొదటిది కథాకథన సరణి రెండవది పదగుంఫన సరణి మొదటిది వస్తువిన్యాసమునకు సంబంధించినది దీనిలో ఆఖ్యాన, నాటకీయ, వర్ణనాత్మకములను మూడు భేదములున్నవి. రెండవదానిలో బుద్ధిగమ్య, భావస్ఫోరక, కర్ణపేయములను మూడు భేదములున్నవి ఇందు తిక్కనశైలి నాటకీయము, బుద్ధిగమ్యము

విరాటోద్యోగ పర్వముల రచన వస్తుస్వభావమును బట్టి శ్రవ్యమే యయినను తిక్కన వానిని నాటకలక్షణములతో నడిపించెను నాటకమునందువలె రంగప్రసాధనమును, అభినయ సూచనలను, జనాంతిక స్వగతములను, పాత్రప్రవేశ నిష్క్రమణములను, పాత్రల అవయవ విక్షేపములను సైతము చక్కగా ప్రదర్శించెను. కావుననే తిక్కన కవిత్వమున నాటకీయత హెచ్చని విమర్శకులు పేర్కొందురు. ఏఘట్టమును తిలకించినను నాటకీయత స్పష్టముగ కనబడుచునే యుండును తిక్కన పాత్రముల సంభాషణములు నాటకమునందలి పాత్రలు రంగస్థలముపై మనయెదుట సంభాషించుచున్నట్లుగనే ఉండును.

సంజయుని రాయబారము పంపునపుడు ధృతరాష్ట్రుడు నటించిన విధమును తిక్కన తీర్చిదిద్దిన విధము పరిశీలించిన తిక్కన నాటకీయత తెల్లము కాగలదు

'మీయయ్య మీరు వనవా
సాయాసము నిస్తరించి యభ్యుదయమునన్
డాయుటవిని ముదితాత్ముం
డై యిట పుత్తెంచె నన్ను ననుమీమొవలన్'

ఈమాటలు సంజయునికొరకు మాత్రమే. ఆ తరువాత చుట్టనున్న వారలతో నిట్లనియె.

'దుర్యోధనుడు కార్యాకార్యజ్ఞుడు గామి నిట్టి కలకగలిగె క్షీరోదకవృత్తి మనము వారలునుం గలసి బ్రదుకవలదె మనలనింక నమ్మరు. మనకీకుంతగ వచ్చునే. అందరను గెల్వనోపినను రుద్రునకు నైన నోర్వరాని ధర్మపుత్రు కోపమునకు దలక వలదె.'

ధృతరాష్ట్రుని ఈమాటలు సంజయునకుగావు. సభలోని వారికందరకు తాను పాండుపుత్రులపై అభిమానము కలవాడ ననియు వారితోకూడి మనుటకే తాను ప్రయత్నింతుననియు, అయినను వారు తాము అనృతాత్ములు, అన్యాయపరులు, గర్వులని తలంచి కూడి మనుట కంగీకరింపుని వినువారిని తప్పుమార్గము పట్టించుటకు చెప్పిననే అంతియేకాని సంజయునితో రాజ్యభాగము నిచ్చుటకు తానుసిద్ధముగా నున్నానను ఒక్కమాటనైనను పలుకక పోవుట విచారణీయము. సభలోని వారందరు ధృతరాష్ట్రుని సహృదయతకు అభినందింప వలెనని ఆతనియూహ. మరల సంజయు దిక్కుమొగంబై ఎల్లవారును విన నిట్లనియె.

'నీవు ధర్మజు పాలికి నెమ్మి నరుగు మతడు పేరోలగంబున్న యవసరమున గాన్పు యతనికి ననుజవర్గంబునకును'

నెయ్యము పాటించి కడుం
దియ్యమెసగ నలుకలెల్ల దీఱునటులుగా
గయ్యమను తలపు లోసగ
నయ్యమనందనుగు మానునట్టి తెఱగు[1] నన్

శాంతిప్రకారంబునం గార్యంబునపవి రొయుక్కటికై
రొయుషగూర్చిరమ్ము, రథంబెక్కిపొమ్ము' అనిపంపెను

ఇందు ధృతరాష్ట్రుని మాటలు మూడురకముల
వచ్చును సంజయునికి మాత్రమే చెప్పినవి. చుట్టునున
మాత్రమే చెప్పినవి సంజయునితో నెల్లవారలు వినునట్లుగ
దీనిని నాటకీయముగ జనాంతికము, అపవారితము, ప్రకా
చెప్పుదురు తిక్కన నాటకీయతకిది నిదర్శనము.

తిక్కన పాత్రములు సహజత్వము కలిగియుండున
సీన వారు కనబడినపుడు అసహాయలైన స్త్రీలు ఏవిధము
తురో తిక్కన కుంతిపాత్రమున చూపియున్నాడు కుంతిని కో
పడుచును చేసియున్నారు.

'ఇట్టి క్రూరులయింటికి నిచ్చిన మనవారి నందు
కుంతి అచ్చముగ తెలుగుదనమున శోకము పెట్టినది స్త్రీ
విషయమున తిక్కన ప్రత్యేకత స్పష్టముగ కనబడుచుండును
సృష్టించిన ద్రౌపది అభిమానవంతురాలు భర్తలనైనను త
గల స్వాభిమానముగలది.

కీచక పరాభవమున శోకద్రోక్కిన అడుగ్రె
బుసలుకొట్టుచున్న ద్రౌపదిని కంకరూపమున నున్న ధర్మజ

"పలువోకల పోవుచు వి
చ్చలవిడి నాట్యంబుచూపు చాడ్పున నిచటం
గులసతుల గఱువ చందము
దొలగగ నిట్లునికి దగునె తోయజవదనా"[2]

1 తి భా, ఉ ప, షు ఆ, ప 270, 271
2 తి భా, వి ప, ద్వి ఆ, ప 150

అని పలుక దానికి ద్రౌపది సమాధానము పర్యాలోచింపదగినది.

'నాదువల్లభుండు నటుడింత నిక్కంబ
పెద్దవారియట్ల పిన్నవారు
గాన పతుల విధమె కాక యే శైలూషి
గానసంగ రాదు కంకభట్ట![1]

అట్లగుటం జేసి నాకునాట్యంబును బరిచితంబ మత్పతి శైలూషుండ కాడు, కితవుండునుం గావున జూదరి యాలికి గలుగు తినవు వెక్కడి యది' అనును

కష్టములామె కేమియు క్రొత్తకావు తానుపడిన యవమానముల కన్నిటికిని ప్రతీకారముగ ప్రచండ యుద్ధము జరుగగలదని యాశించిన యామె తన ఆశనిరాశయై యిదూళ్ళకు ధర్మజుడు మెత్తబడునప్పుడు ఆమెకు ఒడలు మండినది తాపము సహింపలేక 'మాటలనోరి దానవయి మాటలు చిత్తమునందు నిల్పకేగాలుబ్రవేలెదన్[2]' అనిపాండవులను కడుగుట ప్రారంభించి అయిదూళ్ళిచ్చిన వారు సిగ్గువాలిపుచ్చికొని ధృతరాష్ట్రుని సేవించుకొని జీవింతురట, సరే బాగున్నది అని మొదలుపెట్టి ద్రౌపదిచూపిన హావభావచేష్టలు కళ్ళకు కట్టినట్లు తిక్కన చిత్రించియున్నాడు

'క్రొమ్ముడి గ్రన్నన విడ్చి వెండ్రుకల్ దావలచేతబూని కృష్ణుని ముఖముముందు పెట్టి చూపించుట,' 'ఈవెండ్రుకలు పట్టి యీడ్చిన యాచేయి తొలుతగా బోరిలో దుస్ససేను తను వింతలింతలు తునియలుకావడం జూడవలయున'ని అరచేతిలో పెట్టిన బొటనవ్రేలు క్రమముగా కొనగోళ్ళవరకు వెళ్లుట కనులకు కనబడుచునేయున్నది

తిక్కనశైలి కేవలము బుద్ధిగమ్యము ఆలంకారికులు కావ్యగుణముగ పేర్కొన్నదానిలో అర్థవ్యక్తి, సంక్షేపము, సమత మున్నగు గుణములన్నియు బుద్ధిగమ్యమైన శైలికి లక్షణములు. ఈ

1 తి భా వి ప ద్వి ఆ ప 161
2 ,, ఉ ప, తృ ఆ ప 107

బుద్ధిగమ్యములైన గుణములకు తిక్కన తన భారతమున సందర్భోచితముగ ప్రతివిషయమునకు ప్రాధాన్యము నిచ్చి హృదయార్ద్రతను, బుద్ధివికాసమును సమముగా కలిగింపగలిగెను.

విరాటుని సభలో ద్రౌపదిని కీచకుడవమానింపగా భీమునికి కలిగిన యావేశము. కీచకవధకు భీముని పురికొల్పగా అతనికి కలిగిన యావేశము రాయబారమున కేగునపుడు కృష్ణుని మాటలకు భీమునికి కలిగిన యావేశము. రాయబారమున కంగీకరింపని ద్రౌపది మాటలలోని యావేశము సహదేవుని యొక్కయు, సాత్యకి యొక్కయు మాటలలోనియావేశము మొదలగు భావావేశముగల ఘట్టములందు బుద్ధిగుణములకే తిక్కన ఎక్కువ అధికారమిచ్చినను ఆ ఆవేశ ప్రవాహమున తాను మాత్రము కొట్టుకొని పోకుండగ నిలబడుట గమనార్హము. కావుననే కావ్యశిల్ప లక్షణములలో శిరోభూషణమనదగు ఔచిత్యపోషణ తిక్కన రచనలో ప్రతివాక్యమున కనబడుచుండును.

ద్రౌపది కీచకుని మందిరమున ప్రవేశించి కీచకునితో —

'దేవి తృష పుట్టి వారుణి దేరఁ బనుప
నరుగు దెంచితి బోయింపు[1]' ని పలుకగా కీచకుడు
'దేవితృష దీర్ప బానితి
వా వెలది సహోదరుండనగు నాతృష లీ
లావతి నీవు సరస సం
భావన మెయి దీర్పకున్కి పాడియె చెపుమా[2] అని

చమత్కారముగా పలికెను. అటులనే సంజయు రాయబారసమయమున—

"..మీతండ్రి ధృతరాష్ట్రధరణీనాథుఁడిందు మీయున్నై విని ప్రియమొనర మెసఁగ అనుజులు నీవును ద్రౌపదియును బుత్రప యంబునున్న యోగక్షేమంబున తెలగారయ బుత్తెంచె నీకాంత

1,2 తి భా, వి ప, ద్వి ఆ, ప 116, 117

స్నేహపూర్ణ చేతో వృత్తిన్[1,] అనిపలుకగా దానికి ధర్మజుఁడు-

ఆ రాజు మా వెంగల
కారుణ్యము కతమునను సుఖంబున నిట్లు
న్నారము నిను బుత్తెంచిన
గారవమున నాదు మది వికాసము బొందెన్[2]

అని చక్కగా బదులుపలికెను ఇది మూలమున లేని సొబగును తెచ్చుటయేగాక నాటకీయతను, ఔచిత్యమును ప్రస్ఫుటీకరించుచున్నది కవిత్వ మెట్లుండవలెనను విషయమును తిక్కన కుకవినింద చేయుట ద్వారా వ్యంగ్యముగా నిట్లు చెప్పియున్నాడు -

'పలుకుల పొందులేక రసభంగము చేయుచుఁ బ్రాతవడ్డ మా
టలఁ దమనేర్పు చూపి యొకటన్ హృదయం బలరింపలేక'[3]

అనగా కవిత్వమున పలుకులు పొందికగా నుండవలెను. రసభంగము కాకూడదు ప్రాతవడ్డ మాటల కూర్పు కాకూడదు. హృదయము నలరింపగలిగి యుండవలెను. ఈలక్షణములన్నియు తిక్కనశైలియందు ప్రస్ఫుటములు.

అలతి యలతి పదములు వాడుటలో తిక్కన అసామాన్యుడు-

'కోపము నుబ్బును గర్వము
నాపోవక యునికియును దురభిమానము ని
ర్వ్యాపారత్వము ననునివి
కాపురుష గుణంబులండ్రు కౌరవనాథా'[4]

అన్నట్లు ఒకే సమాసమున పద్యమునంతను కూర్చుటయందును తిక్కన సమర్థుఁడు దీనివలన ఆతని సంస్కృతభాషాభినివేశము కూడ వెల్లడి యగుచున్నది

---

1, 2 తి భా, ఉ ప, ప్ర ఆ ప 273, 274, 276

3 తి భా, వి ప, ద్వి ఆ ప 55

4 ,, ఉ ప, ద్వి ఆ, ప 202

"దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాప స్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతులేవు రిప్డు నిను దోర్లీలన్ వెసంగిట్టి గం
ధర్వుల్ మాంసము బ్రాణముం గొనుట తథ్యంబెమ్మొయింగీచకా"
'బక విధ్వంసి జటాసురాంతకు హిడింబ ప్రాణ హారీను గీ
చకనిర్మూలన కేళిలోలు సమరోత్సాహైక శీలప్రవ
ర్తకు నాగాయుత సామ్యకీర్తిత బలోద్యగుం బ్రతివ్యూహ దా
హకు భీముం గొనివచ్చి ధర్మజుగు భాషాటోపము ం జూపగన్'

తిక్కన తనకావ్యములో నుపయోగించిన తెలుగు నుడికారముకూడ ఆతని శైలిలో నొకయంశముగా పేర్కొనవచ్చును తిక్కనలోని తెలుగు దనమును సమగ్రముగా తెలిసికొనుటకు విరాటోద్యోగ పర్వములు చక్కగా సాయపడును

1. నీరు గవిసిన నిప్పువోలె
2. అందని మ్రాకుల పండ్లు కోయదలచుట
3 బెబ్బులియున్న పొదరిల్లు జొచ్చు లేడి చందంబున
4. ఆడుకూయు, అలకూయును లాతివారికైన అరయువలయు
5 కయ్యమునకు కాలుద్రవ్వకున్న
6 నివురు గవిసిన యొరయని నిప్పువోలె
7 పెన్నిధిగన్న పేద చందంబున
8 మంటలో మిడుతలు సొచ్చినట్లయిన
9. వేల్పువచ్చిన యట్లు మేనువొంగ
10. ఏనుగునకు సళ్ళు సూపినట్లు
11. మడుగుజేరయందు మసి దాకినట్లు
12. పిల్లిపట్టిన యూఱుపు
13 అరచేత పాణింబులిడి
14 చిచ్చునకు తోడు కరువలి వచ్చుగతి

1 తి భా, వి ప, ద్వి ఆ, ప ౧౬

15 ఉల్లిపట్టు మాటలు
16 మున్నీరు సొచ్చిన యేరుల చందంబున
17 విరిగిన బార సాపవచ్చునే
18 డెందాన చేయవెట్టికొని నిద్రించుట
19 ఆకొని మునింగి దినిన క్రొవ్వులావు గలుగునయ్యా
20 కంటికిన్ రెప్పయునుబోలె

ఇవన్నియును సాధారణముగ తెలుగువారినోట వినిపించు నట్టివియే. జనసామాన్యమున వాడుకలోగల నుడికారములను తన రచనలో పొందుపరచి భాషలోని సొబగులను రమ్యముగా ప్రకాశింపచుటయేగాక వ్యావహారిక భాషాప్రయోగమునకు తిక్కనయే గురుద్యుతయ్యెను. తేటతెనుగు పదములను తిక్కన వాడినట్లుగా వేరెవ్వరికిని సాధ్యముకాలేదు

సీ. వెలవెల బాఱుదు వెగడొందుఁ బెదవుల
తడియాఱ నెంతయుఁ దల్లడిల్లు
జల్లన నంగంబులెల్ల నిండఁ జెమర్చుఁ
బదములుఁ గరములు గుదియవడకు
హృదయంబు తటపట నదరంగఁ బెలుకుఱు
దీన దృష్టుల మోము దేటిచూచు
నెలుగు గద్గదిక డొట్రిల నేడ్చు విడుమని
ప్రార్థింపుచుఁమాటఁగీడ్పాటు దోప[1]

అటులనే కీచకుని విరహతాప వర్ణనమున వడంగుపడు, ప్రమానుపడు, చికిముడిపడు, వెన్నుంబడు వంటి మాటలన్నియు తెనుగు పదములే.

## వర్ణనలు :

'కవయతీతి కవిః' కవయతి అనగా వర్ణయతి. వర్ణన శబ్దము కవిశబ్దములోనే గోచరించును. కవికావ్యమునందు వర్ణనలు

---
1 తి భా, వి ప, చ ఆ, ప 80

వస్తువర్ణనయనియు, రూపచిత్రణ మనియు, భావచిత్రణ మనియు
మూడువిధములు. మనోహరములు, రమణీయములునైన సూర్య
చంద్రోదయాది ప్రకృతి దృశ్యములును, పాత్రలు సంచరించు రంగ
స్థలాది సన్నివేశములును వస్తువర్ణనలగును. రంగప్రవేశము గావించు
పాత్రల రూపురేఖలను, మనోహర భావములను వర్ణించుట రూప
చిత్రణమగును పాత్రల మనోభావ సంచారములను వర్ణించుట భావ
చిత్రణమగును. విరాటోద్యోగ పర్వముల రచనమున ఈ మూడును
విడదీయరాని పొత్తుకలిగి యున్నవి

సూర్యోదయము, సూర్యాస్తమయము, ఉద్యానవన విహారాది
వస్తువర్ణనలు, ద్రౌపది, ఉత్తర మున్నగు పాత్రముల రూపురేఖా
చిత్రణము, కీచక, భీమ, దుర్యోధన, ఉత్తరాదుల భావచిత్రణము
చాందర్భికముగా చేయబడినవి తిక్కన గావించిన వర్ణనలన్నియు
సందర్భానుకూలముగ, స్వాభావికముగ, సహజగుణ సంశోభితముగ
సరసభావ గర్భితములుగ నుండును ఆతని ప్రకృతివర్ణనలో స్వచ్ఛ
తయు, ఉదాత్తతయు ప్రాధాన్యము వహించును.

సూర్యోదయ వర్ణనము—

సీ. నీరజాకరములు నిష్ఠమై జేసిన
భవ్యతపంబుల ఫలమనంగ
దివసముఖాభినందిత చక్రయుగ్మకం
బుల యనురాగంపు ప్రోవనంగ
హరిహరబ్రహ్మ మహానుభావంబులొ
క్కటిగాగ గరగిన గుటిక యనగ
నలుల వేదత్రయ లతికాదయము పెను
పొంది బుట్టెడు మూలకందమనగ

గీ. సఫలజగముల కన్నైలి యగుచు జనస
మాజ కరపుట హృదయ సరోజములకు

ముకుళనంబును జృంభణంబును నొనర్చి
భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె

ఇందు సూర్యభగవానుని యలౌకిక మహత్వము వర్ణితము భవ్యతపః ఫలంబగు పరంజ్యోతి స్వరూపము, వినిర్మల ప్రణాయ పరిణామము గు రసస్థితి, వారివార బ్రహ్మైక్య జ్ఞానమూర్తి, వేదత్రయీ జన్మ కారణమగు పరబ్రహ్మ స్వరూపము మొదలగు అలౌకికోపమానములతో వర్ణనకు ఉదాత్తత కల్పించెను.

మరియొకచోట సూర్యోదయ వర్ణనము-

ఎత్తినవేడ్క గంధము లెత్తి మొగంబులుసాచి మోకాళ్ళలం
జిత్తములున్ నిగిడ్చి తనుచెందెగు నిక్కలురోసి యింపు ద
ళ్కొత్తగ నొక్కచో నొకటి గాంచియొలర్చు కొయ్యలం
జత్తుజు కేళి దేలె విలసిల్లుచు జక్కవదోయి వేకువన్[1]

ఇందు తిర్యక్కులైన చక్రవాక పక్షులు తెల్లవారు జామునందలి సంభోగవిషయము వర్ణింపబడినది. సంజయు డుపప్లావ్యమునుండి తిరిగి వచ్చిననాటి రాత్రి తెల్లవారుటకైన సూర్యోదయమిది. ప్రధానగతి నిర్ణయమొక విధముగా తనచేతిలో నున్న ధృతరాష్ట్రునకు త్వరగా తెల్లవారుట కావలసిన స్థితి. ధర్మజుని చిత్తమెట్లున్నదియు తెలిసికొన నాత్రపడుచున్న సమయమున వర్ణింపబడిన సూర్యోదయము భావగర్భితము, పదపసుందరము.

సూర్యాస్తమయ వర్ణనము-

ఇనుడు తనకరమను నేతెం
చిన రాగము బొందుటిదె యుచితమనగా కెం
పున మెఱసి పశ్చిమాశాం
గన జన సంభావనముల గౌరవమందెన్[1]

సూర్యుడు పశ్చిమ దిక్కునుచేరగా నాదిశ సంధ్యారాగరంజిత మైనది. భర్తయగు సూర్యుడు తనకరమురాగా పశ్చిమ దిశాకాంత అనురాగ

1 తి భా, విప, ద్వి అ, ప 318

యుక్తమగుట యుచిత మనునట్లు అరుణ ప్రకాశరంజిత మైనదని యుత్ప్రేక్ష

చంద్రాస్తమయ వర్ణన —

తన కులంబున పుట్టిన ధార్తరాష్ట్రు
లన్నదమ్ములతో నిగ్రహంబు గనుట
కుమ్మలించి వివర్ణత నొందినట్లు
గంది యెంతయు వెలువెలె జందురుండు[1]

కౌరవపాండవులు చంద్రవంశము వారగుటచే వారిరువురిమధ్య కలహమునకు చంద్రుడు మనస్తాపము చెందినట్లుగ వర్ణించుట తిక్కనగారి చక్కని యూహాకల్పనకు భావానురూపమగు పద్యములకు కూర్పునకు నిదర్శనము.

ఇట్టి వర్ణనలు చేయుట యందు తిక్కన సిద్ధహస్తుడు. ఇవియే తరువాతి ప్రబంధ మార్గమునకు ఆదర్శప్రాయము లైనవి భావానురూపములగు పదములను పొదిగించి వర్ణనచేయుట తిక్కన ప్రత్యేకత

విరాటునిసభలో ద్రౌపదిని పరాభవించిన కీచకుని భీముడు గాంచినంతనే కోపవేగమున కన్నులు నిప్పులను రాల్చినవి. సాంద్ర ఘర్మ సలిలములతో భావోదీర్ణమైనది. నితాంత దంతపీడనరటదాస్య రంగ వికటభ్రుకుటీ పటులప్రవృత్త నర్తన ఘటనాప్రకార భయద స్ఫురణా పరిణద్ధ మూర్తియైనాడు భీముడు. ఈవర్ణనలో తిక్కన కీచకసంహారమునకు అనుకూలమగు భావిస్థల నిర్దేశమొనర్చినాడు. భీముని కోపాటోపము నాధారముగాగొని తిక్కన నర్తనశాలను జ్ఞాపకము చేసినాడు. ఆ కోపమున కుపశాంతి నర్తనశాల యందే యనెడు చక్కని భావము నీవర్ణనయందు తిక్కన ధ్వనింపచేసెను ఆ తరువాతి పద్యము నందలి-

---

1 తి భా, ఉ ప, ద్వి ఆ, ప 107

'నేలయు నింగియు దాళముల్ గాజేసి
మోపున రేగి వాయించి యూహ[1]' అనునది

కూడ పై భావమునకు దోహదకారి యగుచున్నది. ఇట్టి భావప్రధానముగ వర్ణనచేయుట, వర్ణనలో కథాసూచనచేయుట తిక్కన కళా కౌశలమునకు నిదర్శనము.

ద్రోవది బంధురంబయిన క్రొమ్ముడి గ్రిన్నన విచ్చి వెండ్రుకల్
దావలచేతబూని యసితగ్నవి బోల్చు మహాభుజంగమో
నావిలసిల్లి క్రేలగ మనంబున బొంగు విషాదకోపముల్
గావగలేక బాష్పములు గ్రమ్మగ డగ్గన లేచి యార్తయై[2]

ఆర్తయైన ద్రౌపది రూపమును మన కనులయెదుట నిలబెట్టి వర్ణనా సృష్టి గావించుట కవిబ్రహ్మకేగాని తక్కొరుల కసాధ్యము. ఇందు శృంగార వర్ణనమున కంతటి యవకాశములేదు. అయినను దుర్విదగ్ధుడైన కీచకునినోట ఒక్క అసభ్యపు మాటకూడ రానీయలేదు. తరువాతి కాలమునందలి ప్రబంధ కవులు శృంగార నాయికలను వర్ణించుటకు కచకుచాది బాహ్యావయవ వర్ణనము శ్రోతలకు క్లేశము కలిగించినది. కాని కీచకవధ ఘట్టమున ద్రౌపది సౌందర్య వర్ణనముచే సాధించిన ఫలము ప్రబంధకవు లందుకొనలేకపోయిరి.

కీచకుడు ద్రౌపదిని చూచిన సందర్భమున భయాది భావములచే మేనుకంపించి స్వేదాదులు పొడసూపెను. అదిగనిన కీచకుడు శృంగార లక్షణములని భ్రమించి మదనవికారమునకు లోనగుటను తిక్కన యెంతయో సుందరముగా వర్ణించెను.

సీ. చెలువక ననుజూచె వీపని యెద గలు
షించిన నొండొంత చెమట వొడమెను
తనుచిత కృత్యంబు లాచరించు విధాతృ

1 తి భా, వి ప, ద్వి ఆ, ప 188
2 ,, ఉ ప, తృ ఆ, ప 114

బలిమికి నివ్వెఱపాటు దోప
నిచ్చట దిక్కు లేరెవ్వరు నాకను
భయమున మేనగంపంబుపుట్ట
జేయంగ నేమియువాయంబులేమి నా
ననమున వెల్లదింబుగదుర
నున్న పాంచాలి గనుగొని యన్న రాధ
మును వివేకహీనుడై ముదితు వగుచు
మదన వికృతియుకా దన మదిదలంచి
రాగసాగర పూర నిర్మగ్నుడయ్యె[1]

ఇట స్వేదాదులు శృంగార సంబంధి సాత్త్విక భావములు కావున శృంగారము మనోహరముగా వర్ణింపబడినది. ఉత్తరాభిమన్యుల వివాహవర్ణనముకూడ శృంగార రసభరితము

### ఛందస్సు :

ప్రపంచములోని సర్వభాషా కవిత్వములును ఛందోబద్ధములుగనే యున్నవి ఛందస్సును వదలి కవిత్వము లేదు ఛందస్సు రొక్క సూక్ష్మరూపము వర్ణము స్థూలరూపము పద్యము పద్య మనగా నిబద్ధపద బంధము కవిత్వము పద్యములందుండును. పద్యము వృత్త, జాతి భేదముచేత ద్విధాభూతము జాతియందు అవాంతర భేదము ఉపజాతి వృత్తములు సాంస్కృతికములు. జాత్యుపజాతులు దేశీయములు.

విరాటోద్యోగ పర్వములలో తిక్కన వాడిన ఛందోరీతులీ క్రింది విధముగా నున్నవి

| | విరాటపర్వము | ఉద్యోగపర్వము |
|---|---|---|
| ఉత్పలమాల | 150 | 145 |
| చంపకమాల | 185 | ౧½ |

1 తి భా వి ప, ది ఆ ప 88

| | విరాట పర్వము | ఉద్యోగపర్వము |
|---|---|---|
| మత్తేభము | 36 | 37 |
| శార్దూలము | 24 | 14 |
| మాలిని | 5 | 4 |
| స్రగ్ధర | 1 | 1 |
| కందము | 517 | 505 |
| తేటగీతి | 185 | 153 |
| ఆటవెలది | 97 | 93 |
| సీసము | 95 | 53 |
| వచనములు | 433 | 463 |
| మొత్తం గద్యపద్యములు | 1628 | 1562 |

తిక్కన సాధారణముగా వర్ణనలకు సీసపద్యములను వీర, రౌద్రరస సందర్భములందు శార్దూల, మత్తేభములను, శాంత, కరుణ రసాదులకు చంపకోత్పలమాలలను వాడినట్లు కనబడును. ఛందోగతి నెప్పటికప్పుడు మార్చుటకు వీలైన చిన్నపద్యము కందము. కావుననే తిక్కన కందము నధికముగా వాడెను. తిక్కన కందపద్యమును 'కందమునకు సోమయాజి ఘనుడ'ని కవి చౌడప్ప ప్రశంసించెను. కందపద్యము వ్రాసి మెప్పించుట చాలకష్టము. కావుననే కందము చెప్పినవాడు కవి, పందిని చంపినవాడు బంటు అనునది నానుడి. కందమునందముగా నిబంధించుటలో తిక్కనకు సాటిలేరు.

సామాన్యకవులకు యతిప్రాసములు సంకటస్థానములు. కావుననే వ్యర్థపదములతో పద్యపూరణము గావింప ప్రయత్నింతురు. దీనిని తిక్కన గర్హించెను. తాను వ్యర్థపదముల నెచటను వాడక అర్థవంతములగు పదములనే వాడెను. ఈ విషయమును తిక్కనయే స్వయముగా నిట్లు చెప్పుకొనెను.

తెలుగు కవిత్వము చెప్పం
దలచిన కవి యర్థమునకు దగియుండెడి మా
టలుగాని వళులం బ్రాసం
బులు నిలుపక మెఱుం బలిమి పుచ్చుట చదురే[1]

కన్నడకవుల ప్రభావమున నాటికాలమున యతిప్రాసముల విషయమున సందిగ్ధ పరిస్థితి కలిగియుండవచ్చునని పై పద్యము వలన నూహింప వచ్చును. అంతియేగాక తిక్కన ప్రాసము ప్రకారము వేఱగు నక్షరంబులను కృత్యను రూపమంచనిఁ జనని నొక్కి చెప్పెను. తిక్కన గ్రంథము నందెల్లెడల నొకేవిధముగ ధ్వనించు గ, అ, ల, ళ ఒత్తక్షరములు, ఒత్తులేని యక్షరములు మొదలగు వానికి భేదము పాటింపబడెను ఎచటను సాంకర్యము కనబడదు

తిక్కన రసపోషణ దృష్టితో ఛందస్సులను వాడెడు నేర్పు గలవాడు మానవునకు కలుగు కోమల మధురభావములను చిత్రించుటలో తిక్కన ఎక్కువ సరళములును, శ్రుతిపేయములునైన ఛందోగతుల ననుసరించుటయు, కర్కశము, భయంకరమునైన భావములను చిత్రించుటకు తదనుకూలమైన ఛందస్సుల నవలంబించుటయు పరిశీలనా దృష్టితో ఎఱించిన వారికెల్లరకు సవగతము తిక్కన గద్యము కూడ నొకవిధమగు పద్యము వలెనే నడచును గద్యమైనను, పద్యమైనను శ్రావ్యముగ నుండుట తిక్కనార్యుని పరమోద్దేశము.

రసము :

కుర్వన్ సర్వాశయే వ్యాప్తి మాచిత్య రుచిరోరసః
మధుమాస ఇవాశోకం కరోత్యంకురితం మనః[2]

అశోకవృక్షమును మధుమాసమువలె ఔచిత్యరుచిర మగు రసము సకల జనహృదయ వ్యాపియై మనస్సు నంకురిత మొనర్చుననను ఈ మాట రసప్రాధాన్యమును తెలుపుచున్నది

1 నిర్వచనోత్తర రామాయణము - పీఠిక
2 ఆంధ్రకవుల ఔచిత్యవిచారణ p 28

తిక్కన తానుచూపజోవు రసాదులనుతానే పేర్కొనుచుం గును. ఇట్లు పేర్కొనుట రసదోషముగా అలంకారికులగు మమ్మటా దులు భావించిరి "స్వశబ్దోక్తి వలన రసము ఆస్వాద్యము కానేరదు రసము ప్రకటితమయినప్పుడు దాని అభిరుచి తరిగిపోవును కావున కవి ఎన్నడును స్వశబ్దముచే రసమును వెల్లడించి సహృదయుల రసా స్వాదనమునకు భంగము కలిగింపరాదు అనగా రసమెన్నడును నామ వాచ్యముకారాదు" ఈవిధముగా నాలంకారికులు దోషముగా నిరూ పించినను తిక్కన తన రచనావిధానమున నామగ్రహణము చేసి యున్నాడు. సామాన్య కవుల రచనలో దోషమైనది మహాకవుల చేతిలో గుణమే యగునుకదా!

'అర్జునుడు విరాటసుతున కిట్లను నేపల వీరరసము పొంగ్లు పడగన్'

'రౌద్రరస వినోదియైన యర్జునుడు'

ఇట వీరరౌద్ర రసములు అర్జున పరముగా వాచ్యము లగుట దోషముగా గన్పట్టదు

తిక్కన రసాభిమాని కావుననే తనగ్రంథ అవతారికలో 'భారతము - నానారసాభ్యుదయోల్లాసి' యని పేర్కొనెను భారత మున ప్రధాన ఘట్టములన్నిటి యందును రసపోషణము చక్కగ జరిగినది ఇందు విరాటపర్వమున కీచకవధ ఘట్టము, గోగ్రహణ ఘట్టము, అభిమన్యు వివాహఘట్టము నత్యంత ప్రధానములై నవి. ఉద్యోగపర్వమున కేవలము యుద్ధప్రయత్నమే ప్రధాన విషయ మగుట వివిధరసముల కిచట స్థానము కల్పింప వీలులేదు

కీచకవధ ఘట్టమున కీచకుడు ప్రతినాయకుడు వానిశృంగా రము నీచము అట్టికీచకుని శృంగార పద్ధతులను కూడ తిక్కన హద్దు మీరి పోనీయలేదు. ఇచటి కీచకుని ప్రేమ, విరహాదులు శృంగారా భాసములు.

కీచకుడు విరాటుని కొలువున ద్రౌపదిని పరాభవించుటను గాంచిన భీముని కోపోద్రేకమున రౌద్రరసము, కీచకుని వధించుటలో బీభత్సరసము పోషింపబడినవి. దక్షిణోత్తర గోగ్రహణఘట్టములందు భీమార్జునుల పరాక్రమ ప్రదర్శన రూపమున వీరము వర్ణింపబడినది. ఉత్తరుని ప్రగల్భములందు, అర్జునుని తలక్రిందుల కవచధారణము నందు, కౌరవసేనను గాంచి ఉత్తరుడు పలాయనము చిత్తగించుట యందు హాస్యము వెల్లివిరిసినది. ఇట్టి హాస్యరస పోషణము ఆంధ్ర కావ్యములలోనే అరుదు.

ఉత్తరాభిమన్యుల వివాహసంరంభమున వధూవరుల పరస్పరావలోకనాది చేష్టితములవలన ఉదాత్తశృంగారము పోషింపబడినది.

సీ. వరుచూడ్కి ముద్దియ వదనంబుపై బాఱి
 తిరుగుటమై నునుగాంతి తీపు గ్రోలు
సుందరీ రత్నంబు చూపు మనోరమ
 సొగసుల రొమ్ముపై నల్ల సవరు
జతపిలోకనములు పలుతూర నైదీవ
 గలయంగ బలుమఱు వెలగుచుండు
చెలది కటాక్షముల్ విభునిపై గ్రమమున
 నెగసి మోమున కేకి మఱిడివచ్చు

గీ. నొంటిసొరువుల లేజెమటలనూని క్రేక
పసిన చూపున నవయువ భంగులందు
దళి మఱుపునఁ గప్పయు నిద్దఱి విశాల
నయన దీప్తులు నెఱుకువ బయలుపడగ[1]

కరుణరసమునకు స్థాయిభావము శోకము. తిక్కన ద్రౌపది మాటలుగ ఉద్యోగపర్వమున శోకమిట్లు ప్రదర్శితము.

---

1 తి భా, వి ప ౪ ఆ, ప 376

ఉ. ఆసభ కేక వస్త్రయుగనట్టి ననుం గొనివచ్చి నొంచు దు
శ్శాసను( జూచుచుం బతులసంభ్రములై తగు చేష్టలేక నా
యాసలుమాని చిత్రకులగు నాకృతి నున్న యెడన్ ముకుంద వి
శ్వాసముతోడ నిన్ గొలువ వచ్చె మనం బదియుం దలంపవే[1]

భీముని మాటలలో, చేష్టలలో రౌద్రరసముప్పొంగుచుండును-

ఉ. కయ్యము గల్గినట్లయిన గంధగజ ప్రకరంబు గుంభముల్
వ్రయ్య దురంగ పంక్తులు ధరంబడ దేరిగముల్ బహల్పతన్
పెయ్యమికీపు వెక్కసపడన్ గదపండువు సేయగోరు నా
దయ్యము నెత్తికోలు దుదిదాకుటగాదె భుజంగ భంజనా[2]

సహదేవుని మాటలలో వీరరస ముప్పొంగును-

మ. తుదిరాజ్యమ్ము సగమ్ము గొమ్మపవియుండుం బేరువంచించియుం
బదుమూ(డేడులు నీవునుం దిరిగిరా పాలీక పోవచ్చునే
యదిగాదే దెగిబంటవై యఱుము మాయల్ పన్ను నేర్పింక(జె
ల్లదుసూ నీకని యాసుయోధనుని యుల్లంబుచ్చిపో నాకుమీ[3]

విశ్వరూప సందర్శనావసరమున అద్భుతరసము కల్పింపబడినది. దానిని తిక్కనయే యిట్లు పేర్కొనెనుకూడ-

కం. అనిన పలుకులకు నచ్చటి
జనులెల్ల నృపాలు సిత విశాలాక్షు గనుం
గొనుచుండి రపుడు దమనె
మ్మనము లాశ్చర్యరస నిమగ్నంబులుగాన్[4]

శాంతము రసముగాదని కొందరిమతము. రసముగా నంగీకరించిన విదురనీతి యంతయు శాంతరస ప్రధానమే యగును. అటులనే ధర్మజుని మాటలు శాంతరస స్థానములు-

చం. పగయడగించు టెంతయు శుభంబది లెస్స యడంగునే పగం
బగ పగగొన్న మార్కొనక పల్కగయుండవచ్చునే కడుం

---

1, 2, 3 4 తి భ, ఉ ప, వృ ఆ, ప 111, 67 91, 410

దెగ మొదలెత్తి పోవబగదీర్పగ వచ్చిన గ్రౌర్య మొందు నే
మిగలిఁ దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా[1]

ఇట్లు సందర్భానుసారముగ సముచిత రామణీయకముతో తిక్కన తన రచనావిధానమును కొనసాగించుటచే ఆతని భారతము నానారససాభ్యుదయోల్లాసియై విరాజిల్లుటయేగాక ఆంధ్రుల మనముల నలరించుచున్నది

**అలంకారములు :**

అర్థౌచిత్యవతా సూక్తిః అలంకారేణ శోభతే
పీనస్తన స్థితేనేవ హారేణ హరిణేక్షణా

పీనస్తనములందు హారములుకల హరిణేక్షణవలె అర్థౌచిత్యము గల అలంకారములచే సూక్తి శోభావంతమగునని క్షేమేంద్రునికారిక

మహాకవి తిక్కన తనభారతము నందలి ప్రతిపద్యమును ప్రబంధముగనే తీర్చిదిద్దినను ప్రబంధకవులవలె అలంకారముల నధికముగా నుపయోగింపలేదు. కాని సందర్భానుసారముగ నవియేవచ్చి చేరుచుండును ఆకవివరుని యుపమాలంకారశోభ అనితరసాధ్యము. తదితరాలంకారములు నంతియే అలంకారము వర్ణ్యవస్తువుయొక్క స్వరూప స్వభావములను సహృదయుని బుద్ధియందు సముద్దీపింప చేయునదిగను మరియు ప్రధానకథాసంబంధిగను అనగా అంగివిషయ సంబంధిగను పరమార్థమును స్ఫురింప చేయునదిగను ఉండవలెను దీనికి అనుగుణముగనే తిక్కన తనరచనలో అలంకార పోషణ గావించెను.

సీ. సమదవారణము జంగమలత వెనుకొని
సరభసంబున బట్ట జనువిధమున
గ్రూరదానవుఁడు భూచారి నిర్జర కాంత
బొదువ రయమ్మున బోవుభంగి

1 తి భా, ఉ ప, తృ ఆ, ప 21

ఘోరగృధ్రము సుకుమార నాగాంగన
    బట్టుగతి నొడిసియుంగ బాలుకరణి
ప్రబల బిడాలంబు బాలశారిక మీఁద
    నపరి సత్వరముగ నరుగుమాడ్కి
గీ. సింహబలుఁ డత్యుదగ్రుఁడై చిగురుఁబోడి
పజ్జ గడువడి దగిలి కోపంబు గదుర
నొడిచి తలపట్టి తిగిచి మహోగ్రవృత్తి
గొంతు కొసరించుకయు లేక కూలఁదాఁచె[1]

ద్రౌపదినిగాని, కీచకునిగాని ప్రత్యేకముగా నీపద్యమున వర్ణింపలేదు కీచకుడు ద్రౌపదిని వెన్నంటి తరుముట ఈసన్నివేశ వర్ణ్యవస్తువు. ఇట ద్రౌపది జంగమలత, నిర్జరకాంత, నాగాంగన, బాలశారికలతోను, కీచకుడు మదగజము, క్రూరదానవుడు, ఘోర గృధ్రము, బిడాలములతోను పోల్పబడిరి ఈ ఉపమానములచే కీచకుడు ద్రౌపదిని అందిపుచ్చుకొనినాడను కథార్థము లోకోత్తరముగా చెప్పబడినది కీచకుడు ద్రౌపది కొరకు నర్తనశాలను చేరుటను-

శా 'సింగంబున్న గుహానికేతమునకున్ శీఘ్రంబునన్ వచ్చు మా
    తంగంబుం బురుడించుచుం బవనపుత్రి స్వీకృతంబైన యా
    రంగాగారము సేరవచ్చి[2]

ఇందు కీచకుడు మాతంగము, భీముడు సింహము మాతంగమే సింహమున్న గుహకే తెంచినట్లు భీముగున్న చోటికి కీచకుడు వచ్చి చేరినాడు తాను త్రవ్వుకొన్న గోతిలో తానే పడినట్లు కీచకుడు తన చావును తానే తెచ్చుకొనెను ఇందలి ఉపమానోపమేయ సాధర్మ్యము, ఔచిత్యమును మిగుల రమణీయము.

మరియొకచోట భీముడు-

    పల్లవ ప్రసూన ఫల భరితంబగు
    మ్రాను గూలద్రోచు మత్తగజము

1, [illegible]రిభా వి ప, ద్వి అ ప 128, 330

పోల్కి వివిధరత్న భూషణ భూషితుం
డైన సూతుఁగూల్చె ననిలసుతుఁడు[1]

ఇందు పల్లవప్రసూన ఫలభరితమైన వృక్షమువలె కీచకుఁడు వివిధ రత్నమయ భూషితుఁడైయున్నాఁడట మత్తగజమువలె భీముఁడరుగు దెంచి వానిని గూల్చినాఁడట ఇందలి ఉపమాలంకారశోభ వారిరువు రను మన కనులయెదుట నిలుపుచున్నది.

ఆ. వె 'రోషమయ మహాతరువు సుయోధనుఁడు
స్కంధమందులోన కర్ణుఁడలరు
కొమ్మ సౌబలుండు కుసుమ ఫలంబు దు
శ్శాసనుండు మూలశక్తి తండ్రి'

ఆ వె 'ధర్మజుండు ధర్మతరు వర్జునుఁడు ఘన
స్కంధ మనిలసుతుఁడు శాఖ కవలు
పుష్పఫలము శౌను భూసురులును వేద
ములు తదీయమైన మూలచయము'[2]

కౌరవపాండవుల సామ్యమిందలి వర్ణ్యవస్తువు చక్కనిపోలిక జయ మెవరికి కలుగునను సందేహమునకు తావేలేదు. 'ధర్మో జయతి' ఇది ధృతరాష్ట్రవచనమే.
సత్యముయొక్క విశిష్టత తెల్పుటకు-

నడవడి యను మున్నీటిం
గడవంబెట్టంగ నోడకరణిం దిరి తా
నోడఁగూడదు ననిన సత్యము
గడచిన గుణమింక నొండుగలదే యరయన్[3]

కార్యసాధనము నెట్లుగావింప కొనవలయునో తెల్పును.

---

1 తి భా, వి ప, ద్వి అ ప 352
2 ,, ఉ ప, తృ అ, ప 355, 356
3 తి భా, వి ప, ద్వి అ, ప 99

గీ. మాలకరి పుష్పములు గోయుచూడ్కి జేటి
పుష్పదేనియగా నిమొదు భంగి నెదురు
గందకుండగ గానుసది కావ్యఫలము
బొగ్గులకు బోలె మొనకుంట బొదువజనదు[1]

ఎట్లుచేయవలనో తెల్పుటయేగాక ఎట్లుచేయకూడదో కూడతెల్పుట
తిక్కనగారి ప్రత్యేకత
ఛందోవిజయవర్ణన చక్కని యుత్ప్రేక్షాలంకారము—

గీ. తనకులంబున బుట్టిన ధార్తరాష్ట్రు
లన్నదమ్ములతో విగ్రహంబు గొనుట
కుమ్మలించి వివర్ణత నొందినట్లు
గంది యొంతయు జెలువేదె జందురుండు[2]

సంజయునకి బదులు పల్కు ధర్మజుని మాటలలో విపరీతలక్షణాలం
కారము—

క. ఆ రాజు మా జనంగల
కారుణ్యము కతమునను సుఖంబున నిట్లు
న్నారము నిను బుత్తెంచిన
గారవమున నాదుమది వికాసముఁబొందెన్[3]

ప్రకటనార్థము కన్నను ఆరాజు దయలేమివలననే మేము ఇన్ని కష్ట
ములు పడవలసివచ్చెనను అంతరార్థమే ప్రధానము.

**కుమారవ్యాసుడు — కవితాశిల్పము :**

**శైలి :**

'స్త్వైవవాణీ ప్రయోక్తృవాచ్యయా భావాకర్షణ క్షమా
స్వేషాం పరేషాం విదుషాం ద్విషా మవిదుషామపి'

---

1,2 తి భా, ఉ.ప, ద్వి ఆ, ప 57, 107
3 తి భా, ఉ ప, ప్ర ఆ, ప 276

సవ్యజన చిత్తాకర్షకమగు వాణిని ప్రయోగించుటకు ప్రయోక్తకు విజ్ఞాన కౌశలముండవలెను ఆతని చతురత తెలియుటకు సరసపదముల కూర్పుగల శైలియే సాక్ష్యము. శైలి అను పదము శీలము అను శబ్దమునుండి పుట్టినది 'శీలస్యేయం శైలీ' 'శీలసంబంధి ప్రత్యర్థః' అని దీనిని నిర్ణయించిరి కవియొక్క ప్రజ్ఞాసంస్కారము, భావనాపరిభాష, సంకేతము, సమయము ఏ గొప్పతనమును స్పష్టపఱుచు కావ్యరీతియే శైలి ఇది కవియొక్క నేర్పును ప్రకాశింప చేయు మణిదర్పణము

విషయభేదమునుబట్టి శైలి మారుచుండును ప్రకరణములలో ఔచితి ననుసరించి శైలియున్న కావ్యసౌందర్యము నిరుపమానము గనుండును కావ్యమనే శైలి సందర్భమునుబట్టి ఏనుగు నడక వలెను, హంసనడకవలెను సింహపు నడకవలెను మారుచుండును ఆ ప్రతిభ గల కవికి గీటురాయి ఎంతటి గంభీర విషయమునైనను చిన్న చిన్న పద్యములలో నర్థవంతముగ చెప్పగలుగుట కుమారవ్యాసున కలోకచేత అందులకీ పద్యమే యుదాహరణము-

దాన విల్లద విత్త బుధ స
న్మాన విల్లద రాజ్య పతియభి
మాన విల్లద యువతి సూరిగళిల్లదాస్థాన
జ్ఞాన విల్లద తపవు వేద
ధ్యాన విల్లద విప్ర శర సం
ధాన విల్లద సమర మెరెయదు రాయ కేళెంద[1]

[దానములేనిసంపద, పండిత సన్మానములేని రాజ్యము, సత్పతివర్తన లేని యువతి, విద్వాంసులు లేని ఆస్థానము, జ్ఞానములేనితపస్సు, వేద ధ్యానములేని విప్రుడు, శరసంధానములేని సమరము శోభిల్లవు ]

తానుచెప్ప దలచుకొన్నది నొక్కిచెప్పుటకు కుమార వ్యాసుడు పదములను పునరుక్తము చేయుచుండును-

1, కు భా ఉ ప, సం 3, ప 49

'సిరియుళ్ళవనే కులీనను
సిరియుళ్ళవనే సుశీలను
సిరియుళ్ళవనే విదగ్ధను సకలగుణయుతను'[1]

(సంపదగలవాడే కులవంతుడు, అతడే సుశీలుడు, విదగ్ధుడు, సకలగుణయుతుడు)

'సిరి నెలెయె యౌవన నెలెయె మై
సిరి నెలెయె తను నెలెయె ఖడ్గద
సిరి నెలెయె '[2]

(సంపద శాశ్వతమా? యౌవనము శాశ్వతమా? శరీరసౌభాగ్యము శాశ్వతమా? తనువు శాశ్వతమా? పరాక్రమము శాశ్వతమా?)

కఠిన తత్త్వములైనను సులభ పదబంధములలో చెప్పుట యందు కుమారవ్యాసునకు సాటిరాగలవారు కన్నడ సాహిత్యమున లేరు-

"ఒందు భూపిండదొళు నానా
చందదా ప్రాణిగళు జనిసువు
ఒందు తేజస్సినొళు నానాజ్యోతి యుదయిప్పవు
ఒందు పర వస్తువిన బళిగొళు
బందు దంబుజ భవాండ కోటిగ
ళిందు పవు బేరిల్ల సర్వవు విష్ణుమయవెంద"[3]

(ఒక భూపిండమునుండి పలువిధములైన ప్రాణులు పుట్టుచున్నవి. ఒక జ్యోతినుండి అనేకజ్యోతులు ఉద్భవించుచున్నవి ఒకే పరమాత్మనుండి అనేక బ్రహ్మాండ కోటులు ఉద్భవించుచున్నవి అవి వేరుకావు సర్వము విష్ణుమయము.)

కుమారవ్యాసుని రచన వస్తుస్వభావమును బట్టి శ్రావ్యము కావున ఆతడు 'ఆఖ్యానపద్ధతి' ననుసరించెను అయినను అక్కడక్కడ

---

1, 2 కు వ్యా భా, ఉ ప, సం, 3 ష 87, 88
3 ,, ,, సం, 4 ష 28

నాటకీయతనుకూడ పరిపుష్టముగా పోషించెను. ఇట్లు విరాట ఉద్యోగ పర్వములలో నాటకీయతను చూపిన ఘట్టములు ద్రౌపదీ కీచక సంవాదము, ఉత్తరార్జునుల సంవాదము, కృష్ణకర్ణ సమాగమము దుర్యోధనార్జునులు కృష్ణసహాయము గోరుట కృష్ణుని రాయబారము ప్రధానముగ నెన్నదగినవి.

కుమారవ్యాసుడు తనభారతము ను సాధారణప్రజలకు పఠన యోగ్యముగ సులభగ్రాహ్యమగు 'భామినీషట్పది'లో రచించెను. కావుననే ఆతడు 'జనప్రియకవి'. షట్పదులు ఆరు రకములు అవి శర, కుసుమ, భోగ, భామినీ, పరివర్ధిని, వార్ధక అనునవి. వీనిలో భామినీ షట్పది చాల ప్రాముఖ్యముగలది

భామినీషట్పదికి 6 పాదములుండును. అందు 1, 2, 4, 5 పాదములందు మూడు మాత్రల గణమును, నాలుగు మాత్రల గణమును జంటగా రెండురెండును, 3, 6 పాదములందు అదేజంట మూడు గణములును, మీదగురువును వచ్చును. I U (వ), IUI (జ) గణములు నిషేధములు.

కుమారవ్యాసుని షట్పది రచనము సరసమై, సరళమై, హృదయంగమమై యుండును. భారతమునంతను భామినీ షట్పదులలో రచించిన కుమారవ్యాసుడు దానికనుగుణముగనే కన్నడ నుడికారములను, జాతీయములను, పలుకుబడులను, చక్కని కన్నడ పదముల కూర్పును తన గ్రంథమున విరివిగ నుపయోగించెను. ఇది కుమారవ్యాసునకు కన్నడభాషపైగల అనురక్తిని, అధికారమును వెల్లడించుచు అతని ప్రతిభను చాటుచున్నది

కుమారవ్యాసుని షట్పదులు పాడుటకు యోగ్యములు. అన్నిటను మృదుమధుర పదలాలిత్యము తొణికిసలాడు చుండును. కావుననే ఈతని శైలి పండిత పామరులకు ఆమోదయోగ్యమైనది.

కన్నడ పదముల కూర్పునకు కొన్ని దృష్టాంతములు -

1 అలియలినుంగు 2 కేకనాడు 3 త్రిణాగని 4. కుంతీచిత్త 5 తటతటనాగు 6 నీసబద్ధి 7 నీతిగీతి 8. అతెకత్తతె 9 నాహచిట్ట 10 నుగ్గునుసి 11 మాతుహాళను

12 నినగె సంటనోనాను సమరదలి (నీకు యుద్ధమున నేను కానుక)

13. పాండవరాగు హాలేనేగాల్పు (పాండవుల గాగోగు తేమైనవి)

14 నోడు! రాధాతనుజ నిరవను బేగ పాండెందర్జునన

(చూడు! కర్ణుడున్న చోటును వెంటనే తెలియుమని అర్జునుడనెను)

15 అపళ బరహేళిత్త మగనాటవను నోడలి

(ఆమెను రమ్మను, ఇక్కడ కొడుకు ఆటను చూడనీ)

16. సోలవు గెలవు దైవాధీన, నిన్నాళ్తనకె కుందేను?

(ఓటమి గెలుపు దైవాధీనములు, నీ దొరతనమునకు లోపమేమి?)

17. బాయి నోళొప్పుదు నాగుల నుశివొడె నాయితన బేడ

(నోరు తెరచుట పట్టి మాటలాడకే శునకలక్షణము వలదు)

సంస్కృత పదముల వాడుక—

1. కురుకుల దీప దంత సమీర

2 వీరభట ఫాలాక్ష భీష్మ

3 కౌరవరాయ ధరణి వరాహ

4 వివాహోత్సవ విలోకన కౌతుకిగళు

5 జయవధూటీ విరహాకాతర

జాతీయ సూక్తుల వాడుక—

1. బడవర కోపవొడిగె మృత్యు (పేదవారికోపము పెదవికి చేటు)

2. సేవయందరే కష్టవెంబుదు కోవిదరమత

(సేవాభావము కష్టతరమని కోవిదులందురు)

3. నాలువర నడువణ హావు సాయదు

(నలుగురిలో పడిన పాము చావదు)

4. దేసిగరిగె దేసిగ రొలవు సమనిసబేకు

(జానపదులకు జానపదులే తోడు)

5 బెందుర బెనకి నోయిసు (దెబ్బ చూసి నొప్పి కలిగించు)

6 మదువేయు నాలిగె దేవర మాడువుదు

(పనిమీద ప్రేమతో పరమాత్మ మనుట)

7 వారణవమేలె సుసువె? (ద్రోంలించిన మీదట సరసమా?)

8 నాయి సింహాక్కెదిరె? (కుక్క సింహమునకు సాటిరాగా?)

9 అకట! హెంగసు జన్మ వనుసుఖలి! (అకటా! స్త్రీజన్మము మంచిదీ!)

10. సింహవు హోదరె నరి కేణకిదిరె (సింహముకూడ నక్కకు బెదరుటయా!)

11 పరనిందకనె నింద్యను, పరహితనె వంద్యను

(పరనిందకుడు నింద్యుడు, పరహితుడు వంద్యుడు)

12 దేహక్కె నెళలింగగతి (దేహమునకు నేలపడుటయేగతి)

13 తాయి యిక్కిద నిరుత తప్పే పథ్య ధరెయలి

(తల్లి పెట్టినం మొత్తుతే ఈధరలో తప్పదే పథ్యము)

14 ఒందు వర్ణవ నరిపిదవ గురు (ఒక్క వర్ణము నేర్పినవాడు గురువు)

15 కెలవు గళిసి దరె కెలబరుండు జారువరు

(కొందరు సంపాదించుచో కొందరనుభవింతురు)

16 సత్యవొందే సోపానవు స్వర్గక్కె

(సత్యమొక్కటే స్వర్గమునకు సోపానము)

17 ధర్మవెల్లిహుదల్లి జయ (ఎచట ధర్మముండునో అచట జయము)

18 సమతె యెంబుదు సర్వసాధన

(సమత యనునది సర్వసాధనము)

### వర్ణనములు :

సాధారణముగ వర్ణన అనగా ఋతు, వన, గిరి, తటాకాది అష్టాదశ వర్ణనలేయని సామాన్యాభిప్రాయము కథాకథనము, సన్నివేశ చిత్రణము మున్నగునవికూడ వర్ణనా పరిధిలోనికే వచ్చును.

సమర్థుడగు కవి తాను చేసిన ప్రతివర్ణనము సన్నివేశమునకు, పాత్ర పోషణమునకు ఉత్కర్షనాపాదించునట్లు చేయును. ఈసత్యము నెరిగిన వాడగుటచే కుమారవ్యాసుడు కథాగతి కనుకూలమగు సన్నివేశ చిత్రణమునందే దృష్టిని కేంద్రీకరించును. తిక్కన తన ప్రతిభను వ్యక్తము చేయుటకు సూర్యోదయము, సూర్యాస్తమయము, వన విహారము మున్నగు ప్రకృతి వర్ణనలచే గ్రంథమును పెంచెను. కుమారవ్యాసుడట్టి వర్ణనల విషయమున ఉదాసీనత వహించెను. అట్లని ప్రకృతివర్ణనల నసలే త్యజించెనని గాదు. కథాగతికి భంగము రానట్లు తగుమాత్రముగ చిత్రించెను.

సుదేష్ణ తమ్ముని కోరిక ప్రకారము కార్యము నెరవేర్చెద నన్నది. కాని కీచకునకా రాత్రి యొక యుగమయినది. ఎట్టకేలకు సూర్యోదయ మయినది

ఉదయగా గలద శిరదలి
తరణి తలెదోరిదను తోడెదను భువన దంధకారయ
పరిమళద పావుడ దినలిగళ
కరసిదవు తావరెగళెనె కా
తర లతాంగియు సుళ్ళు తాగితు కుముదినీ పతియు[1]

[సూర్యుడు ఉదయాద్రి శిరముపైకి వచ్చెను. జగత్తుయొక్క అంధ కారమును రూపుమాపెను. పరిమళమును కానుకగా నంపి తామరలు తుమ్మెదలను పిలిపించుకొన్నవి]

మరియొక సూర్యోదయ వర్ణనము భీముడు కీచకుని సంహ రించెదనని శపథము పూనిన మరునాటిది-

'తరణి తెగెదను తావరెయ బాగిలిన బీయగవ'

[సూర్యుడు తామరవాకిలి తలుపు తాళము తీసెను]

సుదేష్ణ సైరంధ్రి విషయమై కీచకుని మందలించి పంపినది. కీచకుడు విరహాతురుడైనాడు. ఇంతలో చంద్రోదయము-

1 కు వ్యా భా, వి ప సం 2, ప 48

"బెచ్చిదవు చక్రాంగయుగమై
కచ్చిదవు మరిదుంబి కుముదవ
ముచ్చిదవు ముఖుడగళ నంబుజరాజి తిమితము గె
హెచ్చిదవు సాగరద తెరెగళు
బెచ్చిదరు జారెయరు చంద్రను
కిచ్చనొట్టిద నబుజభవను వియోగిజనమనకె"

[చక్రవాకములు భయపడినవి. తుమ్మెదలు పుష్పములను కరచినవి. తామరలు తమ ముఖములు తామే మూసుకొన్నవి. సముద్రపు అలల జోరు హెచ్చినది. జారులు భయపడిరి. చంద్రుడు వియోగులకు తాపాగ్నిని రగిల్చెను ]

కుమారవ్యాసునిది ప్రబంధ దృష్టికాదు. కావున సమయోచితముగ ప్రకృతివర్ణన గావింపవలసి వచ్చినపుడు దానిని సూచ్యాయగ చెప్పెనేగాని తిక్కనవలె సందర్భోచితమై సూక్ష్మ వర్ణనలు గావింపలేదు. కుమారవ్యాసుడు శృంగార వర్ణనను కీచకుని మోహావిష్కారాదులందు మాత్రమే గావించెను. తిక్కనతో పోల్చిన ఈ ఘట్టమునందలి ఈతని శృంగారరస పోషణము అత్యల్పము.
దుర్యోధనుని దురాలోచనను తెలుపుటకు-

నెనెవ మంత్రద తన్న తందెయ
మనద మచ్చ నొళు తెదు కర్ణన
నెనహొళు పుటవిట్టు శకునియ నీతియొళు నిగుచి
అనుజసుతరొళు విస్తరిసి మై
దునన సుతరొళు బణ్ణ విట్టను
జనప నసూర్యాంగనెగె తుడిసిదను భూషణవ[1]

[తన ఆలోచనను భూషణమును తండ్రి మనసున గీటు పెట్టెను. కర్ణుని స్నేహమున పుటముపెట్టెను. శకుని నీతియందు

1 కు వ్యా, భా, ఉ ప, సం 3, ష 22

స్వచ్ఛత జేసెను. తమ్ముని యిష్టమున సాగవీసెను. కావ నుతమున మెఱుగుపెట్టెను. ఆ ఆభరణమును అపకీర్త్యంగనకు అలంకరించెను]

కుమారవ్యాసుడు రాజసభను రెండుచోట్ల వర్ణించెను. మొదటిసారి సంజయుడు ధర్మజునిసభలో ప్రవేశించినపుడు, మఱియొక సారి కృష్ణుడు దుర్యోధనుని సభాప్రవేశము చేసినప్పుడును. దుర్యోధనుని సభావైశిష్ట్యమును వర్ణించుచు ఆతని సభయందు వివిధ దేశాగత స్త్రీజనమాతని సేవలోనున్నట్లు వర్ణించుట విశేషము. ఆ స్త్రీ జనమున ఆంధ్ర, కర్ణాటకస్త్రీలు కూడ నుండిరి. వారి వర్ణన మతి సుందరము—

నుడిరొళమృతద రసవ సేళెవ
నడిగొళంచెయ నణక వాంతవ
కుడితె గంగళ బలెయ బీసువ కామ మృగకులకె
బెడగుమిగె బహు కామభోగద
కడలొళగె విటదయువ ముళుగిప
కడుగరువెయరు సరసెయరు తెలుగితియ రొప్పిదరు[1]

[మాటలలో అమృతమును చిప్పిలజేయుచు, నడకలలో హంసలను హాస్యమాడునట్టి వారి సౌందర్యమను వలను మన్మథుడు విసరెను. తమితీరని కామభోగము లనెడు సముద్రమున విటచయమును మునిగింపగల సమర్థులు, సరసవతులు ఆంధ్రస్త్రీలు.]

గరువికెయ గాడికెయ సురతా
తురద చిత్తద సంచు బుద్ధియ
తరళతర మృదుమధుర చపల చతురకెయ
సరసెయరు కడు చలువికెనొళ
చ్చరియరిగె హొంబైక్కెగళెనిసువ
తరళ నయనెయ రొప్పిదరు కర్ణాటవనితెయరు[2]

1, 2 కు భా, ఉ.ప, సం 8, ప. 56, 60

(సమృద్ధతతో, సౌందర్యముతో సురతాసక్తిని కలిగించుబుద్ధి కలవారిలు, మృదుమధురవచనముల చపలత చతురతకల సరసవతులు, అమిత సౌందర్యముతో అప్సరసలకే సాటియనవచ్చు చందలాంతులు కర్ణాటక స్త్రీలు )

ఉద్యానవన వర్ణన-

> లలిత శుకచయ చంచుపుట ని
> ర్దళిత జంబూపక్వఫల రస
> లుళిత నవమకరంద మధుర రసానుపానదొళు
> తిళిత కిన్నర మిథున సుఖ పరి
> మిళిత గీత శ్రవణ సన్నుత
> పుళిన ఒప్త మరాళ పెసెదుదు గజపురోద్యాన[1]

(సుందరమైన శుకసమూహముయొక్క చంచుపుటముల నుండి జారిన చక్కని నేరేడుపండ్ల రసముతో కూడిన నవమకరంద మధుర రసపానముచే తృప్తి చెందిన కిన్నర మిథునముల సుఖసమాగమము చేతను, గీతశ్రవణముల చేతను గజపురోద్యానము శోభిల్లుచున్నది )

నగర వర్ణన-

> అరగె పాతాళద విళాసిని
> యరిగె ఖాతికెయో సుదుర్గద
> సెరెయుగళో బలుగోటెయో నిచ్చణికెయో దినద
> మురిమురిద పులిముఖద హేమద
> బెరదలెనెగళ వజ్రమయ దు
> ర్ధర కవాటద పుటనొళెసెదుదు హస్తినానగర[2]

(పాతాళలోకమందలి విలాసినులకు మార్గమగు అఖాతము, ప్రవేశింప శక్యముగాని రక్షకకవచముగ గట్టికోట, స్వర్గము చేరుటకు నిచ్చెనలుగ కోటబురుజలు, పులిముఖములతో బంగారురేకులు తాపడము చేయబడిన వజ్రమయకవాటములు కలిగి హస్తినానగరము విరాజిల్లుచున్నది )

---

1, 2 క వ్యా భా, ఉ ప సం, 2 ష 27, 28

సముద్రవర్ణన-

మొరెదుమిగె తలెయెత్తి కెరళ్దై
మురిదు మొళగుళు ఘుళిత ఘన ని
ష్ఠుర నినాదద గజఱు గాడిసె వాళి లహరిగొళు
తెరెతెరెయ తివిదెద్దు గగనకె
ఎరగి నెలకె ఉరిదు ఉళియిం
తెరసె నాగనుబ్బు గవళిన కొండవోల్ మెఱెదు[1]

(అధికముగా ధ్వనిచేయుచు తలయెత్తి కోపమును తీవ్రముగ చేసికొని సముద్రము ఘుమఘుమ ఘనమగు నినాదముతో గర్జించుచుండెను. కెరటము ఒకదానినొకటి గుద్దుకొని పైకిలేచి ఆకాశమునను వ్యాపించి తిరిగి భూమికి దిగుచున్నట్లు కనబడుచుండెను. సముద్రుని గర్వమణచుటకే నెత్తిపై కొండలనుంచి నట్లున్నది)

## ఛందస్సు

కుమారవ్యాసుడు తన భారతమునంతను భామినీషట్పదిలో విరచించెను. 'హళెగన్నడ' (ప్రాచీనకన్నడ) సాహిత్యములో మూడు సంప్రదాయములు మనకు గోచరించుచున్నవి 1 విద్వత్సంప్రదాయము 2 దేశిసంప్రదాయము 3 మౌఖిక సంప్రదాయము. ఇందు విద్వత్సంప్రదాయము సంస్కృత ఛందస్సు ననుసరించి కన్నడము లోనికి వచ్చినది. దేశి సంప్రదాయము కన్నడములోనే పుట్టిపెరిగినది. మౌఖికసంప్రదాయము జానపదసాహిత్యమునకు చెందినది. షట్పదిసాహిత్యము దేశిశాఖకు చెందినది. వీరశైవ కవియగు రాఘవాంకుడు మొట్టమొదట షట్పదిని కల్పించెనని ప్రతీతి. ఈ షట్పది నిర్మాణము 12,13 శతాబ్దములమధ్య జరిగినదని చెప్పవచ్చును కాని ఆకాలమున పేర్కొనదగినంత వికాసము నొందలేదు. క్రీ శ 15-18 శతాబ్దముల మధ్యకాలముననే షట్పది మిక్కిలి వికాసము నందినది

1 కు వ్యా భా, వి ప, సం 1, ప 19

కావుననే ఈ కాలమును కన్నడసాహిత్యచరిత్రలో 'షట్పదియుగ' మందురు ఈకాలమున 488 మందికవులు 582 కావ్యములను షట్పదిలో విరచించిరి

షట్పది ఆరువిధములు అవి శర కుసుమ, భోగ, భామిని, పరివర్ధిని, వార్ధక అనునవి షట్పదియనగా ఆరుపాదములతో కూడినది ఇందు పూర్వార్ధమైన మూడుపాదములు ఉత్తరార్ధమైన మూడు పాదములు నొకేరీతిగ నుండును భామినీషట్పది లక్షణాదుల నెఱుంగుట ఇట సమంజసము

## భామినీ షట్పది

భామిని యనగా కాంత, యువతి కాంతలకు సహజగుణము లగు సొగసును, ఒయ్యారమును కుమారవ్యాసుడు తన భామినీ షట్పదిలో కూర్చెను ఈషట్పది శ్రావ్యముగా గానము చేయుట కనుకూలమైనది

### లక్షణము :

మొదటిరెండు పాదములు నొక్కొక్కటి 14 మాత్రలు కలిగియుండును మూడవపాదము మొదటిపాదమునకు ఒకటిన్నర రెట్లుండి అంత్యమున అదనముగ గురువు కలిగియుండును. అనగా ఈ పాదము (21+2) 23 మాత్రలు కలిగియుండును ఇదిపూర్వార్ధము ఉత్తరార్ధమును ఇదేవిధముగ నుండును. ఈషట్పదియందు 1,2,4,5 పాదములు ఒకేరీతిగను, 3,6 పాదములు ఒకరీతిగను ఉండును 3,6 పాదముల చివరి అక్షరము లఘువయినను గురువుగనే పలుక వలెను. దీనికి ఉత్సాహ, మందానిల అనునవి గణములు ఉత్సాహ అనునది మూడుమాత్రల గణము 'మందానిల' అనునది నాలుగుమాత్రల గణము మూడు మాత్రల గణము తరువాత నాలుగుమాత్రలగణము వచ్చును ఈగణములు 1, 2, 4, 5 పాదములలో రెండు రెండుండును.

ఉత్సాహ | మందానిల | ఉత్సాహ | మందానిల

3, 6 పాదములలో మూడు మూడు గణములు చివరనొక గురువు నుండును

ఉత్సా | మందా | ఉత్సా | సుందా | ఉత్సా | మందా | గురువు

ఇది భామినీషట్పదియొక్క లక్షణము కుమారవ్యాసుని షట్పదులపై నీలక్షణమును పరిశీలించుతాము.

1
∪ | | ∪ | | | | | | | | | |
మెల్ల | మెల్లన | ముసుక | సడలిసి 14 మాత్రలు

∪ | | | | | | | | | | ∪ | |
గల్ల | వనహూకి | దెలుగ | ల్ప్రపతి 14 మాత్రలు

∪ | | ∪ | | | ∪ | | | | ∪ | ∪ | | ∪ | | | ∪
మల్ల | నెద్దను | నోడె | దనుపాం | చాల | నందినె | య 23మాత్రలు

2
| | | | ∪ | | | | | | | | | |
అవళ | గంటురు | బిరురు | బిరిరిగె

| | | | ∪ ∪ | | | | | | | |
నమగ | దావం | తరవు | మునిదరె

| | | | | | | | ∪ | | ∪ | | | ∪ | | ∪ | | | ∪
దివజ | దళకిడి | రారు | నమ్మన | దారు | కావప | రు

ఉత్తరార్ధములుకూడ నిట్లే యుండును.

ప్రాచీన తెలుగు సాహిత్యమున షట్పది రచనము కన్పట్టదు కాని అప్పకవి, అనంతుడు తమలక్షణ గ్రంథములందు షట్పది లక్షణములనుకూడ చెప్పిరి 'కన్నడ కస్తూరి'గ ప్రఖ్యాతి నొందిన షట్పది విశిష్టతను తెలుగుకవులు తమ గ్రంథములలో ప్రస్తుతించిరి

1 అలరుల మందహాసముల నన్నన షట్పద మంజుగీతి[1]

2 కన్నడ కవితా వితానంబునుంబోలె షట్పదవృత్త విలాస భాసురంబై[2]

---

1 నన్నెచోడుడు, కుమారసంభవము, ఆ 4 ప 103

2 తె రా కృ. పాండురంగమహాత్మ్యము, ఆ 4, ప 10

శి వనితామణి యీచోద్యము
గనుగొంటే షట్పదములుగల మంజరులం
దు నవీనాగమ రూశిని
ఘన పద్యాన్వితము లగుచు గానంబడియెన్[1]

తెనుగున లాక్షణికులు చెప్పిన లక్షణము కన్నడలాక్షణికులు చెప్పిన లక్షణమునకు భిన్నముగానున్నది. తెనుగువారు గణనియమము పాటించిరిగాని మాత్రానియమము పాటించలేదు. అనంతునిఛందమున షట్పద లక్షణమిట్లున్నది—

మెఱయంగ నిగ్గతి
గ్గఱు సురేంద్రులు మూఁడు
తెఱఁగులన్ శశిఁగూడ నర్ధంబులన్
నెఱిఁ గ్రాలఁగా వళ్ళు
దొఱఁగ షట్పదరీతి
వఱలుఁ జక్రి పద్యాబ్జ వర్ణనంబు[2]

కన్నడ ఛందస్సు లన్నింటికివలెనే భామినీషట్పదికి యతి లేదు కుమారవ్యాసుడు ప్రాసనియమమును పాటించెను ఒకేవిధముగ ధ్వనించు అక్షరములకు భేదమును పాటింపలేదు అనగా ల-ళ, ర-ఱ, న-ణ లకు భేదమును పాటింపలేదు అచ్చటచ్చట దుష్టప్రాసమును కూడ చేయుట కనబడ గుంగును.

నిన్న ఋగ్ గళు కువరి భీష్మరు
కర్ణగురు కృప గురు తమూథప నెంద నాకంక

ఛందస్సు వ్యాకరణాది విషయములందు తెలుగులో మనకు తిక్కన ప్రామాణికుడు కాని కన్నడమున కుమారవ్యాసునట్టి ప్రామాణికునిగ వారు పరిగణింపరు

1 అ రా, రామాభ్యుదయం, ఆ1, ప 22
2 అనంతుడు, ఛందోదర్పణము, ఆ 3, ప 46

### రసము :

కుమారవ్యాసుడు భక్తిప్రధానుడు కావున సందర్భాను సారముగ రసమును పోషించుటయేగాని నవరసములు తనగ్రంథమున నుండవలెనను కౌతుకమాతనికి లేదు అటులని సందర్భము వచ్చిన విడువలేదు అంతియేగాక హాస్యప్రియుడు ఆసహాసుణాలో తొక్కి నను మించి సామాన్యజనుల కత్యంత ప్రియుడయినాడు దీనికి మూలమునందును మనకు ఆధారము లభించదు కుమారవ్యాసుడు పోషించిన హాస్యము సంస్కృతాంధ్రములందు కనబడకపోవుటయే గాక కన్నడకావ్యము లందును అరుదు ఉత్తరకుమారుని ప్రసంగము, ఉత్తరార్జునుల సంభాషణము రూపమున ఆతడు చక్కని హాస్యము నందించెను కుమారవ్యాసుని సున్నితమైన హాస్యము హృదయాహ్లాదము కలిగించుచు సర్వజనుల కాస్వాదము, ఆమోద యోగ్యము నయినది.

ఇట్టిదే మరియొక సన్నివేశము శ్రీకృష్ణుడు కౌరవసభలో ప్రవేశించినప్పటిది అందరును గౌరవపురస్సరముగ లేచి నిలబడిరి దుర్యోధనుడు తనసింహాసనము నుండి లేవడు అంతట కృష్ణుడు తన కాలి బొటనవ్రేలితో భూమిని నొక్కగా దుర్యోధనుడు తన సింహాసనము నుండి దొరలుచువచ్చి కృష్ణుని పాదముల పైబడెను[1] అంతట కృష్ణుడు 'అక్కట! ఇంత వినయమెందులకయ్యా? నేనే నీచెంతకువచ్చినను కదా!' అని నవ్వుచు పేవడీయును భాసుని దూతవాక్యమునుండి గ్రహించి దీనిని తనగ్రంథమున చేర్చుకొనుటలో కుమారవ్యాసుని హాస్యప్రియత్వము

1 సెణసు సౌరద దేవనిదిరొళు
మణియ దాతన కాణుతవె ధా
రుణియు నూకిద నంగుటద తుదియింద నసునగుత
మణి ఖచిత కాంచనద పీఠద
గొణసుమఱిదుదు నఛదె సురసం
దణి గళువిపె హరళిబిద్దను హరియ చరణదొళి ఉ ప సంధి, ష 88

వెల్లడి యగుచున్నది. మఱియొకటి కృష్ణుడు విదురునియింటికి ఆతిథ్య
మునకు వచ్చినప్పుడది విదురునకది ఎదురుచూడని సన్నివేశము
కావున ఆతడు ఆనందముతో నాట్యముచేయునేగాని కృష్ణున కాతిథ్య
మొసగడు అంతట కృష్ణుడు నేనుఆకలితో నీయింటికిరాగా ఆతిథ్య
మొసంగవేమయ్యా? అని[1] మేలమాడును

నవరసములలో శృంగారము రసరాజుగా ప్రసిద్ధము
సాహితీమార్గమున కవులు దీనికిచ్చిన ప్రాధాన్య మనుపమానమైనది.
కాని కుమారవ్యాసుని భారతమున శృంగారమున కంతటి ప్రాధాన్య
మీయబడలేదు కావుననే అవకాశమున్నను ఉత్తరాభిమన్యుల
వివాహసన్నివేశమున ఉదాత్తశృంగారమును వర్ణింపలేదు కీచకుని
విషయమున వర్ణించిన మోహవికారాదులు శృంగార రసాభాసము
నకు పోషకములగునేకాని శృంగారరస పోషకములు కాజాలవు ఈ
కారణములచే మొత్తముమీద శృంగారరసమును పరిపుష్టముగా
పోషింపలేదని చెప్పవచ్చును

కుమారవ్యాసుడును తిక్కనవలె కీచకవధఘట్టమున రౌద్ర,
బీభత్సరసములను, దక్షిణోత్తర గోగ్రహణ ఘట్టములందు వీరరస
మును పోషించెను వేరుతావులందును కుమారవ్యాసుడు జానపదు
లకు ప్రియమగు రౌద్రరసమును చక్కగా పోషించెను.

అదిధర్మరాజసభ అనంతర కర్తవ్యాలోచనా సమయమున బల
రాముడు కౌరవపక్షమున మాటాడును ఇట సాత్యకి ఉత్సాహము
దర్శనీయము-

---

1 దండు కుణిపను మనెయ మురిదీ
డాడిదను మైమఱెద హసండి
గాడికె యొక ప్రతిమ నెసెదం చక్రికెళె యొడ
వాసిదు నావై తందొడె పరి
మసగి కుణి దాడి దొడె మేలి
వసతి యను నీమఱెయ బిసుటొడె నమగె తణివహుదె

ఉ ప, సం 8, ప 11, 12

"బలరాముని మాటకేమి? కౌరవశతమును సంహరింపక, యుద్ధభూమిని గాక ధర్మరాజా! మంచి మాటలతో నీకు భయపడి రాజ్యభాగము నిత్తురా?[1]" అనును

అట్లే భీముని మాటలయందు వీరరస ముట్టిపడుచుండును సంధి కంగీకరించిన పాండవులను నిందించుచు ద్రౌపది భీముని రెచ్చగొట్టినది. అంతట భీముడు మీసము మెలితిప్పుచు ఎడమచేతితో ద్రౌపది కేశపాశమును సవరించుచు క్రోధాతిరేకమున చిగురుడి పడుచు 'ఏకమూర్ధన! వినుము, నక్కలవంటి కౌరవులగాక తోడేళ్ళనాకు! కులీనులను చీల్చెదను యమునిద్రావతను చేరిపెదను[2]' అనును

తిక్కన రౌద్రవీరాదులను వర్ణించునప్పుడు దీర్ఘసమాస జటిలమును, పరుషాక్షర ఘటితములును నాడి రసమును చక్కగా నభివ్యక్తము చేయుచుండును అట్లే శృంగారాది రసములను వర్ణించు తావుల అలతియలతిపదములతో లలితమంజులముగా వ్రాయుచుండును. కుమారవ్యాసుడట్టి రసవర్ణనములందైనను కఠినపదములు ప్రయోగింపకయే రసపోషణమును గావించును అంతియేగాక రసానుగుణ

1 బలన మాతేని వన భాగ్యద
నెరెయపడ కౌరవర శతకద
తలెగ తాపీయనలె కుంతీకుమారకనె
నెలన నలుగిన మొనెగొళ్లదె
మెలు నుడియ సామదొళు నిమగి
న్నిళెయ కొడువరె ధరెయొళుళిత క్షత్రియాత్మజర — ఉ ప సం 1 ష 8

2 ఉరిపోఖ మీసెగళ బెరళొళు
ముఱహి వామద కరది తరుణియ
కురుళ సంతైసిదను కిడికిడి యాగి ఖాతిమొళు
సరభమర్దన కేళు కౌరవ
నరిగళిదిరే కేసెవెను కుల
గిరిగళను తొడెవెను కృతాంతన బాళ దక్కరవ — ఉ ప సం 6, ష 28

ముగ దేశిపద్ధతుల నుపయోగించి దేశితనమును సర్వతోముఖముగ నెల్లడించెను

కుమారవ్యాసుని భారతము భక్తిరసప్రధానము. సుదేష్ణా జ్ఞానుసారము ద్రౌపది కీచకునింటికి బయలుదేరినది అన్యథా శరణము గానక శ్రీకృష్ణుని ధ్యానించును-

హరి హర శ్రీకాంత దానవ
హర మురారి ముకుంద గతిహా
న్నరిగె నీవె గతి[1]

ఉత్తరాభిమన్యుల వివాహఘట్టమున శ్రీకృష్ణుని ప్రవేశపెట్టుట భక్తి రస పరిపోషణమునకేగాని వేరుకారణము కనబడదు విశ్వరూప సందర్శనము అద్భుత రసమోహాకము శ్రీకృష్ణుడు మెఱుపులీగవలె ప్రజ్వరిల్లి క్రమముగా నూరుసూర్యుల కాంతితో కౌరవాస్థానమున విశ్వరూపమును చూపెను

విదుర నింకెనుతిరలు మించిన
హొందరు హరి గొండంకె రవి శతి
వుదిరిదవు మైమురిదు నిందొడె దేవసంగ నొళు
సదెయదాస్థానవను ఘనతే
జద లహరి నీలెయలి హరితో
ఱిశను నిరుపమవిశ్వరూపవనా మహాసభగె[2].

[విదురుడు ధృతరాష్ట్రునకు సంగతి వివరించుచుండ శ్రీకృష్ణుడొక్క సారిలేచి నిలబడెను వెంటనే అతని దేహమున మెరుపు కాంతి వ్యాపించినట్లుగ రవిశత ముపయి చెదు గొప్ప తేజస్సునెడు కెరటములు ఆస్థానమునంత నావరించెను. ఆమహాసభకు హరి నిరుపమాన ముగు విశ్వరూపమును చూపెను ]

1 కు వ్యా భా, వి ప సం 8 ష 5
2 కు వ్యా భా, ఉ ప సం 10, ష 27

**అలంకారములు :**

విమర్శకులు కుమారవ్యాసుని 'రూపకసామ్రాజ్య చక్రవర్తి' యని పేర్కొనిరి. భారత కథామంజరిని పరిశీలించిన అతడు ప్రయోగించిన అలంకారములలో మూడువంతులు రూపకాలంకారములే గోచరించును. కావున నీతనికీ బిరుదము సార్థకమనియే చెప్పవచ్చును. రూపకముల విషయమున నీతని ననుకరించుట తరువాతి వారికెవరికిని సాధ్యము కాలేదనికూడ చెప్పవచ్చును. ఈతని రచనమందు రూపకములు అలవోకగా వచ్చి చేరుచుండును. కావున నవి భావపుష్టములై యతికినట్లు సరిపోవును. అన్యులుపయోగించిన రూపకములను కుమారవ్యాసు డెన్నడును ప్రయోగింపడు. అటులని యితరాలంకారముల నీతడు పోషింపలేదని భావింపరాదు. కొన్ని అలంకారములను గ్రహించి వానిని కుమారవ్యాసుడెట్లు ప్రయోగించెనో పరిశీలింతము.

1 తను నాల్కరలి జీవాత్మ నీవెమగె
(మాయీ నాలుగు శరీరములకు నీవే జీవాత్మవు)

2. ఎళసగెయ బెళుదింగళను నీ
తళిదు తాపవ కెడిసు మెలునుడి
యలి సుధెయింద తృష్ణెయ నకట పరిహరిసు
(చిఱునవ్వను వెన్నెలను నీవు ధరియించి తాపమును బోగొట్టుము
నీ మృదూక్తులనెడు అమృతముతో దాహమును పరిహరించుము)

3. రాయ నాజ్ఞెయ కణ్ణియలి బిగివడెదు కెడెదవు
(రాజాజ్ఞయనెడు త్రాడుతో బిగింపబడి చెడితిమి)

4 తరణి తెగెదను తావరెయ బాగిలిన బీయగవ
(సూర్యుడు తామరయొక్క తలుపు తాళము తీసెను)

5. కారిరుళ పట్టణకె చంద్రన తోరణవ బిగిదంతె
(గాఢాంధకార పట్టణమునకు వెన్నెల తోరణము కట్టినట్లు)

6. ఘనసింహనాదద సిడిల శిక్షా గురువెనలు మసగిదను కలిభీమ
(గొప్పసింహనాదముచే పిడుగునకు పాఠము నేర్పువాడనునట్లు వీరు
డగు భీముడు ప్రకాశించెను)

7 సిడిల పొట్టణగట్టి శాఖవ కొడువరే
హరనేత్రవహ్నియొళ్ తబెనెన సుత బగెవలా మరుళె
(అగ్ని పొట్లముకట్టి కొమ్మకు తగిలింతురా? హరనేత్రాగ్నితో
యుబలను దహింపచేయు చున్నాడు మూర్ఖుడు)

8 ద్రౌపదియ నిట్టుసిరినబిరుగాళి భీమనరోషవహ్నియను హొత్తిసితు
(ద్రౌపది నిట్టూర్పనెడు సుడిగాలి భీముని రోషాగ్నిని ప్రజ్వరిల్ల
జేసెను)

9 అపకీర్తియ నారియ సెరగు హిడిదరు(అపకీర్తి కాంత చెరగుపట్టిరి)

10 అర్జన వదనకమలకె నమ్మ పౌరుషవిందు హిమ వాయితు
(నన్ను ముఖ సేవాభావము మనపౌరుషమును చల్లబరచినది)

11 ఉబ్బిదనత్తె మధురవచనద హొబ్బదలి
(మధురవచనోత్సవమున ఉబ్బిపోతిని)

12 కౌరవ ననుజరను కెడెహొయ్యద గర్వద గిరియ నిళి
(దుర్యోధనుని, సోదరులను చెడగొట్టుచున్న గర్వమనెడు కొండ
నుండి దింపు)

13 అవరిగె విజయకామిని ఓలియుర కళుహిదళు
(వారికి విజయకాంత కానుకలంపినది)

14 కురుకులదబేరను కొయ్యు నీ హరిబళి సలిసి భీమార్జునాస్త్రదలి
(కురుకుల మూలమును కోయుటకు ఈహరిచెంత భీమార్జునాస్త్రములు
కలవు)

15 బందుగళ దరుశన ఫలవలా సంసార తరువింగె
(సంసార వృక్షమునకు బందుగుల దర్శనమే ఫలము)

16. యాదవసైన్యసాగరవ (యాదవసైన్యసాగరము)

17 కరగునపుడు శశికాంత చంద్రదన కిరణ తాగలు
   వజ్రహతియను దరిదిల్లదె గిరిగళఖిరువవు
(చంద్రుని కిరణములు తాకగనే చంద్రకాంతిపు శిలకరగును. వజ్రాయుధపు దెబ్బను చూచినప్పుడే కొండలు లో ంగును)

**ఉత్ప్రేక్షాలంకారము :**

తనకులమువాని హృదయాంధకారమును బోగొట్టుటకు చంద్రుడు వ్యాపింపజేసిన వెన్నెలయో యనునట్లు శ్రీకృష్ణుడు తన దంతికాంతులను సభయంతటను వెదజల్లుచు మాటాడనారంభించెను—

కులదవన హృదయాంధకారవ
కళచలెందు హిమాంశు హరహిద
నెళెయ బెళదింగళ నెనలు సురరిపు కులాంతకను
తొళపద దశన మయూఖతతి హొళె
హొళెయ నుడిదను తత్సభా మం
డల మహాబ్ధియ నుడి దెరెయ తనిగడణవగెరలు[1]

**అర్థాంతరన్యాసాలంకారము :**

కృష్ణుని బంధించినచో పాండవులు ఎదిరింతురని చెప్పుచు గాలి యుపశమించిన అగ్ని తానే చల్లారునని సమర్థించుచు పలికిన దుర్యోధనుని పలుకులు—

గాళియుపశమిసి దొరెదె వహ్ని
జ్వాలె తానే నిలువ దీతన
తొళ బిగిదొడె బళిక మసగుందువరు పాండవరు[2]

**ఉపమాలంకారము**

సింహముభార్య దగ్గరకు నక్క ప్రీతితో చేరినట్లు గరుడుని కాంతదగ్గరకు పాము వలపుతో చేరినట్లు కీచకుడు ద్రౌపది చెంతకు చేరెను.

1, 2 కు భా, ఉ ప, సం 8, ష 87, 81

సింహద సటిగె నరి మనవొలిదు వొప్పదలి

గరుడన లలనె గహాబయసువ నొలన

నయిడదను కాలకీయు[1]

సింహగు పర్వతశిఖరముపై పడినట్లు భీముడు దుష్టుడగు కీచకుని తలపై పడెను.

బరసిడిలు పర్వతద శిఖరద మెంగువంతిరె

ఖళనసెత్తియ మెరగి[2]

శిఖమునుండి దిగుచున్న కౌస్తుభకాంతులు సెదజల్లు నీలదేహుడగు కృష్ణుడు మెఱుపుతో కూడిన మేఘమువలె నుండెను.

అరగిరియ తుదియిందె

మిఱుగుంచుగళ మిగిలి సంతె బాలెశకె

అంజనీలాచల నికాయను

సుందరాంగద కౌస్తుభప్రభె

యింతె కాంచనరథద నిళదను దానవధ్వంసి[3]

### తులనాత్మక పరిశీలనము

తిక్కన, కుమారవ్యాసుల శైలీస్వరూపము దేశీయము, నాటకీయము, ఆలంకారికము నైయున్నది కుమారవ్యాసుడు భక్త్యావేశమున పొంగులువారు కవిత్వమును రచించెను ఈతని శైలి నృత్యము చేయు నాపసమశిఖరి నాట్యమును బోలియుండును తిక్కన బుద్ధిగమ్యమైన శైలితో నాటకీయతను రచనలో పాటించెను ఈతని శైలి రసాభ్యుచిత పదబంధములతో గూడి నిర్మల గంగాప్రవాహమును పోలియుండును

కావ్యసామాన్యసరణి, పదగుంఫన సరణి అని శైలి రెండు విధములు. ఆఖ్యాన, నాటకీయ, వర్ణనాత్మకములని కావ్యసామాన్య

1 క వ్యా, భా, వి ప, సం2 ష 15
2 ,, సం 3 ష 89
3 ,, ఉ ప, సం8, ష 81

సరణిలో భేదములు, పదగుంఫన సరణిలో బుద్ధిగమ్యము, భావస్ఫోరకము, కర్ణపేయము ననునవి భేదములు. తమ కావ్యోద్దేశములనుబట్టి, రచనావిధానమునుబట్టి మొదటిదగు బుద్ధిగమ్యశైలికి తిక్కనయు, రెండవదైన భావస్ఫోరకశైలికి కుమారవ్యాసుడును చెందుచున్నారు. అట్లనుచో మిగిలిన రెండును వారిరచనముల లేవని కాదు. మనస్సున నిగూఢముగనున్న సుప్తచేతనమును మేల్కొల్పి నిరతిశయానందమును కలిగించునది శైలి. అదిపుష్పములోని పరిమళమువలె ఆనందపరచును. ఆకుల గుబురున దాగినను పుష్పసౌరభము దాగదుగదా! తిక్కనది నాటకీయశైలి కాగా కుమారవ్యాసునిది దేశీయశైలియైనది. పాత్రోచితమైనభాష, భావసాకుమార్యము, జాతీయములు, పలుకుబళ్ళు లోకోక్తులు మొదలగువాని ప్రయోగములచే సిద్ధించినసహజత, జీవకళ మొదలగునవి దేశీయశైలి లక్షణములు. కుమారవ్యాసుని కాలమున కృష్ణానదికి ఉత్తరతీరము ముసల్మానులచే వశపరచుకొనబడినది. అచట సాంప్రదాయజీవనము గడపెడివారు నెమ్మదిగ దక్షిణాపెకి వలసవచ్చి గేయరూపమున సులభ దేశీయశైలిలో పురాణగ్రంథములను వ్రాయుచు ప్రచారము చేయజొచ్చిరి. ఈరీతిగనున్న సాంఘికస్థితుల అవసరము తీర్చుటకు కుమారవ్యాసభారతము కర్ణాట భారతి కథారూపములో.

కర్ణాట భాషాగేయా !
ప్రాణాక్షర సమన్వితా ।
షట్పదీ తాల రహితా ।
సానుప్రాసా కథాత్మికా ।

పతనావస్థలోనున్న కన్నడ సాహిత్యము సార్వజనీనమైన శైలిలో మరల ఊపిరిపోసికొన్నది. దీనికి నాటి ద్వైతమత ప్రభావముతోడై గ్రంథము కృష్ణరాయకమైనది. కుమారవ్యాసుని భారతము పాడుకొనుటకు వీలైనది. ఇదిజన ప్రచారమునకు తోడ్పడినది.

తెలుగున భాగవతమున కీర్తనమున్నది. అదిపాడుచుండగ వినుటకు శ్రవణపేయమై యొప్పును శబ్దాలంకార యుక్తమైన కుమార వ్యాసుని శైలి కన్నడదేశమున అతని కఖండ గౌరవమును కలిగించి జనహృదయములలో శాశ్వతస్థానమును కల్పించినది.

> 'వారియను సంసార సుఖ సా
> కారియను జననయన కారా
> గారియను మునిధైర్య సర్వస్వాపహారియను'

ఇట్లే తని రచనము గీతి గుణపూర్ణము.

కృష్ణుని నాయకునిగ చేయుటలోను, తన భారతమును దశ పర్వములకు పరిమితము చేయుటలోను, భాగవతమువలె భక్తికావ్య ముగ రచించుటలోను, జనసామాన్యమున వినియోగములో నున్న పదములను వాడుటలోను దేశీయశైలిని కుమారవ్యాసుడు ప్రతిష్ఠించి నాడు

తిక్కన రసశిల్పి. భారత శాస్త్రేతిహాసమును కావ్యేతి హాసముగ మలచుకొన్నాడు అతనికి భారతము వివిధార్థగతి స్ఫురణ గలది తననాటికే మరుగువడ్డ మార్గశైలీ సమన్వితమైన నన్నయ భారతమునకు అట్టిగతి పట్టించిన శివకవులమార్గమును జాగరూకతతో సరసి చూచినాడు. నిర్వచనోత్తర రామాయణమును రచించి మనుమ సిద్ధి కంకితమిచ్చినాడు జనులనాడిని కనిపెట్టిగాను వైదికమార్గ సిద్ధిలో సాగిన నన్నయభారతము శివకవుల వీరభక్తి ఉద్యమము ముందు నిలువలేక పోయినది అనాడు వారు దేశీయమైన శైలి, ఇతి వృత్తము, ఛందస్సు అను అస్త్రములతో ప్రజాహృదయములను సంపూర్ణముగ దోచుకొనిరి అంతకుపూర్వము ఉత్తరభారతము నుండి జైనులరాకతో ఆంధ్ర, కన్నడదేశములు జైన ప్రాబల్యమునకు లొంగినవి. కావుననే ప్రాచీనసాహిత్యము జైనమత ప్రమేయముతో వెలువడినది. కన్నడ ఆదికవిపంప భారతమిందుల కుదాహరణము.

తెలుగునగూడ అథర్వణభారతము జైనమత ప్రభావమునకు లోబడి నదేయందురు. మనపుణ్యము మంచిదగుటచే నన్నయ వేసిన మార్గ శైలి నేటికిని చెక్కుచెదరక స్థిరముగ నిలిచినది. గురుపద్యవిద్యకు కవిత్రయము నందలి ప్రథముడు ప్రథముడే. అన్నమాసీయ స్థితికి మూలమై నిలిచి రసాభ్యుచితబంధముగ కవితనల్లినవాడు తిక్కన. తిక్కనశైలిలో సౌమ్యత, సౌకుమార్యము తొణికిసలాడు చుండును.

బౌద్ధమతావలంబియగు కుమారిలభట్టు తాకిడినుండి వైదిక మతమును శంకరాచార్యులు నిలబెట్టినట్లు తిక్కన సమకాలీన బౌద్ధ, జైనపండితులతోను, వీరశైవ, వైష్ణవమత ప్రవర్తకులతోను చర్చలు జరిపి సమన్వయము చేసినట్లును, ఆతడు కాకతిరాజ్యమునకు వెళ్ళి చేసిన ఘనకార్యములను చరిత్ర చక్కగా చాటుచున్నది. శివకవుల వీరావేశమునకు భరతవాక్యముపాడి సమన్వయ ప్రవక్తగా నిలచుటచే తిక్కన తన మార్గమునకు నాటకీయశైలి నెన్నుకొనినాడు.

వ్యాసునిది ఐతిహాసిక నిర్మాణము ఆర్షశైలి కృతి శిల్పము అనువాద కవులరీతి అదికాదు వారిది కావ్యశైలి, రస శిల్పము వ్యాసునిభారతము శాస్త్రేతిహాసము. అనువాదకులదికావ్యేతి హాసము వ్యాసునినాటి నిసర్గశైలి అనువాదకవుల నాటికి దేశీయము గను, నాటకీయముగను మారినది.



# సప్తమాధ్యాయము:-

## సాహిత్యపరంపరలో స్థానము

ఆరవ అధ్యాయమున తిక్కన కుమారవ్యాసుల శైలి స్వరూపము దేశీయము, నాటకీయము, ఆలంకారికము నని పేర్కొనుట గాంచితిమి. తిక్కనది బుద్ధిగమ్యశైలియనియు, కుమారవ్యాసునిది భావస్ఫోరక శైలియనియు తెలిసినది ఈ అధ్యాయమున వారిరువురి పై పూర్వకవుల ప్రభావమును, తరువాతి కవులపై వీరి ప్రభావమును పరిశీలింతుము

### తిక్కనపై పూర్వకవుల ప్రభావము :

మహాకవి యగువాడు తన పూర్వ సాహిత్యగ్రంథముల నన్నిటిని అధ్యయనము చేసియుండును. అతని మనసునకు నచ్చిన కవులయొక్క రచనా విధానమునుగాని, పద్యములనుగాని తన గ్రంథమున ప్రతిబింబింప చేయును దీనిని కవి అసమర్థతగా మనము పరిగణింపరాదు ఆతనిపై తనకుగల గౌరవమును ప్రకటించు కొనుటకే అని మనమూహింప వలయును 'అనుకరణమే ఏకవియెడనైనను ప్రదర్శింపగల అత్యుత్తమ గౌరవము'ని ఒక ఆంగ్ల సుభాషితము గలదు

తిక్కనకు నన్నయపైనను, ఆమహాకవి రచించిన భారత భాగముపైనను మిక్కిలి గౌరవము. కావుననే తన అవతారికలో నన్నయభట్టును 'ఆంధ్రకవిత్వ విశారదుండు, విద్యాదయితుండు, మహాత్ముడు' అని మిక్కిలి భక్తితో స్మరించెను భారతము నాది నుండియు తెనిగింపక నన్నయ రచనా భాగమును విడుచుటయే తిక్కనకు నన్నయపైగల గౌరవమునకు ప్రత్యక్ష నిదర్శనము. తిక్కన కవీంద్రుడు పలుతావుల నన్నయ ననుకరించెను. నన్నయ దిద్దిన

బిరవశినే అనుసరించి తిక్కనమహాభారతము నాంధ్రభాష నిర్మింప
బూనెను ఉత్తర రామాయణమును నిర్వచనముగా రచించిన తిక్కన
భారతమును నన్నయ దంపూ పద్ధతినే రచించి 'పద్యముల గద్యములన్
రచియించెఁన్ కృతుల్' అని నిర్వచన ధోరణిని మార్చుకొనెను
గ్రంథాదిని కృతిభర్త హరిహరనాథుని, తరువాత కృష్ణద్వైపాయనుని
స్మరించి వెనువెంట నన్నయను స్తుతించెను తిక్కన కృత్యాదిని
గావించిన వేదవ్యాసమహర్షి స్తోత్రమునకు నన్నయ కావించిన వేద
వ్యాస ప్రశంసయే మేలుబంతి.

నన్నయ జనమేజయ సర్పయాగము- ఆస్తీకుడు వేదవ్యాసుని
స్తుతించుట-

శా. విద్వాన్సుల్ బ్యాసు ధర్మమూర్తి తిరిగ ద్విఖ్యాతతేజుండు కృ
ష్ణద్వైపాయను డేగుదెంచి సుతశిష్యబ్రహ్మ సంఘంబుతో
న ప్పాండవ్యుండు నస్సుయద్యోయనవిన శక్యంబె వర్ణింప సా
క్షాద్విష్ణుండవు నీవు భూపతులలోఁ గౌరవ్యవంశోత్తమా [1]

తిక్కన అదే ద్వకార ప్రాసము, అదే శార్దూల వృత్తము, కృత్యా
దిని వ్యాస స్తుతి-

శా విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు విజ్ఞాన సం
పద్విఖ్యాతుడు సంయమిప్రకర సంభావ్యానుభావుండు గృ
ష్ణద్వైపాయను డర్థిలోకహిత నిష్ఠంబూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్ [2]

ఈ రెండుపద్యములను చూచిన నన్నయ తిక్కన యంతఃకరణము నావే
శించి యెట్లు పునరవతార మెత్తెనో వ్యక్తమగుచున్నది.

నన్నయ : సభాపర్వము - దుశ్శాసనుడు ద్రౌపదిని పరాభవించుట-

ఉ. ఆవనజాననం గురు కులాపళదుండు కచంగి రాజసూ
యావభృథంబునందు వసుధామర మంత్ర పవిత్ర వారిధా

1 ఆ ప 2 వి ప, ప్ర అ, ప 8

రావళిఁ జేసి పావనములైన శిరోజములం దెమల్చి పా
పావహుఁ డశ్చి తెచ్చె సభకందఱు సంభ్రమమంది చూడఁగన్[1]

తిక్కన అదేవృత్తము అదే పకారప్రాసము, అదే సన్నివేశమును ద్రౌపది శ్రీకృష్ణునకు తెలుపుట-

ఉ. నీవు సుభద్రకంటెఁ గడు నెయ్యము గారవముం దలిర్ప సం
భావనసేయు దిట్టినను బంకజనాభ యొకింత రాజసూ
యావభృథంబునందు శుచియై పెనుపొందిన వేణి పట్టి యీ
యేవురుఁ జూడఁగా సభకు నీడ్చెఁ గులాంగన నిట్లొనర్తురే[2]

నన్నయపద్యము తిక్కన మనఃఫలకముపై హత్తుకొన్నది "రాజసూయావభృథంబునందు శుచియై పెనుపొందిన వేణి" ఈ రచనము పాఠకస్మరణీయమైన నన్నయకు తిక్కన తెలిపిన మన్నన

తిక్కనపై కన్నడ ఆదికవి పంప ప్రభావము గలదని[3] విమర్శకాభిప్రాయము దీనికుదాహరణము-

పంప ము బకకిమ్మీర జటాసురోద్ధతి జరాసంధర్క్షళం సింద కీ
చకరం నూర్వరుమం పడల్వడసి దీర్విచ్ఛంద దోర్దండమం
గ్రకురుక్ష్మాప మహీరుహ ప్రకరమం ము త్తేభవిక్రీడిత
క్కెకరింపాల్వగినందు భీమరణదోర్దర్పం పొగళ్గుం చోరమే[4]

తిక్కన అదేవృత్తము, అదేపాఠము, అదే సందర్భము, అదే ఎత్తుగడ-

మ. బక విధ్వంసి జటాసురాంతకుఁడు హిడింబ ప్రాణహారి కీ
చక నిర్మూలనకేళిలోలుఁ డమరోత్సాహైకశీలప్రవ
ర్తకుఁడు నాగాయుతసామ్యకీర్తిత బలాఢ్యుం డుగ్రబాహావ్యూహదా
హకు భీముం గొనివచ్చె ధర్మజుఁడు బాహాటోపముం జూపఁగన్[5]

---

1 స ప 2 ఉ ప త్ప ఆ ప 110

8 నిడదవోలు వెంకటరావు ఆంధ్రవిజ్ఞాన సర్వస్వం p 687

4 పంప భారతము ఆ ప, ప 26

5 ఉ ప, ద్వి ఆ, ప 172

దీనినిబట్టి తిక్కన పంపభారతము సుచూచి యుండును కన్నడ ఆదికవికి తిక్కన తన గౌరవము చెల్లించుటయు సమంజసము

### తరువాతి కవులపై తిక్కన ప్రభావము :

ఒక యుగకవి తనసమకాలీన కవితారీతుల నన్నిటిని ఆకళించుకొని తనదగు ఒక విశిష్ట పద్ధతిని వింగడించుకొనుట ద్వారా తన తరువాతి కవులను ప్రభావితులను చేయును మరియొక యుగకవి జన్మించు వరకును అతని కవిత్వముచే ప్రభావితులగు వారికందరకును ఆతని మార్గమనుసరణీయము అట్లు తిక్కన ప్రభావమునకు ప్రత్యక్షముగ లోనైనవాడు కేతన ఆతడు తన దశకుమార చరిత్రమును తిక్కన కంకితమిచ్చి కృతిభర్తనుగూడ గావించెను. కేతన దశకుమార చరిత్రమునేగాక ఆంధ్రభాషా భూషణము (లక్షణగ్రంథము) విజ్ఞానేశ్వరీయము (న్యాయశాస్త్రగ్రంథము) లనకూడ రచించెను

విజ్ఞానేశ్వరీయము మితాక్షరి అను పేరుతో యాజ్ఞవల్క్య స్మృతికి విజ్ఞానేశ్వరుడు రచించిన వ్యాఖ్యానము హిందూ 'లా' కు అధికారిక గ్రంథములలో నేటికిని మితాక్షరి యొకటి కేతనకు మంత్రియైన తిక్కనతో ఎన్ని హితసంబంధములేనిచో విజ్ఞానేశ్వరీయము తెలుగున నవతరించి యుండెడిది కాదు నిత్యవ్యవహారమున కుపయోగపడు గ్రంథముగావున దానికి జనరంజకత్వము ఆగాగుండి యుండును ఆ కృతికి భవ్యకవితావేశము కలిగించినది తిక్కనయే యనుట నిస్సందేహము

తిక్కన ప్రభావము ప్రత్యక్షముగా సోకిన మరియొక కవి మారన అతడు తనఆశ్వాసాంత గద్యనిట్లు వ్రాసికొనెను 'శ్రీమదుభయ కవిమిత్ర తిక్కన సోమయాజి ప్రసాదలబ్ధ సరస్వతీపాత్ర తిక్కనామాత్యపుత్ర మారయ నామధేయ ప్రణీతంబైన మార్కండేయ పురాణము' ఈకవి చక్కని తెలుగు నుడులతో లలితమై, మనోహరమైన శైలిలో మార్కండేయ పురాణమును రచించెను కుకవి నిందను,

షష్ఠ్యంతములను వ్రాయుటయందు ఈతడు తిక్కననే అనుసరించెను తిక్కన కావ్యములు కనబడు రసముగాని, ప్రౌఢిగాని యీతని కావ్యమున లేకున్నను రమణీయ సులభ కవితాధార కలదు

తరువాతి కవులలో ఎఱ్ఱాప్రెగ్గడపై తిక్కన ప్రభావము తప్పక ప్రసరించినది. అతడు సంస్కృతపదముల వాడుకను నన్నయ నుండియు, తెలుగుపదముల వాడుకను తిక్కన నుండియు గ్రహించెనని చెప్పవచ్చును తిక్కనను 'కవిబ్రహ్మ'గా పేర్కొనినవాడు ఎఱ్ఱాప్రెగ్గడయే అంతియేగాక 'తన కావించిన సృష్టి తక్కొరుల చేతం గాదనా! వాణినత్తను తానౌకరుండగునా!' యన్నట్టి విశేషణముల స్తుతించినాడు. మొత్తముమీద చూడగా ఎఱ్ఱాప్రెగ్గడపై తిక్కన ప్రభావముకన్న నన్నయప్రభావమే హెచ్చు

తిక్కన ప్రభావము తనపై గలదని అన్ని విధముల అతని ననుసరింప దలచినట్లు కనబడువాడు నాచనసోమన. ఇతడు తనకు తిక్కనయందుగల గౌరవమును తన ఉత్తర హరివంశమును తిక్కన వలెనే హరిహర నాథునికి అంకితము సేయుట మూలమునను, ఆశ్వాసాంత గద్యములన్నిటను 'ఇది శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధన విరాజి తిక్కనసోమయాజి ప్రణీతంబైన శ్రీమహాభారత కథానంతరమున శ్రీమత్సకల భాషా భూషణ సాహిత్యరసపోషణ ' అని తదీయ సంకీర్తనము చేయుట మూలముననుచూపియున్నాడు. ఇంతియేగాక తిక్కన రచనా విధానమునుకూడ అతడనుసరించెను

తిక్కన స్రగ్ధర—

గాండీవ జ్యారవంబుత్కటముయి పెలుచ న్గ్రమ్మినన్ భీము బాహా
దండం బేపారి శుంభద్గద జడియుచు రౌద్రంబుగా దోచినన్ వే
దండ ద్వంద్వంబు మాఱ్కొం దతఁడు కవలు మాద్యద్గతిం దాకినం జా
కుండం బోకుండ గౌరవ్యులకు వశమె బిట్టల్కి మార్కొల్లకుండన్?[1]

---

1 ఉ ప, ప్ర ఆ, ప 328

సోమన అదేవృత్తము, అదేప్రాసము, అదేఎత్తుగడ-

స్రగ్ధర- 'గాండీవారావ ఝుంఝాఘటితభయవివేకః పురాంతఃపురంధ్రీ'

తిక్కన- కర్ణుం డుస్ససేనుడును గల్గగ నాకొరుకేల సద్భటా
కీర్ణవిరోధి సైన్యముల గెల్వగ జాలుదు మేము మాకు నీ
యర్ణవ వేష్టితక్షితి యనర్గళ విక్రమ మొప్ప దక్కు మా
నిర్ణయమెల్ల నిట్టి దవినీతియొ నీతియొ చూడుమీ తుదిన్

సోమన- 'నాకీతమ్ముడు ఖడ్గముం గలుగగా
నాకీశుడు న్నాటియే లోకంబు ల్పదునాలుగుం గెలుతు'

తిక్కనపరిభావము తనపై గలదని చెప్పుకొనిన మరియొక ఆంధ్రకవి శ్రీనాథుడు "వాక్రుత్తు తిక్కయజ్వ పరికారము రసాభ్యుచిత బంధముగ నొక్కొక్కమాఱు" అని తన కవిత్వముపై తిక్కన పరిభావమును శ్రీనాథుడు వెల్లడించుకొనెను తిక్కనవలెనే శ్రీనాథుడును తనకావ్యములలో షష్ఠ్యంతములను వ్రాసెను. షష్ఠ్యంతముల చేర్చుటకు తిక్కన చెప్పిన హేతువు హృద్యము "ఈకృతి పుణ్యప్రబంధములు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్కయారాధనావిశేషంబగుటం జేసి" శ్రీనాథుడును తిక్కన సోమయాజివలె చక్కని సూక్తిని వాడినాడు

తిక్కన కృష్ణునితో భీముని పల్కులు-

'దయ్యమునెత్తికోలు తుదిదాకుట గాదె భుజంగభంజనా'

శ్రీనాథుడు శృంగార నైషధకావ్యము - పంచమాశ్వాసము- దమయంతీ స్వయంవర సందర్భము సభలో సరస్వతీదేవి నానాదేశాధీశులను దేవతలను పేరుపేరున దమయంతికిచూపి వర్ణించుచుపట్టున దేవతలంజూపి వారిలో నొకనిని వరించిన-

'ఆదయ్యము నెత్తికోలు తుదిదాకుటగాదె సరోజలోచనా'అనెను.

కొలది కథారచనతోగూడిన కావ్యప్రబంధములలోవలె రచనావైచిత్రికి సమాసముల తూగునకు దీర్ఘసమాస సంపత్తికిని

తనభారతమున అవకాశములేకున్నను అచ్చటచ్చట తిక్కన తనపస చూపగల పద్యములను వ్రాసెను. ఆవిధముగా శ్రీనాథునకు దారిచూపినది. తిక్కనపద్యములు నారీతిగ శ్రీనాథుడనుకరించెను.

తరువాతి కాలమునందలి ప్రబంధకవులందరపైనను తిక్కన ప్రభావము కొలదిగనో గొప్పగనో పడనివారు లేరు.

దక్షిణాంధ్ర యుగమునకు వచ్చిన చేమకూర వెంకటకవి పైనను తిక్కనప్రభావము కొట్టవచ్చినట్టు కనబడును.

రచయిత్రి మొల్లయు భారతపద్యముల సరణి ననుకరించెను

తిక్కన- ఎవ్వాని వాకిట నిభమదపంకంబు రాజభూషణ రజోరాజి నడగు

మొల్ల- ఎవ్వాని వీటికి నేగు వారాసులు పెట్టనికోటలై పెద్ద పెరుగు
ఎవ్వాని సేవింతురింద్రాది దేవతలనుపరబలులయి యనుదినంబు

మహార్ణవమువంటి మహాభారత గ్రంథమున చూపబడని కవితాసౌందర్యములు, త్రొక్కబడని కవితామార్గములు లేనందున సర్వవిధమైన పోకడలు అందించు మచ్చునకు దొరకుననే యుండును ఆ గ్రంథమును చదువకుండ, ఆ ప్రభావమునకు లోనుగాకుండ అనంతర కవులు తమ కావ్యములు వ్రాయుట అసంభవము. ఆంధ్రకవితా వారాశిలో సీదులాడ దలంచిన ప్రతికవియును కవిత్రయ కవితాతరంగముల తాకిడినుండి తప్పించుకొనజాలడు

## కుమారవ్యాసునిపై పూర్వకవుల ప్రభావము :

కుమారవ్యాసుడు నిరక్షరాస్యుడనియు, గదగు వీరనారాయణుని దయవలన సహజపాండిత్యుడై 'కర్ణాటభారత కథామంజరి'ని వ్రాయగలిగెనని కొందరు వాదించుటగలదు. దీనికి దంతకథలే ఆధారము. కాని కుమారవ్యాసుడు తన గ్రంథమున పూర్వకవులననుసరించుటద్వారా చూపిన గౌరవము ఆతని బహుముఖప్రజ్ఞకు విశేష పాండిత్యమునకు నిదర్శనముగనున్నది. కుమారవ్యాసుడు తనపాండిత్య

ముకన్నను భగవంతునిపైనే విశేషముగు నమ్మకము గలవాడగుటచే అతడు భక్తితో గ్రహించిన విషయము, పరిజ్ఞాను ఆతని గ్రంథముపై గల యభిమానము ఈసందేహమునకు తావిచ్చినది. ఇట్టినింద యనపోతనామాత్యునకును తప్పలేదుకదా!

కన్నడసాహిత్యమునను పరిపుష్టమగు మార్గము వేసినవాడు ఆదికవి పంప తరువాతి కవులపై ఆతని ప్రభావము తప్పనిసరి అందుచే పంప, కుమారవ్యాసు ఇతివృత్తము లొకటే యగుటచే కుమారవ్యాసునిపై పంప ప్రభావము విశేషముగా నుండుటకు సందియము లేదు

పంప కుంతీదేవి కర్ణుని చేరవచ్చెను అనటికి గంగవచ్చి కుంతితనకు పసిపాపను అప్పగింపగా తాను కర్ణుని కుంతికి అప్పగించుచున్నానని పలుకును

'గంగాదేవియుం దివ్యమూర్తియుంకె యొక్కాంగబందు-
ఒప్పిసి పెంకైయెడ యెం
దప్పెసిద నిన్నమగ సీగళె నినగెం
దప్పెసి గర్గా పోపుదుం'[1]

కుమారవ్యాసుడు అదేవిధమున మూలమునందేని పంప కల్పించిన దానిని తన గ్రంథమున-

'ఆసమయదలి గంగె నారీ
వేషదలి నడెతందళెతె కుం
తీ సతియె కై లెడియ కందననొప్పుగాళు నీను
ఈ సుదినవివ నాగు హోగిన
భాషెయను తలెగాద్దె నెన్నయ
భాషెయందు నెనుత్త తాయిగె కొట్టళాత్మజన[2]

1 పంపభారతము, న అ, ప 76
2 ఉ ప, సం 8, ష 28

సం. కృష్ణుని రాయబారము- కృష్ణుడు విదురునింట విందుచేయు దుర్యోధనుడు కోపగించి వారిరువురను నిందించును. దానికి విదురుడును కోపగించి దుర్యోధనుని తొడలను రక్షించుటకు తాను తనయొద్ద నుంచుకొనిన విల్లును విఱిచివేయును.

'పళ్వగె దూతి నప్పన
బేళ్పిన నుడికేళ్దు ముళియలాగదు నీనుం
మెళ్పెట్టు విదురనెంబీ
తొళ్పిట్టియ మనెయూటకళు నుడిమిసె నుడిదై

ఎనె, విదురనతి కుపితనాగి

కడుముళిదు నిన్న తొడెగళ
నుడిసెదొరెయొళ్ భీమసేన నానాపదదొళ్
పిడియల్కెందిర్ద నిదం
పిడిదెం పోగెందు సఖరొళుడెదంబిల్లం[1]

కుమారవ్యాసుడు మూలమునలేని అదేసన్ని వేశమును-

ఈకృపన ఈ ద్రోణ నీగం
గాకుమారన మనెయ హోగదవి
వేకి తొత్తి నమగన మనెయలి హాసివ నూకిదిరి
సాకి దాలిను నందగోపను
కాక బళసలు నల్లదేనియ
డెకె రాయరనీతి యొందను నగుత కురురాయ[2]

కురుపతియ బిరునుడియ కేళిదు
కరణదలి కోపాగ్ని యుక్కలు
కెరళి నిర్భీతియొలి నుడిదను విదుర నరసంగె
కడు ముళిసిన భీమ నిన్నయ

1 పం భా, స ఆ ప, 58, 59
2 ఉ ప సం 8, ప 45

తొడెగళను కడివా సమయదొళు
తడెదునిన్నను కాయబేకెందుళుహిడెను ధనువ
కెడెమురిసి కొండెన్న కావెన
నుడియ ఫలవే నెనత విదురను
హిడిద బిల్లను మురిద నాకురురాయ బెరగాగె[1]

(కృష్ణుని సేవతో సంతృప్తిపడక నీకురాజనీతి ఎందులకని దుర్యోధనుడు ఎగతాళిసేయ విదురుడు కోపముతో భీముడు నీతొడలను విరుగగొట్టు నప్పుడు నిన్ను కాపాడ దలచి ఈధనుస్సు ధరించితిని నీమాటలకు ఫలమనుభవింపుమని విదురుడు సభామధ్యమున తన ధనుస్సును విరిచెను )

పంప విదురుడు కృష్ణుని రాకను దుర్యోధనునకు తెలిపెను దుర్యోధనుడు రేపుసభలో కనబడు మనెను.

'నాళె నోలగదోళ్ తందుకాణిసు'[2]

కుమారవ్యాసుడు మూలమునలేని దానినట్లే-

'నాళెకాణిసి కొంబెవు, నాళెబరవేళు'[3]

కుమారవ్యాసునిపై బసవణ్ణ ప్రభావము కలదనుటకుకొన్ని నిదర్శనములు కనబడుచున్నవి బసవణ్ణ వచనములను కుమారవ్యాసు డనుసరించెను

బసవణ్ణ నుడికె దైవ, మొరదైవ, బీదియకల్లుదైవ
దైవ దైవవెందు కాలిడలిం బిల్లా

కుమారవ్యాసుడు అదే భావము-

తిణికిదను ఫణిరాయ రామా
యణద కవిగళ భారదలి తిం
తిణియ రఘువర చరితెయలి కాలిడలు తెరపిల్ల[4]

1 ఉ.ప, సం 6 ష 46 47
2 పం భా న ఆ, ప 28 3 ఉ ప, సం 8, ష 26
4 కు వ్యా భా, పీఠిక

రుద్రుని ప్రళయనాట్యము నాపుశక్తి యున్నదా ? ఇది చెల్లదని విదురుడు కన్నీరు కార్చెను )

కృష్ణుడు రాయబారమునకు వచ్చి కౌరవసభలో ప్రవేశించు సందర్భమున సభలోని వారెల్లరు గౌరవపురస్సరముగా లేచి నిలబడిరి దుర్యోధనుడు లేవక ద్రౌపదీ వస్త్రాపహరణ చిత్రమును చూచుచు సింహాసనముపైననే కూర్చుండెను అంతట కృష్ణుడు భూమిని బొటనవ్రేలితో నొక్కగా సింహాసనముపైనున్న దుర్యోధనుడు కృష్ణుని కాళ్ళపై వచ్చి పడెను ఇట్లుభాస మహాకవి దూతవాక్యము నందున్న దానిని కుమారవ్యాసుడు యథాతథముగ తన గ్రంథమునందు అనుకరించెను

## తరువాతి కవులపై కుమారవ్యాసుని ప్రభావము :

కుమారవ్యాసుని యుగమునందు బ్రాహ్మణ వాఙ్మయము (భాగవతవాఙ్మయము) విపులముగా విస్తరించినది కుమారవ్యాసుడు ‘దేసి’ నిష్ఠకు లౌకికవిధియై తెం. భారతమును దానికి దృష్టాంతముగ అద్భుతముగ చిత్రించెను ఆతని ప్రత్యక్ష పరోక్ష ప్రభావముచే పలువురు భాగవతకవులు ముందుకువచ్చి రామాయణ, భారత, భాగవత పురాణములను కన్నడీకరించిరి వారును సామాన్యముగా షట్పదినే ఆశ్రయించిరి జైనకవులు కూడ “దేసి” దిక్కుగా నీచుగాలినిబట్టి తమసాహిత్య పథమును అలుసాగించిరి తీర్థంకర చరిత్రలు, ఇతర జైన సాంప్రదాయిక విషయములు జనసులభమైన షట్పది సాహిత్యమున వెలయించిరి

ఈయుగమునకు షట్పదియే ప్రధాన కావ్యరూపమైనది దానికి కుమారవ్యాసుని ‘భారత కథామంజరి’యే చాలవరకు కారణము భామిని, వార్ధక షట్పదులు జనాకర్షకములైనవి. అన్నిమతముల సాహిత్యము షట్పదియందే విశేషముగా ప్రతిపాదింపబడుటచే ఈయుగమునకు షట్పదియుగమని పేరిడిరి మతతత్వమును లౌకిక

దృష్టాంతములతో, సులభశైలిలో ప్రచారముచేసిన 'అనుభవామృత' 'హరికథామృతసార' వంటి గ్రంథములు షట్పదిని సార్థకపరిచినవి. క్రియ ప్రతిక్రియగా షట్పదికి మార్గదీక్ష నిచ్చుటకు కొందరు ప్రయత్నించిరి

కుమారవ్యాసుని యుగమున వెలువడిన కొన్ని ప్రసిద్ధ షట్పది కావ్యములను తెలిసికొందము

| | | | | |
|---|---|---|---|---|
| 1450 | భాస్కరకవి | జైనుడు | భామినీ | జీవంధరచరితె |
| 1430 | చామరస | వీరశైవ | ,, | ప్రభులింగచరితె |
| 1430 | గురుబసవ | ,, | ,, | సద్గురురహస్య స్వరూపామృత |
| 1450 | బొమ్మరస | ,, | వార్ధక | సౌందరపురాణ |
| 1500 | కుమారవాల్మీకి | బ్రాహ్మణ | భామినీ | 1 తొరవె రామాయణ 2 మైరావణనకాళగ |
| 1510 | తిమ్మణ్ణకవి | ,, | ,, | కృష్ణరాజభారత |
| 1530 | చాటువిఠలనాథ | ,, | ,, | 1 భారత (కెలభాగ) 2 భాగవత |
| 1550 | లక్ష్మీశ | ,, | వార్ధక | జైమినిభారత |
| 1570 | వాదిరాజ | ,, | భామినీ | స్వప్నగద్య |

### తులనాత్మక పరిశీలనము :

తెలుగు సాహిత్యమున తిక్కన, కన్నడ సాహిత్యమున కుమారవ్యాసుడు ప్రథమశ్రేణికి చెందిన మహాకవులు. వీరిరువురును వ్యాసహృదయమును సంపూర్ణముగా గ్రహించి దానిని తమతమభాషలలో సమర్థవంతముగా నావిష్కరించిన పుణ్యమూర్తులు. ఆంధ్రమున ఆదికవి నన్నయ. కన్నడమున ఆదికవి పంప నన్నయ వైదిక మతానుయాయి యగుటచే అతనిప్రభావము తిక్కనపై పూర్తిగ పడినది పంప జైనుడగుటచే కుమారవ్యాసునిపై అతనిఆఖ్యాన శిల్ప

తులనాత్మక పరిశీలనము 

ప్రభావము మాత్రమే పడినది. తిక్కన, కుమారవ్యాసు లిరువురును భారతీయ సంస్కృతికి దర్పణము పట్టిన ప్రతిభాశాలులైన మహాకవు లగుటచేతను, బృహత్తర కావ్యములను నిర్మించిన అపూర్వ శిల్పు లగుటచేతను వీరి ప్రభావము తరువాతి కవులపై విస్తరించినది కుమార వ్యాసుడు భారతమును చూచియుండె ననుటకు మాత్రము తగిన ఆధారములు కనబడవు. కొన్ని పోలికలు యాదృచ్ఛికములు కావచ్చును లేదా వేరొకరి ప్రభావము వారిరువురిపై పడి యుండవచ్చును. మొత్తముమీద కుమారవ్యాసునిపై తిక్కన ప్రభావము లేదని యే నాసిద్ధాంతము.



# అష్టమాధ్యాయము - సింహావలోకనము

ఇంతవరకును తిక్కన, కుమారవ్యాసుల భారతములందలి విరాటోద్యోగ పర్వములను ఆధారముగా చేసికొని పలువిషయము లను తులనాత్మకముగ పరిశీలించుట జరిగినది. వారిరువురి దృక్కోణ ములు వేరువేరుగ కనబడినను, ఒకరు ధర్మాద్వైతస్థితినంది లోక శ్రేయము కొఱకు భారతరచనమున కుపక్రమింప మఱియొకరు కృష్ణు నకు పరమభక్తులై భారతము మూలకముగ కృష్ణుని విశేషచరిత్ర మును వ్రాయుటకు మొదలిడెననుటతప్ప సన్నివేశముల పరికల్పన మునను, కథనకౌశలమునను, వర్ణనములందును మొత్తముమీద కావ్యధోరణి యందొకేవిధమైన కళాభిరుచిని ప్రదర్శించిరి. కుమార వ్యాసుడు రెండుమాటలు తక్కువ చెప్పినను, తిక్కన రెండుమాటలు ఎక్కువ చెప్పినను ఇరువురి కావ్యములు ఆకాశగంగవలె నతి పవిత్రములు.

'తుదిముట్టిక్ రచియించు కావ్యంబుధ సంతోషంబు నిండా రగన్' అనియు 'భారతామృతము కర్ణపుటంబుల నారగ్రోలి యాంధ్రా వలి మోదమున్ బొరయునట్లుగ' అనియు "భారతసంహిత జెప్పగంటి నాపుట్టువు కృతార్థతం బొరసె, బుణ్యచరిత్రులమైతి" అనియు తిక్కన విశ్వశ్రేయమును తెలిపి వినయమును ప్రకటించె. 'ఎలగె బలపవ హొడియగొం గర్గికె ఎంబీబలుహ గదుగిన వీరనారాయణన కింకరిగె' (పలుక, బలపము వ్రాతపోవుట ఒకపాపతనము. అను ఈబలుపు గదగువీర నారాయణుని సేవకునకు) అనియు, 'బణగు కవిగళ లెక్కిపనె సాకేళిసదిరు, శుకరగాపనల్లవె! కుణిసినగనే కపికుమార వ్యాస నుళిగవర' (సామాన్యకవులను లెక్కింతువా? చాలు చేయకుము! శుకరూపుడను కానా! కవి కుమారవ్యాసుడనగు నేను మిగిలిన వారిని మించిగంతులు వైచినవాఁనా?) అనియు, "కావ్యవే గురుపేనలు రచి

సిద కుమారవ్యాసభారతవ" (కావ్యములకు గురువనబడునట్లు కుమారవ్యాసుడు భారతమును రచించెను ) అనియు ఆత్మస్థైర్యమును, ధైర్యమును కుమారవ్యాసుడు ప్రదర్శించెను

తిక్కన, కుమారవ్యాసు లిరువురకు మూలమొక్కటే ఇరువురును స్వకీయ కల్పనలతో విహాయసమున విహంగములై విహరించినను తిరిగి మూలము నాధారముగ చేసికొనియే వచ్చి నిలిచిరి తిక్కన అచ్చ తెనుగు పదములను ఎక్కువగను, సంస్కృతపదములను తక్కువగను వాడుచు నూతనమైన 'దేసి' మార్గమునకు ప్రవర్తకు డయ్యెను కవిబ్రహ్మ ప్రభావము శతాబ్దముల తరబడి మిగిలిన కవులపై ప్రసరించినది కుమారవ్యాసుడును యుగనిర్మాత జనప్రియకవి తిక్కనవలెనే కుమారవ్యాసుడును సకల కళాపండితుడు పూర్వకవుల కావ్యములను చక్కగా నభ్యసించినవాడు మూలభారత మిరువురకును వాచోవిధేయము తిక్కనకు నన్నయభారతము ఆదర్శప్రాయముకాగా, కుమారవ్యాసునకు కన్నడ ఆదికవియగు పంప విక్రమార్జున విజయము ఆదర్శము మహాభారత మహారణ్యమును సుందరవనముగ తీర్చిదిద్దుటకు, మహాసముద్రమును సుందరసరోవరముగ మార్చుటకు తిక్కన, కుమారవ్యాసు లిరువురును ఇరుభాషలలోని ఆదికవులనుండియే ప్రేరణ పొందిరి ఇందులకు ప్రమాణములతో పనిలేదు

తిక్కన, కుమారవ్యాసు లిరువురకును మహాభారత దాక్షిణాత్య పాఠమే ఆధారము మూలమొక్కటియే యగుటవలన ఇరువురకును కథాసందర్భములు సమానములు, పాత్రములు సమానములు ఆకారణమున కుమారవ్యాసుడు తిక్కన భారతమును చూచినను చూడకున్నను ఉక్తి భావములయందాకస్మికముగ సమానత కనబడుట తథ్యము అంతమాత్రమున కుమారవ్యాసుడు తిక్కననుచూచియే వ్రాసియుండునని నిర్ధారించుట సాహసముతో కూడిన నిర్ణయమగును ఆకస్మికముగ నొకటిరెండు సన్నివేశములలో సామ్యమున్నంత మాత్ర

మున నట్లు నరాదు. అంతకుమించినచో కొంచెము నిశితముగ పరిశీలింప వలసియుండును. సార్వత్రికముగ కనబడనాగిన వేరు అభిప్రాయము నకు తావేర్పడదు.

కుమారవ్యాసునిపై పంప ప్రభావము కలదని తెలిసికొంటిమి. అట్లని ఆ గ్రంథము నొడిలోనిడుకొని దానినే యనుసరించెనని మాత్రము కాదు. అతడు స్వతంత్రముగ భారతకథను సంగ్రహముగ రచింప నారంభించినప్పుడు, పంపభారతము నందలి యనేక సన్నివేశములు, భావములు, వాక్యములు అతని సుప్త చేతనమున అణగియుండి తమంతతాముగ వెన్నువిచ్చుకొని వచ్చి నిలబడినవి. పంపవలెనే కుమారవ్యాసుడును మొదటి పదిపర్వములవరకే తనకథకు పరిమితి విధించుకొనెను. చివరకు పంప తనలౌకిక కారణములచే అర్జునునకు పట్టాభిషేకము చేసి కథకు నవసానము చూపెను. కుమారవ్యాసుడు మూలానుసరణముగ ధర్మరాజునకు పట్టాభిషేకము గావించెను. తిక్కన మహాకవియు పంపభారతమును చూచినట్లు కనబడుచున్నది.

విస్తారమయిన, స్వారస్యశూన్యమయిన కథాభాగములను తమకావ్య నిర్మాణ ప్రమాణమునకు, స్వరూపమునకు అనుగుణముగ సమర్థముగ సంగ్రహించుకొనవలెనన్న ఔచిత్యజ్ఞానము, అతిశయ జ్ఞానము నుండవలెను. ఆ జ్ఞానమునకు కుమారవ్యాసునకు పంప మేల్పంక్తి లభింపగ, తిక్కనకు నన్నయతో బాటు పంప కూడ ఆదర్శప్రాయుడయినాడు. తిక్కన, కుమారవ్యాసు లిరువురును తమ తమ అభిరుచులకు కావ్యోద్దేశములకు అనుగుణముగ స్వతంత్రించి మూలకథలో పలుమార్పులను, చేర్పులను చేసికొనిరి. ఈమార్పుల చేర్పులలో మూలమునందలి యనేకాంశములను విడిచిపెట్టిరి. నూతనాంశములను చేర్చిరి. విస్తారముగనున్న ప్రసంగములను సంగ్రహీకరించిరి. కావలసినచోట సంగ్రహముగనున్న దానిని విస్తరించిరి. సన్నివేశములను స్థలాంతరము చేసికొనిరి. మొత్తముమీద ఇరువురి కావ్యములును మూలమునకు ప్రతిబింబములుకాక పునస్సృష్టియయినవి

ఈపునస్సృష్టి యత్నమున తిక్కన, కుమారవ్యాసుల దృక్పథములు వారి రచనలలో నేరీతిని ప్రతిబింబించినవో తులనాత్మకముగ పరిశీలించుటయే ఈసిద్ధాంతవ్యాస లక్ష్యము

ఇందు ప్రథమాధ్యాయము నందు భారతగ్రంథముయొక్క వైశిష్ట్యము, భారతగ్రంథమున విరాటోద్యోగ పర్వములకుగల ప్రాధాన్యమును, ప్రాశస్త్యమునుగూర్చి విశదీకరింపబడినది తిక్కన తన భారతమును 'హృద్యమార్థాది, ఊర్జితకథోపేతము, నానారసాభ్యుదయోల్లాసి' అనుమూడు విశేషణములతో పేర్కొనెను ఈమూడు విశేషణములు విరాటపర్వమున నేవిధముగ అన్వయము నొందుచున్నవో వివరింపబడినది కన్నడభారతమున చెప్పుకోదగినట్టి విశేషము శ్రీకృష్ణపాండవులకు కుమారవ్యాసుడు కల్పించిన అభేదము కుమారవ్యాసునకు కృష్ణునిపైగల భక్తి అతని గ్రంథములోని పాత్రములకన్నిటికిని కల్పింపబడినవి

ఉపాఖ్యానములచేతను, పాత్రల మానసిక చిత్రణచేతను, వేదాంతసారముచేతను, రాజనీతి తంత్రజ్ఞతచేతను, నీతిబోధచేతను ఉద్యోగపర్వము భారతపర్వములలో నాయకమణివలె ప్రకాశించుచున్నది. ఇందలి ఇతివృత్తమునుబట్టి ఈపర్వము సమరోద్యోగపర్వమని చెప్పదగియున్నది భారతమునందలి ఉద్యోగపర్వము పూర్వోత్తర భాగములకు సేతువువలెనుండి మిగిలిన పర్వములకన్న ప్రత్యేకత కలిగినదై పాఠకులకు ఆహ్లాదమును చేకూర్చుచున్నది తెలుగు, కన్నడభాషల పరస్పర సంబంధముకూడ నీప్రకరణమున పరిశీలింపబడినది. తులనాత్మక పరిశీలనమువలన ప్రయోజనము వివరింపబడినది

ద్వితీయాధ్యాయమున తిక్కన, కుమారవ్యాసుల కాల స్థలాదుల నిర్ణయము చేయబడినది తిక్కనకాలము క్రీ శ 1210-1288 అనియు, భారతరచనాకాలము క్రీ శ 1265 ప్రాంతమనియు సిద్ధాంతీకరింపబడినది అటులనే కుమారవ్యాసుని కాలము క్రీ శ 1425-55 కావచ్చుననియు సోపపత్తికముగ నిర్ధారింపబడినది కుమారవ్యాసుని

నిజనామము నారాయణప్ప. వ్యాసునిపై గల భక్తిప్రపత్తులకు సూచకముగ కుమారవ్యాసుడను పేర ప్రసిద్ధుడయ్యెను తిక్కన కుమారవ్యాసు భారతముల సముద్దేశము కూడ ఈ అధ్యాయమున వివరింపబడినది వ్యాసుడు భారతీయసంస్కృతి పరిరక్షణమునకు జన్మించినవాడు. వేదములు వింగడించి భారతీయ సంస్కృతి భవనమునకు గట్టిపునాది వేసెను. భారతమును రచించి ఆపునాదిమీద విజ్ఞానసౌధమును నిర్మించెను ఆంధ్రభారతమును రచించిన కవిత్రియము త్రిమూర్త్యాత్మకముగ సరిపోల్పదగినది. అందు తిక్కనభారత భాగము రూపసౌష్ఠవమున, శిల్పసౌందర్యమున మూలభారతముకంటె మిన్నగా నున్నది. తిక్కన లోకమున కిచ్చిన సందేశము ధర్మాద్వైత మార్గానుసారియైన పూర్ణయోగసాధన తిక్కన విరాటోద్యోగ పర్వములు ఆతని మేధాశక్తికి, రాజనీతిజ్ఞతకు, లౌకికవ్యవహార నిర్వహణ కుశలతకు నిదర్శనము నిజము చెప్పవలయునన్న జానుతెనుగున రచనగావించిన కీర్తి శివకవులకుగాక, నూటికి నూరుపాళ్ళు తిక్కన సోమయాజికే దక్కవలయును కల్పితములైన నానారూప భేదములచే భగవంతుని పేరను, మతము పేరను దారుణ కలహములకులోనై అలజడి పొందుచున్న ఆంధ్రులకు తిక్కన ప్రసాదించిన భగవత్తత్త్వము హరిహరనాథతత్త్వము

కుమారవ్యాసుడు భారతమును భక్తిభావముతో రచించెను. తాను వ్రాయుచున్నది కృష్ణుని కథయని చెప్పుకొనెను. తనగ్రంథమున కావ్యలక్షణముల కొరకు వెదకవలదని, పవిత్రమైన తులసి తీర్థమువలె పద్మనాభుని మహిమ, శ్రేష్ఠమైన ధర్మపు విచారణమును సాధవలెనని చెప్పికొనియున్నాడు. కన్నడమున మహాకవులైనవారెవ్వరును వ్యాసహృదయావిష్కారమునకు పూనకొనలేదు. దానికి కటిబద్ధుడైనవాడు కుమారవ్యాసుడు

తృతీయాధ్యాయమున తిక్కన, కుమారవ్యాసులు వ్యాస భారతము ననువదించుటలో నవలంబించిన పద్ధతుల సమీక్ష చేయబడి

నది. ఈసమీక్షనుబట్టి అనువాదకవు లిరువురును మూలభారతమును ఆద్యంతము యథాతథముగ ననువదింపలేదని తెలియుచున్నది. తిక్కనకు ఇది త్రౌలిప్రయత్నము కావున ఆతని విరాటపర్వము మూలమునకు చాల సన్నిహితముగ నుండి విస్తృతి చెందినది. కుమారవ్యాసున కిదినాల్గవపర్వమగుట విరాటపర్వమును మిక్కిలి సంగ్రహించి ప్రధాన కథాంశమును మాత్రము స్వీకరించి అనేక ముఖ్యాంశములను విడిచి పెట్టుటజరిగినది. తిక్కన విరాటపర్వ రచనమునకంటెను ఉద్యోగ పర్వరచనమున సంయమము చూపెను. అయినను ఉపాఖ్యానముల విషయమున మరింత సంగ్రహదృష్టిని ప్రదర్శించిన ఉద్యోగపర్వము పరిమాణమున మరింత తగ్గియుండును. అటులని కుమారవ్యాసుడు ప్రధాన కథాంశముతో ముడిపడియున్న రసవత్తరములగు సంజయ రాయబారమువంటి సన్నివేశములను సంగ్రహీకరణ వ్యాజమున కత్తిరించుట సమర్థనీయముగా కనబడదు. విస్తారములగు వర్ణనాభాగములను, కథకు అడ్డమువచ్చు ఉపాఖ్యానములను కుమారవ్యాసుడు చాలవరకు పరిహరించెను. అదిసమర్థనీయమే. ఉద్యోగపర్వము రాజనీతి ప్రధానమయిన దగుటచే తిక్కన విజృంభించి తనకు స్వానుభవములగు రాజకీయ శక్తిసామర్థ్యములతో విశ్వరూప సందర్శనము చేయింప, కుమారవ్యాసుడు రాజకీయానుభవము లేనివాడగుట, మీదు మిక్కిలి భక్తిప్రధానుడగుట ఆతనిభారతమున ఈపర్వము తేలిపోయి కథాగమనమును మాత్రమే సూచింప గలిగెనుగాని కవితాప్రతిభను చాటలేకపోయెను. మొత్తముమీద తిక్కన సోమయాజి రసవత్తరమగు అనువాద ప్రక్రియ ననుసరింప, కుమారవ్యాసుడు సరసమగు సంగ్రహీకరణ ప్రక్రియను ప్రదర్శించెను.

చతుర్థాధ్యాయమున కథాకథనమున తిక్కన, కుమార వ్యాసుల తీరుతెన్నులు తులనాత్మకముగ పరిశీలింపబడినవి. మూల భారతమున ప్రధాన కథకు సంబంధములేని ఉపాఖ్యానములను గమనించి వానికి ప్రధానకథతోగల సంబంధమును తిక్కన, కుమార

వ్యాఖ్యలు దృఢపఱిచిరి. భారతోపాఖ్యానములు అనంతముఖ పరిష్కరణగలవి. అనువాదకవులు ఉపాఖ్యానములను తిరస్కరింపనూలేదు, యథామూలముగ గ్రహింపనూలేదు. తమ కావ్యోద్దేశములకు భిన్నములగు వానిని విడిచిపుచ్చిరి. గ్రహించిన వానిని కథానుకూలముగ మలచికొనిరి.

అరణ్యపర్వమువరకు కౌరవ దుశ్చర్యలకు ప్రతీకారము తలపెట్టని పాండవుల తిరుగుబాటునకు విరాటపర్వమున అంతర్గత ప్రయత్నమును ఉద్యోగపర్వమున బాహ్యప్రయత్నమును జరిగినవి. కావున కథ ఈపర్వములందు రసవత్తరమైనది. దానికనుగుణముగనే తిక్కన వర్ణశైలినుండి నాటకీయశైలికి మారినాడు. కథనము నాట్యాయమానముగ జరుపుట తిక్కనధ్యేయము. కుమారవ్యాసుడును కొన్ని ఘట్టములను నాటకీయముగ ప్రదర్శించినాడు. చాలవరకు నన్నయవలె కథనశైలిలో రచించినాడు. వ్యాసుడు ప్రతిపర్వములోని ప్రధాన కథాంశములను కీచకవధ పర్వము, గోహరణపర్వము ఇత్యాదిగ పర్వములుగ పేర్కొనెను. తిక్కన వీనిని ఆశ్వాసములుగను, కుమారవ్యాసుడు సంధులుగను పేర్కొనిరి.

కథాకథనమున తిక్కనపై పూర్వకవుల ప్రభావము లేదనియే చెప్పవచ్చును. అతనికి వ్యాసుడే పరమప్రమాణము. కుమారవ్యాసుడు భక్తకవి. కృష్ణమాహాత్మ్యము బోధించుటయం దిచ్ఛగలవాడు. కృష్ణప్రాధాన్యముగల సన్నివేశములను మూలాతిరేకముగ కల్పించుటకును, పరిహరించుటకును ఈతడు వెనుదీయలేదు. ద్రౌపది కీచకునితో గడ్డిపోచనడ్డము పెట్టుకొని మాటాడుట, విదురుడు కృష్ణున కించుకపాలతో నాతిథ్యమొసగుట, సభాస్థలిని కృష్ణుడు భూస్థలిని బొటనవ్రేలిచే నొక్కగా అతని నవమానింప దలచిన దుర్యోధనుడాతని పాదములపై పడుట మున్నగు విశేషాంశములను రామాయణము, దూతవాక్యము, ఊరుభంగము, వేణీసంహారము ఇత్యాది వాల్మీకి,

భాస, భట్టనారాయణాది మహాకవుల కావ్యాంశములనుండి గ్రహించి తన కావ్యశోభ నినుమడింప జేసికొనెను.

పంచమాధ్యాయమున తిక్కన, కుమారవ్యాసులు పాత్రపోషణమునందు కనపిన నైపుణ్యము ప్రదర్శింపబడినది. మహాభారతమున పాత్రపోషణము చాలక్లిష్టమగు కార్యము. వ్యాసుడు ఆయాపాత్రల వర్తనలను భారతేతిహాసమున యథాతథముగ నిరూపించుచు పోయెను. తిక్కన, కుమారవ్యాసుల రచనలు కావ్యములగుటచే నట్టివిధాన మొక్కొకచో రసభంగమునకు కారణమగును. వ్యాసునిది ఐతిహాసికదృష్టి, అనువాదకులది కావ్యదృష్టి. అందువలననే తిక్కన, కుమారవ్యాసుల పాత్రలు సహజత్వముతోపాటు సౌందర్యమును కూడ సంతరించుకొన్నవి.

ధృతరాష్ట్రుడు శారీరకముగనేగాక పుత్రవ్యామోహము చేతను మానసికముగను అంధుడు. దుర్యోధన, కర్ణుల బలపరాక్రమములపై యూతని కపరిమితమైన నమ్మకము. ఆనమ్మకమే చివరకు వంశ నాశనము చేసినది.

దుర్యోధనుడు ఈర్ష్యాసూయా ద్వేషములకు ప్రతిరూపము. కన్నడ భారతమున నీతడు మూర్ఖునిగ కూడ కనబడును. శ్రీకృష్ణుడు సభలో ప్రవేశించునపుడు లేవకుండుట, విదురునియింట విందారగించినందులకు ఎగతాళిచేయుట మున్నగున వీందుల కుదాహరణములు.

కర్ణుడసాధారణ శక్తిసామర్థ్య శోభితుడు. దాతృత్వమునకతని యున్నతాదర్శము. భారతపాత్రము లన్నియు స్వార్థముతో క్రిందు మీదులగుచుండ నిస్స్వార్థముగ చేజిక్కిన రాజ్యమును కాలదన్నుకొని మిత్రశ్రేయమునుగోరి ఆత్మార్పణము గావించుకొనిన ధన్యజీవిగా కర్ణుని తెలుగు, కన్నడభారతములు రెండును కీర్తించినవి.

ఉపచారములకు పొగడ్తలకు లొంగిపోవుట శల్యుని బలహీనత. దీనిని రెండు భారతములును పేర్కొనినవి. దానినవకాశముగ నుప

సాధించుకొని శల్యుని తన పక్షమునకు దుర్యోధనుఁడు త్రిప్పికొనగ దాని నుపకారముగ మలచికొనినాఁడు ధర్మజుఁడు.

విదురుఁడు నీతికోవిదుఁడు సమతాగుణశోభితుఁడు స్వామిహితుఁడు. పరేంగితజ్ఞుఁడు ఆంధ్రభారతమున తనయింటికి వచ్చిన కృష్ణునకు విదురుఁడు షడ్రసోపేతమైన విందు నేర్పాటు చేసెను. కన్నడభారతమున కొద్దిపాలను మాత్రమిచ్చి కృతార్థుఁడయ్యెను. పాలకడలిలో శయనించువాఁడగు శ్రీమహావిష్ణువు విదురుని యింట పాలు త్రాగుటకు వచ్చియున్నాఁడు. ఇది దుర్యోధనునకు కంటకమై నోటికివచ్చినట్లు మాటాడుటకు కారణమైనది. వ్యాకులితముగ విదురుఁడు తనవిల్లును విఱిచి దుర్యోధనునకు తన సాహాయ్యమును నిరాకరించెను.

సంజయుఁడు సూతపుత్రుఁడైనను జ్ఞాని, ధర్మాత్ముఁడు. ఆంధ్రభారతమున సంజయుఁడు మాటలచతురతతో మిన్నయైయుండగ, కన్నడభారతమున నీపాత్రము నీరసమై ద్రుపదుని పురోహితునివలె వినినమాటలువారికి, వారిమాటలు వీరికి చెప్పుటమాత్రము చేయును.

ధర్మజుఁడు కరుణాశీలుఁడు సత్యాగ్రహి. అంతఃకలహమును విరోధులయందు పరివర్తనను సాధింపనెంచిన మహామానీయుఁడు. తిక్కన ధర్మజునకిచ్చిన ప్రాజ్ఞత, మాటనేర్పు, ఓర్పు కుమారవ్యాసుని ధర్మజుని యందు కానరావు.

భీముఁడు దుర్యోధనునకు శత్రువగుట మాత్రమేగాక కోపముచేతను అతనికంటెపూర్తిగ భిన్నుఁడు. దుర్యోధనునకు గల నాస్త్రబుద్ధి వ్యంగ్యముగ మాటాడు శక్తి భీమునకు లేదు. కన్నడభారతమున భీముఁడు కొంచెము మొరటుగ కుంతిమాటలు విన్నను.

భీష్మద్రోణులు వయోవృద్ధులుగనేగాక శౌర్యపరాక్రమముల చేతను అత్యంతగౌరవనీయులు కౌరవ పాండవ దాయాది కలహమున వీరు నిష్కర్షగ మాటాడక తుదకు తమ్ము పోషించిన

కౌరవులకుగాని, తాము మెచ్చిన పాండవులకుగాని మనస్ఫూర్తిగ సహాకరింపలేక విషాదాంతమరణము నొందినట్లు తిక్కన, కుమార వ్యాసులిరువురును పేర్కొనిరి.

ఉత్తరుడు మాటలలో మల్లుడు. రాణివాసమున సాహసికుడు. పలాయన విద్యలో పండితుడు. కౌరవసైన్యము కంటబడువరకు నాతడు హాస్యవీరుడు. సారథిత్వమంగీకరించు వరకును భీరుడు. తన సారథి యర్జునుడని నిశ్చయము కాగానే అపూర్వ ధైర్యమును, అత్యంతోత్సాహమును ప్రదర్శించిన ధీరుడని తెలుగు, కన్నడభారతముల రెంటిలో చెప్పబడినది.

కీచకుడెంతటి బలవంతుడో యంతటి మూర్ఖుడు. దానికి తోడు దురభిమాని, దుష్టుడు. ఆతని మాటకు చేతకు విరాటుని రాజ్యమున నెదురులేదు. అదియే చివరకు శతసోదర సహిత దుర్మరణమునకు గురియైనట్లు తిక్కన, కుమారవ్యాసు లిరువురును వర్ణించిరి.

సుదేష్ణపాత్ర మహాభారతమున చాలచిన్నది. అయినను బంగారముతో కూడిన రాగికూడ విలువకలదగునట్లు సైరంధ్రిగ ద్రౌపది ఆమెయింట చేరుటచే సుదేష్ణ పాత్ర పాఠకుల దృష్టి నాకర్షించినది.

ద్రౌపది స్వాభిమానము, కష్టసహిష్ణుత, కర్తవ్యనిష్ఠ, ప్రతీకారవాంఛ కలది ఆమెపగబట్టిన ఆడుత్రాచు. ఆంధ్రభారతమున ఆవేశమునను ద్రౌపది ఔచిత్యము మీరలేదు. కన్నడభారతమున ద్రౌపది కీచకుని విషయమున కలుగజేసికొనని తనభర్తలను 'మీరు పురుషులా? నపుంసకులా?' యని నిందించును. పాండవులు యుద్ధవిముఖులై సంధికంగీకరింప తన పుట్టింటి వారిసాహాయ్యమున, పుత్రుల తోడ్పాటున కౌరవుల నెదిరింతునని తెగించిపలికెను.

కన్నడభారతమున శ్రీకృష్ణుడు మానవాతీత మహిమలు కల మహనీయుడు, కారణపురుషుడు. ఆంధ్రభారతమున కృష్ణుడు కపటనాటక సూత్రధారి. తనకార్య సాఫల్యముకొరకు ఎవరినెట్లు

ప్రయోగించు కొనవలెనో చక్కగ తెలిసినవాడు సంధిగావింతునని ధర్మజునకు చెప్పెను. సంధికంగీకరించిన భీముని రెచ్చగొట్టెను. యుద్ధముతప్పదని ద్రౌపదికి మాటయిచ్చెను. ఈసూత్రధారిత్వము కన్నడ భారతమున సమర్థవంతముగ పోషింపబడలేదు. కుమార వ్యాసుడు 'శ్రీకృష్ణుని సాక్షాత్పరమాత్మునిగనె భావించెను. దుర్యోధనుడుకూడ కాచుటకు, బ్రోచుటకు, చంపుటకు నతడే సమర్థుడని యంగీకరించును. మొత్తముమీద చెప్పవలెనన్నచో తిక్కనపాత్రము లన్నియు రాజనీతి చాతుర్యమున రాటుదేలినవి. కుమారవ్యాసుని పాత్రలలో లౌకిక ప్రజ్ఞయంతగ కనబడదు. అవి యన్నియును కృష్ణుని భగవత్తత్త్వము ప్రతిపాదించునవియే.

వస్త్వాధ్యాయమున తిక్కన, కుమారవ్యాసుల కవితాశిల్పము పరిశీలింపబడినది. తిక్కన తనభారతమును నాటకీయముగ నడిపించెను. అతని పాత్రలు రంగస్థలమున మనయెదుట సంభాషించుచున్నట్లుగనే యుండును. తిక్కనశైలి బుద్ధిగమ్యము. కావ్యశిల్ప లక్షణములలో శిరోభూషణమనదగు 'ఔచిత్యపోషణము' తిక్కన రచనలో ప్రతి పద్యమున కనబడుచుండును. తిక్కన తెలుగు నుడికారము నాతని శైలిలో నొకయంశముగ పరిగణింపవచ్చును. వ్యావహారిక భాషా ప్రయోగమునకు తిక్కనయే ఆద్యుడు.

కుమారవ్యాసుడు ఆఖ్యాన పద్ధతిననుసరించెను. అక్కడ క్కడ నాటకీయత కలదు. తనభారతము సరసయోగ్యమగునట్లు సులభగ్రాహ్యమగు భాషలో రచించిన జనప్రియకవి. కన్నడ నుడి కారములను, [illegible]తియములను, పలుకుబడులను తనగ్రంథమున విస్తృత ముగ నుపయోగించి కన్నడభాషపై తనకుగల మక్కువను ప్రకటించు కొనెను. చిన్న చిన్న పదములతో అర్థవంతముగ చెప్పుట కుమార వ్యాసునకు అలవోకచేత.

తిక్కన భారతమును చంపూపద్ధతిని రచించెను. అతనికి కందపద్యము వ్రాయుటయందాసక్తి మెండు. వ్యర్థపదములతో పద్య

పురాణమును తిక్కన గ్రహించెను కుమారవ్యాసుని భారతము షట్పదులలో వ్రాయబడినది షట్పది సాహిత్యము 'దేసి' సంప్రదాయమునకు చెందినది కన్నడసాహిత్య చరిత్రలో నీషట్పదులలో వ్రాయబడిన గ్రంథముల ప్రాచుర్యము కారణముగ "షట్పదియుగము"ని సాహిత్య విభజనమున ప్రత్యేకయుగ మేర్పరిసినది

తిక్కన భారతమున వస్తువర్ణనము, రూపచిత్రణము, భావచిత్రణము మనోహరముగను రమణీయముగను వర్ణింపబడినది కుమారవ్యాసుడు కథాగతి కనుకూలముగు సన్నివేశ చిత్రణమునందే దృష్టిని కేంద్రీకరించెను

తిక్కన రసాభిజ్ఞుడు. కావుననే భారతావతారికలో 'నానారసాభ్యుదయోల్లాసి' అని పేర్కొనెను తనభారతమున పలురసములకు తగు ప్రవేశము కల్పించుటయేగాక వానిని ఆయా సందర్భములందు ప్రకటనము చేయుట తిక్కన ప్రత్యేకత కుమారవ్యాసుడు భక్తి ప్రధానుడు కావున సందర్భానుసారముగ నితర రసములకు స్థానము కల్పించినను భక్తిరసమే ప్రధానరసము.

తిక్కన తనభారతమునందలి ప్రతిపద్యమును ప్రబంధముగనే తీర్చిదిద్దెను. అలంకారములు ప్రయోగింపవలెనని తిక్కన ప్రయత్నింపలేదు సందర్భానుసారముగ వానియంతట నవియే వచ్చిచేరును కుమారవ్యాసుడు రూపకాలంకార ప్రియుడు విమర్శకులితనిని 'రూపకసామ్రాజ్యచక్రవర్తి' యని పేర్కొనిరి.

సప్తమాధ్యాయమున తిక్కన, కుమారవ్యాసులపై పూర్వకవుల ప్రభావమును, తరువాతికవులపై వారిప్రభావమును వివరింపబడినది తిక్కన, కుమారవ్యాసులు మహాకవులేగాక మహాపండితులగుటచే పూర్వకవుల ప్రభావము వారిపై విశేషముగ కలదు. అట్లే వారిప్రభావము అనంతర కవులపై అత్యధికముగ కలదు

కుమారవ్యాసునిపై తిక్కన ప్రభావము కలదా? అనునది ప్రస్తుతాంశము. ఔచిత్యముగ నొండురెండు పోలికలు వారిలో కనబడుచున్నను సమర్థములగు నిదర్శనము లేవియు నాకు కానరాలేదు. కన్నడ విమర్శకు లెవ్వరును కుమారవ్యాసునకు మురారి సాహిత్య పరిచయము నంగీకరించిరే కాని తెలుగుభాషా పరిచయమున్నట్లు తెలుప లేదు. ఈకారణమున వారిరువురి భారతములలో కనబడుచున్న పోలికలకు నాటిమూలభారత ప్రతికాని, మరేయితర గ్రంథముకాని ఆధారము కావచ్చును. మొత్తముమీద తిక్కన ప్రభావము కుమారవ్యాసునిపై లేదనునదియే నావిశ్వాసము. ఏమైనను తిక్కన, కుమారవ్యాసులు వ్యాసభారతమును, తద్ద్వారమున వ్యాసహృదయమును తెలుగు, కన్నడ ప్రజల కందింపగోరిన వారగుటచే వారి వారి సాధనలలో వారిరువురును కృతకృత్యులైరి. ఇరువురును ప్రాతఃస్మరణీయులే. శాశ్వతానంత కీర్తిమంతులే.

తాభ్యాం నమః



# ఉపజీవికా గ్రంథములు


**తెలుగు :**

| | | | |
|---|---|---|---|
| కవిత్రయము | మహాభారతము | సాహిత్య అకాడమీ | 1971 |
| కవిత్రయము | మహాభారతము | ఉస్మానియ యు నివర్సిటి | ,, |
| కేతవరపు రామకోటి శాస్త్రి | తిక్కన కావ్య శిల్పము | వరంగల్లు | 1973 |
| పింగళి లక్ష్మీకాంతము | ఆంధ్ర సాహిత్య చరిత్ర | హైదరాబాదు | 1974 |
| భూపతి లక్ష్మీనారాయణరావు | భారతము - తిక్కన రచన | రాజమండ్రి | 1949 |
| వండాలి రామకృష్ణమాచార్య | 1) తిక్కన - భారత దర్శనము | కాకినాడ | 1969 |
| | 2) కవిత్రయము | ,, | 1970 |
| ఆరుద్ర | సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర Vol 12 | మదరాసు | 1985 |
| — | భారతోపన్యాసములు | ఆంధ్ర సారస్వతపరిషత్తు హైదరాబాదు | 1957 |
| రావూరి దొరస్వామి శర్మ | తెలుగు భాషలో ఛందోరీతులు | మచిలీపట్నం | 1962 |
| ఖండవిల్లి లక్ష్మీరంజనం | లక్ష్మీరంజన వ్యాసావళి | | |
| దివాకర్ల వెంకటావధాని | వైకన్యలహరి | యువభారతి, సికింద్రాబాదు | 1972 |
| కాశూరి వ్యాసమూర్తి | తిక్కన కళాసామాగ్ర్యము | విజయనగరం | 1964 |
| వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి | మహాభారత తత్త్వకథనము | పిఠాపురము | 1948 |
| చాగంటి శేషయ్య | ఆంధ్ర కవితరంగిణి 1,2 భాగములు | తూర్పు గోదావరి | 1971 |

| | | | |
|---|---|---|---|
| పాటిబండ మాధవశర్మ | 1) ఆంధ్ర మహాభారతము-ఛంద శ్శిల్పము | హైదరాబాదు | |
| | 2) తిక్కన కవితావైభవము | ,, | |
| జొన్నలగడ్డ మృత్యుంజయరావు | వ్యాసభారతము-నన్నయ పరిష్కారము | రాజమండ్రి | 1979 |
| గుండవరపు లక్ష్మీనారాయణ(?) | సాహిత్య కౌముది | హైదరాబాదు | |
| జి. నాగయ్య(?) | తిక్కన-కుమారవ్యాసభారతముల-తులనాత్మక పరిశీలనము | అనంతపురం | 1980 |
| తిప్పాభట్ల రామకృష్ణమూర్తి | భారత నిరుక్తి-తిక్కన సరసోక్తి | విజయపురి సౌత్ | 1985 |
| కలాప్రపూర్ణ(?) రమణాచలశర్మ | 1) భారతధ్వనిదర్శనము 2) విరాటపర్వ ఆంధ్రానువాదము | అనంతపురం | ,, |
| V S రాఘవన్ | తమిళాంధ్రభారతముల తులనాత్మక పరిశీలనము | హైదరాబాదు | 1983 |
| దేశిరాజు భారతీదేవి | కవిత్రయ కవితారీతులు | బాపట్ల | 1979 |
| కోరాడ రామకృష్ణయ్య | ఆంధ్రభారత కవితా విమర్శనము | విజయవాడ | 1981 |
| అప్పజోడు వెంకటసుబ్బయ్య | మహాభారతము మానవ స్వభావ చిత్రణ | గూడూరు | 1977 |

## కన్నడ గ్రంథములు :

| | | | |
|---|---|---|---|
| పంప | విక్రమార్జున విజయము | కన్నడ సాహిత్య పరిషత్తు-బెంగుళూరు | 1977 |
| కుమారవ్యాస | భారత కథామంజరీ | మైసూరు యూనివర్సిటీ, మైసూరు | 1974 |
| | ఉద్యోగపర్వము | మైసూరు | 19[illegible]0 |
| ఎవరేగౌడ | గదుగిన భారత-ఒందు సాంస్కృతిక అధ్యయన | కర్ణాటక విశ్వవిద్యాలయ ధారవాడ | 1978 |
| గుండప్ప | భారత కథామంజరి (గద్య) | బెంగుళూరు | 1976 |

| | | | |
|---|---|---|---|
| ముగళి సిద్ధప్ప | చంపూ సాహిత్య చరిత్ర | బెంగుళూరు విశ్వవిద్యాలయ | 1975 |
| రంశ్రీముగళి | కన్నడ సాహిత్య చరిత్ర | సాహిత్య అకాడమీ ఢిల్లీ | 1963 |
| S V రంగణ్ణ | కుమారవ్యాస | మైసూరు యూనివర్శిటీ మైసూరు | 1949 |
| అనంతరంగాచార్ | ,, | బెంగళూరు | 1973 |
| D V శేషగిరిరావు | కుమారవ్యాస సరసవాణి | , | 1970 |
| H.M శంకరనారాయణ | కుమారవ్యాస-ఒందు సమీక్షె | మైసూరు | |
| — | సమగ్ర కన్నడ సాహిత్య చరిత్ర | బెంగుళూరు విశ్వవిద్యాలయ | 1977 |
| — | కన్నడ సాహిత్య చరిత్ర | మైసూరు విశ్వవిద్యాలయ | 1971 |
| — | కుమారవ్యాస ప్రశస్తి | కన్నడ సాహిత్య పరిషత్ బెంగళూరు | 1978 |
| డా॥ N సుబ్రహ్మణ్యం | మహాభారత సమీక్షె | మైసూరు | 1973 |
| L R హెగడె | కుమారవ్యాస | హెగడె | 1982 |
| ,, | కుమారవ్యాసన ప్రతిసృష్టి | ధారవాడ | 1978 |


**సంస్కృతము :**


| | | | |
|---|---|---|---|
| వ్యాసుడు | భారతము | గీతాప్రెస్ గోరఖ్‌పూర్ | |
| | , | నిర్ణయసాగర్ ప్రెస్ బొంబాయి | 1908 |
| | | భండార్కర్, పూనా | |
| | | వావిళ్ళ రామస్వామిశాస్త్రులు & సన్స్, మద్రాసు | |

**ఆంగ్ల గ్రంథములు :**

| | | | |
|---|---|---|---|
| ప్రతాపచంద్రరాయ్ | ది మహాభారత | భారత్ ప్రెస్, కలకత్తా | 1970 |
| హయవదనరావు | మైసూరు గెజటీర్ | మైసూరు | |
| P లాల్ | ది మహాభారత ఆఫ్ వ్యాస | వికాస్ పబ్లిషింగ్ హౌస్, న్యూఢిల్లీ | |
| ప్రమంత్‌నాథ్ మల్లిక్ | మహాభారత్ ఏజ్ ఏ హిస్టరీ అండ్ డ్రామా | లండను | 1933 |
| V.S సుక్తాంకర్ | ఆన్ ద మీనింగు ఆఫ్ మహాభారత | బొంబాయి | 1957 |

**పత్రికలు :**

ఆంధ్రప్రదేశ్

భారతి

స్రవంతి

సమాలోచన

కన్నడ సాహిత్య పరిషత్

విజ్ఞాన సర్వస్వము

సాధనె